# నిర్భాగ్య జీవులు

[ప్రథమ ఖండము]



విక్టర్ హ్యూగో



అనువాదము :

వెల్లాల ఉమామహేశ్వరరావు B.A., B.L.,






తిరుపతి

7

# ఒక మాట

—

శ్రీ వెల్లాల ఉమామహేశ్వరరావు గారితో నాకు పరిచయము స్వల్పము అగుగాక. వారితో చిరకాల స్నేహాను భూతి నాకు గలిగినది. వారి సౌమనస్యము నన్ను ఆకర్షించినది. అకలుషమైన ఆ మూర్తి సర్వదా స్మరణీయమైనది. పసిబిడ్డవలె మాటాడుచు, బ్రహ్మాండమైన భావములను ప్రకటించుటలో వారికి వారే సాటి.

వారి అనువాద గ్రంథము "నిర్భాగ్య జీవులు". ఆంగ్ల సాహిత్యములో అంతగా అభినివేశము లేని నేను – ఆ రచనమును గూర్చి, ఏమని పరామర్శింపగలను? ఒక్కటి మాత్రము చెప్పగలను – వీరిది అనువాదమని తెలియని యనువాదము; జాతీయమైన నడవడితో సాగిన సాహితీ సంస్కారము వీరి తెనుగుసేతకు వన్నె దెచ్చినది. మహాకవి హ్యూగో రచించిన మహాకావ్యము! ప్రకృతియందలి విభిన్న ప్రకృతులకు ప్రతిబింబము! మానవుని మనుగడలోని ప్రణయ ప్రళయానుభావములకు ప్రతి రూపము! ఇట్టి యుత్తమ రచనము నాంధ్ర లోకమునకు ప్రసాదించిన మా ఉమా

మహేశ్వరరావుగారు ధన్యులు. వారి తెలుగుసేతకు నా ధన్యవాదములు.

గ్రంథములు పూర్తిగాక ముందే మన రచయిత బలీయమైన రుగ్మతకు గురియగుట దురదృష్టకర విషయము. తృతీయ ఖండమపరిపూర్ణముగా ఆగిపోయినది. ఆ శేషాంశముతో కలిపి నాల్గవభాగమును మా జయచంద్రా రెడ్డిగారు పూర్తి గావించిరి. అందలి రచనా పాటవము ప్రశంసాపాత్రము. ఆ పట్టుదల వారి ఉజ్వల భవిష్యత్తుకు నాంది.

తిరుపతి, సదాశివరెడ్డి

1-7-65

# 3

# పరిచయము

మీరు చదువనున్న గ్రంథము విక్టర్ హ్యూగో అను ఫ్రెంచి కవితాత్వికుడు రచించినది. ఆంగ్లాంధ్ర సాహిత్యము లలో నే నెఱిగినంత వఱకు ఇంత కంటే ఉత్కృష్టమైన గ్రంథము లేదు. మన పూర్వులందఱును బలప్రయోగము మానవుని మనస్సు మార్చుటకు ఆధారముగ చేసికొనిరి. అది సాధనములలో అతి నికృష్టమైనదని అనుటలో నాకు సంశయ మణుమాత్రము లేదు. ఏ కొంత సాత్విక భావ సంపన్నుడైనను తోడి మానవుని మార్చుటకు ప్రేమాభి మానముల నుపయోగించును. రవి యస్తమింపని బ్రిటిష్ సామ్రాజ్యమునే కదలించి వైచి, తన దేశమునకే కాక ఆ సామ్రాజ్యములో నింకెన్నో ఇతర దేశములకు స్వాతంత్ర్య ప్రదానము చేయించిన అలౌకిక వ్యక్తి గాంధీ మహాత్ముడు ఉపయోగించిన ఆయుధము కేవల ప్రేమయే!

మహాకవియైన విక్టర్ హ్యూగో ఈ "నిర్భాగ్య జీవుల"లో తీసికొన్న ఇతివృత్తము పరమదివ్యము. సహజ జ్ఞాన సంస్కార శూన్యుడు, నిరక్షరాస్యుడు, సంఘ దౌష్ట్య ముచే నలిగినవాడు నయిన ఒక నిర్భాగ్యుడు ఆ దౌష్ట్యము నకు ప్రతీకారము చేయదలచి ఘోర నరరూపరాక్షసుడుగా మారిపోయెను. దైవవశమున ఆ రాక్షసుడు మహాత్ముడు, బైబుల్ సూక్తులను అక్షరాక్షరము ఆచరించువాడు అయిన

బిషప్ మిరిల్‌ను కలిసికొనెను. ఆ మహానుభావుడు చూపిన ప్రేమ, క్షమ మున్నగు దివ్యగుణములు ఆ రాక్షసుని మనస్సు నింతింతగా మార్చి- తుదకు మిరిల్ గొప్పవాడా, లేక మార్పు చెందిన ఆ నిర్భాగ్యుడు గొప్పవాడా అను సమస్య కలిగించు ఈ పరమ దివ్యగ్రంథము సాటిలేనిది. ఇట్టి తత్వముపదేశించిన విక్టర్ హ్యూగో లోకారాధ్యుడు. ఈ గ్రంథమును తెలుగులో ఎందరో అనువాదము చేసినారు. కానీ ఈ దివ్యగాధ ఎందరు ఎన్ని విధముల అనువదించినను కొఅంత ఏమున్నది? క్రీస్తు పాదాంకితమైన నా ఆత్మ నన్నుద్బోధింప నా అల్పత్వ సంకోచములేక నేనీ పనికి చేయివేసితిని. కానీ మూడు భాగములు పూర్తి కాగానే అసాధారణమైన వ్యాధివలన సంపూర్ణ బుద్ధి జాడ్యము నాకు గలిగినది. అయినను సహృదయులు, నాకు పరమమిత్రులును అయిన శ్రీ సదాశివరెడ్డిగారు కొదువ యున్న నాల్గవభాగమును వారి మిత్రులు శ్రీ జయచంద్రా రెడ్డిగారిచేత పూర్తిచేయింపించి, నా తెలుగు సేతకు రూపము గల్పించిరి. వారి కృషిఫలముచే నన్ను ధన్యుగావించిరి. నా కృతజ్ఞతకు ఎంతో పాత్రులు వారు. వారి ఋణము ఈ జన్మములో తీర్చుకోరానిది. వారికి నా కైమోడ్పు.

విధేయుడు

వెల్లాల ఉమామహేశ్వరరావు.

# దౌర్భాగ్య జీవులు

## ప్రథమ ఖండము — ఫాంటైన్

### ప్రథమాధ్యాయము

### (న్యాయశీలుడు — మిరిల్)

## 1

**1815** వ సంవత్సరమున చార్లె ఫ్రాంకో - బీన్ వెను మిరిల్ డి-పురమున బిషప్పు. ఆయన వయస్సు డెబ్బదియైదు. 1806 నుండి ఆయన యీ గురుస్థానమునం దుండెను. ఆయన యీ స్థానమునకు వచ్చినది మొదలు, ఆయనను గుఱించి ప్రచారమునకు వచ్చిన వార్తలకును మనము చెప్పఁబోవు వృత్తాంతమునకును సంబంధము లేదు. ఉన్నదున్నట్టు చెప్పినట్లగును. అట్లు చెప్పుట పూర్తిగా నిరుపయోగము గాదు.

నిజమో కాదో, ఎవరినిగుఱించియైన నేమైన చెప్పితిమేని మన కథనము వారి జీవితముపై పనిసేయును. ముఖ్యముగా భవిష్యత్తుపై పలుమాఱు ప్రాబల్యము గాంచును. వారి పనులవలెనే ఈ కథనములును వారిని స్వాధీనపఱచు కొనును.

ఎ-పుర పార్లమెంటుకు మిరిల్ తండ్రి, సలహాదారుఁడు. ఆ పనికి న్యాయవాది హోదా కలదు. కుమారునకుఁ

దనస్థానము సంక్రమింపవలెనను ఉద్దేశముతో, పదునెన్మి దిరువదేండ్ల ప్రాయముననే, తండ్రి కుమారునకుఁ బెండ్లి కావించెను. పార్లమెంటు కుటుంబములలో ఆనాఁటి యాచార మది. పెండ్లియైనప్పటికిని మిరిల్ పెకుర నాకర్షించుచునే యుండెను. తీర్చిదిద్దిన యా[illegible]ర మతనిది. లావు పొడుగు లక్ష్యే లేకున్నను ఆ మూర్తిలో నాజూకు, సొగసుఁదనము నిండు కున్నవి. అతని యౌవనదశయంతయుఁ బ్రపంచసుఖములకే అంకితము గన్నది. విప్లవము వచ్చినది - వివిధ సంఘటన లొకటిపై నొకటి గుంపులు కట్టినవి. పార్లమెంటరీ కుటుంబ ముల సంఖ్య దశాంశమైనది. తిటిమి, వేటాడి ప్రజలా కుటుం బములను చిందఱ వందఱ చేసిరి. విప్లవము ప్రారంభము కాగానే మిరిల్ తనభార్యతోఁ గలిసి యిటలీకిఁ బరుగు వెట్టెను. చాలకాలముగా ఆమెకు శ్వాసకోశముల జబ్బుండి నది. ఆమె ఇటలీలో మరణించెను. ఆ దంపతులకు సంతానము లేదు. మిరిల్ అదృష్ట మెల్లు మాఱినది! ఏనాఁటినుండియో వచ్చిన సంఘవిధానము నశించినది. తన కుటుంబము కూలి పోయెను. వలసపోయి, దూరదేశములందుండిన తనబోటి వారికి, 1793 నాఁటి విషాదదృశ్యములు కన్నులారఁ గన్నవారి కంటె విన్నవారికి బీభత్సప్రదములైనవి. ఇవియన్నియు వైరాగ్యభావమును పురికొల్పి, ఏకాంతజీవితమును బ్రేరే పించినవా? ప్రాణధనముల నాశనముచేయ నుంకించిన సంఘోపద్రవములకును చలింపని మానవులు, అగోచరములు భయంకరములు నగు హృదయాఘాతములచే నలిగిపోదురు. దీర్ఘాలోచనలు, హృదయోద్వేగములును అప్పు డతని జీవిత

మును బీల్చివేయుచుండినవి. అతని హృదయమున కేమేని గాయములు తగిలినవా? ఎవరును జెప్పలేరు. ఇటలీనుండి మఱలివచ్చినపు డతడు మతగురువు. అందఱకును తెలిసినదింతే.

1804 లో మాంష్యర్* మిరిల్ డి-పురమున క్యురె. (క్యురెకూడ మతబోధకుఁడే. బిషప్పు హోదాకంటె తక్కువ.) అప్పు డాత డేకాంతవాసి. వృద్ధుఁడు.

నెపోలియన్ చక్రవర్తి పట్టాభిషేకసమయమున తన యుద్యోగధర్మముపై నతడు ప్యారిస్‌కు పోవలసి వచ్చెను.

తన ప్రజల తరఫున మాంష్యర్ మిరిల్ అధికారుల పెక్కురను సందర్శించెను. వారిలో కార్డినల్♦ ఫెష్ ఒకఁడు.

ఒకనాఁడు చక్రవర్తి తన బంధువైన కార్డినల్‌ను చూడవచ్చి, అంతఃపురము దచ్చట కాచియున్న మిరిల్‌ను చూచెను. ఆ వృద్ధుఁడు తన్నుత్సుకతతోఁ జూచుచుండుటను బొడఁగని నెపోలియన్ కఠినస్వరమున "నన్నుఁ చూచుచున్న యీ సత్పురుషుఁ డెవ్వఁడు?" అని ప్రశ్నించెను.

"ప్రభూ! తాము మంచివానినే చూచుచుంటిరి. నేను గొప్పవారిని జూచుచున్నాను. దీన మనకిద్దరకును మంగళ మగునుగాక!" అని మిరిల్ పలికెను.

నాఁటి సాయంకాలమునఁ జక్రవర్తి 'ఆ క్యురె పేరేమి?' అని కార్డినలును బ్రశ్నించెను. తరువాతఁ గొంతకాలమునకు మిరిల్ డి-పుర బిషప్పుగా నియమింపఁబడి యచ్చెరువందెను.

---

* గౌరవసూచకముగ, పేరుకు ముందు మనము "శ్రీ" యనునట్లు, ఫ్రెంచిభాషలో "మాంష్యర్" అందురు.

♦ బిషప్‌కంటె పెద్ద హోదాగల మతగురువు కార్డినల్.

మిరిల్ తొలిజీవితమును గుఱించిన పై యంశములే దృఢముగాఁ జెప్పఁగలము. ఆయనను గుఱించి ప్రచారమూ నందున్న నితర వార్తలలో సత్యమెంతో చెప్పలేను. విప్లవ మునకు మునుపు పెక్కు కుటుంబములకు మిరిల్ కుటుంబమూ తెలియదు.

చిన్నయూళ్ళలో క్రొత్తగా వచ్చినవారిని గుఱించి సాధారణముగ అందఱును మాటలాడువారే. యోజించువా రరుదు. ఈ వాగుడుకుఁ దలవంచక బిషప్పయ్యు మిరిల్ కుఁ దప్పినదికాదు. ఏమైనగానీ, ఆ యుబుసుపోక సంభాషణలూ వ్యర్థప్రలాపములే-వట్టి యల్లరి, వదరు, "మాట" లనిపించుకొనుటకైన తాహతు చాలనివి.

అది యెట్లైనను, ఆ డి-పురమున, తొమ్మిదేండ్లు తఁడు మతబోధచేయునప్పటికి, ఆ కథలు, చిన్నయూళ్ళలోని జనుల వాగ్వాదముల కాస్పదమగు విషయములు మున్నగున వన్నియు మఱపు సీమలఁ బడిపోయినవి. ఇప్పుడు మాటాడరు కదా, స్మరింపరుకూడ.

మిరిల్ డి-కి వచ్చినపుడు ఆయన తోఁబుట్టువు బాప్టిస్టిన్ కూడ వచ్చినది. ఆయనకంటెఁ బదేండ్లు చిన్నది.

మగ్లోర్ ఒక్కర్తెయే వారి పరిచారికా గణమంతయు. ఆమెయు బాప్టిస్టిన్ సమవయస్కులు. మిరిల్ క్యురేగా ఉండి నప్పుడును మగ్లోరే పరిచారిక. మిరిల్ గొప్ప పదవిపొంది యున్న ఈనాఁడును పనికత్తె, వంటకత్తెయు నామెయే.

బాప్టిస్టిన్ పొడుగరి. పాలిన రంగు, బక్కపల్చని శరీరము, అతిమృదు స్వభావమును కలది. "గౌరవనీయులు"

అను పదార్థమును ఆమె పరిపూర్ణముగ అవగతము చేసి కొన్నది. పూజింపఁబడుటకు మాతృత్వమవసరము కాదనిపించి నది. ఆమెలో అందమేనాఁడు నుండలేదు. ఆమె జీవిత మంతయు ధర్మనిష్ఠాపరమే. ఆ నిష్ఠ అతిస్వచ్ఛమగు ధావళ్య మును ప్రసాదించి, గాజువలె ఆమె హృదయ సీమలలో గూఢత్వము లేనేలేకుండ చేసినది. వయస్సు కడచినకొలదిని, ఆమె మంచితనమును పెరిగి, ఒక సురూపము కలిగినది. యౌవనదశయందలి పలుచఁదనము, వయఃపరిపాకమునఁ బార దర్శకమై, లోపలి దివ్య తేజః కిరణములను పైకి ప్రకాశింపఁ జేయుచుండినది. ఆమె నొక మర్త్యకన్యయనుటకంటె సుకృ తాత్మ యనుట మేలు. నీడవంటి యామె శరీరము, లింగ వివేచన చేయుటకుఁ జాలినదికాదు. మినుకు మినుకుమను మృత్తికాలేశ మనవచ్చును. ఆమె విశాల నయనము లెప్పు డును భూమినే చూచుచుండును. పరిశుద్ధాత్మ భూమిపై నిలుచుటకది సాకు కాఁబోలు.

మగ్లోర్ పొట్టిదై లావుగలది. ఉల్లాసవతి. సందడికత్తె. ఎప్పుడును నగరుచుండును. విరామము గొనక పనిచేయుట అందుకు మొదటి కారణము. ఉబ్బసము రెండవది.

బిషప్ పదవి ఫీల్డుమార్షల్ హోదాకు క్రిందిది. కావున చక్రవర్తి శాసనము దానికేర్పఱచిన గౌరవాదరములతో మిరిల్‌ను అతనికి నిర్దేశించిన భవనమునఁ బ్రవేశపెట్టిరి. మేయరు, ప్రెసిడెంటు తొలుత ఆయనను చూడవచ్చిరి. తన పైవారిని ఆయనకూడ అట్టి పరామర్శచేసి గౌరవించెను.

ఉద్యోగ స్వీకారమైనది. పురమంతయు ఆయన కార్య కౌశల్యమును జూడ ఉబలాటపడసాగెను.

# 2

బిషప్ భవనము వైద్యశాల నానుకొని యున్నది. అది అతి విశాలమైనది-అందమైనది. 1712 లో డి-కి బిషప్పుగా ఉండిన హెన్రీ పూజె, రాళ్ళతో ఆ భవనమును గట్టించెను. అది రాజులకుఁ దగిన గృహము, అందలి గదులు, భోజన శాల, వస్తువులు—అన్నియు మహావిభవస్ఫోరకములై పురాతన ఫ్లారెంటిన్ విధానమున నిర్మింపబడినవి. దాని చుట్టు సుందరమై సమున్నత వృక్షములతోఁగూడిన తోఁట కలదు.

దివ్యమైన ఆ భవనమునందలి భోజనశాలలోనే 1714వ సంవత్సరమున, జూలై 29వ తేదీని, పూజె తోడిబిషప్పు లార్డుగరకును, ప్రధాన బిషప్పునకును విందు గావించియుండెను. పూజ్యులగు వారి చిత్రములా శాలయందలి గోడల నలంకరించి యున్నవి. చిరస్మరణీయమగు ఆ దినము సువర్ణాక్షరములతో పాలరాతిపై చెక్కఁబడియున్నది.

ఆస్పత్రి భవనము చాల ఇరుకు. మేడ లేదు. చిన్న తోఁట.

తాను వచ్చిన మూఁడు దినములకు బిషప్పు ఆస్పత్రికి వెళ్లినాఁడు. మఱలిపోవునపుడు ఆస్పత్రి డైరెక్టరును తన భవనమున కాహ్వానించెను.

“అయ్యా, ఆస్పత్రిలో ఎందఱు రోగులున్నారు?” అని డైరెక్టరును ప్రశ్నించెను.

"ఇరువదార్గురు స్వామి!"

"నా లెక్కకట్లే యందినది."

"మంచములలో రోగులు క్రిక్కిరిసియున్నారు."

"అదియు చూచితిని."

"వార్డులు ఇరుకు గదులు. మంచి వెలుతురు లేదు."

"నాకును అట్లే తోచుచున్నది."

"ఒకవేళ ఎండకాచినను, రోగమునుండి కోలుకొను చున్నవారు తిరుగుటకు వలసినంత-చోటూ తోటలో లేదు."

"నేనా సంగతినే యోజించుచున్నాను."

"ఇక నంటువ్యాధులన్ననో, ఇదివఱకే విషజ్వరము మనల నంటినది. రెండేండ్లకు ముందు మిలిటరీ జ్వరము పీడించి నది-ఒక్కొక్కప్పుడు నూఱుమందిని. ఏమి చేయుటకును మాకుఁ దోఁచినది కాదు."

"నాకిది తోఁచినది."

"ఏమి చేయగలము స్వామీ? భరింప వలసినదే!" అని డైరెక్టరు చేతులు పిసికికొనెను,

ఈ సంభాషణ భోజనశాలలో జరిగినది. బిషప్ కొంత ప్రొద్దు పలుకకుండి, తటాలున డైరెక్టరువంకకుఁ దిరిగి "ఈ హాలులో ఎన్ని మంచములు పట్టునని మీ యభిప్రాయము?" అని యడిగెను.

డైరెక్టరు కొయ్యబాఱినవాడై "స్వాముల భోజనశాల లోనా?" అనెను.

బిషప్ కనులు హాలంతయు పరుగిడినవి. అవి కొలతలు వేసి గణించినవి కాఁబోలు. 'దీనిలో ఇరువది మంచములు

పట్టును' అని తనలో ననుకొని "అయ్యా, డైరక్టరుగారూ! నా మాట వినుడు. ఇందులో ఏదో పొరపాటున్నది. ఐదాఱు చిన్న గదులలో మీరు ఇరువదార్గురున్నారు. అఱువది మందికి చాలినంత జాగాలో మేము ముగ్గురు మే యున్నాము. నా మాట నిజము, ఇందేదో పొరపాటున్నది. మీరు నా యింటనున్నారు- నేను మీ యింట నున్నాను. నా యిల్లు నాకిండు. మీ యిల్లు మీకుండును."

మఱునాడా యిరువదార్గురు రోగులు బిషప్ భవనమును బ్రవేశించిరి. బిషప్ తొలుతటి యాస్పత్రి ప్రవేశించెను.

మిరిల్ కే యాస్తిపాస్తులును లేవు. విప్లవ సమయమున ఆయన కుటుంబము దోఁపిడికి గుఱియైనది. ఆయన చెల్లెలికి ఐదువందల ఫ్రాంకుల భరణము వచ్చెడిది. మిరిల్ చిన్న యుద్యోగమునందుండినపుడు ఆ మొత్తమామె వ్యయములకు సరిపోయెడిది. బిషప్పైన తరువాత మిరిల్ కు సంవత్సరమునకుఁ బదునైదువేల ఫ్రాంకుల జీతమైనది. ఆస్పత్రిలో నివాసమేర్పఱచుకొన్ననాఁడే ఒక వేయి ఫ్రాంకులు సొంత వెచ్చమునకనియు, మిగిలిన పదునాల్గువేలును అనాథ శరణాలయములు, ప్రసూతి వైద్యశాలలు మున్నగు సంస్థలకనియు తీర్మానించినాఁడు. తాను బిషప్పుగానున్న కాలమున ఈ యేర్పాటున కెన్నడును అయన భంగము కలిగింపలేదు.

ఈ యేర్పాటుకు బాప్టిస్టిన్ కిన్మనలేదు. మిరిల్ ఆమెకు రక్త సంబంధమున్న అన్న మాత్రమే కాదు-మతాధికారము కల గురువుకూడ. ఏ యాడంబరమును లేక అన్నను ప్రేమించి పూజించెడిది. ఆయన మాటాడెనా వినును. కార్య

రంగమునదిగెనా, సహకారము నెఱపును. మగ్లోర్ మాత్రము గొణుగుచుండెడిది. బిషప్ వేయి ఫ్రాంకులే నిలుపుకొన్నాడు. బాప్టిస్టిన్ కొక అయిదువందలు వచ్చును. దీనితో ఆ ముగ్గురు ముదుసళ్లును జీవింపవలెను.

అదృష్టమాయని, మగ్లోర్ మిక్కిలి పొదుపరి. బాప్టిస్టిన్ అద్భుత నిర్వాహకురాలు. కావున అతిథులు వచ్చినపుడు బిషప్ తెల్లమొగము పెట్టవలసి యుండెడిది కాదు.

మూడు నెలలు కడచిన తరువాత "ఇంత ధనము వచ్చుచున్నను చాలుటలేదు" అని బిషప్ అనెను. "నాకును అట్లే తోఁచుచున్నది. ప్రయాణపు వ్యయములకని యిచ్చు ధనమైనను మీరు తీసికొనుటలేదు. పుచ్చుకొనుట బిషప్పులందఱి యాచారము" అని మగ్లోర్ సలహా చెప్పెను.

"అవును. నీవన్నది సరియే" అని బిషప్ దరకాస్తు పంపెను.

కాన్సల్-జనరల్ ఆ దరకాస్తందుకొనిన కొన్ని నాళ్లకు "బిషప్ ఉపదేశ పర్యటనార్థము ప్రయాణ వ్యయముల అలవెన్సు" అని పేరిడి సాలినా మూఁడువేల ఫ్రాంకులు ఏర్పాటు చేసెను.

ఊరిలోని ధనికులందఱికిందు మూలమున కన్నెఱ్ఱనైనది. పుష్కలమైన యినాము ననుభవించుచుండిన యొక రాజ్యాంగ సభ్యుఁడు దేవాదాయముల మంత్రికి, ఈ యలవెన్సును తీవ్రముగ ఖండించుచు రహస్యముగ జాబు వ్రాసెను. దాని లోని కొంత భాగమీక్రింద నుదాహరింపబడినది: "బండి వెచ్చములు! ఈ యూరిలో నాలుగువేలమంది మాత్రమే

కలరు. బండి యెందుకు? ఉపదేశపర్యటనము! అసలీ యుప దేశములేమక్కఱకు వచ్చును? ఈ కొండప్రదేశ పర్యటనము నకు బండియెందుకు? బాటలే లేవు. గుఱ్ఱముపై పయనింప వలసినదే. 'డ్యురాన్సు' నది మీఁది వంతెన, ఎడ్లబండ్లు పోవుటకైనఁ జాలియుఁ జాలనిది. ఈ గురువుల బుద్ధి యింతే- ఆశపోతులు, పిసినిగొట్లు. మొదట మొదట నితఁడేమో మంచి వాఁడనుకొంటిమి. ఇప్పుడందఱవలెనే ప్రవర్తించుచున్నాఁడు. ఈయనకొక వాహనము కావలయును కాఁబోలు. తొలుతటి బిషప్పులకువలె ఇతనికిని భోగములవసరము. వా! ఈ గురు జాతి! ఈ యపహాస్యపు గురువులనుండి చక్రవర్తి మాకు విముక్తి కలిగించినఁగాని స్థితిగతులు చక్కఁబడవు. పోప్‌ను నణఁగఁద్రొక్కి వేయవలెను. నా మట్టుకు నేనేమో ప్రభు పక్షపాతినే..."

మగ్లోర్‌కీ దరకాస్తు సంతోషము కలిగించినది. బాప్టి స్టినెతో "ఇప్పుడు సరి! స్వామి పరుల చింతతోఁ బ్రారం భించెను గాని, తన్ను జాగ్రతగాఁ జూచుకొనవలెనని యిప్పటి కర్థము చేసికొనెను. అంతయు దానధర్మములకే యైపోయినది. అందుకే యిప్పుడీ మూఁడువేల ఫ్రాంకులు కావలసివచ్చినవి" అని వచించెను.

నాఁటి సాయంకాలముననే, ఆ మూఁడువేల ఫ్రాంకు లను ఫలానా ఫలానా ధర్మములకని గుర్తు వ్రాసి బిషప్ చెల్లెలికొక చీటీ నిచ్చెను. ఇంటికి చిల్లిగవ్వయు లేదు.

సర్కారు వారిచ్చు జీతముకాక, వేఱుగా సంపాదించు టకు మార్గములెన్నో యున్నవి. అది చట్టమునకు న్యాయము

నకును విరుద్ధముకాదు. అట్లుకూడిన ధనము, ధనికులనుండి కచ్చితముగా ఎడమచేత లాగి, కుడిచేత పేదలకుఁ బంచిపెట్టును మిరీల్.

అచిరకాలముననే విరాళములు రాసాగినవి. కలవారు లేనివారును బిషప్ కడకు మూఁగుదురు-విరాళము లిచ్చుటకు, తీసికొనుటకును. సంవత్సరము కడవకముందే ఆయన ధర్మపరుల ధనపేటియు, అక్కఁ గలవారి యందయు నయ్యెను. ధనము ప్రవాహమై చేతులనుండి స్రుతమగుచుండినది. కాని, ఆయన జీవితములో మార్పు రాలేదు. ఆ నిరాడంబర జీవితమున ఆవ గింజంత భోగమైన కన్పట్టలేదు.

ధనికులలోని దయాళుత్వమునకంటెఁ, బేదల దైన్య మధికము. కావున, విరాళములు వచ్చిరాకముందే పైసలతో పంపకమై, ఎడారిలో పడిన నీటిబొట్లువలె అయ్యెడిది. చేత దమ్మిడీ నిలువదు. దీనికిఁదోడుగఁ దన ధనమునుకూడ దోఁచెడి వాఁడు.

ఇది యంతయు ఆయన చిత్రమని మేమనుట లేదు. చూఁచాయ పోలికలు-అంతే.

# 3

బండినట్లు దానధర్మముల పాల్చేసి బిషప్, పర్యటనము మాత్రము మానలేదు. తిరుగవలసిన ప్రదేశము సుకరము కాదు. సమతలము చాల తక్కువ. కొండ ప్రదేశమే యెక్కువ భాగము. రోడ్లు లేవనియే చెప్పవచ్చును. ఆయన పర్యవేక్షణ క్రింద మతబోధ చేయవలసిన వివిధగురు పరంపరా ఖండములు

నూటయిరువదిరెండు. ఈ యన్ని చోటులను పరిశీలింపవలె నన్న నతి శ్రమ. అయినను బిషప్పాపని మానలేదు. తనయింటి చుట్టు ప్రక్కల నడచియే వెళ్లును. సమతలమున నైనచో బండిలో పోవును. మిట్టుచోట్లఁ, గంచర గాడిదనెక్కి తిండి నొక బుట్టలో పెట్టుకొని పయనించును. సాధారణముగా ఆ యూడువాండ్రును అనుసరింతురు. కష్టప్రయాణమైనచో నతఁ డొకఁడే పోవును.

ఒకనాఁడాయన సెనెజ్‌కు వెళ్ళెను. అది పూర్వము బిషప్ పీఠము. ధనమంతయు ముగిసియుండుటచేత ఆనాఁడు మిరిల్ గాడిదనెక్కి యచ్చటఁ జేరుకొనెను. ఆ యూరి మేయర్ బిషప్‌కు స్వాగత మీవచ్చి, ఆ గార్దభ వాహనముఁగాంచి ఆశ్చర్యమునఁ గొయ్యఁబాఱెను. పెక్కురు పౌరులుకూడి నవ్వ సాగిరి. "మీరెందు కాశ్చర్య పడుచుంటిరో నే నెఱుఁగుదును. ఏసుప్రభువుపయోగించిన వాహనమును ఈ యల్పుఁడును నుపయోగించుట పొగరుతోనని యనుకొనుచున్నారు. అవ సరమై యిట్లొనర్చితిని గాని, అహంకారముచేఁగాదు" అని మిరిల్ వివరించెను.

పర్యటన సమయములలో శిష్యులతో మిక్కిలి చనవు నిచ్చి నెమ్మదిగ నుండును. మాటలు తక్కువ. ఉపదేశములు మఱియు తక్కువ. ఎక్కడి కారణములనో,ఉదాహరణములనో లాగి తీసికొనిరాఁడు. ఒక యూరి ప్రజలకుఁ బ్రక్కయూరి నుదహరించును. అతి బీదలను గఠినముగఁ జూచు నూళ్ళలో "బ్రియాన్సన్ ప్రజలను జూడుఁడు. అందరికంటె మూఁడు నాళ్ళు ముందుగనే పచ్చిక బయళ్ళనుండి కోసి కొండని బీదలకు,

వితంతువులకుఁ, దరిద్రులు లేని పిల్లలకును అనుమతినిచ్చిరి. ఆ యభాగ్యుల యిండ్లు కూలినపుడు గృహములను దామే వెచ్చపెట్టి కట్టింతురు. కావుననే వారిని భగవంతుఁడాశీర్వదించుచున్నాఁడు. ఒక్క శతాబ్దముగా అక్కడ నొక్క హత్యయు జరుగలేదు" అని యుద్ఘాటించును.

ఆమనికాలమునఁ బ్రజలు ధాన్యము తమ యింటనే రాసి పోసికొనఁజూచిరేని, వారికిట్లు చెప్పును. "'ఎంబ్రన్' పురమును గమనింపుఁడు. పెద్ద కుటుంబము కలవాఁడైనచో, పొలము కోఁతల కాలమునఁ గుమారులను సైన్యములోనికిఁ బంపును. కుమార్తెలను నగరమునఁ బనులకుఁ బంపును. అతనికి జబ్బుచేసెనా, గురువు ఉపదేశ సమయమున సిఫారసు చేయును. ఆదివారమునాడు, దైవప్రార్థనానంతరము, పల్లె ప్రజలందఱును నతని పొలముకోసి, వామివేసి, గింజలను పాఁతరలోఁ బోయుదురు."

ఆస్తుల తగాదాలలో, వారసత్వమును గుఱించి వేఱుపడిన వారికిట్లు బోధించును. "'డివోల్నీ' పర్వత ప్రజలను పరికింపుఁడు. ఆ ప్రదేశమంతయు అరణ్యమైపోయినది. ఏఁబది యేండ్ల కొక్కసారియైనఁ గాకికూఁతయు వినఁబడదు. తండ్రి మరణించిన, కుమారులదృష్టమును వెదకి కొనుచుఁ బోవుదురు. ఆస్తి యాఁడుపిల్లల వశమగును. అందుచేతనైన వారికి భర్తలు దొరుకుదురు."

చట్టముపై మోజుగలిగి, స్టాంపు కాగితముల మూలమున నాశనమగుచున్న ప్రజలు గల పల్లెలలో ఇట్లుదహరించును. "'క్వేరా' లోయలోని రైతులు మిగుల మంచివారు.

మూఁడు వేలమంది కలరు. అదియొక చిన్న ప్రజాస్వామికమే! అక్కడ జడ్జిలేఁడు—పోలీసు లేఁడు. అన్ని పనులు మేయరే చేయును. ఇంతింతని అతఁడే పన్ను విధించును—తనకు న్యాయమని తోఁచినట్లు. డబ్బు తీసికొనక తగవులు తీర్చును. పిత్రార్జితములను ఫీజు పుచ్చుకొనక పంచిపెట్టును. అతనికందఱు తల యొగ్గుదురు. ఆ సరళ హృదయులలో అతఁడు న్యాయమూర్తి యగుటే అందుకు కారణము.''

ఉపాధ్యాయుఁడు లేని పల్లెలలో మఱల 'క్వేరా' నే ఉదహరించి యిట్లు చెప్పును. ''వారేమి చేయుదురో మీకుఁ దెలియునా? పది పన్నెండిండ్లు కల పల్లెలు ఉపాధ్యాయుని భరింపలేవుకదా. కావున, ఆ లోయలోని యన్ని పల్లెలును చందా వైచి పంతులను నియోగించును. అతఁడు పల్లె పల్లెకును బోయి, వారమో పది దినములో యుండి చదువు చెప్పును. ఆ యుపాధ్యాయులు సంతలయందును బాఠము చెప్పుదురు. నేను చూచినాను. వారి బుట్ట టోపీలలోని కలములనుబట్టి గుర్తింపఁనగును. ఒక కలమున్నవారు చదువుటే నేర్పుదురు. రెండున్నవారు చదువు, గణితమును నేర్పుదురు. మూడు కలములున్నవారు చదువుట, గణితము, లాటిన్— మూఁడింటిని నేర్పుదురు. ఈ కడపటి తరగతివారిని పండితులుగా గౌరవింతురు. అజ్ఞానులుగా ఉండుటెంత యవమానకరము! మీరును 'క్వేరా' ప్రజలవలెఁ జేయుఁడు.''

ఇట్లు గంభీరముగను, పితృభావముతోను బలుకును. ఉదాహరణములు లేనపుడు, తక్కువ మాటలతో కథలల్లి సూటిగా విషయము తెలియఁజేయును. ఏసుప్రభువు వాక్యై

పుణ్య మట్టిదే కదా! అదియే నచ్చజెప్పి, కార్యోత్సాహ మును బురికొల్పునది.

# 4

ఆయన సంభాషణ కరుణారంజకమై యుండెడిది. మాటలలో తనయింటనున్న యిరువురు వృద్ధస్త్రీల నేర్పున కనుగుణ ముగ సరితూఁగెడివాఁడు. అతడు నవ్వెనా - శిశువు నవ్విన ట్లుండును.

మగ్లోర్ ఆయనను "గొప్ప"వాఁడనెడిది. ఒకనాఁ డాయన పుస్తకముల గదిలోనికి వెళ్ళి ఒక పుస్తకమునకై వెదకుచుండెను. అది పై యటకపై నుండినది. బిషప్ పొడుగరి కాఁడు. పుస్తక మందలేదు. చిఱునవ్వుతో "మగ్లోర్! ఒక కుర్చీ తీసికొని రా. నా గొప్పతన మీయల్మారాను అందు కొనలేకున్నది" అనెను.

ఆయన దూరపు బంధుగు "లో" ప్రభ్వి. ఆమెకు ముగ్గురు కుమారులు. తన కుమారుల భవిష్యత్తును గుఱించిన యాశలను ఏకరువుపెట్టు నవకాశము చిక్కిన పోసీదు. ఆమె బంధువుల సంఖ్య పెద్దది. అందఱును మిక్కిలి ముసలివారు. రేపో మాపో అనునట్లుండిరి. ఒక ముత్తవ్వనుండి, తన కడఁ గొట్టు కుమారునికి లక్ష లివర్లు సంక్రమించును. రెండవవాఁడు ఒక దాయాదినుండి "డ్యూక్" బిరుదు పొందును. అగ్రజుఁడు తాతనుండి "ప్రభుత" గాంచును. ఈ అమాయికపు తల్లి యుబలాటమును నోరు మెదల్పక బిషప్ వినుచుండును. వేయవసారి ఆమె యీ సంక్రమణములను వివరించుచున్న

పుడు, బిషప్పెప్పటికంటె అన్యాలోచనలో నుండినట్లు పొడ కట్టెను. అది చూచి ఆమె తటాలున ఆగి "బాగున్నది! అన్నయ్యా, నీవే మాలోచించుచున్నావు?" అని ప్రశ్నించెను. అతడును "ఆగస్టిన్‌ఋషి వచనములలో విచిత్రమైనదానిని గుఱించి ఆలోచించుచున్నాను. 'ఎవరిస్థాన మెవ్వరును పొందరో ఆయనపైనే అన్ని యాసలను పెట్టుకొమ్మ'" అని పలికెను.

ప్రసిద్ధ ధనికుఁ డొకఁడు మరణించినపుడు, ఆ వార్తను దెలుపుచు బిషప్‌కు ఉత్తరము వ్రాసిరి. దానిలో, మరణించిన వాని బిరుదావళియే చాలదన్నట్లు అతని యందలి బంధువుల ఘనతాగౌరవచిహ్నములను అక్షరమక్షరము పేర్కొనిరి. అది చదివి మిరిల్ "ఆహ్, మృత్యువు నీవెంత విశాలము! ఎన్ని బిరుదముల బరువును సంతోషముతో మోయును! గోరీలోను ఆడంబరములను బెంచు మానవులెంత నిర్లజ్జులు!" అని ఆశ్చర్యపడెను.

అప్పుడప్పు డతఁడు మృదురీతిని పరిహాసము సేయును. ఆ పరిహాస మెప్పుడును ఉత్తమభావములతో నిండియుండెడిది. ఒకసారి, నలువదినాళ్ళ యుపవాస కాలమున, యువబోధకుఁ డొకఁ డా యూరువచ్చి దానమునుగుఱించి యుపన్యసించెను. నరకమునందలి ఘోరయాతనలను భయంకరముగఁ జిత్రించి, స్వర్గసుఖములను అత్యాప్యాయనముగ వర్ణించి, నరకము త్యజించి స్వర్గము ప్రవేశింపఁగోరు ధనికులు బీదలకు దానము సేయుఁడని యుపదేశించెను. బట్టలవ్యాపారముచేసి యిరువది లక్ష లార్జించిన యొక వర్తకుఁడా సభలలో నుండెను.

అతఁడు వడ్డివ్యాపారము సేయును. గతిచెడినవారి కొక్క పైసయు నియ్యఁడు. ఈ యుపన్యాసమైననాఁటినుండియు, నాదివారము, ప్రార్థనానంతరము గుడిదగ్గఱఁ గూడు ఆర్గురు ముదుసలి భిక్షుకస్త్రీలకును కలిపి ఒక పెన్నీ ఇచ్చెడివాఁడు. ఒకనాఁడు బిషప్పు దానకర్మ చూచి చెల్లెలితో "చూడు. ఈయన పెన్నీ స్వర్గము కొనుచున్నాఁడు" అని హాసన్ముఖుఁడై పలికెను.

ఏదేని ధర్మకార్యములకు సహాయ మర్థించునపుడు నిరాకరణమతని నోరు మూసెడిది కాదు. వినువారి మనస్సులలో సంచలనము కలిగించు మాటలకతఁడు గని. ఒకనాఁడు ఆ యూర నొక చావిడిలో బీదలకొఱకై ధనము పోగుసేయుచుండెను. ముదుసలి, ధనికుఁడు, లుబ్ధుఁడునగు పెద్దమనుష్యుడొకఁ డచ్చట నుండెను. బిషప్పతని దగ్గఱకు వచ్చి చేయి కలిపి "మీరును ఏమైన ఇయ్యక తప్పదు" అని యర్థించెను. ఆ పెద్దమనుష్యుఁడు ముడిమొగము వేసి "స్వామీ, నాకును నా బీదలున్నారు" అనెను. "వారిని నాకిచ్చివేయుఁడు" అని బిషప్పడిగెను.

ఇంకొకనాఁ డాలయమున ఈ క్రిందివిధముగ నుపన్యసించెను. "సోదరులారా! మిత్రులారా! ఫ్రాంసులో మూఁడు ద్వారములుగలవి లక్షముప్పదిరెండువేల గుడిసెలున్నవి. రెండు ద్వారములు కలవి లక్షయెనుబదియొక్కవేలున్నవి. ఒకటే ద్వారముకల పాకలు మూడులక్షల నలువదియాఱువేలున్నవి. కిటికీలపై తలుపులపై పన్ను విధించుటవలని పరిణామమిది.

ఈ దరిద్ర నిలయములలో ముదుసలి స్త్రీలు పసిపిల్లలు ఎన్ని జ్వరములకు, రోగములకు గుఱియగుచున్నారు? దేవుఁడు మానవులకు వెలుఁగు నిచ్చును. చట్టము దానిని విక్రయించు చున్నది. చట్టమును నిందింపనుగాని, దేవునిఁ గీర్తింతును. 'ఆల్ప్స్' పర్వత ప్రాంతముల ప్రజలకుఁ ద్రోవుడు బండ్లుకూడ లేవు. ఎరువు భుజములపైన మోసికొనిపోదురు. దీపపు వత్తులు లేవు. కొఱివికట్టెలనే వాఁడుకొందురు. కీలులో అద్దిన త్రాళ్ళను కూడ దీపములుగా ఉపయోగింతురు. 'డాఫిన్' ఉపరి ప్రాంతములందెల్లెడల నిదే గతి. ఆర్నెల్లకొకసారి రొట్టె చేసి కొందురు. దానినైన పొలములందలి గొట్టికాళ్ళతో కాల్తురు. చలికాలములో ఆ రొట్టె మిక్కిలి గట్టిపడిపోవును. అప్పుడు దానిని గొడ్డలితోఁ బగులఁగొట్టి యిరువదినాల్గుగంటలు నానఁ బెట్టినఁగాని, తిన వీలుకాదు. సోదరులారా! కరుణింపుఁడు. మీ చుట్టును ఎంత వేదన నిండియున్నదో పరికింపుఁడు.''

ఆయన జననము జనపదమున. వివిధ ప్రాంతములందలి ప్రజల వాడుక భాషను చక్కగా నేర్చుకొన్నాఁడు. ఎక్కడికి తగినట్లుకూడ మాటాడును. ఇది జనసామాన్యమునకు ప్రీతిఁ గొల్పి, వారి హృదయములలో ఆయనకు స్థానమిచ్చినది. తన యింటనెంతో, గుడిసెలో నంతే. కొండపై నంతే. మహో న్నత గంభీర విషయములను సర్వసామాన్య భాషలో వెల్లడించును. భాషలోని యన్నిభేదములును ఆయన యెఱుఁగును. కావున ఆయన మాటలు వినువారికి సూటిగా హృదయ గతము లగును. ఇదిగాక, ధనవంతులయెడ, బీదలయెడ ఆయన ప్రవర్తన మొక్కటే.

దేనినిగాని అన్నిపరిస్థితుల నెఱుఁగక తొందఱపడి ఖండింపఁడు. "తప్పెట్లు జరిగినదో కనుఁగొందము" అని సావధానుఁడగును.

తానును గతమున పాపియని చిఱునవ్వుతో నంగీకరించువాఁడు గావున, పుణ్యాత్ములనుని చాటుకొను డాంబికుల అస్పృశ్యత ఆయనలో లేదు. భయంకర సుచరిత్రుల బాము ముడికిని వెఱువక, ఇంచుమించుగా ఈ క్రిందఁ గనఁబఱచిన సిద్ధాంతము చేసినాఁడు.

"మనుష్యుని దేహము గొప్పమోఁతయు మరులు గొల్పునదియు. మానవుఁడు దానినీడ్చుకొని దానికి లోఁబడుచుండును.

"దానిని హద్దులో నుంచుటకు, అణచుటకు నిరంతరము కనిపెట్టి యుండవలెను. కడపట, కడవరానప్పుడే లొంగవలెను. అప్పుడైన లొంగుట తప్పు కావచ్చు. అయినను అప్పుడది క్షమార్హమగును. అది పతనమే. కాని, మోకాలిపైఁ బడుటే ప్రార్థనగాఁ బరిణమింపవచ్చును.

"ఋషియగుటరుదు. సత్యవంతుడుగ నుండుట తప్పనిది. పొఱపడనచ్చు, తప్పటడుగు వేయవచ్చు, పాపము చేయవచ్చు-సత్యము వీడకు.

"సాధ్యమైనంత తక్కువ పాపము సేయుట మానవునికి శాసనము. పాపము సేయకయే బ్రతుకుట దైవస్వప్నము. భూ సంబంధముగల ఒక్కొక్క-దానికిని పాపము తగులును. పాపము భూమ్యాకర్షక శక్తివంటిది."

దేనిని గుఱించియైన, ఎవరైన అత్యాగ్రహము చూపి

కేకలు వెట్టి విమర్శించుటను ఆయన వినె నేని, తిన్నని నవ్వుతో "ఓ ఓ! అది మహాపాపము కాఁబోలు. వారందఱును తామే యీ పాపము చేయుచున్నారు. భయకంపితమగు వంచన తన్నెట్లు సమర్థించుకొనును! ఎట్లు తన్ను కప్పికొనును!" అని పలుకును.

ఆఁడువారిపై, బీదలపై సంఘభారమంతయు పడును. కావున వారియెడ మిక్కిలి దయాళువై యుండును. "స్త్రీలు, శిశువులు, సేవకులు, దుర్బలులు, దరిద్రులు, అజ్ఞానులు చేసెడి తప్పులు భర్తలది, తండ్రులది, యజమానులది, బలవంతులది, ధనవంతులది, జ్ఞానులది" అనును. వేఱొకపుడు "అజ్ఞులగు వారికిఁ జేతనైనంత బోధింపుము. అందఱకును విద్య ప్రసాదింపకుండుటచే సంఘము శిక్షార్హము. తాను కలిగించిన చీఁకటి కదియే యుత్తరవాది. ఆత్మను చీఁకటిలో విడిచిన పాపములు జరుగును. పాపము చేయువాఁడు అపరాధి కాఁడు. అజ్ఞానము నిర్మూలింపనివాఁడు అపరాధి" అని చెప్పును.

విషయ పరిశీలనమునం దాయనదొక వింత క్రొత్త పద్ధతియని మనకుఁ దెలియుచున్నది. దాని నతఁడు సువార్తల నుండి సంగ్రహించి యుండునని నా యూహ.

ఒకనాడు నలుగురు కూడి మాటాడుచున్నపుడు, విచారణకు రానున్న యొక నేరవృత్తాంతము వినెను. ఒకడు పెండ్లాము బిడ్డలపైన అతిప్రేమచే, వారిని పోషించు వేఱు విధానము లేకుండుటవలన కృత్రిమ నాణెములను సిద్ధము చేయసాగెను. ఆ నేరమునకు శిక్ష ఉరి. అతఁడు చేసిన మొదటి నాణెమును భార్య బజారులో చెల్లించి పట్టుపడెను. ఆమెను

జెయిలులో పెట్టిరి కాని ఆమెయే నాణెముచేసినట్లు ఋజువు లేదు. చేసినవానిపైన సాక్ష్యమామె మాత్రమే చెప్పఁగలదు. శిక్ష కీడ్వఁగలదు. కాని, అతఁడపరాధి కాఁడని భీష్మించినది. అప్పుడు, ఎదుటి వకీలొక యుక్తి చేసెను. ఆమె మగఁడు వ్యభిచారియని చెప్పి, కొన్నిజాబుల ముక్కలను ఇక్కడివక్కడ, అక్కడివిక్కడ జతపఱచి, ఆ యభాగ్యురాలిని నమ్మించెను. ఈర్ష్యాచోదితురాలై, ఉన్నదున్నట్లు నాణెముల నేరము నంతయు వివరించి, నిరూపించినది. త్వరలో వారిద్దరిని విచారింతురు. శిక్ష తప్పదు—ఇది కథ. విన్నవారందరా వకీలు తెలివితేటలను మెచ్చుకొని, క్రోధము సత్యమును బయల్పఱచి ప్రతీకారచింత న్యాయము వెలిగించుటకు హర్షించుచుండిరి. ఇదియంతయు బిషప్ నోరు మెదల్పక విని "వారి నెక్కడ విచారించెదరు?" అని ప్రశ్నించెను.

"న్యాయసభలో" అని జవాబు.

"వకీలు నెక్కడ విచారింతురు?"

డి—లో ఒక విషాద సంఘటనము జరిగెను. ఒకనికి ఉరిశిక్ష చెప్పబడినది. ఆ నిర్భాగ్యుని చదువు చాలతక్కువ. కాని, సంపూర్ణముగా అజ్ఞుఁడుకాఁడు. సంతలలో ఇంద్రజాలము చేయుచుండినవాఁడు. నిరక్షరుల కుత్తరములు వ్రాసిపెట్టుచుండినవాఁడు. అతని విచారణను గుఱించి ప్రజలెంతో ఔత్సుక్య మగపఱచిరి. అతని నురితీయవలసిననాఁటికి ముందు దినము సాయంత్రము, మరణదండన విధింపఁబడినవారికి దైవచింతఁ గఱపుటకని నియమింపఁబడిన యుద్యోగికి జబ్బుచేసెను. క్యూరేకు చెప్పిపంపిరి. "అది నా పనికాదు. ఆ నీచకార్యముతో

గాని, ఆ దొంగవెధవతోఁగాని నా కక్కఱలేదు. అదియును గాక, నా దేహస్థితియు బాగుగలేదు...ఇంతెందుకు, అది నా పనికాదు" అని జవాబు పంపెను. ఈ వార్త విని, బిషప్ "అతఁడన్నది సత్యమే. ఆ పని యతనిదికాదు; నాయది" అని పలికెను.

ఆ క్షణముననే మిరిల్ కారాగారమునకు వెళ్ళి, ఆ "దొంగవెధవ" యున్న చీఁకటికొట్టు ప్రవేశించి, పేర్వెట్టి పిలచి, చేయిపట్టుకొని మాటాడెను. దినమంతయు అతనితోనే కడపెను. నిద్రాహారము లతని జ్ఞప్తికైన రాలేదు. శిక్షితుని ఆత్మోన్నతికై ఈశ్వరప్రార్థనసల్పి, ప్రార్థింపుమని యతనిని గూడ బుజ్జగించెను. ఉత్తమములు, అతిసులభముగ సాధింప వీలైనవియునగు ధర్మములను వివరించెను. తండ్రి, అన్న, స్నేహితుఁడువలె ఆదరించెను. ఆశీర్వదించుటకు మాత్రమే బిషప్. ధైర్యముఁ గఱపి, సమాశ్వసించి యెన్ని నీతులో బోధించెను. శిక్షితుఁడు నిరాశాహతుఁడై యుండును. చావతని కొక యగాధకూపము. భయోత్పాదకమగు ఆ యంచున నిలబడి, గడ గడ నదరి యతఁడు వెనుఁదిరుగుచుండెను. లెక్క సేయకుండుట కతఁ డంత తెలియనివాఁడు కాఁడు. మనము జీవితమనునది, అగోచరమై అందని పరలోకమునుండి వేఱు సేయు గోడవంటిది. ఉరిశిక్ష, ఆ గోడ నిక్కడక్కడ పగులఁ గొట్టి, అతని యంతర్దగత్తును ఘోరముగ మోదినది. ఆ పగుళ్ళ నుండి, ఈ ప్రపంచమున కావల నేమున్నదా యని యతఁడు చూడ, చీఁకటితప్ప వేఱేమియుఁ గనఁబడుటలేదు. బిషప్ వెలుగు చూపించెను.

మఱునాఁడు పోలీసులువచ్చి చూడఁగా, బిషప్ అతనితోఁగూడ నుండెను. బిషప్పతనిని వెంబడించెను. మెడలో సిలువ, పాదములు తాకుచున్న ఊదా గౌను ధరించిన బిషప్‌ను ఆ దీనుని ప్రక్కన జనులగుంపు కనుంగొనెను.

అతఁ డెక్కిన బండిలోనే వెళ్ళి, అతనితోఁగూడ వధ్యశిలను సహితము మిరిల్ ఎక్కెను. ముందునాఁడు విషాదభయవిచేష్టితుఁడై యుండిన శిక్షితుఁ డానాఁడు వికాసవదనుఁడై యుండెను. కనులలో ఆశ, మనస్సున సమాధానము తోఁచినవి. ఈశ్వరునిపై విశ్వాసము కలిగినది. బిషప్ అతనిని కౌఁగిలించుకొని, గొడ్డలి మెడపైఁ బడఁబోవు ముందు "మానవునిచే చంపఁబడినవానికి దేవుఁడు జీవమిచ్చును. సోదర నంచితుఁడు, తండ్రి ప్రేమను పొందును. నాయనా! ప్రార్థింపుము. ఈశ్వర విశ్వాసమును వీడకుము. వాస్తవజీవితమునఁ బ్రవేశింపుము. అక్కడ తండ్రి యున్నాఁడు" అని అత్యనుకంపార్ద్రవచస్సుల సమాశ్వాసముఁ గొలిపెను. వధ్యశిలనుండి, బిషప్ క్రిందికి దిగివచ్చునపుడు, అతని ముఖమునందలి యవర్ణ్యకళనుగాంచి ప్రజలు వెనుక కొదిగిరి. ఆ ముఖమునందలి వైవర్ణ్యమా, స్థిమితమా ఆశ్చర్యము గొలుపునది? చెప్ప వీలుగాదు. తాను భవనమని చెప్పుకొను తన చిన్ని యావాసముచేరి, చెలియలితో "అమ్మా, ప్రధానాచార్యత్వము నెఱపి వచ్చితిని" అని నగుమొగముపెట్టి చెప్పెను.

మహోదాత్తవిషయములు మనస్సునకెక్కుట మిక్కిలి యరుదు. కావున నగరవాసులు బిషప్ చేసినదంతయు నటన యనిరి. కాని, అట్లన్నవారు పైపై వర్గములకుఁ జేరినవారు.

జనసామాన్యము పవిత్రకార్యములలో స్వలాపేక్షోద్దేశ్యములను చూడరు. వారు బిషప్‌ను మెచ్చుకొనిరి. ఆర్ద్రహృదయులునైరి.

ఆ వధాదృశ్యము బిషప్‌కు తీవ్రహృదయాఘాతము కలిగించి భ్రమాన్వితుని చేసెను. ఆయన కోలుకొనునప్పటికి చాల కాలము పట్టినది.

వధ్యశిల నిర్మించి సిద్ధముచేసినపుడు చిత్తభ్రమం గొల్పును. మనము స్వయముగ ఆ పనిని చూడనంతవఱకు ఉరిశిక్షను గుఱించి ఉపేక్షాభావముతో ఉండవచ్చును. ఒక్కసారి చూచితిమా, అతి కఠినముగ హృదయము నదలం గొట్టును. తత్పరముగనో, విరుద్ధముగనో చర్య పుచ్చుకొనం దీవరము గల్గును. కొందఱు దానిని మెచ్చుకొందురు. కొందఱు గర్హింతురు. వధ్యశిల శాసనమూర్తి. ప్రతికర్త్రి యని దాని నందురు. అది పక్షవిభేదములేనిది కాదు. మనలను నిష్పాక్షికులుగ ఉండనియ్యదు. దాని కర్మ చూచినవాండు అనిర్దేశ్య కాయకంపనములచే గడగడలాడిపోవును. సకల సాంఘిక ప్రశ్నలును ఈ గొడ్డలిని గుఱించి తర్కించుచునే యున్నవి. వధ్యశిల వట్టి చట్టము కాదు. యంత్రము కాదు. జడమైన కొయ్యతో, త్రాటితో, ఇనుముతో చేయంబడిన కొఱముట్టు కాదు. అది యొక జీవి. దాని జననమేదో విషాదమునుండి' అది యేమనియు మనకు తోంచదు. ఈ చట్టము చూచును, ఈ యంత్ర మర్థముచేసికొనును, ఈ కొఱముట్టు పట్టుకొనును. ఈ కొయ్యకు, ఇనుముకు, త్రాటికి, ఒక యిచ్ఛ యున్నది— అని చెప్పవచ్చును. దాని సాన్నిధ్య మాత్రమను భయంకర విభ్రమమునం బడంద్రోయును. ఆ యవస్థలో, ఆ వధ్యశిలా

పిశాచము, తన బీభత్సకార్యము నెఱవేర్చును. తలవరి సహకారి యగును. అది కబళించును. మాంసము తిని, రక్తము త్రాగును. న్యాయాధికారియు, పనివాండ్రును సృష్టించిన ఘోరరాక్షసి వధ్యశిల. దానిలో అవాచ్యమైన ప్రాణహార ప్రాణమున్నది. అది కావించిన అసంఖ్య మారణకర్మలనుండి దాని ప్రాణము బలపడినది.

ఇట్లది కలిగించిన భయంకరభావ మాయనలో శాశ్వతముగ నిలచిపోయెను. ఉరి జరిగిన మఱునాడును, తరువాత పెక్కునాళ్ళవఱకును బిషప్ చింతానిమగ్నుండై యుండెను. ఆ యంత్యక్షణము కల్గించిన ప్రశాంతిలో ఏదో యుగ్రత్వమున్నది. ఆ ప్రశాంతి యంతరించెను. సంఘన్యాయమను శూన్యభ్రమ ఆయనను వేధింపసాగెను. తాను చేసిన అన్ని పనులను సింహావలోకనముచేయునపు డతని కుజ్జ్వలమగు తృప్తి కల్గెడిది. ఈ పనిమాత్ర మాత్మనిందాకరముగఁ దోఁచినది. అప్పుడప్పుడు తనలోనే మాటాడుకొనును. ఆ స్వగతములు విషాదభరితములై యుండును. ఒక సాయంకాలమున అతని చెలియలు విని, విన్నదానిని వ్రాసిపెట్టినది. “అది యంత పైశాచికమని నేను నమ్మియుండలేదు. దైవశాసనమునందే నిమగ్నుండై మానవశాసనము పరిశీలింపకుండుట తప్పు. మృత్యువును దైవము నిర్ణయింపవలెను. తామెఱుఁగని దానిని, మానవులేయధికారముతో స్పృశింతురు?”

కాలక్రమేణ ఈ భావములు సన్నగిలినవి. బహుశః తుడిచివేయఁబడియు ఉండును. అయినను, అటుపిమ్మట బిషప్ ఆ వధ్యస్థానమువైపే యెన్నఁడును పోలేదని చెప్పుకొందురు.

రోగులు, మరణశయ్యాగతులునైన వారిచెంతకు పిలువఁగనే మిరిల్ వెళ్లెడివాఁడు. తన యుత్తమధర్మము, ఘనతమకార్యమును అందే కలదని ఆయనకు బాగుగఁ దెలియును. భర్తను మాతాపితరులనుఁ గోల్పోయినవారు చెప్పిపంపనలసినదే లేదు. తానై యచ్చటికి వెళ్లును. ప్రియభార్యను కోల్పోయినవాని ప్రక్కనో, సిసుఁగునుఁ గోల్పడిన తల్లిప్రక్కనో నోరుమెదల్పక గంటలపర్యంతము కూర్చుండును. మౌనసమయము నెఱిఁగినట్లే మాటసమయమును ఎఱిఁగినవాఁడు. ఎంత యద్భుత సమాశ్వాసకుఁడు! దుఃఖమును మఱపించి ముంచఁదలఁపడు. మఱి యాశాకల్పనచే దాని కున్నతిని గౌరవమును ఇచ్చును. "మృతులను గుఱించి చింతించునపుడు పొఱపాటు చేయకుము. ఎట్లుండి యుండునని తలంపకుము. స్థిరదృష్టిని చూడుము. నీకుఁ బ్రేమాస్పదులై యుండి మృతిచెందినవారు స్వర్గమున యశోజీవులై యుండుట పొడకట్టును" అని పల్కును. విశ్వాసము శ్రేయస్కరమని ఆయన నమ్మకము. నిరాశాపీడితునికి, ఈశ్వరాధీనమని తలవొగ్గిన వానిని జూపి మనశ్శాంతి నిచ్చును. గోరీవంక చూపులు బఱపు శోకమును, నక్షత్రమండలము తిలకించు శోకముఁ జూపి మార్చివేయును.

# 5

సాంఘిక జీవితము నంటెట్టి అభిప్రాయములు మిరిల్‌కు కలవో సరిగా గృహ జీవితమునందును అట్టివే కలవు. ఇంట తానై తెచ్చిపెట్టుకున్న దారిద్ర్యమును జూచినవారికి, అది యొక గంభీర మనోహర దృశ్యముగా నుండెడిది. వృద్ధులు,

చింతనశీలురును చాల తక్కువగా నిద్రింతురు. మిరిల్ కూడ అంతే. కాని, ఆయనది గాఢ నిద్ర. ఉదయమొకగంట ప్రొద్దు తేకను ధ్యాన మొనరించును. తరువాత గుడిలోనో, తన యింటనో, సమూహ ప్రార్థనమును నడిపించును. ప్రార్థనానంతరము రొట్టెయు పాలును సేవించును.

బిషప్ ప్రతిదినమును చేయవలసిన పనులొక లక్ష యుండును. ఊపిరి సలుపుకొన నవకాశముండదు. ఏ రవంత వీలు దొరకినను బీదలకు, రోగులకు, దుఃఖితులకు సేవ చేయుటకై వినియోగించును. ఇంకను వ్యవధియున్న కాయ కష్టము సేయును. ఒకప్పుడు తోటలో పనిచేయును. ఇంకొకప్పుడు వ్రాయుటయందో చదువుటయందో నిమగ్నుడగును. ఈ వ్రాత చదువులను తోటపనిగనే గణించెడువాడు. "ఆత్మయొక తోట" యనును.

మధ్యాహ్న వేళ, వాతావరణ మనుకూలముగనుండిన, వాహ్యాళి వెళ్లును. అప్పుడును గుడిసెలలో నివసించువారిని దర్శించును. యోజనా నిమగ్నుడై, నేల చూచుచుఁ బొడుగగు చేతి కఱ్ఱయూతతో, బిషప్ దుస్తులతో, కాళ్ళీడ్చుకొని నడచును.

ఆయన దారినడచు టత్యానందదాయక దృశ్యము. త్రోవ నడచునప్పుడాయన వికాస జీవములను వెదఁజల్లుచుఁ బోవుననవచ్చును. బాలభాస్కర భగవానుని చూచుటకువలే, వృద్ధులును శిశువులును ఆయన దర్శనమునకై ద్వారముకడకుఁ బరుగులెత్తుదురు. ఆయన వారిని దీవించి వారి శుభాశంసనను

లను పొందును. ఎవరికేమి కావలసియున్నను, ఆయన యిల్లు చూపుదురు.

అప్పుడప్పుడు మార్గ మధ్యమున నిలిచి పసిపిల్లలతో సంభాషించి వారి తల్లులఁగాంచి స్మితము కావించును. దుడ్డున్నపుడు బీదల యిండ్లకు, లేనపుడు ధనికులయిండ్లకును వెళ్ళును.

ఆయన చొక్కా వయసు మిగుల నెక్కువైనది. దానిని మఱుఁగు సేయుటకై ఊదా నిలువు గౌను లేక ఇలువీడఁజాలఁడు. వేసవికాలమునందిది కొంత చిక్కే.

మరలివచ్చి మధ్యాహ్న భోజనము సేయును. రొట్టెయు పాలు మాత్రమే.

రాత్రి యెనిమిదిన్నరకు చెలిమలి పంక్తిలో భోజనము. మగ్లోర్ వెనుక నిల్చుకొని, వడ్డించును. ఇదియు అతి మిత భోజనమే. ఎవరైన అతిథులుండిరా, సమీప సరస్సులనుండి చేపలు తెప్పించియో, పరిసర పర్వత జంతుమాంసము వండియో, మగ్లోర్ మృష్టాన్నము పెట్టెడిది. ఒక్కొక్క క్యూరే అతిథియైనప్పుడును, ఇట్టి భోజనమునకు సాకు. బిషప్ అడ్డు చెప్పడు. ఇట్టి యవసరములఁదప్ప, ఉడికిన శాకములును, నూనె వేపుడు రొట్టెయుఁ దప్ప ఇతరములుండవు. కావున "క్యూరెకు విందు సేయని సమయములలో బిషప్ ట్రాపిస్టుకు * విందు కుడుపును" అని నగరవాసులు నవ్వుకొందురు.

రాత్రి భోజనానంతరము బాప్టిస్టిన్‌తో మగ్లోర్‌తో మాటాడుచు అరగంట కడపును. తరువాతఁ దన గదికి పోయి

*అనన్య సామాన్య మిత భోజనమే నియమముగాఁగల క్రైస్తవ పరివ్రాజకులు.

యేమేని వ్రాసికొనును. ఆయన పండితుఁడు. తాను వ్రాసిన అయిదారు వ్రాఁతప్రతి గ్రంథములను అట్లే పెట్టిపోయినాఁడు.

కొన్ని వేళల, ఏ పుస్తకము చదువుచున్నప్పుడైన, ఉన్నట్టుండి ధ్యానమగ్నుఁడగును. మరల బాహ్యజగత్తులోనికి రాఁగానే, ఎదుటనున్న పుటపై తోఁచినది వ్రాయును. ఈ వ్రాఁతకును ఆ పుస్తకమునకును సంబంధమేయుండదు. ఒక పుస్తకపుటంచున ఇట్లు వ్రాసియున్నాఁడు—

"ఓ కాలానవచ్చిన్నా! నిన్ను కొందరు సర్వశక్తుఁ డందురు. స్రష్టయని, స్వాతంత్ర్యమని, సమస్తము, జ్ఞానము, సత్యము, వెలుఁగు, ప్రభువు, విధి, పావిత్ర్యము, న్యాయము, దేవుఁడు, తండ్రి, అనుకంప—అని యిన్ని విధముల నామకరణము చేసియున్నారు. కడపటిది అన్నింటికన్న మనోహరమైనది."

తొమ్మిది గంటలు కాఁగానే, ఆ స్త్రీలు మేఁడమీఁది తమ గదులకు వెళ్ళుదురు. అతఁడొంటరిగఁ గ్రిందనే నిలుచును.

ఇక్కడ ఆయన యింటినున్నదున్నట్లు చెప్పవలెను.

# 6

ఆ యింటికిఁ గ్రింది భాగమును, పైనొక యంతస్తును కలదు. క్రింద మూఁడుగదులు. పైన మూఁడుగదులు. ఒక అటకయు కలదు. ఇంటి వెనుక పాతిక యెకరా తోఁట. స్త్రీ లిద్దరును మేఁడమీఁద నుందురు. బిషప్ క్రిందనుండును. మొదటి గది వీధి నానుకొని యున్నది. అది భోజనశాల. రెండవది పడకగది. మూడవది పూజా మందిరము. పూజామందిరము వెలువడవలెనన్న పడకగది లోనికి, పడకగది వీడవలెనన్న

భోజన గదికి వచ్చి తీఁటన లెను. పూజామందిరమున ఒక మూలలో ఎవరేని అతిథులకని ఒక పరుపున్నది. పల్లెలనుండి 'ఖ్యశే'లు, ప్రజల తరఫుననో ఉద్యోగ ధర్మముననో వచ్చి నపుడు, వారికది యుపయోగించును.

ఆస్పత్రి మందుల గది ఒక చిన్న యిల్లు వంటిది. తోఁటలో నున్నది. దానిని వంటగదిగా మార్చిరి.

తోఁటలో గుఱ్ఱపుశాల కలదు. అది మునుపు ఆస్పత్రి వంటయిల్లుగా నుండెడిది. ఇప్పుడు బిషప్ దానిలో తన రెండావులను కట్టివేయును. ప్రతి దినము తప్పక సగముపాలు ఆస్పత్రి రోగులకై వెళ్లెడిది. "నేను నా పన్ను చెల్లింతును" అని యతఁడు చెప్పును.

ఆయన గది పెద్దది. అతి శీతకాలమున వెచ్చఁగా నుంచుట మిక్కిలి కష్టము. కట్టెలు కడు ప్రియము. కావున, ఆవుల కొట్టమును రెండుగా విభజించి, శీతకాల సాయంకాలము లక్కడఁ గడపుచు దానిని చలికాలపు చావిడి యనును.

ఆ చావిడిలోను, భోజనపు గదిలో వలెనే, చతురశ్ర మగు కొయ్యబల్ల యొకటి, నాలుగు గడ్డి కుర్చీలును కలవు. భోజనశాలలో మాత్రము, పాత్రలుంచుటకు ఎఱ్ఱరంగు పూసిన మేజా కలదు. అట్టిదే యింకొకటి, తెల్లబట్టతో కప్పఁ బడి, పూజామందిరమున దైవపీఠముగా నైనది.

భాగ్యవంతులగు పశ్చాత్తప్తులు, దానపరలగు స్త్రీలును, అందమైన దైవపీఠమునకని యెన్నిసారులో ధన మిచ్చిరి. ఆయన దానిని స్వీకరించి పేదలకిచ్చి వేయును. "సమాశ్వసింపఁబడి దైవమునకుఁ జేతులు మోడ్చు దుఃఖితుని

హృదయమే, అతి సుందర దైవపీఠము” అని ఆయన సమాధానము.

ప్రార్థనా సమయమున నుపయోగించు గడ్డి కుర్చీలు రెండు పూజామందిరమునఁ గలవు. పడక గదిలో గడ్డిదేయగు పడక కుర్చీ యొకటి కలదు. ఏడెనిమిదిమంది చూడవచ్చినపుడు, ఇవి యన్నియు ఒకచోటఁ జేరును.ఇట్లు పదునొకఁడుండ్రు కూర్చుండనగును. ఆగంతుకుల సంఖ్య అధికమైనట్లంతయు, ఒక్కొక్కగదియు నట్టిదగును.

ఎప్పుడైన పన్నెండుగురు వత్తురు. ఆ క్లిష్టసమయము గడచుటకై, చలికాలమైనచో బిషప్ కుంపటిచెంత నిల్చికొనును. వేసవియైన తోఁటలో పచారు సల్పును.

అతిథులకని విడఁదీసిన పడక యున్నచోట ఇంకొక కుర్చీ యున్నది. కాని, అది త్రిపాది. గోడ కానించిన నిలువఁ గలదు. బాప్టిస్టిన్ గదిలో కొయ్యవాలుకుర్చీ యున్నది. అది పెద్దది. ఒకప్పుడు దానికి నగిషీ పట్టుగలీబు లుండెడివి. మేడ మెట్లు చాల ఇఱుకగుటచే, కిటికీగుండ అది పైకి పయనించినది. కావున కదలింప వీలుకాని వస్తువులలోఁ జేరినది.

వెల్వెట్ మెత్తలు, పచ్చని పట్టుగలీబులు, దానిపై గులాబీపూలు, హంసమెడవంటి హస్తములుగల మంచి పెద్ద కుర్చీ, పండుకొన యోగ్యమైనదానిని కొనవలెనని బాప్టిస్టిన్ కెంతో కోరిక. అట్టిదాని వెల అయిదునందల ఫ్రాంకులగును. ఐదు సంవత్సరములకామె నలువదిరెండు ఫ్రాంకులు కూడఁ బెట్టఁ గలిగెను. కావున, లాభము లేదని, ఆ కోరిక మానుకోక తప్పినదికాదు. తమ యాదర్శమును చేరఁగలవారెవరు?

బిషప్ పడకగదికంటె సాధారణమైనదింకొకటరుదు. తలుపుగల కిటికీయొకటి తోటవైపున్నది. దానికెదురుగా, ఆస్నత్రులలో ఉపయోగించు ఇనుపమంచము, దానిపైనొక పఱుపు. ఆకుపచ్చ దోమతెర. పఱుపు నీడలో ఒక తెర వెనుక పూర్వాశ్రమమునం దుపయోగించుచుండిన దేహాలంకారోప కరణములు దాగియున్నవి. రెండు ద్వారములు—ఒకటి పొగ పోవు గొట్టము దగ్గరనుండి పూజామందిరములోనికిఁ గొంపోవు నది, ఇంకొకటి పుస్తకముల బీరువాకడనుండి భోజనశాలకు దారితీయును. బీరువా పెద్దది—అద్దము తలుపులు. దాని నిండుగ పుస్తకములు కలవు. నిప్పుగూడు * నాల్గంచులు కొయ్యవి. పాలరాయివలె కనుపట్టునట్లు రంగు వేయబడినది. ఆ గూటిలో సాధారణముగా నిప్పుండదు. రెండినుపకుంపటి బిళ్ళలు, రెండు పూలగిన్నెలును కలవు. ఒకప్పుడా గిన్నెలకు వెండిపూఁత యుండెడిది. అది మత సంబంధమైన ఒక భోగము. నిప్పు గూటికి పైన వెండిసిలువ వ్రేలాడుచుండును. దాని వెల్వెట్ చట్టముపైనుండిన గిల్టుకూడ ఎగిరిపోయినది. కిటికీ దగ్గర ఒక పెద్ద బల్లయును, దానిపైన కలందానును, చిందరవందరగాఁ గాగిత ములు, పెద్దపుస్తకములు నుండినవి. టేబులు కెదురుగా గడ్డితో చేసిన పడకకుర్చీ, పూజాపీఠమొక్కటియుఁ గలవు.

కోడిగ్రుడ్డు ఆకారముకల చట్టము లమర్పఁబడిన చిత్ర ములు రెండు గోడలకు వ్రేలఁగట్టబడినవి. అవి తొల్లటి మత గురువులవే. రోగులనక్కడినుండి పంపించి తాను ప్రవేశించి

---

* అతి శీత ప్రదేశములలో, గదిని వెచ్చగా నుంచుటకై మంట వేయు చోటు. ఇట్టివి మన దేశమునందును ఢిల్లీ మున్నగుచోట్ల కలవు.

నపుడీ చిత్రములను బిషప్ ఆ గోడలపైనఁ జూచెను. ఆయన వాని జోలికి పోలేదు. వారును మతోపదేశకులు. బహుశః ఆస్పత్రికి విరాళములిచ్చియుందురు. కావున వారు గౌరవార్హులు.

కిటికీకొక తెర కలదు. ఉన్నితో చేయఁబడినది. ముతకవి. కడుఁ బ్రాఁతది. క్రొత్తది కొనవలెనన్న వ్యయము కాఁబట్టి, మగ్లోర్ దానికిఁ బెద్ద అతుకు వేసినది. అది సిలువయాకారమునందుండెను. దానిని చూచి బిషప్ "అది యెంత యదృష్టము కలది" అనెడివాఁడు.

మేడపైనను క్రిందను, గదులన్నియు వెల్ల వేయఁబడినవి. ఆస్పత్రులలో, సిపాయి శాలలలో ఇది తప్పనిసరి. అన్ని విధములను ఆ యింటిని వృద్ధస్త్రీ లిరువురును అతిశుభ్రముగ నుంతురు. ఈ విలాసమునకు బిషప్ అడ్డుచెప్పఁడు. "దీన బీదలకు నష్టములేదు" అనును.

ప్రాఁతకాలపు వస్తువులు కొన్ని ఆయన దగ్గరనున్నవని మన మంగీకరింపక తప్పదు-ఆఱు వెండిగిన్నెలు, పెద్ద వెండి చారుగరిటె. టేబుల్‌పైనఁ బఱచిన ముతక ప్రత్తి వస్త్రముమీఁద ఆసీనములై తళతళలాడు ఈ వెండిపాత్రలు ...ి మగ్లోర్ ఆనందించని దినములేదు. ఉన్నదున్నట్లు ...చుచున్నాముకాన "వెండిపాత్రలు లేనిదే తినుట నాకు ...ాదు" అని యప్పుడప్పుడు బిషప్ పలుకుటయు ...ము.

... మానులతో గణింపఁదగిన రెండు వెండి

దీపస్తంభములు కలవు. అవి ఒక ముత్తవ్వనుండి సంక్రమించినవి. ఒక్కొక్కదానిపై నొక్క మైనపువత్తి కలదు. వాని స్థానమొక యటకమీఁద. ఎవరైన అతిథులు వచ్చినపుడు, వానిని వెలిగించి మగ్లోర్ టేబులుమీఁద బెట్టును.

బిషప్ పడకగదిలో, తలవైపు గోడలో ఒక అల్మారా యున్నది. వెండిగిన్నెలను, గరిటెను ప్రతిసాయంకాలమున మగ్లోర్ అక్కడ భద్రపఱచును. కాని తాళముచెవి తలుపునకే యుండును.

తోఁటలో ఆవులకొట్టము, వంటిల్లు త్రోవలు కాగా, మిగిలిన జాగాలో నాలుగు ముక్కలుగా కాళీస్థలమున్నది. మూఁడింట మగ్లోర్ కూరగాయలను పండించును. ఇంకొక దానిలో బిషప్ పూలమొక్కలను పెంచును.అందందు ఫలవృక్షములును కలవు. ఒకసారి ఆక్షేపణ స్వరముతో మగ్లోర్ "స్వామీ, అన్నిటిని ఉపయుక్తములు చేయవలెనని తామాత్ర పడుచుందురుకదా! ఆ పూలకుమారు, ఏవేని దుంపలను బెంచిన బాగుగనుండదా?" అని ప్రశ్నించెను. "పొఱపాటు. సుందరమైనది ఉపయోగకరమైనదానంత ఉపయోగకరము" అని బిషప్ కొంతవడి మౌనముగానుండి, పిదప "బహుశః అంతకంటె నెక్కువ యుపయుక్తమేమో" అని బదులు చెప్పె

ఆ పూలతోటలో మూఁడు నాలుగు పాదులు ప్రతిదినమును బిషప్ పుస్తకములకిచ్చు కాలము కును ఇచ్చును. ఒకటి రెండు గంటలకాలము, త్ర గత్తిరించుచుఁ, గలుపుతీయుచుఁ, జిన్న చిన విత్తనములు ఫూఁడ్చుచుఁ గడపును. ఆ

పండితుఁడు కాఁడు. వృక్షలతాపరిశీలన మతడు చేయలేదు. కాని. పూవులను ప్రేమించును. విద్యావంతులను గౌరవించును. తెలియనివారి నంతకంటె గౌరవించును. ఈ ధర్మము నిర్వర్తించుచు, ఒక్కొక్క వేసవియందును, రేకు లోటాతో పూలమొక్కలకు నీళ్లు పోయుచుండును.

ఇంట నొక తలుపునకైనఁ దాళము లేదు. భోజనశాల తలుపు గుడి కైవారములోనికిఁ దెఱువనగునని యిదివరకే చెప్పితిమి. పూర్వము దానికి కారాగృహము తలుపులకువలె ఇనుప గొళ్లెము గడియయు నుండెడిది. బిషప్ ఈ యినుప సామగ్రినంతయుఁ దీయించివేసెను. ఇపుడు రేయింబవళ్ళు తలుపూరక చేరవేయుదురు. అంతే. ఏ ప్రొద్దులోనైన దారిని పోవువాఁడు గెంటినఁ దలుపు తెఱచుకొనును. మొదట మొదట ఆఁడువారిద్దరును భయపడిరి. "కావలెనన్న మీగదుల తలుపులను భద్రపఱచుకొనుఁడు" అని బిషప్పు చెప్పివేసెను. కనుక, ఎట్టకేల కాయన విశ్వాసమున వారును పాల్గొనవలసి వచ్చెను. లేక, పాల్గొనుచున్నట్లు నటింపనైనవలసివచ్చెను. మగ్లోరుకు ఉన్నట్టుండి, అప్పుడపుడు భయము కలిగెడిది. బిషప్పందమా, ఆయన నిర్భయత్వమునకు కారణము స్వహస్తాక్షరములతో బైబులులో ఒక పుటయంచునం దిట్లు వ్రాసిపెట్టెను. "చూచాయగా అర్థమిది: వైద్యుని తలుపెన్నడును మూయఁగూడదు. గురువు తలుపెప్పుడును తెఱచియే యుంచవలెను."

...త్వ" మను ఇంకొక గ్రంథమునం దిట్లు వ్రాసి ...యంతటి వైద్యుఁడను నేను కానా? నాకును

రుగ్ణులున్నారు. వైద్యులకుఁ జెందినవారు కాక, అభాగ్యులైన వారును నావారే.''

ఇంకొకచో ఇట్లు వ్రాసినాడు. ''నిద్రింపఁ దావర్థించువాని పేరడుగవద్దు. అట్టివానికే పేరు భారము. అతనికే ఆశ్రయ మవసరము.''

ఒకనాఁడొక 'క్యూరె', మగ్లోర్ ప్రోత్సాహముతో కొంచోలు, ఇంటి నింత యరక్షితముగా విడిచిన అజాగ్రత కదా, ఏదేని అపాయము వాటిల్లదా యని ప్రశ్నించెను. బిషప్ తిన్నగా అతని భుజమంటి ''దేవుడు రక్షింపని యింటిని కాపాడఁ జూచుట వ్యర్థప్రయత్నము'' అని పలికెను.

''అశ్వసైన్యాధ్యక్షునకును, మతోపదేశకునకును ధైర్య మవసరము. కాని మా ధైర్యమున ప్రశాంతి యుండవలెను'' అని పలుమాఱుచునుండును.

# 7

ఇప్పుడొక సంఘటనమును వివరించి తీరవలెను. బిషప్ ఎట్టి వాఁడో స్పష్టపఱచు పెక్కింటిలో ఇది యొకటి.

ఫ్రాంసు సరిహద్దులలో 'గాస్పర్డ్ బే' అను దారి దోపిడిగాఁడొక పెద్దగుంపును చేర్చుకొని బీభత్సము నెఱ చుండెను. ప్రభుత్వము, వారినందఱను తుదముట్టించెను. వారిలో ముఖ్యుఁడైన 'క్రావా' కొండలలో దాగి త[illegible] కొనెను. ప్రాంతగుంపులోనివారే కొండఱనుచరులును యుండిరి. కొంతకాలము అణఁగియుండి క్రా[illegible] లతో ఫ్రాంసు ప్రవేశించి 'ఎంబ్రన్' వఱ[illegible]

లలో దాగి పరిసరములలో మానవసంచారమైన లేనట్లు చేసెను. గుడిలోఁ జొరఁబడి, అలంకారములను, పాత్రాది సామగ్రిని మటుమాయము చేసెను. అతనిని బట్టుకొనఁబంపిన రక్షక భటులు నిష్ఫల ప్రయత్నులైరి. అతఁడెప్పుడును తప్పించు కొనును. గుండెతీసినబంటు. ఇట్టి సమయమున మిరిల్ వచ్చెను. క్రావా ఉండు మార్గమున 'చాస్టిలక్'కు ఆయన పయన మయ్యెను. మేయర్ వచ్చి యీ ప్రయత్నము మాన్పింపఁ జూచెను. "తోడుతీసికొని వెళ్ళుటయు వ్యర్థమే. నిష్కారణ ముగ ఇద్దరు ముగ్గురు భటులను అపాయము పాల్సేయుట గును" అని నొక్కిచెప్పెను.

"అందుచేతనే ఏ రక్షణయు లేక పోనెంచినాను."

"అట్లు చేయఁదలంపకుఁడు" అని మేయరుద్విగ్నుఁడయ్యెను.

"నా తలంపంతయు దానిపైనే యున్నది. రక్షక భటుల యవసరమే లేదు. ఇంకొక గంటలో బ్రయాణము."

"ప్రయాణము!"

"ఆఁ."

"ఒంటరిగనా?"

"ఒంటరిగనే."

"స్వామీ, వలదు వలదు."

"ఆ కొండమీఁద ఒక చిన్నపల్లెయున్నది. తన్నివాసులు ంత మిత్రులు. యోగ్యులును. మూఁడేండ్లనుండి ేదు. వారు మేపు గొఱ్ఱెలలో ముప్పదికొక్కటి అందమైన నానారంగుల దారములు చేయు

దురు. అప్పుడప్పుడైన దేవునిగుఱించి వారికి బోధించుటవ సరము. పిఱికివాఁడైన బిషప్పును గుఱించి వారేమి భావింతురు? నేను పోకున్న నేమనుకొందురు?"

"కాని, స్వామీ, ఆ దోపిడిగాండ్రు?"

"నిజమే. దానిని గుఱించి యోజించుచున్నాను. మీరన్నది సరియే. నేను వారిని కలిసికోవచ్చును. దేవుని మంచితనమును గుఱించి బోధించువాఁరు, వారికిని అవసరమే."

"స్వామీ, వారొక తోడేళ్ళ గుంపు."

"అయ్యో, ఏసు ప్రభువాగుంపును మనుచుటకే నన్ను ద్దేశించినాఁడు కాబోలు. సర్వేశ్వరుని యిచ్ఛను ఎవరెఱుంగుదురు?"

"స్వామీ, వారు మిమ్ము దోఁచుదురు."

"నాదగ్గఱ నేమున్నది?"

"మిమ్ము చంపుదురు."

"ప్రార్థన చేసికొనుచు నడుచు వృద్ధగురువునా? లేదు. లేదు. వారి కందువలన ఏమి లాభము?"

"అయ్యో స్వామీ! వారిని గలిసికొని ఏమి చేయుదురు?"

"బీదలకే దేని సాయము చేయ వేఁడెదను."

"వలదు స్వామీ! పోవలదు. స్వర్గము పేర ప్రా మీదికి తెచ్చుకొనుచున్నారు."

"అయ్యో, నిక్కముాడితిరి. నా ప్రాణము కొనుటకై నేను బ్రతుకుచుండుట లేదు. తోడ్పి నుంటిని."

ఆయనను మళ్ళింప కాలేదు. పసిబాలుఁడొకఁడు దారి చూపగా బిషప్ బయలుదేఱెను. అందఱును ఆయన మొండితనమును గుఱించియే యాడుకొనఁజొచ్చిరి. పర్యవసానమును గుఱించి భయపడిరి.

తన సోదరిని కాని, మగ్లోర్‌ను కాని తోడుగాఁతీసికొనఁడయ్యెను. కంచర గాడిదెపైఁ గొండ దాఁటెను. దారిలో ఎవ్వరును ఎదురుపడరైరి. సురక్షితముగ తన స్నేహితులగు గొల్లవారిని జేరుకొని, పదునైదు నాళ్ళు ఈశ్వర సందేశమును వారికి బోధించెను. మఱి మఱలిపోఁదలచి పోవుటకుముందు, అందఱితోఁగలసి కృతజ్ఞతాగీతము పాడనుద్దేశించెను. (అది Te Deum అను లాటిన్ గీతము. దీనిని పాడినపుడు సాంప్రదాయమును బట్టి కొన్ని సాధన సామగ్రులవసరము.) కాని తదవసర వస్తువులు లేవు. 'క్యూరె' చింతించుచుండగా, బిషప్ "చింతింపవలదు. నేఁటి ప్రార్థనోపన్యాసానంతరమున, ఈ యుద్దేశ్యమును ప్రకటింపుఁడు. దానంతకదియే జరిగిపోవును" అని పలికెను.

చుట్టుప్రక్కల నున్న అన్ని గుడులను గాలించిరి. సమకూడిన ఆ పేద పరికరములన్నింటిని కుప్పపోసిన, ఒక కతిడ్రల్ పాటకుఁడు ధరించుటకైనఁ జాలినవి కాదు.

ఇట్టి సందిగ్ధస్థితి యందుండగా, అపరిచితులగు ఆశ్వికులిద్దరు ఒక పెద్ద పెట్టెను తెచ్చి, బిషప్పుకిచ్చి వెంటనే వాయువేగమున వెడలిపోయిరి. దానిని తెఱచిచూడగా, 'ఎంబ్రన్' గుడినుండి దొంగిలింపబడిన కనక మణిమయాలంకారములు, పట్టు వస్త్రములును ఎట్టివట్లుగా ఉన్నవి. ఒక చీటిపై "బీన్

వెను స్వామికి, వ్రాసిన నమస్కారపురస్సరార్పణ" అని వ్రాసి యుండినది. ఆ సామగ్రి ఆర్చిబిషప్పు ప్రయోగింపవలసినది.

"దానంతకదియే జరిగిపోవునని నేఁజెప్పలేదా? 'క్యురే' సాధనములతోఁ దృప్తి పడువానికి ప్రధానాచార్యుని పరికరములు ప్రభువు పంపినాఁడు" అని బిషప్పు హాసన్ముఖుఁడయ్యెను.

"ప్రభువా, పిశాచమా స్వామీ!" అని క్యురె శంకా సంకుచితుఁడయ్యెను.

నిశ్చలదృష్టితో అతనిని జూచుచు, అర్ధ్మాతస్వరమున ఆచార్యుఁడు "ప్రభువే" అని ప్రశాంతుఁడై పలికెను.

బిషప్పు చాప్టిలర్‌కు మఱలిరాఁగా, దారి పొడుగునను, ప్రజలుత్సుకులై చూడవచ్చిరి. చాప్టిలర్‌లోని గురుగృహమున బాప్టిస్టిన్ మగ్లోర్‌లు ఎదురు చూచుచుండిరి. "నేనన్నది సరియేకదా? పేద గురువు నిరుపేద గొల్లల యూరికి వట్టి చేతులతో పోయి, నిండుచేతుల మఱలి వచ్చినాఁడు. దేవుని మీఁద విశ్వాసముతో వెళ్ళి, కతీడ్రల్ నిధులను తీసికొని వచ్చితిని" అని చెల్లెలితో చెప్పెను.

రాత్రి, పండుకొనబోవునప్పుడాయన మరల ఇట్లుపదేశించెను. "దోఁపిడిగాండ్రు, హంతకులను భయముంచుకొనకుము. అవి వెలుపలి యపాయములు, స్వల్పములును. భ్రమలే నిజమైన దోఁపిడిగాండ్రు, కల్మషములు, హంతకులు. మహాపాయములు మన లోపలనున్నవి. మన తలలను, ధనపు సంచులను గత్తిరించునవేమి లెక్క? ఆత్మను ఖండించువానిని గుఱించి జాగ్రత్త వహింతము. చెలియలా! ఇరుగుపొరుగు వారి విషయమై మతాచార్యుఁడెన్నఁడును ముందు జాగ్రత్త

పడకుండదు. అతని పొరుగువారి పనులు ఈశ్వరానుజ్ఞాతములే. మన తలపైన అపాయములు పడనున్నవని తోంచినపుడు దైవ ప్రార్థన చేయవలెను-మనలగుఱించి కాదు, మన మూలమునం దోడి మానవుండు పాపము చేయకుండవలెనని."

వేయేల, ఆయన జీవితమున సంఘటనలు మిగులం గొద్ది. మాకుం దెలిసినవి మాత్రమే వ్రాయుచ్చితిమి. సాధారణ ముగా ఆయన ఒక గంటలోం జేసినపనినే మరల ఆ గంటలో చేయును. సంవత్సరమునందలి మాసము, దినమునందలి గంట వలెనే కడపును.

ఎంబ్రన్‌కతిడ్రల్ ధనరాసు లేమైనవను ప్రశ్న సంకో చము కలిగించును. "దానిని కతిడ్రల్‌కు మరల ఇచ్చివేయ వలెనా, లేక ఆస్పత్రికిం బంపవలెనా అనునదియే ప్రశ్న" అని, ఆయన చిత్తుకాగితములలో ఆయన హస్తాక్షరములున్నవి. ఇది ఆ ధనమునకు సంబంధించినదే కాంబోలు.

# 8

నిశితబుద్ధి కల సెనెట రొకడుండెడివాండు. అంతరాత్మ, విశ్వా సము, న్యాయము, డ్యూటీ-మున్నగు అడ్డులేవియు లేక, లక్ష్యము సేయక జీవితమున తన పనుల నెఱవేర్చుకొనువాండు. తన గమ్యమునకు సూటిగాం బయనించును. ఏదియు అతని ప్రక్కకీడ్వంజాలదు. తొలుత, గవర్నమెంటు వకీలుగా ఉండెడి వాండు. విజయమొక మార్దవ మతనికిచ్చినది. అతండు చెడ్డ వాండును గాండు. కొడుకులకు, అల్లుండ్రకు, బంధువులకు, స్నేహితులకును చిన్నచిన్న సాయములు చేయుచు వచ్చినాండు.

మంచి దినములలో జాగ్రత్తవహించి, ఎదురువచ్చిన యవకాశములను జారవిడువలేదు. తక్కినవంతయుఁ తెలివి తక్కువవిగా అతనికిఁ దోచెడివి. ఎపిక్యురస్* అనుయాయినని భావించెడి వాఁడు. వాస్తవమున కతఁడు ఎప్పుడును, ఎల్ల విషయములను గుఱించి సిద్ధముగా నవ్వుచుండును-ముఖ్యముగా "బిషప్పు పిచ్చి యభిప్రాయములను" గుఱించి, ఆయన యెదుటనే, ఏదో పోషకునివలె పోజువెట్టి నవ్వుచుండును. మిరిల్ ఊరక వినును.

ఒకనాఁడేదో యుత్సవమున, బిషప్పు ప్రక్కనఁ గూర్చుండి, ఆ సెనెటర్ పెద్ద యుపన్యాసము మొదలు పెట్టినాఁడు. "...ఆ యాద్యంతరహితునితో ఏమి పని? జిహోవా యను ఊహయే నాకు విసుగుఁగొల్పును. మనుష్యులలో, కార్శ్య దేహములను, శూన్య శిరస్సులను ఉత్పత్తి చేయుట తప్ప దీనికి వేఱు ప్రమేయము కానరాదు. సర్వమనఁబడు ఆ ఘనుఁడేటఁబడనిమ్ము! శూన్యమునకు స్వాగతము! అది ప్రశాంతి నిచ్చును. మీరాచార్యులు! ఒకనాఁడంతయు మీ యెదుట ఒప్పుకొనవలెను. ఇప్పుడే ఆ పని చేయుదును. నాకు సహజ వివేకమున్నదని యొప్పుకొందును. మీ జీసస్ ఊరూర బోధించిన సన్యాసము, ఆత్మత్యాగము నా తల దాకలేదు. అది పిసినిగొట్టుచే బిచ్చగాండ్రకిఁబడిన యుపదేశము. ఎందుకా సన్యాసము? ఎందుకాత్మత్యాగము? ఒకతోడేలింకొక తోడేలు కొఱకై చావదే. కావున, ప్రకృతి ననుసరింతము. జీవరాశిలో

* ఇంద్రియ సౌఖ్యమే జీవిత పరమావధి యని చాటిన గ్రీకు తాత్వికుడు.

అగ్రగణ్యులమైన మన తత్త్వముకూడ ఉత్తమముగా ఉండ వలెను. ఈ యున్న జీవితమే సకలమును కావున హాయిగా జీవింతము. మనుష్యున కింకొక జీవితము పైనో, క్రిందనో, ఇంకెక్కడనో ఉన్నదన్న, అక్షరముకూడ విశ్వసింపను... ఆచార్యస్వామీ! మానవుని అమరత్వము ఎండమావుల వంటి దని గట్టిగా నా కర్థమైనది... ఈ స్వర్గములు పిచ్చి యూహలు. దేవుఁడు ఘోరమిథ్య. ఈ మాట ఆచార్యులతోఁ జెప్పఁ గూడదు. అయినను మనలో మనము చెవులలో ఊదికొన వచ్చు లెండు. భూమిని స్వర్గము కొఱకు త్యాగమును సేయుట వస్తువును విడిచి నీడను పట్టుకొనుటగును. ఈ యనంతముచేత నేను వంచింపబడను. నేను శూన్యము. నా పుట్టుకకు ముందుం టినా? లేదు. చచ్చినపిదప ఉందునా? ఊఁహు. నేనేమి? పిడి కెడు మట్టి యీ వివిధాంగ రూపముతో ఉన్నది. ఈ భూమి పైన నేను చేయవలసినదేమి? సుఖమో, కష్టమో నేను కోరుకోవచ్చును. బాధ ఫలము? శూన్యము. భోగానుభవ మెక్కడికిఁ దీసికొనిపోవును? శూన్యమునకు. కాని, హాయి గన్నవాఁడ నగుదును. కావున వాస్తవమిట్టిది. నేను తినవలెను లేదా, తినఁబడవలెను. నేను తినఁగోరుకొంటిని. పల్లగుట గడ్డి యగుటకంటె మేలు. ఇదీ నా తత్వము. ఇక్కడినుండి గోరీ లోనికి. గోరీ అందరు చేరు చోటు. అక్కడ అంతయు ముగిసి పోవును. మృత్యువే చచ్చినది. నమ్ముఁడు. కాని, మనకంటె తగ్గుదశలో ఉన్న కార్మికులు, కాలికి చెప్పులైన లేని నిర్భా గ్యుల కేమైన వలదా? ఆత్మ, అమరత్వము, స్వర్గము మున్నగు పిచ్చిపిచ్చి కల్పనలు ఊహలు, వారిని జోకొట్టుటకు. వారా

కల్పనలు నెమరు వేసికొందురు. ఎండి రొట్టెకు దానిని పూసి కొందురు. ఇక్కడ ఏమియు లేనివానికిఁ బరలోకములో దేవుఁడు. మన ధనము మనకడ ఉన్నంతవఱకుఁ పరలోకములో దరిద్రులను భగవంతుఁడు కరుణించిన మనకే మభ్యంతరము?''

బిషప్పు చప్పట్లుకొట్టి, బిగ్గరగా సెనెటరు నిట్లభినందించెను. "అదీ అది. ఈ అనాత్మవాదము చాల పసందైనది. మహాద్భుతమైనది. ఎవరు నిరసించిన నేమి? దీనినంగీకరించినవాఁడింక మోసపోఁడు. కేటోవలె దేశాంతరము పోవుటకు, స్టీఫన్‌వలె శిలావర్షముక్రింద మడియుటకు, జోన్ వలె మంటలలో మ్రగ్గుటకుఁ దెలివిచెడి యంగీకరింపఁడు. ప్రశంసార్హమైన అనాత్మవాద మంగీకరించినవారికి బాధ్యతారాహిత్యము వలని సుఖమున్నది. అన్నింటిని, ప్రశాంతముగా కబళించవచ్చును. ఉన్నతస్థానములు, పనిలేకయే పెద్దజీతములు, గౌరవములు, మంచిగనో చెడ్డగనో అధికారములు, ఆదాయమిచ్చు అసత్యములు, ఉపయుక్తవంచనలు, రుచ్యములగు అంతఃకరణ వశీకరణములు-అన్నియు అతిసులభ కార్యములు. అన్నింటిని అరిగించుకొని వారు గోరీలోనికి దిగవచ్చును. ఇదంతయు ఎంత యింపు! మిమ్ము గుఱించియు ఇట్లే అనను. అయినను మిమ్మభినందింపకుండఁజాలను. ఘనప్రభువులైన మీకందఱకును, మీమీ లాభములకొఱకు మీ దేయగు ఒక తత్వమున్నది. అది మనోహరము, సున్నితము, ధనవంతులకే అందుబాటులోనిది. జీవిత సుఖమున కది వ్యంజనము వంటిది. చాల లోఁతులో నుండిన తత్వమది. దానినెంతో వెదకి తెచ్చితిరి.

అయినను మీరు మహోదారులు. కరుణాళుఁడగు ఈశ్వరునిపై విశ్వాసమును బేదవారికే వదలిపెట్టితిరి.''

# 9

దారి దోపిడిగాండ్రతో నిండిన ప్రదేశమునకు రక్షణలేక పోవుటకంటె ఎక్కుడాశ్చర్యము గొలిపిన పనియొక్కటి బిషప్పు చేసెను. ఊరంతయు దీనిని మహాపాయకరమనిభావించెను.

డి-పురము దగ్గర అడవిలో ఒంటరిగా ఒక మనుష్యుఁడుండెను. ఇతఁడు జాతీయసమాజ సభ్యుఁడని చెప్పినఁజాలును. ఎక్కువ ఉపోద్ఘాతమక్కఱలేదు. ఈ సంఘమువారు రాజవంశమునే తుదముట్టింపవలెనన్నవారు. అతని పేరు జి-.

ఆ యూరి వారందరా సామాజికుని గుఱించి, అదఱుగుండెతోఁ జెప్పుకొందురు. అతఁడొక పిశాచమనియే లెక్క. రాజును జంపవలెనని నిశ్చితముగా అతఁడు వోటుచేయలేదు. కాని, అంతపని చేసినాఁడు. సగానికి సగము రాజహంత. మొత్తమునకు భయంకర జీవి. రాజవంశము మఱల అధికారమునకు వచ్చినప్పటికిని, ఇతనిని కోర్టుకెందు కీడ్వలేదో? ఉరివేసెడివారు కారేమో-దయదలఁచిన, యావజ్జీవ దేశాంతరవాసమైన విధించియుండవలసినది. ఇంకొకరికది గుణపాఠమై యుండును...అదియునుగాక అతఁడు నాస్తికుఁడు. ఆ గుంపంతయు అంతే. రాబందును గుఱించి బాతుల వదరుటలు!

కాని, యీ సామాజికుఁడు రాబందా? అవును-అతని యేకాంతవాసమునందలి మృగప్రాయత్వమునుబట్టి యోజించి

నచో. రాజు నరి తీనవలెనని అతడు వోటు చేయలేదు కాఁబట్టి, ప్రవాసశిక్షకు గుఱి కాలేదు.

ఊరినుండి యతఁడున్నచోటకొక గంట నడువవలెను. రోడ్డుకు, జనపదములకది దూరము. జనదూరమై భయంకర మగు లోయలో. అక్కడ విశ్రాంతిగ కూర్చుండుట కతనికొక చీఁకటి కొట్టున్నదని చెప్పుకొందురు. అతని కిరుగుపొరుగులు లేరు. ఆ త్రోవ నడచువారు లేరు. అతఁడక్కడ నివాస మేర్పఱచుకొన్నది మొదలు, అక్కడికిఁబోవు మార్గము పొద లతో మూసికొనిపోయినది. ఆతని యునికి పట్టును తలవరి యిల్లుగాఁ ప్రజలు భావించెడివారు.

అప్పుడప్పుడు బిషప్పు,ఆ లోయవంక చూచి "అక్కడ ఒక్క జీవుఁడేకాకియై యున్నాఁడు" అని, తన ఆంతర్యమున 'అతనిని చూడవలసియున్నది' అని తలఁచెడివాఁడు.

ఈ యభిప్రాయ మప్పటికి సహజముగఁ గనబడినను, కొన్ని నిముసములు యోజన చేసినపిదప చిత్రముగ, ఆచరణా సాధ్యముగ, అసహ్యముగను తోఁచెడిది. జన సామాన్యమైన యభిప్రాయమాయననుకూడఁ బట్టుకొన్నది. ఎట్లో అతనికే తెలియదు. ఆ యభిప్రాయము ద్వేషపుటంచులలోనిది. అసహ్య మనవచ్చును.

ఏమైనగానీ, కాపరి జబ్బుపడిన గొఱ్ఱెనుండి విముఖుఁడు కాఁగూడదు! ఆహా, ఇది యెట్టి పశువు!

దయాసాంద్రుఁడగు ఆచార్యుఁడు కలవరపడుచుండెను. ఒక్కొక్క సారి ఆవైపు నడచి మరల వెనుదిరుగును.

కట్టకడపటికొక్కనాఁడు, ఆ సామాజికునికిఁ బరిచర్య

యొనర్చుచున్న బాలుఁడు డాక్టరు కొఱకై యూరిలోనికి వచ్చి నట్లు తెలిసెను. ఆ ముసలి పిశాచము చావనున్నాఁడని, కట్టె బాఱియున్నాఁడని విని జనులు "అమ్మయ్య! దేవుఁడు కనులు తెఱచినాఁడు" అని నిట్టూర్పు విడిచిరి.

బిషప్పు తన గౌను తొడిగికొని ప్రయాణమయ్యెను. చినిఁగిన కోటు, ప్రారంభమగుచున్న రాత్రి గాలి గౌనుతో అవసరము కల్పించినవి.

సూర్యాస్తమయ మగుచుండెను. బిషప్పు తన గమ్యమును చేరునప్పటికి సూర్యబింబము పశ్చిమ సముద్రమును దాకుచుండినది. ఆ చీకటి గుహను సమీపింపఁగనే గుండె యొకింత త్వర పడినట్లయ్యెను. ఒక గుంతదాటి, పొదనుగడచి, కంచె నెగిరి, యెత్తైన యొక పొద కెదురుగానున్న బయలు ప్రవేశించెను. అక్కడ సామాజికుని నివాసము.

ఆ యావాసమొక తగ్గు గుడిసె. దారిద్ర్యనిలయము. చిన్నదే కాని, శుభ్రముగనున్నది. దాని యెదుట చిన్న ద్రాక్షతీగ కలదు.

తలుపున కెదురుగా, తిరుగుకుర్చీ మీఁద, పండినతలతో ఒక వృద్ధుఁడు కూర్చుండి, హసన్ముఖుఁడై అస్తంగత సూర్యుని ఱెప్పవాల్పక చూచుచుండినాఁడు.

గొల్లపిల్లవాఁడు ప్రక్కన నిల్చుండి, గిన్నెలో పాలం దించు చుండినాడు. బిషప్పు చూచుచుండగా,ఆ వృద్ధుఁడు కంఠ మెత్తి "చాలు తండ్రీ! నాకిం కేమియు వలదు" అని పలికెను.

బిషప్పు ముందుకు వచ్చెను. పదశబ్దము విని వృద్ధుఁడు తలద్రిప్పి అత్యాశ్చర్యమగ్నుఁడయ్యెను. "నేనిక్కడ నివసింప

వచ్చినది మొదలు, నన్నుఁ జూడవచ్చినవారు మీరొక్కరే. మీరెవరు?"

"నా పేరు బీన్ వెను మిరిల్."

"బీన్ వెను-మిరిల్? నేనాపేరు వినియున్నాను. బీన్ వెను స్వామి అని ప్రజలనునది మిమ్మేనా?"

"అవును."

వృద్ధుని ముఖమున చిఱునవ్వొక్టి యుండెను. "అయిన నాకాచార్యులు."

"కావచ్చు."

"దయచేయుఁడయ్యా!" అని సామాజికుఁడు చేయి చాచెను. ఆచార్యుఁడా కరస్పర్శ చేయకయే "నాకు వచ్చిన దసత్యవార్తయైనందుకు సంతోషము. మీరు చాల జబ్బుగా ఉన్నట్లు కన్పట్టుట లేదు" అనెను.

"అయ్యా, త్వరలోనే యిప్పటికంటె బాగగును" అని ఒకింత ఆగి "మూఁడు గంటలలో నేను మరణింతును. నేనును కొంతకుఁగొంత వైద్యుఁడను. మృత్యువు అడుగుల సవ్వడి నేనెఱుఁగుదును. నిన్న నా పాదములే చల్లఁగ ఉండి నవి. ఈ దినము మోకాళ్ళకు ప్రాకినది. ఇప్పుడు నడుముల కెక్కినది. గుండె తాకినపుడంతయు ఐపోవును. సూర్యాస్త మయము మనోహరముగా నున్నది. కాదూ? నా యంతకు నేనే యీ కుర్చీని వెలుపలికి దొరలించుకొని వచ్చితిని-కడ పటిసారి ప్రకృతి శోభను జూచుటకు. మీరు నాతో మాటాడ వచ్చు. అది నాకాయాసము కల్గింపదు. చావసిద్ధమైనవానిని జూడవచ్చుట చాల మంచిపని. ఈ సమయమునకు సాక్షు

లుండుట మంచిది. ఒక్కొక్కరికొక్క మోజుండును. సూర్యోదయము వఱకు బ్రతుకవలెనని నా కోరిక. కాని, మూఁడు గంటలలో నా బ్రతుకు ముగియునని నాకు తెలియును. అప్పుడు రాత్రి సమయము. అయిననేమి? ముగింపు చాల సులభము. దానికుదయ మక్కఱలేదు. అట్లే జరుగనీ. నేను నక్షత్రకాంతిలో మరణింతును" అని చెప్పి, ఆ పిల్లవానివంక తిరిగి "నాయనా, నీవు పోయి పడుకో. నిన్నరాత్రియంతయు కాచితివి. అలసియున్నావు" అనెను.

పోవుచున్న బాలకునట్లే చూచుచు వృద్ధుఁడు, తనలో మాటాడుకొనుచున్నట్లుగా "వాఁడు నిద్రించునపుడు, నేను మరణించెదను. రెండు నిద్రలొకటికొకటి తోడు" అని మంద్ర స్వరమునఁ బలికెను.

ఆచార్యుని యభిప్రాయము ననుసరించి యిది ఉత్తమ మరణముకాదు. కావున, ఈ దృశ్యమతనినిఁ గదలింపఁలేదు. మనమంతయుఁ జెప్పఁదలఁచుకొన్నపుడు, మహాత్ములలోని చిన్న సరిపడని సంగతులుకూడ వివరించి తీఱవలెను. డాక్టర్లలో, మతాచార్యులలో, సామాన్యముగఁ గాఠిన్యము కనఁబడును. మిరిల్ కది యలవాటులేదు. ఆ కాఠిన్యమునకుఁ బ్రేరణ కలిగిన మాట వాస్తవము.

ఎన్ని చెప్పినను ఈ సామాజికుఁడు, ఈ ప్రజాప్రతినిధి ఒక నాఁడధికారయుతుఁడు. బిషప్పుకు, తన జీవితమున బహుశః ప్రథమమున ఇప్పుడే కాఠిన్యము వహించుట వినోదకరమైనది. సామాజికుఁడు వినయ సద్భావములతో సన్మానించెను.

మట్టిలోఁ గలియుటకు సిద్ధమైయుండువారిలో ఇట్టి యుణఁకువ యుండునేమో!

బిషప్ సాధారణముగా ఒకరి విషయములు తెలిసికొొన ఉత్సుకుఁడు కాఁడు. ఆ యుత్సుకత్వము తప్పని యతని భావము. కాని ఈ సామాజికుని బరిశీలింపకుండుట కతనిచేతఁ కాలేదు. ఈ పరిశీలనకు మూలము సానుభూతి కాదు. ఇంకొొకరిట్లు చేసి యుండిన ఆయన యంతరాత్మ నిరసించియుండెడిది. కాని, జాతీయసమాజ సభ్యుఁడు సంఘద్రోహియని, దాతృత్వమున కును అర్హుఁడు కాఁడని అతని యభిప్రాయము.

ఆత్మనిగ్రహము, వంపులేని మూర్తి, కంపిత స్వరమును గల ఈ యెనుఁబదేండ్లు కడచిన సామాజికుఁడు, మానవదేహ తత్వజ్ఞులకు అద్భుతముగొొల్పు వ్యక్తి. సమయమునకుఁ దగినట్లు విప్లవమిట్టివారిని బెక్కుర నుత్పత్తి చేసినది. మృత్యువునింత సమీపించియు, ఆరోగ్య చిహ్నములనట్లే నిలిపికొొన్నాఁడు. అతనిని జూచిన, ఇదిగో పరీక్షలకు నిలచినవాఁడనిపించును. చూపులో ప్రకాశము, పలుకులో పటిష్ఠత, బుజములలోని కండల కదలికలు మృత్యువు ప్రయత్నమును విఫలముసేయ సమర్థము లనిపించును. మహమ్మదీయమతమునందలి సమాధి దేవతయగు అగ్రేల్, పొరపడితి ననుకొొని, యీ మూర్తిని చూచి వెనుదిరుగనోపు. అతడు తానై కోరి మరణించుచుండి నట్లుండినది.ఆతని వ్యథయందును స్వాతంత్ర్యముండినది. కాళ్ళే కొొరడువారి, చల్లఁబడి, చచ్చిపోయినవి. తల పూర్ణపాటవ ప్రకాశములతో జీవించుచునేయున్నది. ప్రాచ్యవాఙ్మయము నందు, నడుముపైనఁ గండలు, క్రింద శిలగా వర్ణింపఁబడిన

యలౌకిక ప్రాణివలె, ఈ గంభీర సమయమున సామాజికుఁడు కన్పట్టుచుండెను. బిషప్పొక రాతిపైనఁ కూర్చుండి, తటాలున నిందాస్వరముతో "రాజ హత్యకై మీరు ఓటు చేయనందుకైన మిమ్మభినందింతును" అని పల్కెను.

"ఐన"యని యూది పల్కుటలోని కాఠిన్యమును సామాజికుఁడు గమనించినట్లు కన్పట్టలేదు. అతని ముఖము నందలి చిఱునవ్వంతరించినది.

"ఎక్కువగా అభినందింపలదయ్యా! ఆ రాక్షసుని నాశనమునకు నేను ఓటు చేసితిని" అని తప్తకంఠమున బదులు పల్కెను.

"ఏమి మీ యభిప్రాయము?"

"నా యభిప్రాయమా? మానవునిలో ఒక రాక్షసుఁడున్నాఁడు-అజ్ఞానము. ఆ రాక్షస నిర్మూలనమునకు నేను ఓటు చేసితిని. ఆ రాక్షసునికి రాచఱిక మబ్బినది. అది యసత్యము నుండి యుత్పన్నమగు అధికారము. సైన్సు సత్యమునుండి యుత్పన్నమగు అధికారము. మానవుఁడు, సైన్సుచేతఁ బాలింపఁబడవలెను."

"అంతస్సాక్షి చేతను-"

"అవునదియే. అంతస్సాక్షి మనలోని జ్ఞానము."

ఇది బిషప్పుకు క్రొత్తభాష. ఆశ్చర్యము కలిగించినది. సామాజికుఁడు మఱల మాటాడసాగెను. "పదునాఱవ లూయీ వధ కూడదని నేనంటిని. ఒక మనుష్యుని చంపు అధికారము నాకు లేదని నా నమ్మకము. కాని, చెడ్డను నిర్మూలించుట నా ధర్మమనుకొందును. రాక్షస పతనమునకు సమ్మతించితిని.

అనఁగా, వేశ్యావృత్తి నిర్మూలింపవలెనని, బానిసతనమును దుడిచివేయవలెనని, శిశువులకు విద్యనీవలెనని ఓటు చేసితిని. ప్రజాప్రభుత్వమునకు ఓటనగా పైమూడింటికని యర్థము. సౌభ్రాత్రమునకు, సామరస్యమునకు, వికాసమునకు ఓటిచ్చితిని. మాధ్యభ్రమలను దొలగింప సాయమొనర్చితిని. వాని పతనము వికాసమును తెచ్చును. ప్రాంత ప్రపంచమును బడఁద్రోసితిమి. అది దుఃఖాలవాలము. దానిని దలక్రిందు చేయనిదే మానవజాతికి హాయి కలుగదు.''

''ఆ హాయి మిశ్రమము.''

''కష్టసహితమని మీరనవచ్చును. 1814 అనఁబడు మారణ మహా వాయువు వీచిన తరువాత, హాయి బొత్తిగా అంతరించినది. అయ్యో! ఆ పని పూర్ణత్వ సిద్ధిలేనిదని యంగీకరింతును. పూర్వవిధానము యొక్క ఆకారమును మాత్రమే మేము పడఁగొట్టితిమి. అభిప్రాయమింకను నిలచియుండినది. దురాచారము మాన్పినఁజాలదు. అలవాటు మార్చవలెను. గాలికిఁదిరుగు యంత్రము పోయినది. గాలి యింకను ఉన్నది.''

''మీరొనర్చినది ధ్వంసకర్మ. విధ్వంస ముపయోగకారి కావచ్చు. కాని, ఆగ్రహముతో చేసిన ధ్వంసకర్మను నేను నమ్మను.''

''ధర్మమునకుఁ గోపమున్నది ఆచార్యులవారూ! ధర్మోగ్రత్వమునఁ బ్రగమనము కలదు. ఎవరేమన్న నేమి? క్రైస్తు అనంతరము, మానవజాతికి గరిష్ఠాభివృద్ధి నిచ్చినది ఫ్రెంచి విప్లవమే. అది యపరిపూర్ణము కావచ్చు. అట్లయ్యు అది మహోదాత్తము. సంఘమును బంధించి యుండిన రహస్య రజ్జువు

లను అన్నింటిని సడలించినది. హృదయములను మృదువొనర్చి నది. ప్రశాంతిని, ఉపశమనమును వికాసమును ప్రసాదించినది. సంస్కార తరంగములలో భూమిని సుఖప్లావితము చేసినది. ఆహా, ఎంత మంచిది! ఫ్రెంచి విప్లవము మానవజాతిని పునీత మొనర్చినది స్వామీ!''

బిషప్ అప్రయత్నముగనే "అవును. 1793'' అని గొణిఁగెను.

సామాజికుఁడు తన కుర్చీలోనే వీపు నిక్కించెను. విషాదచ్ఛాయలిచ్చు గాంభీర్యమతని ముఖము నావరించెను. మృత్యుహస్తంగతుఁడైనవాఁడు పలుకఁగలిగినంత గట్టిగా "ఆ! మీకది జ్ఞప్తి వచ్చినది. ఆ 1793! నేను దానిని ప్రతీక్షించు చుంటిని. పదునైదువందల యేండ్లుగా ఒక మేఘము క్రమ్ము చుండినది. పదునైదు శతాబ్దములు కాఁగానే అది పెటిలినది. మీరు పిడుగును నిందించుచుంటిరి'' అనెను.

ఇది తన హృదయమును దాకుచున్నట్లు బిషప్పునకుఁ దోఁచినది. అయినను, అతఁడు దానిని దానై యంగీకరింపలేదు. కాని, దాని నాధారము చేసికొని యిట్లు బదులు చెప్పెను. "న్యాయాధికారి న్యాయముపేర చెప్పును. ఆచార్యుఁడను కంపపేరఁ బలుకును. అనుకంప అతీతన్యాయము. పిడుగును అపార్థము చేసికోఁగూడదు.'' పిదప స్థిరదృష్టితో సామాజి కునిఁ జూచి "పదునేడవ లూయీ సంగతి?'' అని ప్రశ్నించెను.

సామాజికుఁడు చేయి చాచి, బిషప్పు చేయి పట్టు కొనెను. "పదునేడవ లూయీ – పరిశీలింతము! మీ రెవరి కొఱకు కేకలిడుదురు? – అమాయిక శిశువునకా? మంచిదే. మీతో

నేనును విలపింతును. రాజ శిశువునకా? ఆలోచించుకొననిమ్మం దును. కార్టుషే సోదరుఁడగు అమాయిక శిశువు కార్టుషే సోదరుఁడైన కారణముచేఁ జచ్చునంతవఱ కురితీయఁబడు టెంత విషాదకరమో, పదునైదవ లూయీ మనుమఁడగు అమాయిక శిశువు పదునైదవ లూయీ మనుమఁడైన పాపము నకు మాత్రమే హత్యకావింపఁబడుటంతే విషాదకరము.''

''అయ్యా, ఆ పేర్లనట్లు జతపఱచుట నా కిష్టములేదు.''

''కార్టుషేనా, లూయీనా ఎవరిని మీరభిమానించుట?''

ఒక్కనిమిష మంతయు నిశ్శబ్దము. బిషప్ ఏల వచ్చితి ననుకొనెను. కాని, ఏదో వింతగను వివరింపరాకయు అతని హృదయము కలఁగసాగినది. సామాజికుఁడు మరల మాట లాడ నారంభించెను. ''ఆచార్యా! మీరు సత్యమునందలి కాఠిన్యమును ప్రేమించుటలేదు. క్రీస్తు ప్రేమించెను. ఆయన కొరడా చేతఁ బూని గుడిని నీచనిర్ముక్తము గావించెను. నిప్పులుగ్రక్కు ఆ కొరడా సత్యమును నిర్దాక్షిణ్యముగాఁ జాటినది. ఆయన సంబోధనములందు శిశువులను గుఱించి విభేదములేదు. చక్రవర్తి కుమారుఁడును, సామాన్యుని కుమా రుఁడును ఒక్కటే. అయ్యా! అమాయకత్వము తానే కిరీటము! అమాయకత్వ మాచరించినదంతయు మహోదాత్తము. చినుఁగు ప్రాఁతలలోఁ జీనాంబరములలో అది సమాన తేజస్సు విరజిమ్మును.''

''అది నిజమే.'' బిషప్ తిన్నని స్వరమున ఏకీభవించెను.

''మీరు పదునేడవ లూయీ ప్రసక్తి తెచ్చితిరికదా. అందఱమాయికులకై, ఆదర్శమునకై ప్రాణత్యాగముచేసిన

యందఱికై, శిశువులందఱికై—పెద్ద చిన్న యను భేదము పాటింపక విలపింతము. అట్లు సేయువారిలో నే నొకఁడను. కాని, మన కన్నీళ్లు పదునేడవ లూయీకంటె నెంతో ముందు ప్రారంభము కావలెను. సామాన్య ప్రజల బిడ్డలకై నాతోఁ గలసి యశ్రుతర్పణమిండు. నేను మీతోఁ గలసి రాజశిశువులకై కన్నీరు విడిచెదను."

"నే నందఱికై దుఃఖింతును."

"సమానముగ త్రాసారిగినచో, ప్రజల పక్షమున నే కావలెను. వారు చాలకాలమునుండి బాధపడినారు."

మఱల నిశ్శబ్దము. వృద్ధుఁడే మఱల దానిని భేదించెను. మోచేతిపైన నొకింత లేచి, ఆలోచించుచున్నవానివలెఁ జెక్కు చూపుడు బొటనవ్రేళ్ళతో నలిపికొనుచు, అతివేదనా తీవ్రత్వముతో పలుకసాగెను. అది యించుమించుగా శాపము వలె నుండినది. "అవునయ్యా, ఎంతో కాలముగాఁ బ్రజలు బాధపడుచున్నారు. అంతతో ముగియలేదు. నన్నుఁ బ్రశ్నించుటకు, పదునేడవ లూయీని గుఱించి నాతో వాదించుటకు మీ రేల వచ్చితిరి? నేను మిమ్మెఱుఁగను. ఈ ప్రదేశమునకు వచ్చినది మొదలు, ఈ గోడలమధ్య ఏకాకినై యున్నాను. ఎన్నడును అడుగావల పెట్టలేదు. ఈ బాలకునిఁ దప్ప నింకెవ్వరినిఁ జూడలేదు. మీ పేరస్పష్టముగా వినియున్నాను. చతురులీయమాయికే ప్రజల నెన్నివిధములుగనో లోఁగొందురు. ఉదాహరణమునకు, నేను మీ బండి శబ్దము వినలేదు. పొదకావల, రోడ్డు తిరుగుచోట దానిని వదలి వచ్చినారు—నిస్సందేహము. తాము బిషప్ అంటెరి. అది మీ నైతిక

వ్యక్తిత్వమును గుఱించి యేమియుఁ దెలుపదు. ఇదిగో, పునః ప్రశ్న చేయుచున్నాను. మీరెవరు? బిషప్ - చర్చి ప్రభువు. బంగారు, లాంఛనములు, ఐశ్వర్యము, పదునైదువేల వార్షికము, వంటశాలలు, పరిచారకులు, రుచ్యభోజనముల లేవాదేవీలు, భగవానుఁడగు క్రీస్తు వట్టికాళ్ళతో నడచు టెఱిగి ఆయనపేర, ముందు వెనుకల భటులు నడుమ పల్లకీలలోఁ బ్రయాణము మున్నగు భోగములలో మునిఁగితేలు ఇంద్రియ దాసులలో మీరును నొక్కరు. బిషప్పుల చిత్ర మిది. మీరంతవారో అంతకంటె అధికులో. బిషప్ అన్నంతమాత్రమున నిజమైన మీ మూల్యము తెలియదు. నాకు జ్ఞానమును మోసికొనివచ్చినట్లు భావించుచుంటిరి కాఁబోలు. నే నెవ్వరితో మాటాడుచున్నాను? మీరెవ్వరు?''

బిషప్పు తలవంచి, బదులిడెను. ''ఒక మట్టిపురుగు.''

''పల్లకిలోఁ బయనించుచున్న మట్టిపురుగు!'' ఔద్ధత్యము సామాజికుని వంతు, వినయము బిషప్పువంతునైనది.

మృదువుగ, బిషప్ ఇట్లనెను. ''అయ్యా, అట్లే యనుకొందము. అయినను ఈ చెట్లకు కొన్నియడుగుల వెనుకనున్న నా పల్లకి, నా భోజన సామగ్రి, శుక్రవారమునాఁడు నేను భుజించు కోళ్లు, నా యిరువదైదువేల వార్షికము, భవనము, భటులు—అన్నియు, అనుకంప సుగుణముకాదని, కరుణము ధర్మముకాదని, 1793 ఘోరముకాదని యెట్లు నిరూపించును?''

క్రమ్ముచున్న మేఘమును ప్రక్కకు నెట్టుచున్నవాని వలె, వృద్ధుఁడు లలాటము నెదుర చేయి విసరెను. ''మీకు జవాబు చెప్పుటకు ముందు, క్షమింప వేడుచున్నాను. నేను

తప్పొనర్చితిని. మీరు నాయింట నున్నారు. నా యతిథి. నేను మిమ్మాదరింపవలెను. నా యభిప్రాయములను గుఱించి మీరు తర్కించుచున్నారు. మీ హేతువు నెదిరించుటమాత్రమే న్యాయము. ఈ వాదమున మీ యైశ్వర్యము, భోగములు నా కనుకూలములు. కాని, దాని నాధారముగాఁ గొనుట సంస్కారద్యోతకము కాదు. ఇంక వాని నుపయోగింపనని ప్రమాణము చేయుచున్నాను.''

''కృతజ్ఞుఁడను.''

''నన్ను మీరడిగిన సంజాయిషీకి మరలుదము. ఏమను చుంటిరి? 1793 కఠోరమా?''

''కఠోరమే. అవును. ఉరి తీయుటనుజూచి, మారత్ చప్పట్లు చఱచుట కేమందురు?''

''సోల్జర్లనుబంపి, ప్రాటెస్టాంట్లను పదునాలవ లూయీ నలిపి నాశము చేయుచుండగా టేడియం పాడిన బోసెట్ నేమందురు?''

జవాబు తీక్ష్ణముగ నుండినది. పిడి బాకువలె ఉద్దిష్ట స్థానమునకుఁ జీల్చుకొనిపోయినది. బిషప్పు తల తిరిగినది. అతని కేమి చెప్పుటకును దోఁపలేదు. బోసెట్‌ను గుఱించి అట్లు మాటాడుట అసహ్యము గొలిపినది. అత్యుత్తములందును కొన్నింటిపైన హేతురహితాదరముండును. హేతువాదము తమ్ము గౌరవింపకున్నచో వారికిఁ పిడుగు మొత్తినట్లగును.

సామాజికుని కెగయూపిరి మొదలయ్యెను. బాధాకర మగు ఉబ్బసము, ఉచ్ఛ్వాసముతోఁ గలసి, కంఠస్వరమును బగులదీసెను. కాని, ఆత్మ తేజము కన్నులనుండి స్పష్టముగాఁ

గనఁబడుచుండినది. మరలఁ బలుకసాగెను. "ఇంకను కొన్ని మాటలిక్కడక్కడఁ జెప్పవలసియున్నది. నాకది యిష్టము. విప్లవముద్వారా మానవజాతి తన యభిప్రాయమును అత్యంత స్పష్టమొనర్చినది. దానిని మీరు కఠోరమందురు. కాని, సకల రాజ కృత్యములు ఏమగును? రాణి యగు మేరీ ఆంటొనేకొఱకు శోకింతును. 1685వ సంవత్సరమున, ని ఋ పే ద హ్యూగొనాట్ స్త్రీని పెట్టిన నరక యాతనకును శోకింతును. ఆ యభాగ్యురాలు శిశువునకు స్తన్యమిచ్చుచుండినది. ఆమె నడుము పైభాగమున బట్టలు పెఱికివేసిరి. స్తంభమునకు బంధించిరి. శిశువు నామె యెదుటనే నిలిపిరి. స్తనములలో పాలు పొంగినవి. హృదయమున వేదన నిండుకున్నది. కడుపు కాలుచుండిన బిడ్డ స్తనముగాంచి యేడునసాగినది. తలనరి 'మతము మార్చుకొందువా, లేదా?' యని బాదెను. ఆమె తన శిశువునో అంతరాత్మనో చంపుకొనవలెను. తల్లిని పెట్టిన యీ యాతన కేమందురు? ఇది మఱువ వలదు స్వామీ—ఫ్రెంచి విప్లవము సహేతుకము. దాని యుగ్రత్వమును భవిష్యత్తు క్షమించును. దాని పరిణామము ప్రపంచమునకు మేలు. దాని యతిభయంకరాఘాతములనుండి, మానవజాతికి సుఖాశ్లేషమబ్బును. ఇంక గ్లు ప్తపఱుపవలెను. నా యంత్యము సమీపించుచున్నది" అని, బిషప్పునుండి దృష్టి మఱల్చి ప్రశాంత స్వరమున, తన యభిప్రాయము నిట్లు ముగించెను. "ప్రగతియందలి పశుత్వమునే విప్లవమందురు. అది ముగిసి పోయిన పిదప ఈ యంశము తెల్లమగును: విప్లవము మానవ

జాతిని గరిననముగాఁ జూచినది. అయినను మానవజాతి పురోగ మించినది.''

బిసప్పులోని అగడ్తల నన్నింటిని, ఒకటివెంట నొక దానిని, తాను విజయముతో దాటిపోయినట్లు సామాజికుఁ డనుకొనెను. ఒక్కటి యింకను నిలచియున్నది. అది యాచా ర్యుని కడపటి యాధారము. దాని నూతగా గొని, ప్రారంభ తైక్ష్ణ్యము వహించి ''ప్రగతికి ఈశ్వర విశ్వాసముండన లెను. అభ్యుదయమునకు దైనదూరుఁడగు సేవకుఁడుండ వీలులేదు. నాస్తికుఁడు మానవజాతిని దుర్గతి కీడ్చును'' అని ఘూర్ణిల్లెను.

వృద్ధుఁడగు ఆ ప్రజాప్రతినిధి బదులు పలుకలేదు. కంపించుచుండెను. ఆకసమువంక చూచెను. అతని కన్నులలో నొక యశ్రు బిందువు కూడినది. ఱెప్పలు నిండినపుడది పాలి పోయిన చెక్కిళ్ళపై జారినది. మెల్లగాఁ దడబడు నాల్కతో, తనలో మాటాడుకొనుచున్నట్లు, అగాధమగ్న దృష్టితో ''ఓ ఓ ఆదర్శమా! త్వమసి!'' అని పలికెను.

ఇట్టిదనరానియొక హృదయోద్వేగము ఆచార్యుఁడను భవించెను.

కొంతసేపూరకుండి వృద్ధుడు, చూపుడువ్రేలాకసము నైపెత్తి ''అనంతమున్నది-అక్కడ. అనంతమునకు 'నేను' లేకున్నచో, 'నేను' దాని మితి. కాని, అది కలదు. దానికొక 'నేను'కూడఁ గలదు. ఈ యనంతాహమే ఈశ్వరుఁడు'' అని గట్టిగాఁ పలికెను. అప్పుడాతని స్వరమొక మహానందముతో వణఁకి యెవరినో చూచుచుఁ బలికినట్లుండినది. మాటలు నిలిపి నపుడతని కనులు మూసికొనెను. ఆ ప్రయత్నమతనిని అల

యించినది. మిగిలియున్న కొన్నిగంటల జీవితమును, ఒక్క నిమిషముననే అతడు ముగించినాఁడు. ఆ పలుకులు, మృత్యు గర్భితుఁడైయున్న వానిదగ్గఱకతని నీడ్చినవి. అంత్య నిమేషము వచ్చినది.

బిషప్ ఇది కనిపెట్టినాఁడు. కాలము తఱుముకొని వచ్చుచున్నది. తానాచార్యకత్వము వహించి వచ్చియుండుట అత్యుదాసీనత్వమునుండి అత్యుద్వేగము పొంది, మూఁతలు పడుచున్న వృద్ధుని కన్నులు చూచి, చల్లనై ముడతలు పడి యుండిన యతని చేయి పట్టుకొని సమీపించి "ఈ సమయ మీశ్వరునిది. మన సమాగమము వ్యర్థమగుట విచారకరము కాదా?" అనెను.

సామాజికుఁడు మఱల కనులు తెఱచెను. ప్రశాంతి యతని ముఖమున నిండి తొణఁకిసలాడుచుండినది. క్షీణించు చున్న శారీరక శక్తినుండికాక, ఆత్మౌన్నత్యమునుండి నిర్గ మించుచున్నదా యన్నట్టి ఆలోచనాగర్భిత స్వరమున ఇట్లు పలికెను. "అయ్యా, నా జీవితమంతయు ధ్యానపఠనాలోచ నలతో గడపితిని. దేశమాత పిలుపు వచ్చినపుడు నాకిరువ దేండ్లు. శిరసావహించితిని. అవకాశ దుర్వినియోగము జరుగు చుండినది. దాని నెదిరించితిని. క్రౌర్యము చెలరేగుచుండినది. దానిని నాశము చేసితిని. నీతి న్యాయములుండినవి. వాని పక్షము వహించితిని. మాతృభూమిని శత్రువులు ముట్టడించిరి. గుండె లెదురొడ్డి కొలిచితిని. నేను ధనికుఁడనై యుండలేదు. నేఁడును దరిద్రుండనే. ప్రభుత్వాధికారులలో నేనొకఁడనై యుంటిని. బ్యాంకులు ధనముతో నిండియుండినవి. కావున

గోడలు భద్రపఱుపనలసి వచ్చినది. లేనిచో ఆ వెండి బంగారుల బరువునకే గోడలు కూలిపోవును. వీధుల చివరి చిన్న హోటళ్ళలోఁ గార్మిక భోజనము చేసితిని. నలిగిపోవుచున్న వారి నాదరించితిని. వ్యథా శిథిలులను ఊఱడించితిని. పూజా పీఠము నలంకరించిన, కనకాంబరముల నూడఁబెఱికితిని. నిజమే. కాని, వానితో దేశమాత గాయములకుఁ గట్టుకట్టితిని. మానవజాతి, ప్రకాశమువంకకు నడువ నెల్లపుడును దోడ్పడితిని. అనుకంపాశూన్యమగు ప్రగతి నప్పుడప్పుడు నిరోధించితిని. కొన్నివేళల మీ మిత్రులై నా శత్రువులగువారిని రక్షించితిని. శక్త్యనుసారము ధర్మము నిర్వర్తించితిని. చేయగలిగిన మంచి చేసితిని. తత్ఫలితముగా నన్ను తఱిమి వేఁటాడిరి. హింసించిరి. అసత్యముగ దూషించిరి. వెక్కిఱించిరి. నామీద ఉమ్మివేసిరి. బహిష్కరించిరి. ఇన్నేండ్లై, తలపండిన నన్నుఁ దిట్టుటకుఁ దమకు హక్కున్నదని పెక్కురు నమ్ముచుండిరి. అజ్ఞప్రజలు, నన్నధమునిగా భావించుచున్నారు. ఈ ద్వేషకల్పితమైన ఏకాంతమును ఎవరినైన ద్వేషింపక యంగీకరించితిని. ఇప్పుడు నా కెనుబదియాఱేండ్లు. చావనున్నాను. నన్నేమడుగుటకై యిక్కడికి వచ్చితిరి?"

"మీ యాశీర్వాదము" అని యాచార్యుఁడు మోకరిల్లెను.

ఆచార్యుఁడు తల పైకెత్తుసరికి, వృద్ధుని ముఖము నిశ్చల గంభీరమైనది. ఆ "నేను" అనంతాహామున గలసిపోయినది.

చింతాధీనుఁడై బిషప్పు ఇంటికి పోయెను. రాత్రియంతయుఁ బ్రార్థనతో వెళ్ళఁబుచ్చెను. మఱునాఁడు, ఉత్సు

కత్వము ప్రేరేపఁ గొందఱా సామాజికునిగుఱించి ప్రస్తావింప యత్నించిరి. ఆయన పలుకక గగనమువంక ప్రేలుచూపెను.

ఆ నిముసమునుండి, దుర్బలులు బాధితులునైనవారి యెడ, ఆయన భ్రాతృప్రేమయు, మార్దవమును ద్విగుణీత మయ్యెను.

ఆ "పాపి సామాజికుని" గుఱించి యెవరు నిందించు చుండినను, పరధ్యాన మతనిని ముంచుకొనివచ్చెడిది. ఆతని యెదుటఁ గడచన్న ఆ జీవుఁడు, తన యంతఃకరణముపై మర లింపఁబడిన ఆ యుజ్వలాంతఃకరణము, అతని పరిపూర్ణతా సిద్ధికి తోడుపడలేదని యెవ్వరనుటకును వీలులేదు.

ఈ "యాపదేశిక దర్శనము", ఆ యూరి మిత్రబృంద ముల విమర్శకు గుఱికాక, తప్పించుకొనలేదు.

"అట్టి మానవుని చావుపడకదగ్గఱ బిషప్పు నిలువ వచ్చునా? అక్కడ నెట్టి మార్గైన నతఁ డాశించియుండఁడు కదా! ఈ విప్లవకారులందరును సమయమునఁ దగ్గువారే. అట్టివానిదగ్గఱ కెందుకు పోవుట? ఏమిచూడవలెనని పోయెనో? దయ్య మావేశించిన జీవునిఁ జూడఁదలఁచియుండును."

భర్త యాస్తిలో భాగముపొంది, హాయిగా జీవించు చుండిన విధవ యొకర్తు అధికప్రసంగి. తాను మహామతిమంతు రాలనుకొనెడిది. "స్వామీ, మీకు ఎఱ్ఱ * గౌను ఎప్పుడు వచ్చునని ప్రజలడుగుచున్నారు" అని బిషప్పు నెకసక్కెము లాడెను. ఆయన "ఓహో! అది ఘనమైనరంగు. ఎఱ్ఱగౌనులను

---

* ఎఱుపు విప్లవ చిహ్నము.

నిరసించువా రెజ్జీటోపీల యెదుట సాగిలఁబడుదురు'' అని జవాబిచ్చెను.

# 10

పై సంఘటనముబట్టి, మిరిల్ ''తాత్వికుఁడైన బిషప్పు'' అనియో ''దేశభక్తుఁడను ఆచార్యుఁ'' డనియో తలంచుట పొఱపాటు. సామ్రాజికునితో సమావేశము దైవప్రసాదమనవచ్చును. ఆ సమావేశ మతని నత్యాశ్చర్యమున ముంచి, మునుపటికంటె ఎక్కుడు దానదయాపరు నొనర్చినది, అంతే.

అధికారైశ్వర్యముల కెన్నఁడును అతఁడు ప్రాకులాడలేదు. సరికదా, తమంత వచ్చినప్పుడును నిరసించెను.

భోగమును ద్వేషించుటలోఁ దెలివిడి లేదనక తప్పదు. దానిలోకళాద్వేషమిమిడియున్నది.అట్లయ్యు,మతాచార్యులలో మతప్రోక్త కర్మలను మించిన భోగములన్నిటిని నేరములని గణింపవలెను. దాన పరములయిన యలవాట్లు లేవని ఆ భోగములు వెల్లడించును. ధనవంతుఁడైన ఆచార్యుఁడు వైరుధ్యము. అతఁడు, ఎడతెగక పేదల సాహచర్యము నిలుపుకొనవలెను. సకల కష్టములతో, దురదృష్టములతో, దారిద్ర్యములతో అహర్నిశలును కలసియుండి, ఒకింతైన పవిత్ర దారిద్ర్యము తాను బొందకుండుటెట్లు? దారి నడచిన ధూళి సోకకుండ నగునా? నిప్పు దగ్గఱనుండి వేఁడి తాఁకని వాని నూహించుటకైన వీలున్నదా? సర్వదా కొలిమిదగ్గఱఁ బనిచేయుచుఁ జెమట పట్టని, మసిసోకని వాఁడుండునా?బిషప్పులో దానగుణమునకుఁ

ప్రథమ నిరూపణ దారిద్ర్యము.డి-పుర బిషప్పుయొక్క నిస్సంశ యాభిప్రాయ మిదియే.

మిరిల్ కు కూడ పక్షబుద్ధి, కోపకారణము, తామసము నుండినవి. ఆతని మృదూన్నతాత్మ శాశ్వత విషయముల పైననే లగ్నమైయున్నను, దత్కాల మనోవికారచ్ఛాయ లాతనిపైనను క్రమ్మినవి. అట్టి మానవుఁడు రాజకీయాభి ప్రాయముల కతీతుఁడై యుండవలసినది. మా యభిప్రాయ మపార్థమునకుఁ బాల్పడకుండుఁగాక! ప్రగతిని గుఱించిన ఉన్న తాశలను, దేశభక్తిపరాయణను ప్రజాస్వామికమునైన ఉన్నత విశ్వాసమును మేము రాజకీయాభిప్రాయములనుట లేదు. మన కాలమున, ఆ యాశా విశ్వాసములే ఉదార జ్ఞానాధారములు. ఈ కథా విషయములకు సంబంధించని వాదములకు దిగక, మేమింతమాత్రము చెప్పెదము: మిరిల్ రాజపక్షమునకుఁ జెందినవాఁడు కాకుండినచో బాగుగనుండె డిది. ఈ లోక కల్పనాద్వేషముల కతీతమై, మనుష్య వ్యవ హార సంక్షోభముల ఆటుపోటులకు లోనుగాక సత్యన్యాయ దయా తేజస్త్రయము అవిచ్ఛిన్నముగఁ బ్రకాశించుచుండును. ఆ త్రయినుండి యొక్క నిమేషమైన నాతని చూపు చలింపకుండ వలసినది.

రాజకీయముల కొఱకై భగవంతుడు మిరిల్ ను సృష్టింప లేదు. అయినను, నెపోలియన్ సర్వాధికారియై యుండినపుడు, ధర్మ స్వాతంత్ర్యముల పేర, నపాయకరమగు తీవ్ర ప్రతి ఘటనమును బిషప్పు సలిపియుండినచోఁ బ్రశంసార్హుఁడు. విజయము గాంచుచున్న వానిలోని యే గుణమునకు హర్షిం

తుమో, దానికే పతనము గనుచున్న వానిలో హర్షింపము. అపాయములేని పోరాటమును మేము ప్రశంసింపము. ఏమైనను మొదటి గడియలో పోరాడినవారే కడగడియలోఁ దల నుత్తరింప హక్కుగలవారు. మంచికాలమున స్థిరమతిమై నిరసింపనివాఁడు, చెడుకాలమున నోరు మూసికొని యుండ వలెను. విజయము నాక్షేపించిన వానికే పతనమునందలి న్యాయమును బ్రకటించు నధికారము కలదు. 1815 లో, వాతావరణమంతయు అంత్య వినాశమును సూచించుచుండి నపుడు, రానున్న యమంగళమును సూచించు గగుర్పాటు ఫ్రాంసును గంపింపఁజేయుచుండినపుడు, నెపోలియన్ కెదుట అప్పటికే అస్పష్టముగ వాటర్లూ కన్పట్టుచుండగా, దైవోప హతులగు, క్రుంగు హృదయముతోనే జయధ్వనులు సలుపు సైనిక ప్రజలు అపహసింపదగినవారుకారు. నెపోలియ నెంత నిరంకుశుఁడైనను, అగాధపుటంచున నిలువఁబడి, ఆ మహా వీరుఁడు మహిమోపేతమగు తన మాతృదేశమును కడపటి సారి కౌఁగిలించుకొను దృశ్యము మహనీయము, కరుణాభరిత మును. మిరిల్ హృదయము ఆ గుణములను గుఱుతింపకుండ వలసినదికాదు.

అతఁడన్నింటను న్యాయము, సత్యము, నీతి, తెలివి, అర్హత, ఉపకారము, కనికరమును పాలించెడివాఁడు. అతఁడు మతోపదేశకుఁడు, జ్ఞాని, మనుష్యుఁడు. మనమిప్పుడు కఠిన ముగా విమర్శించిన రాజకీయాభిప్రాయములందును, మనకంటె నెక్కువ సహనము చూసి లొంగిపోవును. సిటీ హాలు ద్వార

పాలకుఁడు నెపోలియన్ చేత నియమింపబడినవాఁడు. పూర్వము నెపోలియన్ సైన్యమునందుండిన యోధుఁడు. పట్టఁజాలక అతఁడప్పుడప్పుడు ఆడెడి మాటలు రాజద్రోహకరము లనఁబడు నవి. అట్టిమాట లధికముకాఁగా, అతని యుద్యోగమూడెను. భార్యతో, బిడ్డలతో, అన్నము లేక, ఇల్లులేక అతఁడు వీధులఁ బడెను. బిషప్పు అతనిని పిలిపించి, మందలించి,కతిడ్రల్ ద్వార పాలకుఁడుగా నియమించెను.

తొమ్మిదేండ్లలో పవిత్ర కృత్యములచేత, సాధురీతుల చేతఁ బురప్రజలందఱి హృదయములలో మిరిల్ పుత్రీయార్ద్ర భావములు పుట్టించెను. నెపోలియన్ పట్ల ఆయన వైఖరినికూడ ప్రజలంగీకరించి మన్నించిరి. దుర్బలులయ్యు సత్పురుషులగు శిష్యులు! తమ చక్రవర్తిని బూజించిరి. గురువును ప్రేమించిరి.

# 11

మిరిల్ వినమ్రుఁడు. నిఱుపేద. అధికారముపయోగింపని వాఁడు. కాన అతని తలమీఁది కిరీటము నిర్భాగ్యముగ గణింపఁబడుచుండినది. ఆయనవెంట ఒక్క యువ మతోప దేశకుఁడైన లేకుండుటను గమనించిన యీ యంశము బోధ పడును. పారిస్‌లో అతఁడు లెక్కకెక్కలేదు. ఈ యేకాకి వృద్ధునికి ఉజ్వల భవిష్యత్తు కలలోనైన లేదు. ఉన్నత స్థితిఁ గాంచఁగోరు యువకుఁడెవ్వఁడీ ముదుసలి నాశ్రయించును? అతనిక్రింది యుపదేశకులు, వయసు చెల్లిన సత్పురుషులు. వారి కాలమైపోయినది. ఇంకే యభివృద్ధి యాశయు లేదు.

ఈయనతోఁ లాభము లేదని, ఆయన దగ్గఱఁ పట్టముపొందిన యువకులందఱకును సుస్పష్టము. కావున, పట్టము పొందినదే తడవుగ, వారు ఇతర సిఫారసులతోఁ బ్రధాన విషప్పు నాశ్రయింతురు. మనుష్యులు వృద్ధికోరెదరు. అట్టివారికి త్యాగనిష్ఠుఁడైన ఋషి అపాయకరుఁడగు పొరుగు. అంటువ్యాధివలె విడుమరలేని దారిద్ర్యముఁ నతఁడు నీకందింపవచ్చును. నీవు కోరిన దానికంటె నెక్కుడైన త్యాగము నీలో నెసకొల్పవచ్చును. కావున, మనుష్యులట్టివానినుండి పాఱిపోవుదురు. అందుచేత మిరిల్ ఏకాకి యయ్యెను. మనతోడి సంఘము విషాదకరమైనది. ఆవరించిన యవినీతి "ఎట్లైనను ఉద్దిష్టము పొందుము" అను పాఠమునే నిరంతరము బోధించును.

విజయము వికారమైనది. పాత్రతావేషముచే లోకమును వంచించును. జనసామాన్యమునకు కార్యసిద్ధి ప్రభుత్వమువలెఁ గన్పట్టును. ధనమున్నచోటఁ బ్రతిభ యుండితీఱవలెనని అభిప్రాయము. లాటరీలో గెలిచితివా, నీవు సమర్థుఁడవు. అదృష్టమున్నఁ జాలు, అన్నియు నున్నట్లే—నీవు మహాపురుషుఁడవు. సమకాలికుల మెప్పు సాధారణముగా సంకుచిత దృష్టియే—ఏవైయుదార్థుర మహాపురుషుల విషయముననో తప్ప. మెఱసినది బంగారు. మోసస్, ఈషిలస్, డాంటే, మైకేల్ ఎంజిలో, నెపోలియన్ల పదవులనుబట్టి ప్రజ వారికి మహాప్రతిభ నాపాదించెను. గ్రుడ్డిలోకమే పనిలో నెగ్గినవానికైన నాప్రతిభను అంటఁగట్టును. మింటిసూర్యునితో మిణుఁగురుపురుగును పోల్చును.

# 12

క్రిడపటిమాట యొక్కటి.

మనము, డి-పుర బిషప్పును గుఱించిన యంశము లెన్నింటినో అతిసూక్ష్మముగఁ బరిశీలించితిమి. అవియన్నియుఁ గలిసి, ఆయన విశ్వమే దైవమనువాఁడను అభిప్రాయము కలిగించిన సత్యదూరమగును. మనకాలమునకు విశిష్టమై, అప్పుడప్పు డొక్కొక్కరి మనస్సున నొకతత్త్వము పొడకట్టి మతమును దుడిచివేయుచున్నది. మిరిల్‌ను జక్కఁగాఁ దెలిసిన వారిట్టివానినిగా నతనిని భావింపరు. ఆయనకు వికాసమిచ్చినది హృదయము. ఆయన జ్ఞానము, హృదయమునుండి వచ్చిన ప్రకాశమునఁ గలిగినది.

అతని కొక ప్రత్యేక విధానము లేదు. కాని, పెక్కు పనులు చేసినాఁడు. దుర్గ్రాహ్యములైన ఆలోచనలు తల నొప్పి కలిగించును. నిగూఢభ్రమలతో నతఁడు మనస్సును పోఁగొట్టుకొనలేదు. నూతన సిద్ధాంతములుచేయువాఁడు ధైర్యముగ నుండవచ్చును—బిషప్పు పిఱికిగనే యుండవలెను.మహా భయంకరమతులకు మాత్రము ప్రత్యేకింపఁబడిన సమస్యలను గదలింప నతఁడు సంకోచించియుండనోపు. నిగూఢత్వమును సమీపించుటలో పవిత్రమగు నొక భీతి యున్నది. గంభీర ద్వారము లావులించుచుండును. దానియంచును నీవు డగ్గఱు సరికి, ఇదమిత్థమనరానిది, "ప్రవేశింపకుము" అని మందలించును. ప్రవేశించినవాని గతి దేవుఁడెఱుఁగును!

సకల సిద్ధాంతముల కతీతమై, అగాధమైన దుర్గ్రాహ్య

లోచనలో, తమ యభిప్రాయముల నీశ్వరుని కర్పించు నలౌకి కులు కలరు. వారి ప్రార్థన నిర్భయవాదము. వారి పూజ ప్రశ్న. ఇది ఈశ్వరునితో ముఖాముఖమైన మతము. దీని గోడలు ప్రాకువాని వ్యాకులము, బాధ్యత యింతింతనరాదు.

మానవుని యాలోచనకు హద్దులేదు. తనభ్రమల నది తానే విడఁదీసి, కత్తిరించి యపాయగ్రస్తమగును. తనకుఁ దానే యెదురు తిరిగి ప్రకృతిని మోహింపఁ జేయును. మనలను జుట్టియున్న విచిత్ర ప్రపంచము తాను గ్రహించిన దానినే వెనుకకిచ్చును. ఆలోచించుచున్నవారే యాలోచింపఁబడుటయు సంభవము. తమ యాలోచనాకాశమున నిర్గుణౌన్నత్యమును స్పష్టముగా చూచు మానవులు ఈ లోకమునఁ గలరు. అనంతపర్వతము కూడ వారి యద్భుత దృష్టి కందును. మిరిల్ వారిలో ఒకఁడుకాఁడు. లోకాతీతుఁడు కాఁడు. స్వీడెన్‌బోర్గు, పాస్కల్ వంటి మహామహులను గూడ పిచ్చివారి నొనర్చిన ఆ మహౌన్నత్య మతిని కంపింపఁజేసియుండును. ఈ మహాధ్యానముల వలనఁ దప్పక నైతికోపయోగమున్నది. ఈ కష్టమార్గముల మూలమునఁ బరిపూర్ణత్వమును సమీపింపనగును. కాని, మిరిల్ రాజమార్గము నెన్నుకొనెను-క్రీస్తు సువార్త.

అతడు ప్రవక్తకాఁడు, ఐంద్రజాలికుఁడు కాఁడు. అతని వినమితాత్మ ప్రేమమయము-అంతే.

ఆయన ప్రార్థనోద్దేశ్యము, ఏదో మానవాతీతమగు ఆశ కావచ్చు. కాని, ప్రార్థనా ప్రేమలలో, కావలసిన దాని కంటె నెక్కువని యుండదు.

దుఃఖితులు, పశ్చాత్తప్తులునైన వారి పక్షమతఁడు వహించును. విశ్వమొక మహా వ్యాధివలె నతనికిఁ గనుపట్టినది. ఎల్లెడల జ్వరము, బాధ. ఈ సమస్యను విడఁదీయఁ బూనుకొనక గాయములకుఁ గట్లు కట్టుటకు మాత్రమే ఆయన ప్రయత్నించెను. సృష్టియందలి దుర్భరదృశ్యము లతనిని ద్రవింపఁజేసెను. కనికరించుట, ఊఱడించుట-ఇవి యతని సర్వదా ప్రయత్నములు. సత్పురుషుఁడైన యీ యపురూప గురువునకుఁ బ్రపంచము నిరంతర విషాదపీడితమై ఊఱటఁ గోరుచున్నట్లు తోఁచినది.

బంగారు తోడుటకై పాటుపడువారున్నారు. ఆయన మాత్రము కరుణను తోడుటకే పాటుపడెను. విశ్వవేదన అతని గని. దుఃఖమెప్పుడును సుఖమున కవకాశము. "ఒండొరులను ప్రేమింపుఁడు"-ఇది పరిపూర్ణమని యతఁడు చాటెను. అతని సకల సిద్ధాంతమదే. ఆయన వేఱేమియుఁ గోరలేదు. ఇంతకు ముందొకసారి మనము పేర్కొన్న సెనేటర్, మిరిల్‌తో "లోకపు నడక జాడుఁడు. ఒక్కొక్కఁడును తక్కినయందఱితోఁ దగవులాడుచున్నాఁడు. అధిక బలవంతుఁడే అత్యుత్తముఁడు. ఒకరినొకరు ప్రేమింపుఁడనుట తెలివి తక్కువచేతనే" అనెను. ప్రతివాదముచేయక మిరిల్ "మంచిది, అట్లైన ఆ బుద్ధిమాంద్యము వెనుక, ముత్యము చిప్పలోవలె, ఆత్మ దాచుకొనవలెను" అని బదులు చెప్పెను. తన్నట్లు దాచుకొని, ఆ మఱుగునఁ దాను నివసించెను. విధి, మంచిచెడ్డ, శూన్యము, ఆత్మ-మున్నగు నిగూఢ సమస్యల జోలికతఁడు పోలేదు. అలౌకికధిషణావంతులకు వానిని వదలి హృదయ పూర్ణముగ వారిని, ఆ సమస్యలను గౌరవించెను.

# నిర్భాగ్యజీవులు

## ప్రథమఖండము – ఫాంటైన్

### ద్వితీయాధ్యాయము

### (పతనము)

## 1

**1815** అక్టోబర్ నెల మధ్యకాలమున, ఒకనాటి సాయం సమయము, సూర్యాస్తమయమునకొక గంట ముందు, పాదచారియొకఁడు డి–పురము ప్రవేశించెను. అప్పుడు తమ కిటికీలలోఁ గూర్చుండియుండిన కొందఱు ఆ పాంథుని సందేహ దృష్టితోఁ జూచిరి. ఆకారమునుబట్టి అంతకంటె దీన హీన నిర్భాగ్యునింకొకని ఊహించుటయుఁ గష్టమే. లావై బలము సూచించు శరీరము. నడి వయస్సు. నలుబదియాఱో యేడో యుండును. వ్రేలఁబడుచున్న టోపీ ముఖమును సగము వఱకును గప్పినది. గాలి యెండలకు గఱుడువారి, చెమ్మటలు కారుచుండిన ముఖమది. మోటు పచ్చచొక్కా– మఱుగునుండి వెంట్రుకలతో నిండిన ఱొమ్ము కాన్పించుచుండినది. త్రాడు వలె పేనిన గుడ్డ మెడకుఁ జుట్టుకొన్నాఁడు. షరాయికూడ మొఱ్ఱైన దే–నీలిరంగు. చాల ప్రాఁతది. మాసినది. ఒక మోకాలిపైన షరాయి తెల్లబడియుండినది. ఇంకొక మోకాలి

మీఁద జినిఁగియుండినది. చొక్కామీఁద దోఁడిగిన బ్లౌజుకూడ బ్రాఁతది. చినుఁగుబొంత. అక్కడక్కడ ట్వైన్‌దారముతోఁ గుట్టిన ఆకుపచ్చ అతుకులు. వీపుపైన, నిండుగానున్న క్రొత్త సంచి. పెద్దముడియున్న బెత్తము చేత. మేజోళ్ళులేని పాదములకుఁ పెద్ద తల మేకుల బూడుసులు. కత్తిరించిన తల, పొడుగాటి గడ్డము—ఇది యాగంతుకుని యాకారము.

చెమ్మట, ఎండ వేడిమి, దీర్ఘప్రయాణము, దుమ్ము—అతని నిశీర్ణాకారమునకు, అవాచ్యమగు నైచ్యము కల్పించుచుండినవి.

బిఱుసగు తలవెంట్రుకలు కత్తిరించి కొంతకాలమై యుండును. అతనిని దెలిసిన వారెవ్వరులేరు. బాటసారి కాఁబోలు. దినమంతయు నడిచియుండును. ఎకుడన యలసినట్లుండినాఁడు. దప్పిచే నాలుకెండి పోవుచుండెనేమో—రెండు వందల గజములైనఁ గడవక రెండుసారులు నీళ్ళు ద్రాగినాఁడు. మేయరు ఆఫీసులోనికి వెళ్ళి, పదునైదు నిముసములుండి, మఱల వెలువడెను.

ఒక ద్వారియరుగుమీఁదఁ గూర్చుండి యుండిన రక్షకభటునికి, టోపీ తీసి, వినమ్రుఁడై నమస్కరించెను. ఆ రాజసుఁడు, ప్రతినమస్కారము సేయక, తదేక దృష్టితోఁ గొంత దూరమేగువఱకును జూచి, టౌన్ హాలులోని కేఁగెను.

అప్పుడు డి—లో మంచి హోటలుండెను. దాని యజమాని జకిన్‌లాబార్. ఈ జకిన్‌లాబార్ అనిన ఊరివారికి గౌరవము. ఏలన గ్రెనోబుల్ పురములో వేఱొక హోటల్ యజమాని లాబాన్ కలడు. అతడు సైనికులకు మార్గదర్శకుఁడుగాఁ

బనిచేసినవాఁడు. అతనికిని జకిన్‌లాబార్‌కును బంధుత్వము. చక్రవర్తి, స్వదేశమునకు మఱలివచ్చినపుడీ గ్రెనోబుల్ హోటలును గుఱించి జనులు మిగుల బ్రస్తావించుచుండిరి. చక్రవర్తి గ్రెనోబుల్ ప్రవేశించినపుడు, ఆ నగరాధికారి యింట విడియుటకు నిరాకరించి, "నా పరిచితుఁడగు ఒక ధీరునింట విడిసెద"నని, లాబార్ హోటలు కేఁగెనట. ఈ గ్రెనోబుల్ హోటల్ ప్రభావము ఇరువదైదుమైళ్ళ దూర మందున్న జకిన్‌లాబార్ హోటలుకును సంక్రమించినది. "ఆ గ్రెనోబుల్ లాబార్‌కు దాయాది" అని తఱచుగాఁ బ్రజలనుచుందురు.

పాంథుఁడాహోటలుకు వెళ్లెను. ఆ యూర నదియే యుత్తమమైనది. వీధి నానుకొనియే వంటసాల యున్నది. వెంటనే పాంథుఁ డందుఁ బ్రవేశించెను. పాత్రములనుండి పొగలు వచ్చుచుండినవి. పొగ గొట్టము దగ్గఱఁ బెద్ద మంట యుండినది. యజమానుఁడే వంటవారికి పెద్ద. అతిచురుకుగా పాఱాడుచు వంటకములను బరీక్షచేయుచుండినాఁడు. కొందఱు బండివాండ్రకు మంచిభోజనము సిద్ధమగుచుండినది. బండి వాండ్రు ప్రక్కగదిలోఁ జేరి నవ్వుచు గట్టిగా మాటాడుకొను చుండిరి. ప్రయాణములుచేసినవారికందఱకును, బండివాండ్ర కంటె సుఖజీవులు లేరని తెలియును.

యజమాని, తలుపుతీసిన సవ్వడి విని, క్రొత్తవాఁడు వచ్చుట గ్రహించి, పాత్రలనుండి దృష్టి మఱలింపకయే, "తమ కేమి కావలెను?" అని ప్రశ్నించెను.

"తినుట కేమైన, పండుకొనుట కింత చోటు."

"ఇంతకంటె సులభమైనది లేదు." అని, యజమాని తలత్రిప్పి, ఆగంతుకుని బరిశీలించి "డబ్బీవలెను" అని పలికెను.

పాంథుడు, జేబునుండి పెద్ద తోలుసంచి తీసి "నాదగ్గఱ దుడ్డున్నది" అని బదులు పల్కెను.

"అట్లయిన, తమసేవకు సిద్ధుఁడను."

ఆ మనుష్యుఁడు తోలుసంచి మఱల జేబునఁ జేర్చి, వీపుమీఁది మూట తీసి తలుపు దగ్గఱగాఁ బెట్టి, కఱ్ఱ చేతనే పట్టుకొని, ఒక తగ్గు స్టూలుమీఁదఁ గూర్చుండెను. డి— కొండలమధ్య నుండుటచే, అక్టోబరులో సాయంకాలములు జిల్లుమనుచుండును.

యజమాని ముందు వెనుకలకుఁ బోవునపుడంతయు, జాగ్రతగాఁ బాంథుని బరిశీలించుచుండెను.

"వంట చాలమట్టుకైనదా?" అని పాంథ ప్రశ్న.

"ఇదిగో, యిప్పుడే."

వీపు త్రిప్పి నూతనాగంతుకుఁడు చలి కాచుకొనుచుండగా మర్యాదగల జకిన్ లాబార్, చిన్నకాగితపు ముక్కపైన పెన్సిలుతో ఏమో వ్రాసి, హోటల్లోఁ బని సేయు బాలకునిచేతికిచ్చి, చెవిలో నొక్కమాట నూఁదెను. వాఁడు మేయర్ * కచ్చేరివంకఁ బరుగిడెను.

పాంథుఁ డిదియంతయు గమనింపలేదు. "వంటయైనదా?" అని రెండవసారి ప్రశ్నించెను.

---

* నగర న్యాయాధికారి.

"ఆఁ, కొన్నినిముసములలోనే."

బాలుఁడు, కాగితము పట్టుకొని మఱలివచ్చెను. ఏదో జవాబుకై ప్రతీక్షించుచున్నవానివలె యజమాని తొందఱగా మడత విప్పెను. సావధానుఁడై చదువుచున్నట్లు కనుపట్టెను. తలనొకప్రక్కకు వంచి, ఒక నిముస మాలోచించెను. పిదప, కష్టాలోచనలలో మునిగినట్లున్న పాంథునివైపొక్క యడుగు వైచెను.

"అయ్యా, మీకిక్కడ అన్నము లేదు."

"ఎందుకు? దుడ్డివ్వనని భయపడుచుంటిరా? ముందుగనే యిచ్చివేతునా? నమ్ముఁడు, నా దగ్గర డబ్బున్నది."

"అందుకుగాదు."

"మఱి?"

"మీ దగ్గర డబ్బున్నది——"

"ఆఁ."

"కాని, యిక్కడఁ జోటులేదు."

"సరి సరి. గుఱ్ఱపుశాల చాలు."

"వీలు లేదు."

"ఏల?"

"గుఱ్ఱములకా జాగా సరిపోవును."

"అట్లయిన, అటకపైన ఒకమూల, ఒక గడ్డిమోపు చాలును. ఆ సంగతి తరువాత చూచుకొందము."

"మీకన్నము లేదు."

ఈ ప్రకటన దృఢ గంభీర స్వరమునఁ జేయబడినది. అందులో హాస్యము లేదు. పాంథుఁడు లేచి నిల్చుండెను.

"ఓహ్హో! నేనాఁకలికిఁ జచ్చిపోవుచున్నాను. సూర్యోదయము మొదలు నడిచితిని. ముప్పదియాఱు మైళ్ళు. డబ్బిచ్చెదను. నాకుఁ దినుటకేమైనఁ గావలెను."

"ఏమియు లేదు."

పాంథుఁడు పకపకనగి చలిమంటవైపు, పాత్రలవైపును జూచెను. "ఏమియులేదు! ఆ యున్నదంతయు?"

"ఇదివఱకే ఒప్పందమై పోయినది."

"ఎవరికి?"

"అదిగో, ఆ బండివాండ్రకు."

"వాండ్లెందఱున్నారు?"

"పండ్రెండుగురు."

"ఆ యన్నమిరువది మందికిఁ జాలునే."

"ఒప్పించుకొని, అంతటికిని అడ్వాన్సిచ్చినారు."

పాంథుఁడు మఱలఁ గూర్చుండి, సన్న గొంతుకతో "నేను హోటలులో ఉన్నాను. నా కాఁకలి యగుచున్నది, కదలను" అనెను.

యజమాని పాంథుని చెవివఱకు వంగి, తన యొడలదరునంత గట్టిగా "వెళ్ళిపో" అని గర్జించెను.

చేతికఱ్ఱ కొనలోని యినుప పొన్నుతోఁ పాంథుఁడు చలిమంట కలియబెట్టుచు తల వంచుకొని యుండినవాఁడు, ఆ గర్జన విని, చటుక్కున వెనుదిరిగి, ఏమో పలుక నుంకించెను. యజమాని యతనిని పలుకనీయక "ఉండు. ఇంకఁ గథలు చాలింపు. నీ పేరు చెప్పుదునా? నీ పేరు జాన్‌వాల్డా. నీ వెవరో చెప్పుమందువా? నిన్ను జూడఁగనే అనుమానించితిని.

మేయరు కచ్చేరికిఁ జెప్పి పంపితిని. ఇదిగో జవాబు. నీవు చదువఁ గలవా?'' అని, కచ్చేరినుండి వచ్చిన కాగితమును బాంధుని యెదుటఁ బెట్టెను. పాంథుడు దానిని జూచెను. కొంతసేపూరకుండి, హోటల్ యజమాని ''అందఱితో మర్యాదగాఁ బ్రవర్తించుట నా కలవాటు. వెళ్ళిపో!'' అని మెల్లగా బలికెను.

పాంథుఁడు తల వంచి, మూట తీసికొని వెళ్ళిపోయెను.

ప్రధాన మార్గమునఁబడి, ఏమియుఁ బాల్పోక, కాళ్ళీడ్చునట్లు పోసాగెను, అవమాన దుఃఖితునివలె, ఇండ్లను సమీపించినపుడు, వంగి జాఱిపోవును. వెనుదిరిగి చూచి యుండిన, హోటలు యజమాని, హోటలుకు వచ్చినవారు అందఱును వాఁకిట గుమిగూడి, తనను గుఱించి యుద్రేకముతో మాటాడుచు తనవైపు వ్రేలు చూపించుచుండుటను గాంచియుండును. వారి చూపులలోని భయసందేహములను బట్టి, త్వరలోనే తన రాక ఊరంతయుఁ బ్రాకిపోవుననియుఁ దన్ను గుఱించియే యందఱును మాటాడుకొందురనియు తెలిసికొని యుండును.

అతఁడు దీనినంతటిని జూడలేదు. అతికష్టమున నున్నవారు వెనుదిరిగి చూడరు. విపత్తు వెంటనంటి వచ్చునని వారికి స్పష్టమే.

ఇట్లు కొంతసేపు నడచి, తనకుఁ దెలియకఁయే సందులఁబడి మితిమించిన ఖేదముచేత శారీరక బాధ మఱచిపోయెను. అట్టివానికున్నట్టుండి ఆఁకలి యీాఱె పోటువలెఁ గడుపు తాకెను. రాత్రి సమీపించుచున్నది. ఎక్కడనైనఁ దలదాచు

కొనుటకింత చోటు దొరకదా యని చుట్టుప్రక్కల చూపులు పఱపెను.

మంచిహోటలు తన పాలిటికి లేకనేపోయినది. ఏదైన చిన్న పూటకూటింట కాలుసేతులు ముడుచుకొనుటకైన ఒక నేలమాళిగ లభించినను చాలునని, ఆ వీధి కొసనున్న యొక పూటకూటింటి కేగెను.

పాంథుఁడొక నిముసమాగి, కిటికీగుండ హాలులోనికిఁ జూచెను. టేబుల్ మీఁదఁ జిన్నలాంపు వెలుగుచుండినది. పెద్ద చలిమంటయొద్దఁ గూర్చుండి, కొందఱు మనుష్యులు త్రాగు చుండిరి. ఇంటి యజమాని చలి కాచుకొనుచుండెను. మంట మీఁద ప్రేలుచు, ఇనుపపాత్ర యుడుకుచుండినది. ఈ యింటికి వీధిలోనుండి యొక ద్వారమును, దొడ్డివైపునుండి యొక్క టియుఁ గలదు. వీధి ద్వారమునుండి ప్రవేశించు ధైర్యము పాంథునికి లేదు. బెదరుచు, దొడ్డివైపు తలుపును మెల్లగాఁ ద్రోసెను.

"ఎవరక్కడ?" యజమాని ప్రశ్నించెను.

"అన్నము, పండుకొన స్థలము కావలసినవారు."

"సరే. నీవిక్కడ తిని పండుకోవచ్చును."

పాంథుఁడు లోనికి వెళ్లెను. త్రాగుచుండిన మనుష్యు లందఱును అతనివైపు చూచిరి. ఆతని ముఖము నొకప్రక్క దీపపు వెలుతురును, ఇంకొకప్రక్కఁ జలిమంట వెలుతురును స్పష్టమొనర్చినది. అతఁడు మూట దించుచుండగా వారు పరిశీలించిరి. యజమాని "అదిగో మంట. చలి కాచుకో. అన్న ముడుచుకున్నది. రా అన్నయ్యా!" అని యాహ్వానించెను.

అతఁడును మంటదగ్గఱఁ గూర్చుండి చలిచే బడలికచేఁ గొయ్యఁబాఱిన కాళ్ళను చాచెను. మంటమీఁది పాత్రనుండి చవులు గొలుపు వాసన వచ్చుచున్నది. టోపీతో సగము కప్పఁబడిన యతని ముఖమున, అస్పష్టమగు ఉపశమనము కన్పట్టి, చిరబాధాశీర్ణమైన అతని ముఖమునందలి దుఃఖముద్ర నొక్కింత తగ్గించినది.

అతని ముఖము బలత్రాణ విచారములను సూచించును. ఆ ముఖ లక్షణమున అసాధారణమగు గుఱుతులు కన్పట్టును. మొదట అణఁకువను సూచించు నట్లుండును. వెంటనే తీవ్రత్వము దాల్చును. పాదక్రింద నిప్పువలె, కనుబొమలక్రింద గ్రుడ్లు ప్రజ్వరిలుచుండును.

ఆ టేబుల్ దగ్గఱఁ గూర్చుండినవారిలో ఒకఁడు బెస్త వాఁడు. ఈ పూటకూటింటికి వచ్చుటకుముందు, లాబార్ హోటలు లాయములో తన గుఱ్ఱమును గట్టివేసియుండెను. ఆనాఁటి యుదయముననే, సందేహాస్పదుఁడుగా కన్పట్టుచున్న పాంథుని ఈ బెస్త రస్తాలోఁ గలిసికొనెను. అలసియుండిన పాంథుఁడు గుఱ్ఱముపై వెనుకవైపు కూర్చుండనిమ్మని ప్రార్థించెను. ఆ ప్రార్థన విని బెస్త అశ్వమును ద్విగుణీకృత వేగమునఁ బరుగెత్తించెను. అరగంటముందు లాబార్ హోటలులో ఈ బెస్తయు ఉండి, నాఁటి ప్రాతస్సంఘటనమును అక్కడివారికిఁ జిలవలు పలవల కల్పించి వర్ణించియుండెను. అతఁడు పూటకూటి యజమానిని సైగతోఁ బిలిచి గుసగుస లాడెను. ఈ వేళకుఁ బాంథుఁడు మఱల ఆలోచనా పరంపరలోఁ బడిపోయెను.

యజమాని చలిమంట సమీపించి, పాంథుని బుజ ముపై రభసముగాఁ జేయివేసి, కటుస్వరమున "నీవిక్కడ నుండి వెళ్లిపోవలెను" అని యఱచెను.

పాంథుఁడు వెనుదిరిగి, నిర్జీవముగ "ఆ! మీకుఁ దెలిసి నదా?" అనెను.

"అవును."

"ఆ హోటలునుండి వారు గెంటివైచిరి."

"ఇక్కడినుండి మేమును గెంటివేయుదుము."

"నన్నెక్కడికి పొమ్మందురు?"

"ఇంకొకచోటికి."

చేతికఱ్ఱను, మూటను దీసికొని, ఆ మానవుఁడు వెలికి వచ్చెను. అతఁడు పోవుచుండఁగా, లాబార్ హోటలునుండి యతనిని వెన్నంటివచ్చిన బాలురు కొందఱతనిపైన ఱాళ్ళు విసిరి. అతఁడు కోపముతో వెనుదిరిగి కఱ్ఱ జళిపించెను. పక్షులవలె బాలురు చెదఱిపోయిరి.

త్రోవలో జెయిలుండినది. పైని గంటకుఁ గట్టిన యినుపగొలుసు తలుపునుండి వ్రేలుచుండెను. పాంథుఁడు గంట మ్రోయించెను.

తలుపు తెఱచుకొనెను. పాంథుఁడు సగౌరవముగ టోపీ తీసి చేతఁబట్టుకొని "అయ్యా, జెయిలు కాపరీ! ఈ రాత్రి నన్నిక్కడఁ గడపనిత్తువా?" అని ప్రాధేయపడెను.

"జెయిలు పూటకూలిల్లుకాదు. నిన్ను ఖైదుచేయు ఉపాయము వెదకుము. కొట్టు తలుపులు తీయుదుము" అని ప్రత్యుత్తరము. తలుపు మూసికొనెను.

పెక్కుతోఁటలున్న యొక్క చిన్నవీథిలోఁ బాంధుఁడు ప్రవేశించెను. తోఁటకంచెలే ఆ వీథికి ప్రకాశమానములు. ఒక తోఁటలో నొక చక్కని చిన్న యిల్లుండినది. కిటికీనుండి లోని వెలుతురు వెలికి తొంగి చూచుచుండినది. పూటకూటింటిని జూచినట్లే, కిటికీనుండి యీయింటి లోనికిని జూచెను. అది వెల్ల వేయఁబడిన పెద్దగది. పరుపుమీద కాలికోబట్ట కప్పఁబడి యుండినది. మూలలలో తోట్ల కొయ్యకుర్చీలు కొన్ని. గోడకు వ్రేలుచున్న తుపాకి. గది మధ్యమున ఒక టేబులమర్పబడి యుండినది. టేబుల్‌మీఁద ముతక వస్త్రము,దానిమీద ఇత్తడి దీపస్తంభము. ద్రాక్షరసముతో నిండిన రేకు పానపాత్రము వెండివలె మెఱయు చుండెను. చూరుగిన్నె నుండి పొగలు లేచుచుండినవి. ఈ టేబుల్ దగ్గర ఆనంద ప్రఫుల్లవదనుఁ డొక్కఁడు, నలువదేండ్ల వయస్సువాఁడు, ఒడిలో శిశువు నాడించుకొనుచుఁ గూర్చుండియుండెను. అతని సమీపమున, యువతి యొక్కర్తు ఇంకొక శిశువునకు జన్నుగుడుపుచుండెను. తండ్రిబిడ్డలు నవ్వుచుండిరి. తల్లి స్మితముఖియై యుండెను.

ఈ మధురార్ద్ర దృశ్యమును గుఱించి ఆప్యాయనముగ నాలోచించుచుఁ, బాంధుడొక నిముసము నిల్చుండెను. ఏమతని యాలోచనలు? అతనికే తెలియును. ఈ సౌఖ్య సంభరిత గృహమున తనకాశ్రయము లభించు ననుకొనుచుండెనో, ఇంత యానందమున్న చోట ఒకింత కరుణ దొరుకునని యాశించు చుండెనో?

తిన్నగాఁ గిటికీ తట్టెను. ఎవరును వినినట్టులేదు. రెండవ

సారి తట్టెను. "ఎవరో తలుపు తట్టినట్లున్నది" అని శ్రీకంఠ మతఁడు వినెను. "లేదు" అని భర్త పలికెను.

పాంథుఁడు మూఁడవసారి తట్టెను. భర్తలేచి, లాంపు చేతఁబట్టుకొని, తలుపు తీసెను.

అతఁడు స్ఫురద్రూపి, కర్షకుఁడు, మెకానిక్. వెడల్పాటి తోలు ఏప్రన్ రెండు భుజములను కప్పునట్లు కట్టుకున్నాఁడు. దాని జేబులో సుత్తి, ఎఱ్ఱచేతిగుడ్డ, పౌడర్ డబ్బి, నడుము పట్టీలో పట్టగలిగినన్ని యితరోపకరణములును ఉండినవి. అతఁడు తల త్రిప్పఁగాఁ దెల్లనైన నగ్నమైన యతని వృషభ కంఠము బలప్రకటన చేసెను. అతని కనుబొమలు ఒత్తైనవి. నలుపై దీర్ఘమగు మీసములు. ఉబికిన కన్నులు. ముఖమునఁ దన యింటనుండు నప్పటి హాయి నిండియున్నది.

"అయ్యా! క్షమించి డబ్బు తీసికొని, ఒక గిన్నెడు అన్నమిచ్చి తోటలోని పాకలో పండుకోనిత్తురా? చెప్పుడు, డబ్బిత్తును" అని పాంథుఁడు దీన కంఠమున వేడుకొనెను.

"నీ వెవరు?"

"ముప్పది యాఱుమైళ్లు, దినమంతయు నడచి వచ్చితిని. ఈ రాత్రికిఁ దల దాచుకొనిరా, డబ్బిచ్చుకొందును."

"తగినవాఁడు డబ్బిచ్చినచో నేను నిరాకరింపను. అయినను, హోటలుకెందుకు పోలేదు?"

"అక్కడ స్థలము లేదు."

"వా! అదెట్లు సాధ్యము? ఈ దినమేమి ఉత్సవమా? సంతా? లాబార్ హోటలుకు వెళ్లియుంటివా?"

"ఆఁ."

"మఱి?"

పాంథుఁడు సంశయించుచు బదులు పలికెను. "నాకుఁ దెలియదు. అతఁడు నన్ను రానీలేదు."

"ఆ వైపున్న పూటకూటింటికి పోయితివా?"

పాంథుని కళవళ మధికమయ్యెను. తడఁబడుచు "అక్కడను రానీలేదు" అనెను.

కర్షకుని ముఖమున అపనమ్మకము తోఁచెను. అతఁడు పాంథుని నాపాదమస్తకము పరీక్షించి కంపితగాత్రుఁడై "నీవా మనుష్యుఁడేనా?" అని యఱచెను. మఱల నొకసారి పరీక్షించి లోనికి వెళ్ళి, లాంపును టేబుల్ మీఁదఁబెట్టి, తుపాకి నందుకొనెను.

"నీవా మనుష్యుఁడేనా?" అను మాటలు విని, కర్షకుని భార్య అదిఱిపడి లేచెను. ఇద్దరు బిడ్డలను పొదివి పట్టుకొని, క్షణమాలసింపక, భర్త వెనుక దాగికొనెను. భయోద్వేగముతోఁ జెమర్చిన కనులు తెఱచి, పాంథునిఁ జూచుచు "దొంగముండ కొడుకు!" అని కంపించిపోయెను.

ఇదియంతయు ఱెప్పపాటు కాలములో జరిగిపోయెను. విష సర్పమును జూచినట్లూ మనుష్యునొక నిమిషము చూచి, యింటి యజమాని, తలుపు దగ్గరికి వచ్చి "వెళ్ళు!" అని గొంతు చించుకొనెను.

"కరుణించి, ఒక లోటా నీళ్ళు!"

"నీళ్లు కాదు, తుపాకిగుండు!" అని కర్షకుఁడు బల మంతయు నుపయోగించి తలుపు మోది మూసెను. బరువైన

యినుప గడియలు వేసిన ధ్వని పాంథుని చెవింబడెను. తరువాత నిముసమునకుఁ గిటికీ తలుపులును ధమ్మని మూసికొనెను.

రాత్రి పరుగిడి వచ్చుచున్నది. శీతమగు ఆల్ప్స్ పర్వత వాయువులు వీవనారంభించినవి. దివసాంత ప్రకాశమున దారి నానుకొనియున్న యొక తోటలోఁ బాంథుఁడొక బోద కొట్టము చూచెను. ధైర్యముచేసి, కొయ్యకంచెను తొలఁగించి లోనికివెళ్లి, గుడిసెను సమీపించెను. దాని ద్వారను మిక్కిలి కుఱుచ, ఇఱుకు. రోడ్డుకూలీలు అప్పటికప్పుడు వేసికొను పాకలవలె నుండినది. అదియొక రోడ్డుకూలీ నివాసస్థానమనియే పాంథుఁడు భావించెను. శీతక్షుద్బాధ లతనిని వేఁపుకొను తినుచుండినవి. తున్నివారణ మార్గములేదు. చలినుండి కాపాడుకొనుటకైన అవకాశము దొరకినది. సాధారణముగ నీపాకలు రాత్రిపూట ఖాళీగ ఉండును. అతడు వంగి, పాకలోనికిఁ బాకి పోయెను. లోపల వెచ్చగా నుండెను. ఒక గడ్డి పడకయు ఉండినది. క్షణకాలము అలసటచే కొయ్యబాఱి పడిపోయెను. వీపు మీఁది మూట అననుకూలముగ నుండినది. ఇది తల క్రిందికిఁ బనికి వచ్చునను‌కొని, వీపునుండి విడఁదీయుచుండగా, భయంకరమగు గొరగొర శబ్దము వినబడినది. పాంథుఁడు తలయెత్తి చూచునుగదా, ద్వారమున సమున్నత భీకరశ్వానము! ఆ పాక కుక్క గూడు!!

అతఁడు బలవంతుఁడు, త్రాణశాలి. కావున, మూటను అడ్డు పెట్టుకొని, చేతికఱ్ఱ జళిపించుచు, ఆ యిఱుకు వాఁకిటి దారి ఎట్లో బయట పడెను. ఇదివఱకే ఛిద్రమైన యతని బట్టలు మఱింత పేలికలైపోయినవి. తోఁటనుండి కూడ,

కట్టెతోఁ గుక్క నదలించుచు, వెనుకకు వెనుకకు జరిగి వీథిలోఁ జేరెను. ఆ కుక్కగూటికి, గడ్డిపడకకైన నోచుకొనని ఆ మానవుడు మఱల గడగడ వడఁకించు చలిలో, నడుమ్రోవన నిలువఁ బడెను. ప్రక్కనున్న ఒక రాతిపలకపైఁ బడిపోయెను. "ఛీ, నేను కుక్కనైనఁ గాకపోతినిగదా!" అని యటమటించెను.

కొంతవడికి మఱల లేచి కాళ్లు కదలించెను. ఒక చెట్టో, గడ్డివామియో దొరకిన, దాని యాశ్రయమునసైనఁ జలికిఁ గొంత నివారణ కలుగును గదా యని ఊరిబయటికి నడిచెను. తల వంచుకొని కొంతదూర మట్లే పోయెను. మానవ నివాసముల నన్నింటిని గడచితినను కొన్నపుడు, తల పైకెత్తి పరిశీలించెను. అతఁడున్న దొక పొలములో. అతని యెదుట ఒక చిన్న గుట్ట యుండెను. చీఁకటి యాకసమంతయుఁ గ్రమ్మినది. నట్టి చీఁకటి రాత్రియేకాదు. క్రిందికి దిగిన మేఘములు కొండ శిఖరములను దాఁకుచు ఆకసమునంతయుఁ గప్పినట్లుండినది. తలపై సూటిగా, నక్షత్రకాంతి ఒక్కింత మినుకు మినుకనుచుండెను. చంద్రుఁ డప్పుడే పొడసూపుచుండుటచే, ఆ కాంతి నడిమింటిమేఘములపైఁ బ్రసరించి, భూమికిఁ గొంత వెలుఁగు నిచ్చెను.

అప్పుడు భూమి ఆకాశముకంటె లఘువైనట్లు కన్పట్టి, విచిత్రమగు నొక అమంగళపరిణామమును సూచించినట్లుండెను. మబ్బువిడచి, ఆ వాతావరణమున ఆ క్షుద్రపర్వతము వెలవెలఁ బాఱినట్లైనది. దృగ్గోచరప్రపంచమంతయు వికారమై, అల్పమై, దుఃఖభరితమై, సారహీనమైనట్లు తోఁపఁ జేసినది. పొలమునఁగాని, కొండపైనఁగాని, ఏమియు లేదు.

పాంథునకు గొన్నియడుగుల దూరమున చుట్టుకొని వికృతమగు చున్నదా యనిపించు కురూపవృక్ష మొకటున్న దంతే.

అతిసూక్ష్మమైన మానవ జ్ఞానదృష్టియు, హార్దధర్మ మును దురూహ్యములగు ప్రకృతి చిత్రములను గ్రహింప నిచ్చును. ఆ దృగ్ధర్మములకీ మానవుఁడు చాల దూరస్థుడు. అట్లయ్యు. ఈ యాకాశమునఁ, బర్వతశకలమునఁ, బయల, చెట్టులో, ఏ దేనగాధ శూన్యత్వమున్నది. ఒక్కక్షణము నిశ్చలుఁడై ఆలోచించి, సత్వరముగ రోడ్డు చేరినాఁడు. ప్రకృతియే వికటించు సమయములును ఉన్నవి.

వెనుకకు, వచ్చినచోటికే కాళ్ళు మళ్ళించెను. పుర ద్వారములు బంధింపఁబడి యుండినవి. మత యుద్ధములలోఁ బెక్కుముట్టడుల కాస్పదమైన ఆ యూరింకను కోటచేఁ జుట్టఁ బడియే యున్నది. చతురస్రాకారమైన బురుజు లింకను ఉన్నవి. ఒక శిథిలప్రదేశమున, గోడదాటి పాంథుఁడు ఊరిలోఁ బ్రవేశించెను.

అప్పటి కెనిమిది గంటలైనది. ఆ త్రోవలు తెలియమి నతఁడు విచక్షణ చేయక పోవుచుండెను. నగరాధికారి యిల్లు, పాఠశాల కడచిపోయెను. కతిడ్రల్ పార్శ్వమునఁ జనుచున్న పుడు, పిడికిలి బిగించి దానివైపూపెను. కతిడ్రల్ ఆవరణమును ఆనుకొని, ఒక ముద్రాయంత్రశాల యున్నది. ఈ ప్రెస్సు లోనే, ఎల్బానుండి నెపోలియన్ చక్రవర్తి తప్పించుకొనివచ్చి నప్పుడు చేసిన ప్రకటన ప్రథమమునఁ బ్రకటింపఁబడినది. మిక్కిలి యలయికచే చైతన్యము చచ్చి, ఇంతకంటె ఎక్కువ

భాగ్య మిప్పటికి లేదనుకొని, ఆ ప్రింటింగ్ ప్రెస్ ఎదుట కల రాతియరుగుమీఁద శరీరము వాల్చెను.

సరిగా అదేసమయమున, ఒక వృద్ధస్త్రీ చర్చినుండి వెలికివచ్చి, చీఁకటిలో శిలాఫలకముపైనఁ బడియున్నవానిని చూచెను. "నాయనా! అక్కడ నేమి చేయుచుంటివి?"

"నిద్రపోఁబోవుచుంటిని దల్లీ!" అని కోపకఠినస్వరమునఁ బాంధుఁడు పలికెను.

ఆమెది నిజముగా తల్లిహృదయమే. "ఆ బెంచి మీఁదనా?"

"పందొమ్మిదేండ్లుగా కొయ్యపలకపైనఁ బరుకొంటిని. ఈరాత్రికి రాతిబెంచి దొరకినది."

"సైనికుఁడవా?"

"అవునమ్మా, సైనికుఁడనే."

"హోటలు కెందుకు పోవైతివి?"

"డబ్బు లేదు."

"అయ్యో, నాదగ్గర నాల్గు కానులే యున్నవి."

"వానినే యిమ్ము" అని తీసికొనెను.

"ఇంత కొంచెము దుడ్డుకు హోటలులో గది నొసఁగరు. ఇంకెక్కడనైనఁ బ్రయత్నించితివా? రాత్రియంతయు ఇట్లు కడప వీలగునా? చలికి వడఁకి ఆకలికి మాడిపోవుచుంటివి. వారు దానబుద్ధితోనైన నీకింత చోటీవలెను."

"నే నన్నియిండ్లలోఁ బ్రార్థించితిని."

"ఏమైనది?"

"ఒక్కొక్కరును నన్ను దఱిమివేసిరి."

ఆ దయావతి, పాంథుని బుజముపైఁ జేయివేసి, చవుకు కావల బిషప్ భవనమునకు ప్రక్కనున్న, చిన్న తగ్గు ఇల్లు చూపుచు "ఆ యింటికి పోయితివా?" అని ప్రశ్నించెను.

"లేదు."

"అక్కడికి పో."

## 2

నాఁటి సాయంకాలము, ఊరిలోనికి వెళ్ళివచ్చినపిదప చాల సేపు బిషప్ తనగదిలోనే యుండి వ్రాసికొనుచుండెను. ఎనిమిదిగంటలప్పటికి, పెద్దపుస్తకము నొక్కటి తెఱచి యెదుట నుంచుకొని, చిన్న కాగితపుముక్కలమీఁదఁ గష్టముగ నేమో వ్రాసికొనుచునే యున్నాఁడు. అప్పుడు, ప్రతి దినమువలె మగ్లోర్ అల్మారాయందలి వెండిసామాను దీసికొనిపోయెను. పిదప నొకనిముసమునకు, వడ్డనయైనదని, చెల్లెలు కాచుకొని యున్నదని గ్రహించి బిషప్ పుస్తకము మూసి భోజనశాల కేగెను.

అప్పుడే మగ్లోర్ పళ్లెములు పెట్టినది. టేబుల్ సద్దుచున్నపుడు బాప్టిస్టిన్‌తో మాటాడుచునే యుండినది. టేబుల్ చలిమంట సమీపమునందుండెను. టేబుల్ మీఁద దీపము వెలుఁగుచుండెను.

నాఁటి సాయంకాలము జరగిన సంగతులను, ఎన్ని సారులో బాప్టిస్టిన్ ఎందఱికో పూసగ్రుచ్చినట్లు చెప్పినది. నేఁటికిని, నాఁటి ఒక్కొక్క చిన్నవిషయమును ఏకరువుపెట్టువా రెందఱో కలరు.

బిషప్ లోనికి వచ్చువేళకు సరిగా, మగ్లోర్ కొంచెము ఉద్రేకముతోఁ బలుకుచుండినది. విషయము పరిచితమైనది. బిషప్‌కు అలవాటైన సంగతి-వీధి తలుపు భద్రపఱచుటను గుఱించి.

మగ్లోర్, భోజన సామగ్రులు తెచ్చుటకు బజారుకు పోయినపుడు, అక్కడక్కడ క్రొత్తవార్త విన్నదట. సందేహాస్పదుడగు ద్రిమ్మరి యొకఁడు వచ్చి ఊరిలో దాగియున్నాఁడని, ఆలస్యముగా ఇంటికివచ్చువారికేదైన నష్టము తప్పదని, పోలీసులు నట్టిదండుగమాఱులని, నగరాధికారికి మేయరుకుఁ బొసఁగదని, ఏదేని విపత్తు సంభవించిన ఒకరిపై నొకరు త్రోయుటకు పన్నాగము పన్నుచున్నారని, కావున బుద్ధిమంతులు తమ పోలీసులు తామేయై ప్రాణధనములు రక్షించుకొనవలెనని, ఒక్కొక్కరును దలుపులను మూసి, గొళ్లెము బిగించి యిల్లు భద్రము చేసికొనవలెనని.

మగ్లోర్ ఈ కడపటి యంశమును గుఱించి యూది చెప్పుచుండెను. కాని, చల్లని గదిలోనుండి వచ్చిన బిషప్, చలిమంటదగ్గఱఁ గూర్చుండి కాచుకొనుచు, ఏమేమో యోజించుచుండెను. మగ్లోర్ పలుకొక్కటియు ఆయన వినలేదు. ఆమె మఱి మఱి చెప్పసాగెను. గత్యంతరము లేక, బాప్టిస్టిన్ అన్నకు తృప్తికలుగక మగ్లోర్‌కు తృప్తి కలుగునట్లుగా జంకుచు "అన్నయ్యా, మగ్లోర్ చెప్పునది వింటివా?" అనెను.

"ఏదో అస్పష్టముగా వింటిని. ఏమి సంగతి? మనకే

దైన అపాయము రానున్నదా?" అని ప్రియము, ఉల్లాసమూ పల్లవించిన ముఖము మగ్లోర్ వంకఁ ద్రిప్పెను.

మగ్లోర్ తన కథ మఱల మొదటినుండి యారంభించెను. ఈసారి అప్రయత్నముగనే కొన్ని అతిశయోక్తులు కలిపినది. పాదరక్షలు లేని జిప్సీ, భీకరుఁడైన గజదొంగ, ఊరిలో నున్నాఁడు. జకిన్‌లాబార్ హోటలుకుఁబోగా, వానిని రానీ లేదు. చీఁకటి పడుచున్నప్పుడు వీథులలోఁ దిరుగుచుండగా నెందఱో చూచిరి. వానికడ ఒక మూట, త్రాడునున్నవి. వాని ముఖము హడలుగొట్టును.

"ఆహా!" అని బిషప్ ఆశ్చర్య ప్రకటన చేసెను.

ఇది మగ్లోర్‌ను బురికొల్పెను. బిషప్ ఇంచుమించు భయపడినట్లా మెఱుఁ దోఁచెను. కొంత విజయాభానముతో "అవును స్వామీ, సత్యమే. ఈనాఁడూరిలో నేమోజరుగును. ఎల్లవారట్లు చెప్పుచున్నారు. పోలీసువారిలో కట్టుబాటే లేదు. (అనుకూలపునరుక్తి). ఈ కొండప్రదేశములో ఉన్నాముకదా, వీథిలో దీపములైన లేవు! వెలుపలకేగితిమా, కంట సూది గ్రుచ్చుకున్నట్లే. నేను చెప్పునది, అమ్మగారు చెప్పునది—"

"నేనేమి చెప్పితిని? అన్నయ్య యేమిచేసినాసరే."

మగ్లోర్ ఈ యసమ్మతి విననట్లుగనే తన మాటలు కానిచ్చినది.

"ఈ యిల్లు సురక్షితముకాదని మేము చెప్పుచున్నాము. స్వామియాజ్ఞయైనచో నేనిప్పుడే వెళ్ళి, ఇనుప పనివానిని బిల్చుకొనివచ్చి, తలుపునకు తొలుత నుండిన గడియలను మఱల బిగింపుమని చెప్పుదును. ఒక నిముసము పట్టదు.

ఈ రాత్రికైన గడియలుండక తప్పదు. తాకిన తెఱచుకొను తలుపునకంటె భయంకరమైన దేముండును? దీనికేదోడు అర్ధ రాత్రమప్పుడును 'దయచేయుఁడు' అని యాహ్వానించుట స్వామి కలవాటు—"

ఆ నిముసమునఁ దలుపు గట్టిగా తట్టిన శబ్దమయ్యెను.

"దయచేయుఁడు" అని యాచార్యుఁ డాహ్వానించెను.

# 3

త్రలుపు తెఱచుకొనెను-త్వరగా, పూర్తిగా, ఎవరో ధైర్యముతో బలముగా త్రోసినట్లు.

ఒక మనుష్యుడు లోపలికి వచ్చెను. అతనిని మనమిది వఱకే యెఱిఁగి యున్నాము. నిలువ నీడకై వెదకుచుండిన బాటసారి.

లోపలఁ బ్రవేశించి, ఒకటడుగు ముందుకు వైచి ఆఁగెను. అతని వెనుక తలుపట్లే తెఱచియుంచినాఁడు. వీపు మీఁద మూట యున్నది. చేత కఱ్ఱ. కన్నులలో కర్కశ కఠిన పరిశ్రాంత భయంకర దృష్టి. అది వికారముగ నుండినది. ఆ మూర్తియంతయు, ఒక యశుభ సూచనవలెఁ గనుపడెను.

మగ్లోర్ కుఁ కేకపెట్టుటకైన శక్తిలేదు. నోరు తెఱచుకొని అదరుచు నిల్చుకొన్నది.

బాప్టిస్టిన్ వెనుదిరిగి ఆ మనుష్యునిఁజూచి, సగము భయపడినట్లు అదటిపడెను. మఱలఁ దిన్నగాఁ జలిమంటవైపు తిరిగి, అన్నను చూచిన తరువాత ఆమె ముఖమెప్పటి ప్రశాంత గాంభీర్యములు వహించెను.

బిషప్పు, నిశ్చల దృష్టితో ఆగంతుకునిఁ జూచెను.

ఏమి కావలెనని యడుగుటకై బిషప్పు పెదవి కదలింపఁ బోవ, పాంథుఁడు కఱ్ఱపై రెండుచేతులు మోఁపి, ఒక్కొక్కరినిగా అందఱను చూచి, బిషప్పు పలుకులకై కాచుకొనకఁ గట్టిగా ఇట్లనెను—

"ఇటు చూడండి. నా పేరు జాన్‌వాల్జా! ఖైదు శిక్ష అనుభవించినవాఁడను! పందొమ్మిదేండ్లు కఠినశిక్ష ననుభవించితిని. నాల్గుదినములైనది నన్ను విడిచి. నా గమ్యము పంటార్లీ. అక్కడికని, టూలన్‌నుండి నడచివచ్చితిని. ఈనాడు ముప్పదియాఱు మైళ్ళు నడిచినాను. ఇక్కడికి రాగాఁనే, మేయర్ కచ్చేరికిఁపోయి పచ్చవిడుదల కాగితమును జూపితిని. అట్లు చూపించి తీఱవలెను. దానిఫలితము నిరాశ్రయము. ఒక హోటలుకుఁబోఁగా, అక్కడినుండి వెళ్ళఁగొట్టిరి. ఇంకొక హోటలుకుఁ బోయితిని. అక్కడినుండియుఁ బొమ్మనిరి. ఒకరి వలెనే యింకొకరు. నన్నెవ్వరును రానీరైరి. జైలు దగ్గఱకు వెళ్లితిని. జైలుకాఁపరి పోపొమ్మనెను. ఒక కుక్క గూడు లోనికిఁ బ్రాకఁగా, కుక్క కఱచెను. అదియు మానవులవలెనే తఱిమివేసెను. దానికిని నా సంగతి తెలిసినదా యనిపించును. నక్షత్రకాంతిలో నిద్రింతమని పొలముల కేఁగితిని. నక్షత్రములు లేవు. వర్షము వచ్చునేమో యనిపించెను. చినుకుల నాపఁగల దయాళువు దేవుఁడు లేఁడుకదా. కావున, ఏ తలుపు దగ్గఱనైన రాత్రి వెళ్ళఁబుత్తమని ఆ చవుకు దగ్గఱ రాతిపైఁ బండుకొంటిని. మంచితల్లి యొకర్తు ఈ యిల్లు చూపి 'అక్కడికి పొమ్మ' అని యుపదేశించెను. వచ్చితిని. ఇది యేమి చోటు? పూటకూటిల్లా? నాదగ్గర ధనమున్నది. నూటతొమ్మిది

ఫ్రాంకులు, ఏడున్న అపెన్నీలు ఉన్నవి. పందొమ్మిదేండ్లు కారాగారమున నేను జేసిన కఠినశ్రమఫలితమది. నేను దుడ్డిచ్చుకొందును. నాకేమి లక్ష్యము? ఉన్నది. చాల అలసిపోయితిని— కాలినడకను ముప్పదియాఱుమైళ్ళు. ఆఁకలి మాడ్చివేయు చున్నది. నే నిక్కడ నిలువవచ్చునా?''

''మగ్లోర్! ఇంకొక పళ్లెముకూడ టేబుల్ మీఁద బెట్టుము'' అని బిషప్పు ఆదేశించెను.

పాంథుఁడు మూఁడడుగులు వేసి, టేబుల్ మీఁదనున్న దీపము సమీపించెను. తనమాటలు వారర్థముచేసికొనలేదను కొన్నట్లుగా ''నిలు. నన్నర్థముచేసికొన్నారా? నేనొక గాలీ * బానిసను. ఖైదీని. గాలీనుండి యిప్పుడే విడుదలపొంది వచ్చితిని'' అని జేబునుండి పెద్ద పచ్చకాగిత మొకటి వెలికిఁ దీసి మడత విప్పెను. ''ఇది నా విడుదల పత్రము. చూచుచున్నారు కదా, దాని పచ్చరంగు. ఎక్కడికి పోయినను, నన్ను బయటికి గెంటించుట కిది చాలును. దీనిని చదువుదురా? నాకుఁ జదువుట తెలియును. గాలీలలో నేర్చుకొంటిని. నేర్చుకొనఁగోరువారి కక్కడ బడి యుండును. ఈ కాగితములో ఏమి వ్రాసి యున్నారో చూడుఁడు. 'జాన్‌వాల్జా. విడుదల చేయఁబడిన ఖైదీ. ఇతని యూరు—' మీకది యక్కరలేదు. 'పందొమ్మిదేండ్లు గాలీలలో బంధింపఁబడి యుండెను. ఇంటి దోఁపిడికై దేండ్లు. నాల్గుసారులు తప్పించుకొనఁ జూచినందుకుఁ బదునాల్గేండ్లు. ఈ మనుష్యుఁడు మిక్కిలి అపాయకరుఁడు.'

---

* గాలీ యనగా, భయంకరులైన అపరాధులను బంధించియుంచెడు ఓడ.

చూచితిరా? ఒకొక్కడును నన్ను ద్రోసివైచెను. మీరు రమ్మందురా? ఇది హోటలా? తినుటకేమైన నిచ్చి, పండుకొనఁ జోటిత్తురా? మీకు గుఱ్ఱపులాయమున్నదా?"

"మగ్లోర్! మూలయందలి పఱుపుమీఁద శుభ్రవస్త్రములు పఱువుము" అని బిషప్పు ద్వితీయాదేశము నిచ్చెను.

ఆ యిరువురు స్త్రీల విధేయత యెట్టిదో మన మెఱుంగుదుము. మగ్లోర్ ఆ యుత్తరువులు పాలింపఁ బరుగెత్తెను.

బిషప్పు ఆ మనుష్యునివంకఁ దిరిగి "అయ్యా, కూర్చో. చలిమంట కాచుకో. మనమిప్పుడే భోజనము చేయుదుము. అంతలో పఱుపు సిద్ధమగును" అనెను.

ఎట్టకేల కామనుష్యుని కర్థమయ్యెను. అతని ముఖమింతవఱకును విషాద కాఠిన్యములను సూచించుచుండినది. ఇప్పుడు స్తబ్ధత, సందేహము, సంతోషము, ఆశ్చర్యములతో నిండిపోయెను. పిచ్చివానివలె మాటలు తడఁబడెను—

"నిజమే? ఏమి! నన్నిక్కడ నిలువనిత్తురా? తఱిమివేయరా? ఖైదీని! న 'న్నయ్యా' అని సంబోధించితిరి. 'పో, కుక్కా' యని తఱుమరు! నన్ను పొమ్మందురని తలఁచితిని. అందుకే అంతయు ముందే చెప్పివేసితిని. ఆహా! నన్నిక్కడికిఁ బంపిన దెంత యుత్తమస్త్రీ! నే నన్నము తినఁబోవుచున్నాను! అందఱవలె శుభ్రవస్త్రాచ్ఛాదితమగు పఱుపుమీఁదఁ బండుకొనఁబోవుచున్నాను! పందొమ్మిదేండ్లైనది నేను పఱుపుపైనఁ బరుండి! నిజముగా నన్నుండుమనుచున్నారా? మీరెంత మంచివారు! అదియుగాక, నాయొద్ద ధనమున్నది. ధారాళముగ నిత్తును. క్షమింపుము, హోటలు యజమానీ! నీ పేరేమి?

నీ వడిగినంత దుడ్డిచ్చి వేయుదును. నీవు మిగుల మంచివాఁడవు. నీవు హోటలు పెట్టినావా?''

''నేను మతోపదేశకుఁడను. నా నివాసమిది.''

''ఉపదేశకుఁడు! ఎంత ఔదార్యము! అయిన డబ్బే అడుగరు? మీరు క్యూరే కదూ? ఈ పెద్ద చర్చికి క్యూరే? అవు నవును. నేనెంత మందబుద్ధిని? మీ శిరోవేష్టనమును జూడనే లేదు.''

మాటలాడుచుఁ బాంధుడు మూటను కట్టిను ఒకమూల నుంచి, విడుదల కాగితమును మఱల జేబుచేర్చి కూర్చుండెను. బాప్టిస్టిన్ ప్రియవదనయై యతనిని జూచుచుండెను.

పాంధుఁడు మఱల అందుకొనెను. ''అయ్యా, క్యూరే! మీరు దయాశీలురు. నన్నేనగించుకొనరు. మంచి మతగురువును మించినదేమున్నది? అయిన,డబ్బిమ్మని యడుగరుకదా?''

''లేదు. అది నీ కక్కఱకు వచ్చును. ఎంత యున్నది? నూటతొమ్మిది ఫ్రాంకులని చెప్పితివికదా?''

''దానిపైన ఏడున్నర పెన్నీలు.''

''నూటతొమ్మిదిఫ్రాంకులు, ఏడున్నర పెన్నీలు. దానిని సంపాదించుటకు ఎన్నేండ్లు పట్టినవి?''

''పందొమ్మిది.''

''పందొమ్మిదేండ్లు!'' అని బిషప్పు నిట్టూర్చెను.

పాంధుఁడు మఱల నిట్లు పలికెను. ''ఇంకను నా ధనమంతయుఁ జెక్కుచెదరకున్నది. నాలుగు దినములకుఁ బన్నెండున్నర పెన్నీలే వెచ్చపెట్టితిని. త్రోవలో బండ్లనుండి మూటలు దించి దాని నార్జించితిని. మీరు మతాధిపతులు

గానఁ జెప్పెదను. గాలీలలో మాకు పురోహితుఁడు కలఁడు. ఒకనాఁడు బిషప్ వచ్చెను. ఆయనను 'స్వామి' యందురు. ఆయన క్యూరేలకు క్యూరె. చూచితిరా, యివి చెప్పునప్పు డెన్ని తప్పులు చేయుదునో! నాకును ఈ సంగతులకును మిగుల దూరము. మా సంగతి మీకుఁ దెలియును. ఒక పీఠమెక్కి ఆయన మాస్ * పఠించెను. అతని శిరోవేష్టనముపైన మెఱయు చుండిన బంగారు కొమ్ముండెను. మూఁడుప్రక్కల వరుసగా మమ్ములను నిలిపిరి. మాయెదుట ఫిరంగులవరుస పెట్టియుండిరి. బిషప్పుపదేశము చేసెను. కాని, ఆయన దూరముగా ఉండు టచే, మాకు వినఁబడలేదు. బిషప్ అనగా మాకుఁ దెలిసిన దిది."

అతఁడు చెప్పుచుండగా,బిషప్పు తెఱచియుండిన తలుపు మూసెను. మగ్లోర్ ఇంకొక పళ్లెము తెచ్చి టేబుల్ మీఁదఁ బెట్టెను.

"మగ్లోర్! ఈ పళ్లెము చలిమంటకు దగ్గఱగాఁ బెట్టు" అని పాంథునివైపు తిరిగి "ఆల్ప్సు పర్వతవాయువులు రాత్రులఁ గోసివేయును. నీకుఁ మిగులఁ జలిగా ఉండును కదయ్యా?" అనెను.

మృదుగంభీరస్వరమున స్వాగతముచింద 'అయ్యా' యని బిషప్పు సంబోధించినప్పుడంతయు, పాంథుని ముఖము ఆనంద శోభ గాంచెడిది. ఖైదీకా సంబోధనము, సముద్ర మధ్యమున తృష్ణావిదగ్ధునకు మంచినీళ్ళవంటిది. అప్రతిష్ఠ గౌరవమునకు నాల్కలు చాచును.

---

* మాస్ అనగా అందఱును కలసి గురుముఖముగఁ బ్రార్థించుట.

"లాంపు వెలుతురు చాల తక్కువగా నున్నది" అని బిషప్పు పలుక మగ్లోర్ అర్థము చేసికొని, పడక గదిలోనికి వెళ్లి, గూటినుండి రెండు వెండి దీప స్తంభములను దెచ్చి, వెలిఁగించి టేబుల్ మీఁద అమర్చెను.

పాంథుఁడిట్లనెను. "ఆచార్యా! మీరు మిగుల మంచి వారు. నన్నసహ్యించుకొనరు. మీ యింటిలోని కాహ్వానించితిరి. నా కొఱకై దీప స్తంభములు వెలగించితిరి. నేనును, ఎక్కడి నుండి వచ్చితినో దాచ లేదు. ఎంత దీనగతిలో నున్నానో."

బిషప్పు పాంథునకు దగ్గఱగాఁ గూర్చుండి యుండెను. అతనిచేయి మెల్లగా స్పృశించి యిట్లనెను. "నీవెవరో చెప్పనల సిన పనిలేదు. ఇది నా యిల్లు కాదు, క్రీస్తు భగవానునిది. వచ్చిన వారికి పేరున్నదా యని ప్రశ్నింపదు. బాధ యున్నదా యనియే తెలిసికొనఁగోరును. నీవు బాధ పడుచున్నావు. ఆఁకలిదప్పులచే నటమటించుచున్నావు. కావున, నీకు స్వాగతము. నా కేమియుఁ గృతజ్ఞత తెలుపవలదు. నా యింట నీకాశ్రయ మిచ్చితినని తలఁపవలదు. ఇది ఆశ్రయ మవసరమైన వారి యిల్లు. ఇతరులది కాదు. బాటసారివైన నీకే యీ యింట నాకంటె హక్కు కలదు. ఇక్కడున్నదంతయు నీది. నీపేరు తెలిసికోవలసిన అవసరమేమున్నది? అదియుగాక, నీవు చెప్పు టకు ముందే నాకుఁ దెలియును."

"ఆ! నా పేరెఱుఁగుదురా?"

"అవును. నీ పేరు నా సోదరుఁడు."

"చాలును, ఇంక జాలును ఆచార్యా! ఇక్కడికి వచ్చు

టకు ముందుఁ గడుపు కాలిపోవుచుండినది. మీ కృపారసము ఒడలు మఱపించినది. నా బాధలన్నియు మాయమైనవి.''

బిషప్పు అతనిని దదేకదృష్టిని జూచి ''నీవు చాల కష్టముః లనుభవించితివి?''

''అయ్యో, అయ్యో! ఏమిచెప్పుదును? ఆ యెఱ్ఱబ్లౌజు, గుదిగుండు, సంకెల, పండుకొొన కొయ్యపలక, వేడి, చలి, గాలీగుంపు, కొరడా, కిమ్మనకున్నను గరపాదబంధనము, నోరు తెఱచినఁ జీఁకటికొట్టు-రోగముతోఁ బడక కంటుకొొని యున్నపుడును! కుక్కలు- కుక్కలు నాకంటె సుఖమనుభవించినవి! పందొొమ్మిదేండ్లీ నరకము! ఇప్పుడు నా వయస్సు నలువదాఱు. ఈ విడుదల కాగితము బహుమానము, అంతే.''

''అవును. నీవు నరకబాధ పెట్టినచోటు వీడి వచ్చితివి. నాయనా! పశ్చాత్తప్త పాపకర్ముని కన్నీళ్ళలో, నూర్గురు సత్పురుషుల ధవళవస్త్రములలోకంటె నెక్కువ ఆనంద స్వర్గమున్నది. కోపద్వేషములతో నీవాదుఃఖ నిలయమును వీడి వచ్చితివా, అనుకంపార్హుఁడ వవుదువు. సానుభూతితో, మార్దవ శాంతులతో వెలువడితివా,మా యందఱికంటె మేలివాఁడవు.''

ఈ వేళకు మగ్లోర్ వడ్డన ముగించినది. అతిథి సత్కారము సేయు స్వభావము కలవారి ముఖమునఁ దాండవించు విచిత్రానందతృప్తి బిషప్పు ముఖమునఁ బ్రఫుల్లమైనది.ఆయన కుడివైపు పాంథుఁడును, ఎడమవైపు సోదరియు భోజనమున కాసీనులైరి. బిషప్పు, ఈశ్వరునికిఁ గృతజ్ఞతావందనము సలిపిన పిదపఁ దిన మొదలుపెట్టెను. పాంథుఁడాత్రముతో మ్రింగ సాగెను.

ఉన్నట్లుండి బిషప్ "ఏమో కొదువమైనట్లున్నది" అనెను.

విషయ మేమన, కావలసిన మూఁడు పళ్లెములను మాత్రమే మగ్లోర్ టేబులుపై నమర్చినది. అతిథులున్నపుడు, అన్ని పళ్లెములను టేబులుపై నమర్చుట ఆ యింటనలవాటు. ఇదియొక శైశవాడంబరము. దారిద్ర్యమునకు గౌరవమునిచ్చిన ఈ సాధు తపోగృహమున కీయాడంబరమొక మనోహరత్వము నిచ్చునది.

మగ్లోర్ ఆ సూచన గ్రహించెను. మఱు మాటాడక వెళ్లెను. తరువాత నిముసమున కంతయు, మిగిలిన మూఁడు పళ్లెములును ఒక్కొక్కరి దగ్గఱ ఒక్కటిగా మెఱయసాగినవి.

# 4

పాంథుఁడు మిక్కిలి యలసి యున్నాఁడని, తాము మాటాడుచుఁ గూర్చున్న యతనికిఁ గష్టమనియుఁ దలఁచి బిషప్పు,తొందఱించి బాప్టిస్టిన్ మగ్లోర్‌లను నిదురింపఁబొమ్మని ఒక లాంపు తాను దీసికొని, ఇంకొకటి పాంథునికిచ్చి "నీ పడక జూపుదును రమ్ము" అని తోడ్కొనిపోయెను.

ఇదివఱకే మన మొనర్చిన వర్ణనను బట్టి, పూజా మందిరమునందలి యతిథి పఱుపు చేరుటకు, బిషప్పు నిద్రా గృహమునుండి పోవలెనని స్పష్టము. దీనినుండి వారిరువురును పోవుచున్నపుడు మగ్లోర్ వెండి సామానులను, బిషప్పు మంచము తలవైపున్న గూటిలో భద్రపఱచుచుండెను.

పండుకొనఁబోవుటకు ముందు ఆమె కడపటి కార్యమునుదిన మిదియే.

బిషప్పు, అతిథిని బూజామందిరము మూలలో శుభ్ర ధవళ వస్త్రాచ్ఛాదితమైయున్న పఱుపు చెంతకుఁ తీసికొని పోయెను. పాంథుఁడు తనచేనున్న లాంపునొక చిన్న టేబుల్ మీఁదఁ బెట్టెను.

బిషప్పు "రా నాయనా, సుఖముగా విశ్రాంతి తీసికొనుము. రేపుదయము బయలుదేఱుటకు ముందు, మా యావు లిచ్చు నులి వెచ్చని పాలు త్రాగి పయనింతువుకాని" అనెను.

"చిత్తము, స్వామీ! కృతజ్ఞుఁడను."

ఈ శాంత వచనములాడి యాడకముందే, తటాలున నతడు చిత్ర విధానమున హస్తవిక్షేప మొనర్చెను. దానినా స్త్రీలు చూచియుండిన భయభ్రాంతులై యుందురు. ఎట్టి ప్రేరణచే నతనిలో నట్టి సంచలనము కలిగెనో యిప్పటికిని మేము వివరింపఁజాలము. భవిష్యత్సూచన చేయదలఁచెనా లేక బెదరించు కోరికయా? లేక, తనకే యెన్నటికిని నిగూఢమగు సహజప్రేరణకుఁ దలయొగ్గెనా? తటాలున, వృద్ధునివంకఁ దిరిగి, చేతులొండొంటిపైఁ జేర్చి, అన్నదాతపై భీకరదృష్టి నిలిపి, కఠోరస్వరమున "మీయింట ఇంత దగ్గఱగా నన్నుఁ బండుకొన నిత్తురా!" అని యాగి, ఏదో భయము విరజిమ్ము నవ్వు విసఱి "దానిని గుఱించి యోజించినారా? నేను హంతకుఁడు కాదని మీకెవరు చెప్పిరి?" అని ప్రశ్నించెను.

"సర్వేశ్వరుని యిచ్ఛ!"

ఇట్లు జవాబిచ్చి, బిషప్పు గంభీరముగఁ బెదవుల కదలిక

చేతనే తనలోఁ దానే పలుకుకొనుచున్నట్లు, హస్తముచాచి పాంథు నాశీర్వదించెను. పాంథుఁడు స్వీకరింపఁ దలవంపలేదు. బిషప్పు వెనుదిరిగిచూడక, నిశ్చలశిరస్కుఁడై తనగదిఁ బ్రవేశించెను.

ఒక నిముసమున కావల బిషప్పు తోఁటలో నుండెను. రాత్రి చీఁకటిలో భగవంతుని నిగూఢ మహత్కార్యములు దృగ్గోచరమగును. తోఁటచేరి, బిషప్పు తన చిత్తాత్మలను ఆ కార్యములమీఁదఁ బరిపూర్ణముగ లగ్నమొనర్చెను.

ఆ మనుష్యుఁ డందమూ, అతని యలయిక హద్దుమీఱి పోయినది. ఖైదీల యలవాటునుబట్టి నాసికోచ్ఛ్వాసముతో లాంపును ఆర్పివేసి, ఎట్లున్నవాఁ డట్లే పఱుపుపైఁ బడిపోయెను. ఉత్తరక్షణమున గాఢనిద్ర యతని నావరించెను.

బిషప్పు పడకగది చేరుకొనునప్పటి కర్ధరాత్రమైనది. పిదపఁ గొన్నినిముసముల కా యింట నందఱును నిద్రించుచుండిరి.

# 5

నడుమేయి కడచిన పిదప జాన్‌వాల్జా మేల్కొనెను.

బ్రీలో, బీదకర్షకులింట జాన్‌వాల్జా జనించెను. పసినాఁట నతనికిఁ జదువ నేర్పరైరి. పెద్దయైన తరువాతఁ గట్టెలు కొట్టుట జీవనోపాధిగాఁ జేసికొనెను. అతని తల్లిపేరు జీనే మాతూ. తండ్రిపేరు జాన్‌వాల్జా.

ఆలోచనాస్వభావముకలవాఁడు జాన్‌వాల్జా. అట్టివారికి హృదయము మెండు. మొత్తమునకు, అతని యాకారము

ననే ఏదో జడత్వము అముఖ్యత్వము గోచరించుచుండినవి. బాల్యావస్థయందే పితరులు గతించిరి. పాలజ్వరమువచ్చి, మందులేమిచేఁ దల్లి మరణించెను. తండ్రియుఁ గట్టెలు కొట్టు వాఁడు—చెట్టు పైన పడి స్వర్గస్థుఁడయ్యెను. జాన్‌వాల్జాకు మిగిలియున్న బంధువు వితంతుసోదరి. ఏడ్గురుబిడ్డల తల్లి. తన భర్త బ్రతికియుండినప్పుడు, తమ్మునిఁ బోషించినది. భర్త గతించునప్పటికిఁ బెద్దబిడ్డ వయస్సు ఎనిమిదేండ్లు. కడఁగొట్టు శిశువున కొక్క-సంవత్సరము. జాన్‌వాల్జాకు ఇరువదైదేండ్లు. ఆ కుటుంబ భారమతనిపైఁ బడెను. చిననాఁడు తనను బోషించిన అక్కను, ఆమె పిల్లలను కాపాడఁ బూనుకొనెను. ఇది తప్పనిదనుకొన్నను, అప్పుడప్పుడు చిరబురలాడుచుండును. యౌవనదశ బండకష్టముతోను, గిట్టని కూలితోను కడచన్నది. అతనికొక ప్రియురాలున్నట్టే లేదు. ప్రేమకలాపమునకు వ్యవధి యేది?

రాత్రి యలసి యింటికి వచ్చును. ఒక్క-మూలైన ఆడక, చాలీచాలని తనపాలి తిండి తినును. దానిని తినుచున్నపుడైన, అక్క-ప్రక్కనఁ గూర్చుండి, బాగున్న ముక్కలు కొన్నియేఱి, తనబిడ్డకుఁ దినిపించును. జాన్‌వాల్జా తలవంచుకొని, వెంట్రుకలు గిన్నెమీఁదఁ బడుచుండగా, ఏదియు గమనింపక కన్నులు మూసికొని తినుచున్నట్లుండును. వారి యింటికిఁ గొంచెము దూరమున, రోడ్డు కాప్రక్క, ఒక కర్షకునిభార్య మేరీక్లాడ్ అను నామె కలదు. పిల్లలు, అప్పుడప్పుడు తల్లిపేరుచెప్పి, అర్ధసేరు పాలామెదగ్గఱఁ దీసికొని, ఏ పొద వెనుకనో, సందుగొందులలోనో, అత్యాత్రముతో ఒకరినుండి యొకరు పాత్ర

గుంజుకొనుచుఁ ద్రాగివేయుదురు. చిన్నపిల్లలు బట్టలపైన, మెడపైన ఒలుకఁబోసికొందురు. నిరంతర క్షుత్పీడితులైన వారేమి సేయఁగలరు, పాపము! తల్లికిఁ దెలిసిన, ఈ యపరాధుల నామె తీవ్రముగ శిక్షించెడిది. మొత్తము గొణఁగరి యయ్యు, జాన్‌వాల్జా ఆ బాకీ తీర్చెడివాఁడు. తల్లికీ సంగతి యెప్పుడును తెలియనేలేదు. పిల్లలకు శిక్ష లేదు.

గృహారామములందు, చెట్లను పొదలను ఇంపుగాఁ గత్తిరించెడు తరుణమున దిన దినమునకుఁ దొమ్మిది పెన్నీలతఁడు సంపాదించును. ఇతర సమయములలో దొరికిన పని చేయును. అతని అక్కయు కూలి చేసెడిది. కాని, ఏడ్గురు పిల్లలను కట్టుకొని యేమిపని చేయగల్గును? అదొక నిర్భాగ్య కుటుంబము. దైన్యము దినదినాభివృద్ధిచెంది, దాని నింతింతగా తినివేయసాగినది. ఒక హేమంతము దుర్భర తీవ్రత్వము దాల్చినది. జాన్‌కు పని దొరకనేలేదు. కుటుంబమునకన్నము లేదు-ఒక్క కడియైన లేదు. ఏడ్గురు పిల్లలు!

ఒకరాత్రి, రొట్టెలంగడివాఁడు నిద్రింపబోవుచుండెను. అప్పుడు, ఇనుపకమ్ములున్న కిటికీ తలుపుమీఁద బలముగాఁ గొట్టిన చప్పుడయ్యెను. అతఁడు దిగివచ్చుసరికి, పగులగొట్టఁబడిన గాజుతలుపునుండి ఒక చేయి లోనికి చాచుట చూచెను. ఆ చేయి ఒక బ్రెడ్డును తీసికొని వెనుకకు వెళ్ళెను. అంగడివాఁడు వెలుపలికురికెను. దొంగ, కాళ్ళ సత్తువను ఉన్నంత చూపియు, పట్టుపడెను. అతఁడు బ్రెడ్డును పాఱవేసియుండెను. కాని, చేయినుండి యింకను రక్తము కారుచుండినది. అతడు జాన్‌వాల్జా!

ఇదియంతయు 1795 లో జరిగినది. జాన్‌వాల్జాను ఆ నాఁటి కోర్టులో నిలిపిరి. "రాత్రికాలమున, మనుష్య నివాసమున్నయింట దోఁపిడి" యతని నేరము. అది స్థిరమయ్యెను. శిక్షాస్మృతి స్పష్టముగనున్నది. మన నాగరకతలో భయంకర ఘటికలున్నవి. క్రిమినల్ చట్టము, ఒక మానవుని జీవితనౌకా భంగమును శాసించునప్పటి గడియ యట్టిది. సంఘము వెనుకకుఁ దగ్గి, తోఁడిమానవునెప్పటికిని త్యజించు నిముసము దుఃఖకరమైనది. జాన్‌వాల్జాను, గాలీలో ఐదేండ్ల ఖైదు విధింపఁబడెను.

తొంబదేండ్ల వృద్ధగు జైలుకాపరియొకఁడు, నాఁడు కోర్టులో జరిగినదంతయు మఱువక, నేఁటికిని నేకరువుపెట్టును. తక్కిన ఖైదీలతోఁపాటు నేలపైఁగూర్చుండి, జాన్‌వాల్జా తన గతి యర్థము చేసికొన్నవానివలె కనుపట్టలేదఁట. దానిలోని భయంకరత్వము మాత్రమే అతఁడు గ్రహించెను. నిఱుపేదయు, అజ్ఞానియునైన యతనికిఁగూడ ఈ శిక్ష చాల యెక్కువైనదన్న అస్పష్టాభిప్రాయము కలిగెను కాఁబోలు. శాంతిరక్షకులతని వెనుక నిల్చుండి మెడకుఁ దగిలించిన యినుప సంకెల చీలలు బిగించుచుండగా అతఁడేడ్చెను. కన్నీళ్ళతని కంఠము నదిమివైచెను. అప్పుడప్పుడతి కష్టముతో "నేను కొమ్మలు కత్తిరించువాఁడను" అని మాత్రము నుడువుచుండెను. ఏడ్చుచునే, కుడిచేయెత్తి ఏడంతస్థులుగా, ఏడ్గురు పిల్లల తలలంటుచున్నట్లు దించెను. ఇందుచేఁ దానేమిచేసినను ఆ యేడ్గురుపిల్లల కడుపు వీపులకని స్ఫురించును.

అతఁడు టూలన్ చేరునప్పటి కిరువదేడు దినములు

పట్టెను. బండిమీాద మెడకు గుది గొలుసు తగిలించియే కొంపోయిరి. అక్కడ ఎఱ్ఱ బ్లౌజు తొడిగించిరి. జరిగిన జీవిత మంతయు పేరుతోఁగూడ నాఁడు తుడిచివేయఁబడెను. ఆ తరువాత నతడు జాన్‌వాల్జా కాఁడు. నంబరు 24601. అక్క యేమయ్యెను? ఏడ్గురు పిల్లల కేగతి పట్టెను? అ బాధ యెవరికిఁ గాఁబట్టినది? చిన్న చెట్టును మొదటికే నఱికిన మొలచిన యేడాకుల గతి యేమగును?

అది ప్రాఁత కథయే. ఆ నిర్భాగ్య శిశువులకు, ఈశ్వర సృష్టిలోని వారికి నాఁటినుండి యాధారము లేదు, దర్శకులు లేరు. ఆశ్రయము లేదు. అవసర మీాడ్చినట్లు పోయిరి. అది యైన నెవ రెఱుఁగుదురు? ఒక్కొక్క రొక్కొక్క దోవనేగిరి. క్రమ క్రమముగా, ఏకాకుల యదృష్టమును గబళించు కాలకాళిమ మున మునిగిపోయిరి. మానవజాతియొక్క మందప్రగనమున ఎండటో యదృష్టహీనులా కాళిమమున నదృశ్యులై పోయినారు. వారా యూరు వదలిపెట్టి పోయిరి. అక్కడి చర్చి, వారు తమదనుకొన్న పొలము కంచె, అంతయు వారిని మఱచి పోయెను. గాలీలో కొన్ని యేండ్లుండిన పిదప జాన్‌వాల్జాకూడ మఱచెను. ఆ హృదయమున గాయముండినది. దాని స్థానమున నిప్పుడు మచ్చ నిలిచినది, అంతే. టూలన్‌లో నుండినపుడు, ఖైదు నాల్గవ సంవత్సరము ముగియునపుడు, ఒకసారి తన సోదరిని గుఱించి వినెను. ఆ వార్త యతనికెట్లు చేరెనో తెలియదు. అతఁడు తన యింటనున్న కాలమున అతనిని దెలిసి యుండిన యతఁడు ఆమెను జూచెను. ఆమె పారిస్‌లో, దరిద్ర నిలయమగు నొక వీధిలో నివసించుచుండినది. ఆమెతోఁగూడ

కట్టకడపటి సంతానమగు బాలుఁడు మాత్రముండెను. తక్కిన యొర్గురు నేమైరి? ఆమెకే తెలియదు కాఁబోలు. ఆమెయొక బైండరీలోఁ పని చేయుచుండెను. కాగితములు మడచి, పుస్తకములు కుట్టుటామె పని. ఉదయమాఱు గంటలకే బైండరీలో నుండవలెను. చలికాలమున, నాలుగంటలైన పిదపఁ జాల ప్రొద్దుకుఁగాని సూర్యోదయము కాదు. ఆ బైండరీయున్న యింటిలోనే ఒక స్కూలుండెను. తన యేడేండ్ల కొడుకు నా బడిలోఁ జదువ వేసినది. బడి యేడుగంటలకు. ఆమె పని యాఱుగంటలనుండి. కావున, ఒక గంట ప్రొద్దు చలిలో, చీఁకటిలో ఆ బాలుఁడు, వరాండాలో నిలిచియుండవలెను. బైండరీలోనికి వారు రానీరు-బాలుఁడు తులువయఁట. పనివాండ్రు కూలికై ప్రాతఃకాలమున పోవుచు, రస్తాప్రక్కనఁ గూర్చుండి, అలసటచే ఊఁగుచునో, తన బుట్టపైవంగి నిద్రించుచునో యుండు ఈ నిరుపేదబాలునిఁ జూచెడివారు. వర్షము వచ్చినపుడు, బడి దర్వానుగానున్న ముదుసలి కరుణ వహించి, తన పాకలోనికి రమ్మనెడిది. అక్కడ, ఒక మూలలో వెచ్చగా నుండుటకై పిల్లిని కౌఁగిలించుకొని ముడుఁగుకొనును. ఏడు గంటలకు బడి తెఱువఁగా చదువుకొనఁబోవును. జాన్ వాల్జాకు చెప్పఁబడినదిది. ఒక కిటికీ హఠాత్తుగాఁ దెఱచి, తాను ప్రేమించిన వారి నొక్క క్షణము చూపి, మఱల మూసినట్లైనది. పిదప, అతఁడేమియు వినలేదు. మఱి వారిని జూడలేదు. చూడఁబోఁడు! మిగిలియున్న యీ విషాదకథయందు మనము వారిని గలిసికొనఁబోము.

నాల్గవ సంవత్సరాంతమున స్వేచ్ఛకవకాశము కనుపించి

నది. ఆ ఘోర ప్రదేశమున బంధింపబడినవారెల్లపుడును ఒండొరులకు సాయపడ సిద్ధముగా నుందురు. జాన్‌వాల్జా తప్పించుకొనుటకు వారు తోడుపడిరి. పొలములలో రెండుదినములు స్వేచ్ఛావాయువులు పీల్చెను. భటులు వేటాడుచుండ, నిమిష నిమిషమును వెనుదిరిగి చూచుచుఁ, జీమ చిటుకుమన్న నదటిపడుచు, దేనిని జూచినను భయపడుచుఁ, జిమ్నీపొగ – దారినడచు ప్రతిమానవుఁడు – కుక్కమొఱుగు – గుఱ్ఱపు పరుగు – గడియారపు టిక్కు – వెలుతురుండుటచే పగలు – చీఁకటగుటచే రాత్రి – రోడ్డు – కాలిబాట – నిద్ర – సకలమును భీతిగొలుపుచున్నపుడు స్వేచ్ఛ యున్నదనుకొంటిమా, రెండుదినములు జాన్‌వాల్జా దాని ననుభవించెను. రెండవనాఁటి సాయంకాలమున, అతనిని మఱలఁ బట్టుకొనిరి. ముప్పదియాఱుగంటలకాలమతఁడు కునుకలేదు. తినలేదు. నౌకాన్యాయస్థానము ఈ ప్రయత్నమునకై మూఁడేండ్లెక్కువ శిక్ష విధించెను. కావున, మొత్తమెనిమిదేండ్లయ్యెను. ఆఱవ సంవత్సరమునఁ దప్పించుకొను వంతు మఱల నతనికి వచ్చెను. ప్రయత్నించి మఱల విఫలుఁడయ్యెను. హాజరు పిలుపు వేళ అతడు పలుకలేదు. వెంటనే వెదుక నారంభించిరి. ఆ రాత్రియే, 'పరిసర ప్రజలు ఒక యోడ యడుగున దాగియున్న యతనిని గనుఁగొనిరి. పట్ట వచ్చిన గాలిభటుల నతఁడు ప్రతిఘటించెను. తప్పించుకొనుట – ప్రతిఘటించుట – రెండపరాధములు కావున, మఱి యైదేండ్లెక్కువ చేయబడెను. అందులో రెండేండ్లు, కాళ్ళకుఁ జేతులకుకూడ సంకెలలు వేయవలెనని యుత్తరువిచ్చిరి. అంతయుఁ గలిసి, యిప్పటికిఁ బదుమూఁడేండ్లు. పదవయేట మూఁడవసారి

తప్పించుకొను వంతు వచ్చెను. ఫలము మునుపటియట్లే. దీనికి మూఁడేండ్లు – వెరసి పదునాలు. పదుమూఁడవసంవత్సరమునఁ గడపటి ప్రయత్నమొనర్చి, నాల్గు గంటలు జేయిలు వెలుపల నుండెను. ఈ నాల్గుగంటల స్వేచ్ఛ మఱి మూఁడేండ్లకెక్కించి నది. పందొమ్మిదేండ్లు. 1815 అక్టోబరులో అతనిని వదలి పెట్టిరి——1796 లో గాజు కిటికీ పగులఁగొట్టి, ఒక రొట్టె తీసి కొన్నందుకు, గాలీ ప్రవేశించినవాఁడు!

ఒక యప్రధానవిషయము తడవుట కిది సమయము. పరిహారప్రశ్నను, కోర్టుశిక్షలను గుఱించి ఈ గ్రంథకర్త చేసిన పరిశీలనలో, ఒక్కరొట్టె భవిష్యత్సకలనాశనమునకు మూల మగుట కిది రెండవ పర్యాయము. క్లాడ్‌గో ఒక్క బ్రెడ్డు దొంగిలించెను. జాన్‌వాల్జా ఒక్క బ్రెడ్డు దొంగిలించెను. ఇంగ్లండు లెక్కలు పరిశీలించిన, ఐదింట నాల్గు దొంగతనము లకుఁ గారణము నిత్యోపవాసమని తేటపడును.

జాన్‌వాల్జా వెక్కివెక్కి యేడ్చుచు, గడగడ వడఁకుచు గాలీ ప్రవేశించెను. శిలాకాఠిన్యముచెంది వెలువడెను. హతాశుఁడై లోనికేగి, భయంకరుఁడై వెలికి వచ్చెను.

ఈ జీవుని యాత్ర యెట్లు సాగినది?

# 6

వివరింప యత్నింతము.

సంఘ మీ విషయములను బరిశీలింపవలసిన యవసరము విధిగా నున్నది. సంఘకల్పితములే యివి.

మన మిదివఱకే చెప్పినట్లతఁడు అజ్ఞుఁడు. బుద్ధిలేని

వాఁడు కాఁడు. సహజ జ్ఞానదీపమతనిలో వెలిఁగింపఁబడియుండి నది. దురదృష్ట ప్రకాశమూ వెలుతురుకుఁ దోడైనది. దుర దృష్టమునకును ప్రకాశముండును. కొరడా చురుకులో, సంకెల బరువులో, చీఁకటికొట్టులో, అతిశ్రమలో, గాలిలో మండు టెండలకు మాడునపుడు, కొయ్యపలకపైఁ బరుండినపుడు, తన యంతరాత్మనంకఁ దిరిగి పర్యాలోచించెను.

తానే న్యాయస్థానమయ్యెను,

ఆత్మ నిందతోఁ బ్రారంభించెను.

తాను నిరపరాధి కాఁడని, అన్యాయముగ శిక్షింపఁబడ లేదని యతఁడంగీకరించెను. నిందాస్పదమైన తెగువకుఁ దాను బూనుకొనుటొప్పుకొనెను. తానడిగియుండిన, ఆ బ్రెడ్డు నిరాక రింపఁబడెడిది కాదేమో. ఏమైనఁగానీ, పని దొరకువఱకో, పరులు జాలిచూపునఱకో కాచియుండిన బాగుగ నుండును. "ఆఁకలి మాడ్చునపుడు కాచుకొన సాధ్యమా?" అను ప్రశ్న నిరుత్తరముకాదు. ఆఁకలికిఁ జచ్చువారరుదు. నైతికముగను, భౌతికముగను మనుష్యుఁడు చాలకాలము చాల బాధలకుఁ జావక తాళఁగలఁడు. ఇది యదృష్టమో, దురదృష్టమో. కాన మానవున కోర్పుండవలెను. ఓర్పుండిన, ఆ పసికూనలకును ననుకూలముగ నుండెడిది. సంఘము మహాబలిష్ఠము. తానో నిఱుపేద. సంఘముతో మెడపట్లకు దిగుట, దొంగతనముచే దైన్యముఁ బాపుకొన నూహించుట తెలివితక్కువ పని. ఏ ద్వారమునుండి దుర్యశము ప్రవేశించునో దానినుండి దైన్యము నకుఁ దొలఁగఁజూచుట వెఱ్ఱి. తనది తప్పు.

పిదప ఇట్లు ప్రశ్నించుకొనెను.

తన కష్టచారిత్రమునఁ దప్పొనర్చినది తానొక్కఁడేనా? శ్రామికుఁడైన తనకుఁ బని లేకుండుట ఘోరముకదా? పాటుపడ సిద్ధముగానుండు తనకు అన్నము లేకపోవుట యన్యాయము కాదా? తాను తప్పొనర్చినను, దాని పరిహారము, క్రూరము మితిమీఱినదికాదా? అపరాధి నేరమునకంటె పరిహారము విధించుటలో దుర్వినియోగమెక్కువైనదికాదా? ఈ త్రాసులో పరిహారమువంక భారమెక్కువ పడలేదా? ఈ వైపరీత్యము, చట్టమును ధిక్కరించినవానిని న్యాయశీలియనిపించుట లేదా? గాలినుండి తప్పించుకొనుటకై చేసిన ప్రతి ప్రయత్నముతో నధికాధికము చేయఁబడిన పరిహారము, బలవంతుఁడు దుర్బలునిపై నెఱపిన దారుణ దౌర్జన్యముకాదా? సంఘము వ్యక్తిపై సాగించిన ఘోరమైన దోషము నేరముకాదా? ఈ నేర మేనాఁటికానాఁడు ప్రత్యగ్రమై, పందొమ్మిదేండ్లు తన నెత్తిపైనఁ గూర్చుండినది.

ఒకచో హేతురహితమైన యజాగ్రత వహించి, యింకొకచో నిష్ఠుర జాగరూకతఁజూపి, నిఱుపేదకుఁ బని లేకుండఁ జేసి, తల పగిలిపోవునంత పరిహారభారము మోపి, సభ్యులను నలిపివేయు హక్కు సంఘమునకుఁ గలదా?

ధాన్య, ఐశ్వర్యమును సంఘ సభ్యులకు విషమముగాఁ బంచినది. చాలతక్కువ పొందినవారు చనవున కర్హులుకారా? నిష్కారణముగఁ జట్టము నకుశాకురము వారిపై రుద్దుట దారుణ దౌర్జన్యము కాదా?

ఈ ప్రశ్నలడిగి తీర్మానించి, సంఘమునకతఁడు శిక్ష చెప్పెను.

అతని ద్వేషమే ఆ శిక్ష.

తానను భవించిన యాతనకు బాధ్యతను సంఘముపై మోపెను. ఒకనాఁడు ప్రతిక్రియ నెఱపెదనని తీర్మానించుకొనెను. తాను చేసిన గాయమునకుఁ దనకుఁ జేయఁబడిన గాయమునకు ధర్మయుతమైన సంబంధమే లేదని నిశ్చయించుకొనెను. ఆ పరిహారము అన్యాయము మాత్రమే కాదు-అధర్మమును.

కోపము తెలివితక్కువ కావచ్చు, అయుక్తము కావచ్చు. తప్పు చేసినవాఁడు కోపగించుకొనవచ్చు. కాని, మొదలుఁ దాను ధర్మయుతుఁడను భావము లేనిదే, మానవుఁడు దారుణ దౌర్జన్యమునకు గుఱియైనట్లు భావింపఁడు. జాన్ వాల్జా యట్లు భావించెను.

మఱి మానవ సంఘ మతనికి గాయము తప్ప వేఱే మియుఁ జేయలేదు. అతనికిఁ గనఁబడిన సంఘమంతయు, న్యాయముపేరిటి కుపిత దుస్సహ ముఖము. తాను పడఁగొట్టఁ దలఁచిన వారికే సంఘమా ముఖముఁ జూపును. అతని నెవ్వఁడు తాకినను గాయపఱచుటకే. మనుష్యులతో అతని సామీప్యము దెబ్బలాటలందే. శైశవావస్థనుండి, తల్లినుండి, అక్కనుండి-ఎవ్వరినుండి కాని ఒక్క ప్రియవచనము, ఒక్క కరుణాదృష్టి పొందినవాఁడు కాఁడు. బాధపై బాధపడి, క్రమక్రమముగా జీవితమే యుద్ధమను నిశ్చయమునకు వచ్చెను. ఆ యుద్ధమునఁ దాను బరాజితుఁడు. ద్వేషము తప్పఁ దన కితరాయుధము లేదు. గాలీలో దానికిఁ బదును పెట్టి వెలికి పోవునపుడు తనతోఁ దీసికొని పోవఁ దీర్మానించుకొనెను.

టూలన్‌లో, ఇష్టమున్న ఖైదీలు చదువుకొనుటకొక స్కూలుండెను. అచ్చట అతి ముఖ్య విషయములు బోధించు చుండిరి. ఇష్టమున్న వారిలో నతఁడొకఁడు. నలుబదవయేఁట బడికి వెళ్లి వ్రాయను జదువను నేర్చుకొనెను. విషయజ్ఞాన మెక్కువ చేసికొనుటనగా తన ద్వేషము బలపఱచుకొనుటని యతడు భావించెను. కొన్ని పరిస్థితులలో బోధనా వికాసములు పాపమునకుఁ బిలుపుఁగూఁతలు.

ఇట్లు సంఘ విచారణ సల్పి, సంఘమును సృష్టించిన యీశ్వరుని విచారించి శిక్షించెను. ఇది విషాదకరము.

ఈ విధముగ, పందొమ్మిదేండ్ల యాతనలో బానిస తనములో ఆ జీవాత్మ ఏక సమయముననే పడుచు లేచు చుండెను. ఒకవైపునుండి వెలుఁగు, ఇంకొకవైపునుండి చీఁకటియుఁ బ్రవేశించుచుండెను.

జాన్‌వాల్జాది పాపస్వభావము కాదని మనమెఱుఁగు దుము. గాలీ చొచ్చినపుడు అతని హృదయమింకను ధర్మపక్షమై యుండెను. గాలీలో నుండఁగా సంఘమును నిరసించి తాను క్రూరుఁడైనట్లు భావించెను. ఈశ్వరుని నిరసించి పాపమాచ రించినట్లు భావించెను,

ఇక్కడ ఒక్క నిముస మాలోచింపవలెను.

మానవ స్వభావము సంపూర్ణముగా మార్చివేయ వీలగునా? దేవునిచే దయాళువుగ సృష్టింపఁబడిన మానవుని, సంఘము క్రూరునిగా మార్చివేయఁగలదా? విధి నిర్ణయము దుష్టముగా నున్నప్పుడు, తదనుగుణముగా జీవుని మార్పనగునా? అతిభారమైన మేధస్సుచే వెన్నెముకవలె, తగని వ్యసనబలముచే

హృదయము వికృతమై, కుంఠీభూతమై అనివార్య జాడ్య గ్రస్తమై పోఁగలదా? ప్రతిమానవాత్మయందును, ముఖ్యముగా జాన్ వాల్జా యాత్మయందును, బురాణప్రకాశ కణిక, యీ ప్రపంచమునఁ జెఱుపరానిది-పరలోకమున నమరమైనదియునై, సద్భావముచే వృద్ధికివచ్చునది, వెలుఁగునది, మహోజ్వల ప్రకాశమును వెదఁజల్లునది, ఎన్నటికిని ఆర్పరానిదియునైన దివ్యవస్తువుండలేదా?

ఇవి మహాప్రశ్నలు - అల్పప్రశ్నలును. టూలన్‌లో, విశ్రాంతిసమయమున, ఏకాంతముగఁ గూర్చుండి, చేతులు కట్టుకొని, క్రిందికి లాగకుండుటకై సంకెల కొనను జేబులో దూర్చి, పెదవి కదల్పక, ఆలోచనాధీనుఁడై, విచారవదన ముతోనుండు జాన్ వాల్జాను, మానవునిపై గ్రుడ్డిగ్రుడ్డిఁజేయు చట్టముచే బహిష్కరింపఁబడినవానిని, స్వర్గమునే కఠోర దృష్టితోఁ జూచు నాగరకతచే శిక్షితుడైనవానిని, మానవ దేహశాస్త్రజ్ఞుఁ డెవఁడేని చూచియుండిన, పై ప్రశ్నలలోఁ గడపటిదానికి, నిస్సంశయముగ "లేదు" అని జవాబుచెప్పి యుండును.

జాన్ వాల్జా యందా శాస్త్రజ్ఞుఁడు తీర్పరానిదైన్యము పసిపట్టి యుండును. చట్టము తెచ్చిన యీ వ్యాధిని గాంచి వాపోయి యుండును. నివారణకై ప్రయత్నమైనఁ జేసి యుండఁడు. ఆ యాత్మయందేర్పడిన చీకటిగుహలనుగాంచి కనులు మూసికొనియుండును. నరకద్వారమునందలి డాంటే వలె, సర్వేశ్వరునిచేఁ బ్రతిమానవుని ఫాలమున వ్రాయఁబడిన

'ఆశ' యను పదమును, ఆ జీవితమునుండి తుడిచివేసి యుండును.

ఆ మనస్థితిని గుఱించి, పాఠకునకు మేము వివరింపఁ బూనినంత స్పష్టముగ, జాన్‌వాల్జాకుఁ దెలియునా? తన నైతికపతనమునకు దారితీసిన విషయములను, అవి గుమిగూడి నపుడో, కూడుచున్నపుడో కనుగొనియుండునా? ఆ భావపరంపర లొక్కటొక్కటిగా, లేచుచుఁ బడుచుఁ, దానిప్పుడున్న విషాదకరపరిణామము మనస్సునఁ గలిగించుటకుముందీ మోటు మానిసి, యీ నిరక్షరుఁడు వానిని సరిగాఁ దెలిసికొనియుండెనా? తనలో సంచరించి, తన్ను కదలించుచుండినవాని నతఁడు స్పష్టముగాఁ దెలిసికొనియుండెనా? ఔనని చెప్ప ధైర్యము మాకు లేదు. మేము నమ్ముటయు లేదు. ఇంత యాతనపడిన తరువాతఁగూడ, నిట్టి విషయములను సూక్ష్మముగా వివేచన సేయుటకుఁ దగిన జ్ఞానము జాన్‌వాల్జాకు లేదు. అప్పుడప్పుడు, నికరముగాఁ దనభావమే అతనికిఁ దెలియదు. జాన్‌వాల్జా చీఁకటిలో నుండెను. చీఁకటిలో నతఁడు బాధలనుభవించెను' చీఁకటిలో ద్వేషించెను. తన కన్నుల యెదుటనే ద్వేషించె ననియుఁ జెప్పవచ్చును. ఎడతెగని యంథకారమునందుండి, స్వాప్నికావస్థలోవలె, గ్రుడ్డిగాఁ దాఱాడుచుండెను. నడుమ నడుమ, హఠాత్తుగా, లోపలినుండియో వెలుపలినుండియో యొక్క కోపాఘాతము తగిలి, బాధాతరంగము వెల్లివిఱిసి, చుట్టుప్రక్కల సర్వమును అగపఱచు వెలుతురు ప్రకాశించి, అతని విధినిర్ణీతమునందలి భయంకర పర్వతసానువులను అస్పష్ట దృశ్యములను కన్పఱచెడిది.

ఆ వెలుఁగు పోయినది. రాత్రి వచ్చినది. తానెక్కడ నుండెను? అతఁడెఱుఁగఁడు.

ఈ శిక్షణ విధానమున, నిష్కరుణమై, పాశవము కల్గించు గుణము ప్రబలముగా నుండును. అది క్రమక్రమముగా, స్పృహతప్పించి మానవుని జంతువుగను, కొన్ని సమయములఁ గ్రూరమృగముగను మార్చివేయును. మొండియై పలుమాఱులు తప్పించుకొనుటకు జాన్ వాల్జా చేసిన ప్రయత్నమాజీవునిలోఁ జట్టము కలిగించిన విచిత్ర పరిణామమునకు నిరూపణ. ఆ ప్రయత్నములు అప్రయోజకములు. తెలివిమాలినవి. దాని ఫలమును గుఱించి యొక్కనిముస మాలోచింపక, పూర్వానుభవముచే బుద్ధి తెచ్చుకొనక, అవకాశము చిక్కినపుడంతయుఁ బునఃప్రయత్నము చేయుచునే వచ్చినాఁడు. బోను తలుపు తెఱచుకొని యుండఁగాఁజూచి వెలికుఱుకు తోడేలువలె, ఉన్మత్తుఁడై యుఱుకసాగినాడు. సహజ ప్రేరణ "పో"మ్మని, హేతు"వుండు"మని చెప్పినవి. కాని, అంతబలమైన ప్రేరణ యెదుట, హేతువు పాఱిపోయెను. ప్రేరణయే నిలచినది. పశువే పనిచేసినది. మఱలఁ బట్టుకొని అతనిపై గుప్పిన క్రొత్త క్రౌర్యములు. పాఱిపోవు ప్రేరణకుఁ బదును పెట్టసాగినవి. అతనిని, క్రమక్రమాధిక భయంకరునిగా జేసినవి.

ఒక విషయము మనము మఱువఁగూడదు. దేహబలమున, తక్కిన ఖైదీలందఱికన్న నతఁడు చాలమిన్న. కాయకష్టమున, మోకులు పెనవేయుటలో, బరువులెత్తు యంత్రమును ద్రిప్పుటలో నలుగురకతఁడొక్కఁడు సాటి. అప్పుడప్పుడు మహాభారములను ఎత్తి, వీపుపై మోయును. కావున,

తోడివారతనికి జాన్‌జాక్ (Jack) అని పేరుపెట్టిరి. ఒకసారి టూలన్‌లో ఊరి చావడి బాల్కనీ మరమ్మతు చేయుచుండిరి. ఒకస్తంభ మొఱిగి కప్పంతయుఁబైనఁ బడునట్లుండెను. అక్కడనే యుండిన జాన్‌వాల్జా బుజము దానికానించి, కూలివాండ్రు వచ్చునవఱకట్లే నిలిపెను.

అతని చుఱుకుఁదనము బలమును మించినది. ఎల్లప్పుడును దప్పించుకొనఁ జూచుచుండు ఖైదీలు, బల చాకచక్యముల శాస్త్రము నొక్కటి వృద్ధిచేసిరి. పక్షులను, ఈగలను జూచి యీర్ష్యాళువులై వారు నిగూఢ శీఘ్రగామి విధానమును బ్రతిదినమును నలవాటు చేసికొనెడివారు. గోడ బ్రాకుట, రవ్వంత బుడపైన లేనిచోట కాలు నిలుపుట జాన్‌వాల్జాకు ఆట. గోడకు కోణమున్నఁజాలు. వీపు మోకాళ్ళ బిగువుతో, చేతుల మోచేతులను కఱకురాళ్ళకానించి, యింద్రజాలమనిపించునట్లు మూఁడవయంతస్తు కెగఁబ్రాకఁగలఁడు. అప్పుడప్పుడీ విధమున గాలిమేడ నెక్కెడివాఁడు.

చాల మితభాషి. నవ్వుటే లేదు. హద్దుమీఱిన యుద్రేకము కలిగినఁగాని, సంవత్సరమున కొకటి రెండుమాఱులు నవ్వెడివాఁడు కాఁడు. ఆ నవ్వైనఁ బిశాచహాస ప్రతిధ్వనివలె నుండి, విషాదగర్భితమైయుండెడిది. ఏదో భయానకమైన దాని మీఁదనిరంతరము దృష్టిసారించుచున్నవానివలెకన్పట్టెడివాఁడు. నిజమునకు, నిరంతరాలోచనాధీనుఁడై యుండెడివాఁడు.

అసంపూర్ణ ప్రకృతి. అదియు వ్యాఘ్రగ్రస్తము. ఉన్న ప్రజ్ఞకు వికాసములేకపోఁగా, అణఁగఁ ద్రొక్కఁబడినది. అట్లయ్యు, ఏదో యమానుషభారము తనపైనుండినట్లతని కస్పష్ట

ముగాఁ దోఁచెడిది. దానిక్రింద నలిగి బరుగునప్పుడు, తల నిటో యటో త్రిప్పి, కనులెత్తి చూచెనా, సమున్నతములై చట్టములు, పక్షపాతములు, మనుష్యులు, కార్యములు నేర్పడి, గుమిగూడి అసహ్యముగఁ గనుపట్టెడివి. వాని యాకృతులతని పట్టు తప్పించుకొని, భారము గుండెలవియఁ జేసి, అతనిని భయక్రోధ ఘూర్ణితునొనర్చెడివి. అదే నాగరకత యని మనమనెడి బ్రహ్మాండమైన "పిరమిడ్." ఆకార శూన్యమై ప్రాకుచున్న ఆ సముదాయమున, ఒకప్పుడు సమీపముగ,నింకొకప్పుడు దూరముగఁ జేతికందని సానువులపై, ఒక గుంపునో, విస్పష్ట ప్రత్యేకాంశమునో,.కట్టి చేతనిడుకొన్న జెయిలు కాపరినో, కృపాణధారియైన భటునో, కిరీటియగు బిషప్పునో గుఱుతించెడివాఁడు. ఈ యందఱపై, అన్నింటిపై ప్రత్యేక ప్రతాపముతోఁ గిరీటధారియైన చక్రవర్తి జాజ్వల్యమానుఁడై యుండుటను జూచెడివాఁడు. ఈ దూరప్రకాశ ప్రభావములు, తన్నానరించిన రాత్రిని దొలఁగించుటకు బదులు మఱింత యంధకారముగ మారకముగఁ జేయుచున్నట్లతనికి దోఁచుచుండెను. ఈ చట్టములు, పక్షపాతములు, పనులు, మనుష్యులు, వస్తువులు-అన్నియు నాగరకతపైన నీశ్వరుఁడు నాఁటిన నిగూఢ సంకీర్ణ విధానమున, అతనిమీఁద నడిచి, యొక యనర్హ్య నిఃక్షోభ క్రౌర్యముతో, కఠినోదాసీనతతో నలిపి వేసినది. అభాగ్యత్వపుటడుగునకుఁ గ్రుంగిన జీవులకుఁ, గనుచూపు చొఁఱలేని యగాధమునఁ జట్టముచే బహిష్కృతులై పడిపోయిన దుఃఖజీవులకు, మానవ సంఘ భారమంతయు,

సంఘు వివర్జితుమైనపుడు తలపైని మహాపర్వతమై, ఆ సంఘము క్రిందనున్నపుడు భయంకరమై తోఁచును.

ఇట్టి సన్నివేశమున జాన్‌వాల్జా తదేకధ్యాన మగ్నుఁడై యుండును. అతని యాలోచన లెట్టివో?

జొన్నగింజ తన్ను పిండిచేయు యంత్రము క్రింద యోజింపఁగలదేని, అది జాన్‌వాల్జావలె నాలోచించుననుట నిస్సందేహము.

ఇవియన్నియుఁ బిశాచములతో నిండిన వాస్తవములు. వాస్తవికములతో నిండిన మాయాజగత్తు. వివరింపరాని యొక స్థితిని జాన్ వాల్జాలోఁ గలిగించినది.

గాలీలో పనిచేయుచు, నున్నట్టుండి యాగి, యాలోచించును. అతని హేతువు కొంత యెక్కువ పరిణతి గాంచి యుండియుఁ, దొల్లిటి కంటె నెక్కువ సంచలితమై యుండుటచే నెదురు తిరుగును. తనకు జరిగినదంతయు నెక్కువ యన్యాయమని తనను జుట్టుకొన్న దసాధ్యమనియు ననిపించును. ఇది స్వప్నమనుకొనును. సమీపమున నిల్చుండి జైలరును జూచి, మాయయేమో యనుకొనును. హఠాత్తుగ, ఈ మాయ కఱ్ఱతో బాదును.

అతనికి గాలీ వెలుపలి ప్రపంచమున్నట్టే లేదు. సూర్యుఁడు లేఁడు, సుందర వసంతర్తువు లేదు, స్వచ్ఛాకాశము లేదు, ప్రకాశవదరుణోదయము లేదు. మకమకలాడు, కిటికీ వెలుతురే ఆ జీవప్రకాశము.

సారాంశము: పందొమ్మిదేండ్లలో, పల్లెలోఁ గట్టెలు కొట్టు సాధువు, టూలన్‌లో భయంకరుఁడైన గాలీ బానిసమై,

గాలీ శిక్షణ ధర్మమాయని, రెండు విధములైన యపరాధము లొనర్ప సమర్థుఁడయ్యెను. మొదటిది - హ ఠా త్తు గాఁ బూర్వాలోచన లేకయే, ఔద్ధత్యపూర్ణమై, పశుప్రేరణమై తానునుభవించిన బాధలకుఁ బ్రతీకారముగ, నెట్టిపనినైనఁ జేయుట. రెండవది—పూర్వాలోచిత కార్యము, అంతరాత్మచే విమృష్టము, అట్టి దురవస్థాదత్తమైన కృత్రిమాభిప్రాయసంభవమునైనది. కొన్ని ప్రకృతులలో యోజనలు మూఁడవస్థలను పొందును—హేతువు, ఇచ్ఛ, మాధ్యము. జాన్‌వాల్జా పనులందలి పూర్వాలోచన లీమూఁడవస్థల నొకటివెంట నొకటిగాఁ పొందినవి. అలనడిపోయిన క్రోధము, విషాదభరమైన యాత్మ, మహాయాతన లనుభవించితినన్న భావము, మంచివారు - అమాయకులు - న్యాయశీలురు నున్నచో వారియెడలను నైరుధ్యము, ఇవే అతని యుద్దేశములు. అతని యోజనల యాద్యంతములు మానవశాసనముమీఁది ద్వేషమే. ఈశ్వర కల్పిత సన్నివేశ మేదైన ఇట్టి ద్వేషము నరికట్టదేని, అది క్రమక్రమముగా సంఘద్వేషమై, మానవద్వేషమై, సకల సృష్టిద్వేషమై జీవత్పదార్థము దేనినైనసరే బాధింపవలెనన్న నిరంతరాస్పష్టకాంక్ష యగును. జాన్‌వాల్జాను "చాలఅపాయకరమనుష్యుఁడు" అని విడుదలపత్రము సత్యమే వచించినది.

సంవత్సర సంవత్సరమును, ఈ జీవుఁడు తిన్నగా వినాశకరముగా క్షీణించిపోయెను. హృదయకార్శ్యముతోఁబాటు, నేత్రములు శుష్కించిపోయినవి. గాలీ వదలివచ్చినపుడు, ఆ పందొమ్మిదేండ్లలో నొక కన్నీటిబొట్టైన జాన్‌వాల్జా విడువలేదు.

# 7

మనుష్యుఁ డొకఁడు ఓడలోనుండి సముద్రమునఁ బడి పోయెను!

ఎవరికేమి లెక్క? ఓడ నిలువదు. గాలి వీచుచున్నది. ఓడమాత్రము తన గమ్యమువంకకు సాగితీఱవలెను. వెళ్ళి పోవును.

ఆ మనుష్యుఁడు మునుఁగును, లేచును. అఱచును. చేతులు చాచును. వాయు తీవ్రత్వమునకూఁగు నోడ, కష్టముతోఁ బోవును. నడపువారు, ప్రయాణికులును మునుఁగుచున్న మనుష్యునిఁ జూచుటలేదు. అతని దీనమస్తకము, అనంత తరంగములపైన ఒక నలుసు.

అతని నిరాశారోదనము లగాధమునఁ గలిసిపోవును. కనుమఱుఁగగుచున్న ఆ యోడ యెట్టి పిశాచము! అతఁడున్మత్తుఁడై దానిని జూచును. అది, కదలిపోవుచునేయుండును. అస్పష్టమగును. చిన్నదగుచుఁ బోవును. ఇంతకుముందతఁడు దానిపై నుండెను. నడపువాండ్రలో నతఁడొకఁడు. అతనికిని, గాలివెలుతురులలో భాగముండినది. ఇప్పుడేమైనది? కాలు జాఱి పడిపోయెను! అంతయు ముగిసినది!

అతడు ఘోరాగాధమునఁ బడిపోయినాఁడు. కాలి క్రింద, జాఱిపోవు, పరుగిడు జలముతప్ప వేఱేమియు లేదు. అలలు, గాలికి తునకలై చెదరి బీభత్సముగా నతనిని జుట్టుకొనుచున్నవి. సుడుల తిరుగుడులు ముందువెనుకల కీడ్చును. తరంగశకలములు తలపైఁ బాఱును. అలలగుంపులు విఱుచు

కొని పైఁబడును. మునుఁగునపుడు దూరమునందున్న కొండ శిఖరములు అస్పష్టముగఁ గన్పించును. ఎఱుఁగని తీవె లేవో కాళ్ళకుఁ జుట్టుకొని, లోనికీడ్చి వెఱగుఁ గొలుపును. ఆ యగాధ మునఁ దాను లయించుచున్నట్లతఁడు భావించును. నాలుక కా యుప్పు తగులును. కడుపు నిండని సముద్రమతనిని మ్రింగి వేయఁ ద్వరపడును. ఆ పిల్లి యీ యెలుకతోఁ జెఱలాడును. అది ద్రవీభూత ద్వేషమువలెఁ గన్పట్టును.

అతఁడాత్మ రక్షణకై తన్నుకొనును. ఈదును. తఱుగు చున్న య ల్ప బ ల మా త ని ది. తఱగని మహాబలముతోఁ బోరాడును.

రాత్రి వచ్చును. గంటల పర్యంతమతఁ డీదుచుండి నాఁడు. అతని శక్తి యుడిగినది. మనుష్యులతో నిండిన ఆ యోడ దూరమైపోయినది. ఈ భయంకరాగాధ మధ్యమున, అతఁడేకాకియైనాఁడు. మునుఁగును, నరములు తెగఁ గష్టిం చును. క్రిందఁ గంటికి కన్పడని పిశాచములున్నట్లు భావిం చును. ఆర్తధ్వానము సేయును.

ఇంక మనుష్య సహాయము లభింపదు. దేవుఁడేఁడీ?

నిరాశకు లొంగిపోవును. అలసి, మృత్యువును గాంక్షిం చును. ఇంకఁ బ్రతిఘటింపఁడు. ఆత్మార్పణ చేసివేయును. ఆ యంధకారమున, అగాధమున, శాశ్వతముగఁ బడిపోవును.

మానవ సంఘప్రగమనమునందెంత గట్టిపట్టున్నది! దానిమార్గము మానవ జీవ ధ్వంసముచే మలిమసమైనది! చట్టము పడఁద్రోసిన వారందఱును సముద్రమునఁ బడిపోదురు! అమంగళమై, సహాయము నశించును! నైతిక మరణము!

మానవ శాసనము బలిగొనువారిని ద్రోయు నిష్ఠుర నిశయే సముద్రము. సముద్ర మప్రమేయదైన్యము.

ఆ సముద్రమునఁ దారాడు జీవుఁడు శవమైపోవచ్చు. దానిని దరిఁజేర్చువారెవరు?

# 8

గాలీని వీడు సమయమువచ్చి, "నీవు విడుదల చేయఁబడితివి" అను వింత పలుకులతని చెవిఁబడగనే, జాన్‌వాల్జాకా క్షణము నమ్మరానిదిగ నవాస్తవికముగఁ దోఁచినది. జీవత్ప్రకాశ కిరణమొకటి, సజీవమానవ ప్రకాశ కిరణమొకటి యున్నట్టుండి యతని యాత్మలోఁ బ్రవేశించెను. కాని, యిది త్వరలోనే మాసిపోయెను. స్వేచ్ఛాభావమే యతనికి మిఱుమిట్లు గొలుపునదిగా నుండెను. నూతన జీవితమునందాతనికి విశ్వాసముండినది. పచ్చవిడుదల కాగితమిచ్చు స్వేచ్ఛయెట్టిదో, త్వరలోనే యతనికిఁ దెలిసిపోయెను.

దానితోఁగూడి, యెన్నో కంటకానుభవములు కల్గినవి. గాలీలోనుండిన కాలమునఁ దాను కూలిచేసి మిగిల్చినది నూటడెబ్బదియొక్క ఫ్రాంకులని అతఁడు లెక్కపెట్టియుండెను. ఆదివారములు, ఇతర సెలవు దినములు బొత్తుగా పనిలేకుండ నాపివేయుటను నతఁడు మఱచిపోయెను. పందొమ్మిదేండ్లలో ఇట్లు వచ్చిన సెలవులవలన, ఇరువదినాల్గు ఫ్రాంకులు తగ్గిపోయినవి. దానితోఁగలసి, యితర వ్యయములు అతని సంపాద్యపు మిగులు నూటయేడు ఫ్రాంకులు, ఏడున్నఱ పెన్నీలకు దించినది.

అతనికివి యేవియు అర్థము కాలేదు. తన్ను దోఁచిరనియే యతఁడు భావించెను.

విడుదలైన మఱునాఁడు, ఒక బండినుండి మూటలు దించుచుండుట చూచెను. అతఁడు పనిసేయ సంసిద్ధత చూపెను. వారికిని సాయము కావలసియుండి, యంగీకరించిరి. అతఁడు మూటలు దింపసాగెను. తెలివిగలవాఁడు, బలవంతుఁడు. సమయమునకు వచ్చినవాఁడు. చేతనైనంత చేసెను. పనిగొన్నవాఁడు తృప్తుడైనట్టు కన్పట్టెను. జాన్‌వాల్జా పని చేయుచుండఁగా, ఒక రక్షకభటుఁడు చూచి, కాగితములు సోదా చేసెను. అదియైన పిదప మఱల జాన్‌వాల్జా తన పనిలోనికి దిగెను. అంతకుఁ గొంతముందు కూలీలలో నొక్కని "దినమునకెంత"ని ప్రశ్నించి యుండెను. వాఁడును పదునైదు పెన్నీలని తెలిపెను. మఱునాఁడు తానా యూరు విడిచి పోవలసియుండుటచే, సాయంకాలమునఁ బనిగొన్నవాని దగ్గఱకేఁగి కూలి నడిగెను. అతఁడేమియు పలుకక యేడున్నఱ పెన్నీలిచ్చెను. జాన్‌వాల్జా వేసిన ప్రశ్నలకతఁడు "నీకిది చాలునులే" అనెను. జాన్ పట్టు పట్టెను. పనిగొన్నవాఁడతని కన్నులలోనికిఁ జూచి "లాకప్ వెదకుము!" అని యదలిఁగొట్టెను.

ఇక్కడను నన్ను దోఁచిరనుకొనెను.

సంఘము, ప్రభుత్వము—తన మిగులు ధనము తగ్గించి హోల్‌సేల్ దోఁపిడి చేసెను. ఇప్పుడు వ్యక్తుల వంతు. వారు రిటెయిల్ దోఁపిడి ప్రారంభించిరి.

స్వేచ్ఛ విముక్తి కాదు. ఖైదీ గాలీ విడిచి రావచ్చు. నెత్తికెక్కిన నిందపోదు.

దారిలో అతని యనుభవమిది. డి-లో అతడు పొందిన స్వాగతము మనము చూచియున్నాము.

# 9

క్రెతిడ్రల్ గడియారము రెండు కొట్టుసరికి నతఁడు మేల్కనెను. అతనిని లేపినది అతి సుఖశయ్య. ఇరువదేండ్లుగా పఱుపే యెఱుఁగఁడు. దుస్తులు మార్చుకున్నను, ఈ యనుభవము క్రొత్తదగుటచే నిద్ర రాలేదు.

ఇంచుమించు నాల్గు గంటలతఁడు నిద్రించెను. ఆయాస మంతరించినది. చాలసేపు విశ్రాంతి పుచ్చుకొను అలవాటతనికి లేదు.

కనులు తెఱచి, ఒక నిముసము చీకటిలోనికి చూచి, మఱల నిద్రింప యత్నించెను.

దినమంతయు నానా విధ సంక్షోభములకు గుఱియై, చిత్తము నిండియున్నపుడు మనమొకసారి నిద్రింపఁగలము. రెండవసారి యసాధ్యము. రెండవసారికంటె మొదటిసారి చాల సులభముగా నిద్రపట్టును. జాన్‌వాల్జా కట్లే జరిగినది. అతనికి మఱల నిద్ర పట్టలేదు. కావున ఆలోచింపసాగెను.

అతఁడప్పుడున్న చిత్త స్థితిలో భావములు తబ్బిబ్బగుచుండెను. మనస్తరంగములలో ఒక విధమైన ఆటుపోటులుండినవి. చాల ప్రాతవి, చాల క్రొత్తవియునైన స్మృతులు చిందరవందరగాఁ దేలియాడుచు నువ్వెత్తుగ లేచుచుఁ

దబ్బిబ్బుగ నొండొంటి నెదిరించుచుఁ, దమతమ యాకారములఁ గోల్పోవుచు, బుఱదయై కష్టగమనమైన యేటిలోని వానివలెఁ దుదకు నదృశ్యమగుచుండినది. ఎన్నో యోజనలు పుట్టినవి. ఒక్కటి మాత్ర మెడతెగక పొడసూపి, తక్కిన యన్నింటిని దఱిమివేయసాగినది. టేబులుమీఁద మగ్లోర్ అమర్చిన యాఱు వెండి ప్లేట్లను, పెద్ద గరిటెను నతఁడు చూచియుండెను.

ఆ పళ్లెము లతనిని పట్టుకొన్నవి. అవి యక్కడనే, కొన్నియడుగుల దూరమునందే యున్నవి. తాను పరుండి యున్న గదిలోనికి వచ్చునపుడు, దానికి ముందున్న గదిలో, పడక తలవైపున అల్మారాలో మగ్లోర్ వానిని దాచుచుండినది. అల్మారా నతడు గుర్తుంచుకొనెను—భోజనశాలనుండి వచ్చునపుడు, కుడివైపున. అవి ఘనమైనవి, ప్రాఁత వెండివి, గరిటెతోఁ గలిసి, అవి రెండువందల ఫ్రాంకుల వెల చేయును — పందొమ్మిదేండ్ల శ్రమచేఁ దాను సంపాదించినదానికి రెండంతలు. నిజమే! "గవర్నమెంటు" తన్ను "దోఁచ"కుండినచోఁ దాను సంపాదించిన దింకను అధికముగ నుండెడిది.

ఒక గంటసేపాతని మనస్సు హెచ్చుతగ్గులై తన్నుకొనెను. గడియారము మూఁడు కొట్టెను. కనులు తెఱచి, ఆత్రముతో లేచి, చేయి చాచి మూలలో తాను నిక్షిప్తము గావించియుండిన మూట తీసికొని, కాళ్లు విదలించి నేలపై నిడి, తనకుఁ దెలియకయే మంచముపైనఁ గూర్చుండి యుండెను.

కొంత ప్రొద్దాలోచనానుగ్నుఁడై యట్లే యుండెను. ఇంట నందఱు నిద్రించుచుండ, నితడు మాత్రము మేల్కొని

యిట్లు కూర్చుండియుండుటను ఆ మసకచీఁకటిలో నెవరేని చూచియుండిన, అమంగళము శంకించెడివారు. ఉన్నట్టుండి యతఁడు వంగి, జోళ్ళు తీసికొని, మంచము నెదుటి చాపపైన మెల్లగా వాని నుంచి, మఱల యోజనావిధిని గూర్చుండి, నిశ్చలుఁడయ్యెను.

ఆ భయంకర ధ్యానమున, మనము పేర్కొన్న భావములు విడువక కాతని మనస్సును బాధింపసాగెను. వచ్చుచుఁ, బోవుచు, మఱల మచ్చుచు నతిభారవంతమైనవి. ఆ స్థితిలో, తనతోడిదైన దీర్ఘమైన ప్రెవీని గుఱించి, ఎందులకో తనకుఁ దెలియకయే స్మరించెను. మనఃపరిభ్రమణమున కిట్టి యచింతిత మాధ్యము బరిపాటియే. ప్రెవీ నతడు గాలిలో నెఱఁగియుండెను. ప్రెవీ పరాయి, మెడను చుట్టిన యొక్క ప్రత్తిదారము ఆధారముగా నిలిచియుండెడిది. ఆ దారము జాన్‌వాల్డా స్మృతికి విడువక వచ్చుచుండినది.

• ఉదయమునఱకత డక్లేకూర్చుండి యుండెడివాఁడేమో. అఱగంట కొట్టిన శబ్దమతనిని గదలించెను. "ర"మ్మని గడియారము పిలుచుచుండినట్లు కన్పట్టెను.

నిలువఁబడి, ఒక నిముసము తటపటాయించి, చెవి రిక్కించి వినెను. ఇంట నంతయు నిశ్శబ్దము. కిటికీ తెలియుచుండెను. నేరుగా, జాగ్రతగా దానివంక నడచెను. రాత్రి యెక్కువ చీఁకటిగా లేదు. చంద్రుఁడు పూర్ణకళావిలసితుఁడై యుండెను. కాని, గాలి దీర్ఘమేఘము లతనిమీఁదఁ జిమ్ముచుండినది. దీనిచే, బయల నీడయు వెలుతురును, ఇంట మకమకని వెలుతురును గల్గుచుండెను. ఆ మకమక వెలుతు రతనికిఁ

ద్రోవ చూపఁజాలినది. కిటికీ సమీపించి, జాన్‌వాల్జా చూడ, కమ్ములు లేవు. దాని తలుపులు తోఁటవైపునఁ దెఱచుకొనును. ఒక మేకుతో, గాలికి పోకుండ మూసియుంపఁబడినవి. అతఁడు కిటికీ తెఱవఁగనే చలిగాలి చుఱకత్తివలె నిశితమై లోపలికి దూఱుటచేఁ, దలుపులు మూసివైచెను. తోఁటను బరిశోధనా దృష్టితోఁ జూచెను. తోఁటను జుట్టి తెల్ల గోడ యున్నది. అది పొట్టిది. ఒక గంతుతో దాట వీలగును. గోడ కావల, వృక్షాగ్రములు సమదూరమునఁ గన్పట్టుచుండినవి. కావున ఈ గోడ, యిరుప్రక్కల చెట్లునాఁటిన యొకసందును, తోఁటను వేఱుచేయునది యని యర్థమయ్యెను.

ఇది తెలియగనే, నిశ్చయమునకు వచ్చినవానివలె, వెనుదిరిగి, మూలకు వెళ్లి, మూట విప్పి, యేమో తీసికొని పరుపుపైనుంచి, చెప్పులను జేబులో నుంచుకొని, మూట కట్టి వేసి బుజముపై పెట్టుకొని, టోపీ కన్నులు కప్పునట్లు పెట్టుకొని, కట్టెనందుకొని దానిని కిటికీ మూలలోనుంచి, మఱల పరుపు సమీపించి, దానిపైనుంచిన వస్తువును దీసికొనెను. అది యినుపకడ్డీ. ఒక కొన బల్లెమువలె సూదిగా నుండినది.

ఈ యినుప కడ్డీ యెందుకుపయోగింపవలెనో ఆ చీకటిలోఁ దెలిసికొనుట కష్టము. అది మీటయా? దుడ్డుకఱ్ఱయా?

పగటివేళ, గని త్రవ్వుటకుపయోగించు కొఱముట్టని పించును. ఆ కాలమున, టూలన్ చుట్టునుండిన కొండలను త్రవ్వి రాళ్ళు తీయుటకై ఖైదీలకిట్టి సాధనముల నిచ్చెడివారు. అవి గట్టియినుము. ఒక కొనలో నిశితముగ నుండును.

దానిని దీసికొని, ఊపిరి బిగబట్టి, దొంగ యడుగులతో ముందు గదితలుపువంక నడిచెను. అది బిషప్ పడకగది యని మన మెఱుఁగుదుము. తలుపు సమీపింప, లోపల గడియ వేసి యుండలేదని తెలిసిపోయెను.

# 10

జాన్‌వాల్జా యొడలంతయుఁ జెవిచేసికొని వినెను.

తలుపు త్రోసెను.

పిల్లివలె పిఱికిగా రహస్యభంగము కాకుండునట్లు వ్రేలితోఁ ద్రోసెను. ఆ యొత్తిడికే, నిశ్శబ్దముగ, కదలిక తెలియకయే, తలుపు తెఱచుకొని, సందు పెద్దది చేసినది.

ఒక నిముసమాగి, కొంచెము ధైర్యముతో తలుపు నింకకొంత తెఱచెను.

క్రమక్రమముగ, సవ్వడి లేక తలుపు వెనుక కొగ్గెను. ఇప్పుడు లోని కేగుటకుఁ జాలినంత సందు కల్గినది. కాని తలుపు దగ్గఱ నొక బల్లయుండి. ప్రవేశించుట కెడమీయకుండెను.

జాన్‌వాల్జా ఆ యడ్డు గమనించెను. ఏమైనగానీ. సందు పెద్దదిచేసి తీఱవలెను.

అట్లు నిశ్చయించుకొని మూఁడవసారి బలముగా తలుపు త్రోసెను. ఈసారి త్రుప్పుపట్టిన కీలు, కొట్టినట్లు దీర్ఘముగ "కి"ఱ్ఱన్నది.

జాన్‌వాల్జా కంపించిపోయెను. ఈ కిఱ్ఱు బాకాశబ్దము వలె స్పష్టమై భయంకరమై అతని చెవులలో బ్రతిధ్వనించినది.

తొట్టతొలుత భ్రమ యతిశయించి, ఉన్నట్లుండి యీ

కీలు సజీవమై భయంకర స్వభావముదాల్చి, కుక్కవలె మొఱిగి యందఱను మేలుకొలిపి, ప్రబోధించుచున్నదా యనిపించెను.

మతి చలింప, నడఱుచు, నిలిచి మునిగాళ్ళపైనుండిన వాఁడు, చక్కగా నిల్చుండెను. కణతలు కొట్టుకొనసాగెను. గుహనుండి హోరుమని గాలి వీచునట్లు ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఒక్కుమ్మడి నెత్తి కొట్టెను. భూకంపమువలె ఈ పాపిష్ఠమైన కిఱ్ఱు ఇంటి నందరఱను లేపకుండుట అసాధ్యమనిపించెను. తనచేఁ ద్రోయఁబడిన తలుపు హెచ్చరిక చెంది యెల్లరను బిలిచినది. వృద్ధుఁడు లేచును. ఆ యిద్దరు వృద్ధస్త్రీలును గొంతు చించుకొందురు. సహాయము పరుగిడివచ్చును. ఒక కాల్గంటలో ఊరంతయు నిది తెలిసిపోవును. భటులు వత్తురు. ఇంకఁ దనగతి ముగిసినట్లే.

శిలా ప్రతిమవలె స్తంభించిపోయెను. కదలుటకు గుండె చాలలేదు. కొన్ని నిముసములు కడచెను. తలుపు పాఱఁ దెఱచుకొని యుండినది. ఎట్లో ధైర్యముచేసి, గదిలోని కొక్క చూపు బఱపెను. ఎట్టి సంచలనమును లేదు. ఎట్టి సవ్వడియు లేదు. కిఱ్ఱు ధ్వని యెవ్వరిని లేపలేదు.

ఈ ప్రథమాపాయము గడచిపోయినది. అయినను, అతనిలో భయానక సంఘర్షణ నిలువలేదు. అట్లయ్యు, అతఁడు వెనుకకుఁ దగ్గలేదు. తాను ముగిసిపోతి ననుకొన్నప్పుడును వెనుకకుఁ దగ్గలేదు. ఈ పని త్వరలో ముగింపవలెననియే యతని యోజన. ఒక్కడుగు వైచి గది ప్రవేశించెను.

అచ్చట గంభీర ప్రశాంతి నిండి యుండినది. బల్లపైని కాగితములు, తెఱచిన పుస్తకములు, స్టూలుపైనఁ జేర్చిన పుస్తకములు, బట్టలతో నిండిన వాలు కుర్చీ, పూజాపీఠము మున్నగు వస్తువులు, అక్కడక్కడ అస్పష్టములు అరూపములు నైన చీఁకటి కోణములలో తెల్ల మచ్చలవలె నుండినవి. గృహోపకరణములకు జాగ్రత్తగాఁ దొలఁగుచు జాన్‌వాల్జా ముందు నడచెను. గదియందా కొనలో సమమృదూచ్ఛ్వాస నిశ్వాసములు నిదురించుచుండిన బిషప్పునుండి వినవచ్చు చుండినవి.

తటాలున జాన్‌వాల్జా ఆగెను. బిషప్ పఱుపు దగ్గర తాను ఉండినాఁడు. అనుకొన్న దానికంటెఁ ద్వరగా నచ్చోటుఁ జేరుకొనినాఁడు.

ప్రకృతి యప్పుడప్పుడు తన పర్యవసానములను బైరూపములను మన పనులతోఁ గలిపివేయును. అట్లొనర్చు టలో, గంభీరమై యింగితమును తెలుపు సామంజస్యమిమిడి పర్యాలోచింప మనలను బలవంత పెట్టును. సుమారరఁగంట నుండి, యొక పెద్ద మేఘము ఆకాశమును జీఁకటితోఁ గప్పి వేసినది. జాన్‌వాల్జా, బిషప్ పఱుపు డగ్గరించిన వేళకు సరిగా, ఆ మేఘము చీలి, చంద్రకిరణ మొక్కటి కిటికీ దూరి, పాలిన బిషప్పు ముఖమును బ్రకాశ మొనర్చెను. శ్రీభారహితుఁడై నెమ్మదిగా నిద్రించుచుండినాఁడు. నిదురించుచుండియు మేల్కని యుండు నప్పటివలెనే, ఆల్ప్స్ పర్వత శీతాపనోదనార్థమై, దుస్తులన్నియు ధరించి పండుకొనియుండెను. నల్లని యున్ని యంగీ మణికట్టు వఱకును జేతులను గప్పియుండినది. గాఢ

నిద్రా బద్ధమైన ఆ తల తలగడపై నొకవంక కొక్కింతమొరిగి యుండినది. పఱుపుకొక ప్రక్క ఒక చేయి అసంఖ్య సత్కా ర్యములను, దానధర్మముల నొనర్చిన ఆచార్యాంగుళీయ కాలంకృతమై, జాఱియుండినది. ఆ యాకారమునందన్నిటం దృప్తి, ఆశ, సౌఖ్యము-అస్పష్టముగం బ్రదర్శించుచు నా మూర్తిని కాంతిమంతముగ నొనర్చుచుండినవి. అది హాస మాత్రము కాదు. అలౌకిక తేజఃప్రసారము. ఆ ఫాలభాగము మీఁద వర్ణనాసాధ్యమైన దృగ్గోచరము కాని వెలుగు ప్రతి ఫలించుచుండినది. ధర్మదక్షుల యాత్మలు నిద్రావస్థయందు నిగూఢ స్వర్గదృశ్యములు గాంచును. ఆ స్వర్గము ఆచార్యునిలోం బ్రతిఫలించి ప్రకాశించుచుండినది.

ఆ ప్రతిఫలించినదానిలో నిరుపమాన నైర్మల్య మున్నది. ఏలన, ఈ స్వర్గ మతనిలోనే యున్నది. అయ్యదియే యంతరాత్మ.

ఈ యాంతరిక తేజముపైనం జంద్రకిరణము ప్రసరించి, నిద్రాముద్రితుండైన ఆచార్యునిముఖము పరివేషమైనట్లుండినది. అది యతి మృదువై, అనిర్వచనీయమగు సంధ్యాకాంతివంటి దానిచేం గప్పబడియుండెను. ఆకసమునందుం జంద్రుండు, తూగు న్న ప్రకృతి, కదలి మెదలని యారామము, నెమ్మది నిండిన గృహము, ఆ గడియ, ఆ నిముసము, ఆ నిశ్శబ్దత-అన్నియు గలసి, ఆశా విశ్వాసముల నెలవై. ధవళాలకమై నిద్రా నిబిడ నేత్రమై పరిణతిగన్న మేధ పసిబాలుని గాఢ నిద్రయుం జూపు చున్న యా పూజ్యుని ముఖముపై పూజ్య విశ్రాంతిపై విచిత్ర

పవిత్ర వాగతీతమైన దేదో యొక్క- దాని నాదేశము చేసి, దివ్య స్వచ్ఛప్రభావము విజిజిమ్ముచుండినది.

మైమఱచిన యీ మహనీయునియందిట్లు దైవత్వము కన్పట్టుచుండెను.

ఆ యుజ్వలమూర్తిని గాంచి భయపడి, చైతన్యము దక్కి, చేత నినుపకడ్డీతో ఆ యస్పష్ట కాంతిలో జాన్‌వాల్జా నిటాలున నిల్చుండి యుండెను. ఆ మూర్తితోఁ బోల్పదగిన దానిని దేనినతఁడు చూచియుండ లేదు. ఈ నిశ్చయ జ్ఞాన మతనిని భయమున ముంచివేసెను. కష్టపీడితమై, కల్లోలితమై అకార్యము నాచరింపనున్న యంతరాత్మ ఒక సత్పురుషుని సుషుప్తిని గుఱించి యోజించుచుండిన యీ దృశ్యమును మించినది నైతిక ప్రపంచమున నాస్తి.

ఈ యేకాంతమునందలి యీ నిద్ర. జాన్‌వాల్జావంటి వంటి సాక్షి - యీ ద్వితయమునందొక మహోదాత్తత యున్నది. అస్పష్టముగనైనను, అతి బలముగ ఇది యతనికిఁ దోఁచుచుండినది.

అతనిలో నేమిజరుగుచుండెనో యెవ్వరును జెప్పఁ జాలరు. అతఁడే చెప్పజాలఁడు. దాని నవగాహము చేసికొనుటకు, నతి సౌమ్యసమక్షమున నత్యుగ్రత్వము నూహింపవలెను. అతని ముఖమున దేనిని నిదమిత్థమని విచక్షింపలేము. అదియొక విధమగు కృశించిన యాశ్చర్యభావము. దానినతఁడు గ్రహించెను. అంతే. కాని, అతని యాలోచన లెవ్వి? ఊహించుట యసాధ్యము. అతనిలో సంచలనము కలవరము కలిగినది. కాని దాని స్వభావ మెట్టిది?

వృద్ధుని ముఖముపైనుండి యతఁడు దృష్టి మఱల్పలేదు. అతని యాకార వైఖరులనుబట్టి, ఏదో విపరీతమగు అనిశ్చయత్వ మతనిలో నుండెనని తెల్లమగుచుండెను. వినష్టస్థానమా విముక్తస్థానమా యని యతఁడూగులాడుచుండెను. ఆ వృద్ధ మస్తకమును ఛేదించుటకో, అతనికడ మోకరిల్లుటకో సిద్ధముగ నున్నవానివలెఁ గన్పట్టెను.

కొన్ని నిముసములలో, తిన్నగా నెడమచేతిని పైకెత్తి టోపీ తీసి, మఱల తిన్నగా ఆ చేయి దించి జాన్‌వాల్జా ఎడమ చేత టోపీ, కుడిచేత యినుప కడ్డీ పట్టుకొని, భయంకరమైన ముఖముపై వెండ్రుకలు జీరాడ, మఱల ఆలోచింపనారంభించెను.

ఆ ఘోర దృష్టిపాతమున బిషప్ ఇంకను గాఢనిద్రావశుఁడై యుండెను.

గోడపైని సిలువ, చంద్ర ప్రకాశమున తళతళ మనుచునే యున్నది. దాని హస్తములలో నొక్కటి యొకరి నాశీర్వదించుచుండినట్లును, ఇంకొక్కటి యొకరికి క్షమాప్రదానము చేయుచుండినట్లును ఉండినవి.

తటాలున జాన్‌వాల్జా టోపీ తలపై నిడుకొని, బిషప్ [illegible]క చూడక త్వరగా గూడుచేరి, యినుప యూచ నెత్తెను. [illegible]ని, తాళముచెవి తలుపునకే యుండినది. తలుపు తెఱచెను. వెండిప్లేట్ల బుట్ట వెంటనే కంటఁబడెను. దానిని దీసికొని, శబ్దభయములేక పెద్దయంగలతో గది గడచి, తలుపుతీసి మరల పూజాగృహముచేరి, తన చేతి కఱ్ఱతీసికొని, వెలువడి, బుట్టపారవైచి, యుద్యానమున పరుగిడి, పులివలె గోడదాఁటి యుఱికెను.

# 11

మఱునాడు, సూర్యోదయ సమయమున ఆచార్యుఁడుద్యానమున పచారు సల్పుచుండెను. మగ్లోర్ పిచ్చిపట్టినదానివలెఁ బరుగిడి వచ్చెను.

"స్వామీ! స్వామీ! వెండిపళ్లెముల బుట్ట యెక్కడ నున్నదో తమకుఁ దెలియునా?"

"ఆఁ."

"అమ్మయ్య! ఏమైనదో తెలియక కొట్టుకొనుచుంటిని!"

బిషప్ ఇంతకుముందే దానినొక పాదులో చూచియుండెను. దానిని మగ్లోర్‌కిచ్చుచు "ఇదిగో" అనెను.

"సరే, దీనిలో ఏమియులేదు. వెండిసామానులో?"

"ఆహా, నిన్ను పీడించుచున్నదదియా? నాకుఁ దెలియదవి యెక్కడ నున్నవో."

"అయ్యో దేవుఁడా! అవి దొంగతనమైపోయినవి. రాత్రి వచ్చినవాఁడు వానిని మోసికొనిపోయినాఁడు."

తెప్పపాటు కాలమున కావల, తన వయస్సు పోనిచ్చినంత వేగముగ, మగ్లోర్ పూజాగృహమునకుఁ బరువెత్తి మఱల బిషప్పుకడకు పరుగిడివచ్చెను. బుట్టపడి నలిపిన యొక మొక్కపైన ఆచార్యుఁడు విషాద దృష్టి నిలిపి యుండెను. "స్వామీ, ఆ మనుష్యుఁడు పోయినాఁడు! వెండి దొంగిలించుకొనిపోయినాఁడు" అని మగ్లోర్ అఱువగా నామెవైపు తిరిగెను.

ఒక నిముసమూరకుండి, గాంభీర్యము మార్దవము నొలుక "ముందీమాట చెప్పు. ఆ వెండి మనదా?" అని ప్రశ్నించెను.

మగ్లోర్ పలకలేదు. నిముసమాగి బిషప్ మరల "చాలకాలమునుండి యీ వెండి వస్తువులను అన్యాయముగ దాచియుంచితిని. అవి బీదలవి. ఆ మనుష్యుఁడెవఁడు? నిజముపేద కదా?" అని యడిగెను.

"అయ్యో, అయ్యో! నాకొఱకుఁగాదు – అమ్మగారి కొఱకుఁగాదు. ఎట్లైనను మాకొకటే. రేపటినుండి స్వామి దేనిలో భుజించును?"

బిషప్ ఆశ్చర్యముతోఁజూచి యిట్లనెను. "ఏమి? సత్తు పాత్రలు లేవా?"

"సత్తు గబ్బు కొట్టును."

"అట్లయిన, ఇనుప ప్లేట్లు."

"ఇనుము దాని రుచి కల్పించును."

"అయినచో కొయ్యప్లేట్లలో తిందును."

పిదపఁ గొన్నినిముసములకు, గతరాత్రి జాన్‌వాల్జా కూర్చుండి భుజించినచోటనే కూర్చుండి, బిషప్ ప్రాతఃకాల భోజనము చేయుచుండెను. తినునప్పుడు, పలుకని బాప్టిస్టిన్‌తో గొణుఁగుచుండిన మగ్లోర్‌తోఁ బరియాచకములాడుచు బిషప్ "బ్రెడ్డుముక్కలను పాలలో అద్ది తినుటకు చెక్కప్లేటెందుకు?" అనెను.

అన్నచెల్లెండ్లు టేబుల్ కడనుండి లేచునపుడు, తలు పెవరో తట్టిరి.

"దయచేయుఁడు" అని బిషప్ ఆహ్వానించెను.

తలుపు తెఱచుకొనెను. విపరీత భయంకర వ్యక్తులు కడపకడఁ దోఁచిరి. ముగ్గురొక్కని మెడ పట్టుకొని యుండిరి. ఆ ముగ్గురును భటులు. నాల్గవవాడు జాన్‌వాల్జా!

భటులపెద్ద తలుపు దగ్గఱనుండెను. అతఁడు బిషప్పును సమీపించి సైనికవిధానమున వందనమొనర్చెను. "స్వామీ!"–

ఆ సంబోధనమును విని, చిఱచిఱలాడుచు అంతయు మునిఁగినవానివలె నుండిన జాన్‌వాల్జా, భ్రమాన్వడినవానివలెఁ దలపైకెత్తి "స్వామి? ఈయన క్యూరేకాఁడా?" అని గొణిఁగెను.

"నోర్మూయ్! స్వామియే. బిషప్" అని భటుఁడు గద్దించెను.

ఈలోఁగా, ఆచార్యుఁడు త్వరత్వరగా జాన్‌వాల్జాను సమీపించి "ఆహా. వచ్చినావా! సంతోషము! దీపస్తంభము లనుకూడ ఇచ్చితిని కదా. అవియు వెండివే. రెండువందల ఫ్రాంకులు చేయును. నీ ప్లేట్లతో వానినిగూడ నేలతీసికొని పోలేదు?" అని ప్రశ్నించెను.

జాన్‌వాల్జా కనులు తెఱచి, మానవ జిహ్వ వర్ణింప నేఱని ముఖవైఖరితో బిషప్ దెసఁ జూచెను.

అప్పుడు భటులపెద్ద యిట్లనెను. "స్వామీ! అయిన ఈ మనుష్యుఁడు చెప్పినది నిజమే? మేమతనిని జూచితిమి. పాఱి పోవుచున్నవానివలెఁ గన్పట్టెను. పట్టుకొంటిమి. ఈ వెండి పళ్లెములతని దగ్గఱ నుండినవి."

హాసన్ముఖమున బిషప్ అందుకొనెను. "గతరాత్రి తనకన్నము పెట్టిన వృద్ధ గురువు తనకిచ్చెనని యతఁడు

చెప్పెను. మీరతనిని బంధించి మరల ఇక్కడికిఁ దోడ్తెచ్చిరి? ఇదియంతయు పొఱపాటు. నాకర్థమైనది.''

''అయిన, అతనిని వదలివేయవచ్చునా?''

''నిస్సందేహముగ.''

భటులు జాన్‌వాల్జాను వదలివేసిరి. అతఁడు వెనుకకొత్తిగిలి ''నన్ను వదలివేయుట నిజమేనా?'' అని నిద్రలోఁ బలుకుచున్న వానివలె, అవ్యక్త ధ్వనితో గొణిఁగెను.

''అవును, పోవచ్చును. అర్థము కాలేదా?'' అని భటుఁడడిగెను.

''నాయనా! పోవుటకు ముందు, నీ దీపస్తంభములను దీసికొని పొమ్ము. ఇవిగో'' అని బిషప్ పలికి, దీపస్తంభములను జాన్‌వాల్జా కడకుఁ దెచ్చెను.

జాన్‌వాల్జాం ఆపాదమస్తకము కంపించిపోవుచుండెను. యంత్రము విధానమున ఆటవికునివలె రజత దీపస్తంభములను గైకొనెను.

''నాయనా, శాంతమతివై పొమ్ము. ఇంకొకసారి వచ్చునపుడు తోట దోవను రావలసిన పనిలేదు. ఎప్పుడును వీధి వెంట వచ్చి పోవచ్చును. రేయుంబగళ్ళు తలుపూరక చేరవేసియుండును'' అని, భటులవంకఁ దిరిగి ''అయ్యలారా! మీరింకఁ బోవచ్చును'' అనెను. వారు వెడలిపోయిరి.

జాన్‌వాల్జా స్పృహ తప్పుచున్న వానివలె నయ్యెను.

ఆచార్యుఁడతనిని సమీపించి, తిన్నని గొంతుతో ''మఱచిపోకుము. 'ఈ ధనమును సత్యాత్ముఁడ నగుట

నుపయోగించెద'నని నాకుఁ బ్రమాణము చేసినట్లు మఱచి పోకుము" అని యుత్తరించెను.

జాన్‌వాల్జాకు ఈ ప్రమాణము జ్ఞప్తి లేదు. అతడు కళవళము చెందెను. ఆచార్యుఁడా మాట నూఁదిపలికెను. గంభీరుఁడై మఱియు నిట్లనెను. "తమ్ముఁడా, జాన్‌వాల్జా! నీ వింక దుష్పథుఁడవు కావు, సన్మార్గుఁడవు. నీ యాత్మను నీ కయ్యె కొనుచున్నాను. దానిని, దురాలోచనలనుండి, వినాశకర స్వభావమునుండి గ్రహించి ఈశ్వరుని కర్పించుచున్నాను!"

# 12

తప్పించు కొనుచున్న వానివలె జాన్‌వాల్జా నగర బహిః ప్రదేశము చేరుకొనెను. సాధ్యమైనంత త్వరగాఁ, జిక్కిన సందుగొందులలోఁబడి, ప్రతి నిముషమును బోయినవైపే మఱల వచ్చుచుండుటైన గ్రహింపలేక, ఉదయమంతయుఁ దిరిగెను. ఏమియుఁ దినలేదు. ఆఁకలియే యెఱుగఁడు. ఏవో నూతన సంక్షోభములు గుంపులు గుంపులై నలిపివేయ సాగినవి. కోపము వచ్చినది. ఎవరిపైనో యెఱుఁగఁడు. అనురాగమునకా, అవమానమునకా తాను గుఱియైనది? చెప్పఁ జాలకుండెను. అప్పుడప్పు డతనికస్వాభావికమైపోయిన ఆర్ద్రిత హృదయమునఁ బొడసూప సాగినది. దానితో నతఁడు పోరాడు చుండెను. ఇరువదేండ్లుగాఁ దాను పొందిన కాఠిన్యమును దాని కెదురు నిలిపెను. అతనికి విధి యేర్పఱచిన విధానమునందొక 'యన్యాయ' ముండినది. తత్ఫలితముగ నతనిలో నొక భీకర నిశ్చంచలత్వము కుదురుకొని యుండెను. ఇప్పుడది జాఱిపో

నారంభించినది. అందుచే నతని నెమ్మది చెడిపోవుచుండెను. దాని స్థానమున నేమిరానలెనని ప్రశ్నించుకొనెను. జెయిలులోనే యుండిన, ఇదియంతయు జరిగియుండదుకదా, ఈ మనఃకల్లోలము లేకుండెడిది కదా అని యొకొక్కప్పుడు మనఃపూర్తిగనే కోరుకొనును. కాలము మీాఱినను, అక్కడక్కడఁ బొదలలో నాలస్యముగ వికసించిన పూవులుండినవి. ఆ సువాసనలు, శైశవ స్మృతులను రేకెత్తించెను. ఈ స్మృతులాధార శూన్యములై పోయినవి. ఎన్నేండ్లైనవవి జరిగి?

వాకొనరాని యోచనలిట్లు దినమంతయు మనస్సునఁ గూఁడుచుండినవి.

సూర్యుఁడు పశ్చిమ సముద్రమునఁ గ్రుంకఁబోవుచున్నపుడు, గులకరాయికూడ దీర్ఘచ్ఛాయలు బఱపుచున్నపుడు, ఒక పొద వెనుక అరుణవర్ణ సమతలమునఁ గూర్చుండియుండెను. అదియొక యెడారి. ఆల్ప్స్ దాని హద్దునలెనున్నది. మధ్యనెందును జర్చి గోపుర శిఖరమైన లేదు. అక్కడికిని డీ-కిని కొన్ని గ్రామడలుండును. పొదకుఁ గొన్ని యడుగుల దూరమునందున్న కాలిబాట సమతలమున అడ్డముగా పోవును.

ఆ ధ్యానము, ఆ పేలికలును ఎవరికైన వెఱుగుఁ గొలుపును.

ఆ ధ్యానమునందును, నతడొక యానందకంఠము విని, ఆ వైపు తల త్రిప్పెను. కాలిబాటనుండి, పది పన్నెండేండ్ల వాఁడొక యాటవికుఁడు చిత్తారు చేఁటూని పాడుచు వీపున

చిన్న పెట్టె వ్రేలుచుండ వచ్చుచుండెను. ఆ జాతివారొక చోటినుండి యింకొంటికిఁ ద్రిమ్మరుచుందురు.

అప్పుడప్పుడా బాలుఁడు పాటనిలిపి, కొన్ని నాణెము లెగురవేయుచుండెను. వాని యాస్తియంతయు అవేయై యుండును. ఆ నాణెములలో ఒక ఫ్రాంకును ఉండినది.

జాన్‌వాల్జాను చూడకయే వాఁడు పొద దగ్గఱ నిలిచెను. నాణెముల నెగురవేసి అన్నింటిని అఱచేయి వెనుకఁ బట్టుకొనఁ జూచుచుండెను. ఆ ప్రయత్నమున ఫ్రాంకు క్రిందపడి దొర్లుచు జాన్‌వాల్జా దగ్గఱకుఁ బోయెను. అతఁడు దానిపై పాదముంచెను. బాలుఁడు నాణెమును కంటితో వెన్నాడి యెక్కడికేగెనో చూచెను. నిర్భయుఁడై ఆ మనుష్యుని సమీపించెను.

అది, పూర్తిగా నిర్జనస్థలము. కనుచూపు పాఱినంతలో సమతలమునగాని, బాటలో కాని మనుష్యులే లేరు. ఆకాశమున చాలయెత్తునఁ బర్వెత్తుచున్న పక్షుల మంద కూజితములు తప్ప, వేఱొట్టి సవ్వడియు లేదు. బాలుని వీపు సూర్యుని వైపుండుటచే అతని శిరోజములు బంగారు తీగలట్లుండెను. జాన్‌వాల్జా కిరాతముఖమునకొక భయంకరారుణకాంతి వచ్చినది.

అజ్ఞానామాయికత్వముల సమ్మేళనమగు శైశవ విశ్వాసముతో ఆ బాలుఁడు "అయ్యా, నా ఫ్రాంకు" అనెను.

"నీ పేరేమి?" అని జాన్‌వాల్జా ప్రశ్నించెను.

"పెటీగెర్వా."

"పో యిక్కడినుండి."

"అయ్యా, నా ఫ్రాంకిచ్చివేయుము."

జాన్‌వాల్జా తల వంచి పలుకఁడయ్యెను.

బాలుఁడు విడువలేదు. "నా ఫ్రాంకు, అయ్యా-"

జాన్‌వాల్జా దృష్టి భూమిపై నాటుకొని పోయినది.

"నా ఫ్రాంకు! నా తెల్లని నాణెము! నా వెండి నాణెము!" అని బాలుఁడు కేకలు పెట్టెను.

జాన్‌వాల్జా అర్థము చేసికొన్నట్టు లేదు. బాలుఁడతని బ్లౌజు మెడపట్టి పట్టుకొని యూఁపెను. తన పెన్నిధిని త్రొక్కి-పట్టియున్న ఆ దృఢ పాదమును కదలింప యత్నించుచు "ఫ్రాంకు! ఫ్రాంకు!" అని యేడువసాగెను.

జాన్‌వాల్జా తల పైకెత్తెను. ఇంకను గూర్చుండియే యున్నాఁడు. ఆ దృష్టి సంక్షోభితమై యున్నది. ఆశ్చర్యపడిన వానివలె బాలునిఁజూచి, కట్టినందుకొని "ఎవరిక్కడ?" అని ఘోరగర్జ కావించెను.

"నేనయ్యా, పెటీగెర్వా! నేను! నేను! నా ఫ్రాంకిచ్చి వేయుము, దయచేసి! కాలు తీవయ్యా, తీ" అని కుపితుఁడై "తీ, కాలు తీసెదవా లేదా? ఏల తీయవు?" అని జడిపించెను.

జాన్‌వాల్జా రభసముతో లేచి నిల్చుండి, కాలు కదల్పక "ఆహా, ఇంకను నిక్కడనే యున్నావా? జాగ్రత్త!" అనెను.

బాలుఁడు భీతుఁడై చూచెను. అతని దేహమాపాద మస్తకము కంపించినది. రెండుక్షణములు కొయ్యవారినట్లుండి, అఱచుటకును ధైర్యములేక, వెనుకకు దిరిగిచూడక కాలికొలది పరుగెత్తెను.

కొంతదూరము పోయి, ఊపిరి సల్పుకొన నిలచెను. ఆలోచనాధీనుఁడై యున్నప్పటికిని జాన్‌వాల్జాకు ఏడుపు విని

పించెను. కొన్నినిముసములకా బాలుఁడెటకో పోయెను. సూర్యుఁడ_స్తమించెను.

జాన్‌వాల్జాను చీఁకట్లు చుట్టుకొనసాగినవి. ఆ దిన మంతయు పస్తు. సన్నని జ్వరమును గాచుచుండినది.

బాలుఁడు పఱుగిడినదిమొదలు నిల్చుండియే యుండెను. వైఖరినైన మార్చలేదు. పది పన్నెండడుగుల దూరపు నేలపై దృష్టి నిలిపియుండెను. అక్కడ నీలవర్ణపు వంటపాత్ర ముక్క పడియుండినది. దానినే తదేక ధ్యానమునఁ బరిశీలించుచుండి నట్లుండినాఁడు. ఉన్నట్లుండి యదలిపడెను. నిశాశీతవాయువు చబుకుతోఁ గొట్టినట్లు వీచినది.

టోపీని ఫాలముపై కీడ్చుకొని, నిర్జీవముగ అంగరకా గుండీలు తగిలించుకొనుచు, ముందుకడుగిడి కఱ్ఱనెత్తికొన వంగెను.

అప్పుడు గులకరాళ్ళ మధ్య, మిలమిల మెఱయుచు ఫ్రాంకు కన్పట్టెను. ఆ దర్శనము విద్యుత్ప్రసారమువలెఁ బని చేసినది. "ఏమిది?" యని పెదవులలోనే గొణిఁగికొని, ఒకటి రెండడుగులు వెనుక కేగెను. ఆ చీఁకటిలో తళతళలాడు చుండిన నాణెమొక అనిమిషనేత్రమై తనవంకకే చూచు నట్లయి, దానినుండి కన్ను మఱల్చుటకతని కసాధ్యమైనది.

కొన్నినిముసముల కవ్వల, వడఁకుచు నెగిరి ఫ్రాంకు గైకొని, సమతలమున నన్నిదెసలను గంప్లుచించుకొని చూచెను. విశ్రామస్థానమును వెదకుచున్న భీతహరిణమువలె నతఁడు కంపించిపోవుచుండెను.

ఏమియుఁ గన్పడలేదు. రాత్రి పడుచున్నది. వివిక్త

సమతలమున, మకమకమను నక్షత్రకాంతిలోఁ జలియు మంచు పొగలును ముంచుకొని వచ్చుచున్నవి.

జాన్‌వాల్జా అఱవగలిగినంత గట్టిగా "పెటీగెర్వా! పెటీగెర్వా!" అని పిలచి, చెవి యొగ్గెను. జవాబు లేదు.

ఆ ప్రదేశమంతయు శూన్యమై అంధకారమున మున్గి యున్నది. అన్నిదిక్కులం దాకాశము. పిలుపు చూపులు దానిలో మాయమైనవి.

ఉత్తర వాయువులు చీల్చుకొని వచ్చి, చుట్టుప్రక్కల జీవితములును కష్ట మొనర్చుచుండినవి. నమ్మనటకు వీలు కానంత తీవ్రతతోఁ బొదలు తమ చిన్ని చేతులను త్రిప్పసాగి నవి. ఎవరినో బెదరించుచు వెన్నాడుచుండినట్లుండెను.

అతఁడు మఱల నడువ మొదలిడెను. నడకను బరుగు స్థాయికిఁ దెచ్చెను. అప్పుడప్పుడు నిలిచి, ఆ యేకాంతమున, భీతనిరాశాకంఠమున "పెటీగెర్వా! పెటీగెర్వా!" యని కుయ్యిడును.

బాలుఁడు వినియుండినను, భయపడి దాగుకొని యుండును. కాని, అతఁడు చాల దూరమేగియుండును.

మతబోధకుఁడొకఁడు గుఱ్ఱమెక్కి, జాన్‌వాల్జా కెదురు వచ్చెను. "అయ్యా, ఒక బాలుఁడు మీకెదురయ్యెనా?" అని జాన్‌వాల్జా ప్రశ్నించెను.

"లేదు."

"వాని పేరు పెటీగెర్వా."

"నే నెవ్వరినైనఁ జూడలేదు."

జాన్‌వాల్జా రెండైదు ఫ్రాంకుల నాణెములు తీసి,

బోధకునికిచ్చుచు "అయ్యా, దీనిని మీ పేదలకిందు...ఆ బాలునికిఁ బదేండ్లుండును. వీపునఁ బెట్టె, చేత చితారుండును. ఇక్లే పోయినాఁడు. ఆటవికుఁడు" అనెను.

"నేనట్టి వానిని జూడలేదు."

"వాని పల్లె యిక్కడనే యెందైననుండునా? చెప్పఁ గలరా?"

"మీ మాటలనుబట్టి చూచిన, వాఁడు విదేశీయుఁడని పించును. వారు తిరుగుచుందురు. ఎవ్వరును వారి నెఱుఁగరు."

జాన్‌వాల్జా మఱి రెండైదుఫ్రాంకుల నాణెములను త్వరగా తీసి, బోధకునికిచ్చి "బీదలకు" అని, భయంకరముగ "గురూ! నన్ను ఖైదు చేయింపుము. నేను దారి దోపిడి గాఁడను" అని పల్కెను.

గురువు గుఱ్ఱమును తాడించి యతి భయమునఁ పరు గెత్తించెను.

త్రోవటి దెసయందే జాన్‌వాల్జా మఱల పరుగిడ సాగెను.

ఈ విధమున, అఱచుచుఁ బిలుచుచు దిక్కులు చూచుచు చాల దూరమరిగెను. రెండు మూఁడుసారులు, ఎవరో పండుకొని యున్నట్లును నక్కి యున్నట్లును దోఁపగా, దారి విడిచి చూచెను. అవి పొదలో, మట్టిదిబ్బలో. కడపట మూఁడు దోవ లొకచోట కలిసిన చోటికి వచ్చి ఆగెను. అప్పటికిఁ జంద్రోదయమైనది. దూరమున దృష్టి సారించి "పెటీగెర్వా" యని నాల్గుసార్లు గొంతెత్తి పిలచెను. ఆ పిలుపులు ప్రతిధ్వనియైన లేక మంచుపొగలో కలిసిపోయెను.

మఱల అస్పష్టధ్వనితో దుర్బలముగ గొణిఁగినట్లు "పెటీ గెర్వా" యని పిలచెను. అదే కడపటి యత్నము. దుష్టమైన యంతరాత్మ బలమునఁ గూలినట్లు, ఏదో యదృష్టశక్తి యొక్క దెబ్బతోఁ బడద్రోసినట్లు, అతని మోకాళ్ళు వంగి కుదిలపడెను. అలసి యొక్క పెద్ద రాతిపై బడి, రెండు చేతులతోఁ దల పట్టుకొని, తల మోకాళ్ళపై నూని "ఎంత నికృష్టుఁడను!" అని యటమటించెను.

హృదయము పొంగి, కన్నీళ్ళాగక ధారలు కట్టినవి. పందొమ్మిదేండ్లకిదే మొదటిసారి యేడ్చుట.

బిషప్ గృహమును వీడినపుడు జాన్‌వాల్జానుఁ దన మనఃస్థితి తెలియదని యిదివఱకే చెప్పితిమి. తనలో నేమి జరుగుచుండినదో యెఱుగఁడు. ఆ వృద్ధుని దివ్యకృత్యములకు, మృదువచనములకును మూర్ఖముగా ఎదురు తిరిగెను. "సత్యాత్ముఁడవగుటకు బాస చేసితివి. నీ యాత్మను గొనుచున్నాను. కుటిల స్వభావమునుండి దానినిపట్టి, సర్వేశ్వరుని కర్పించు చున్నాను." ఈ పలుకులు ప్రతి క్షణమును చెవులలోఁ బ్రతి ధ్వనించుచున్నవి. ఈ దివ్యసౌకుమార్యము నతఁడు, అహంకారముచే నెదిరించెను. మానవుని దౌష్ట్యమున కహంకారమే కోట. ఈ యాచార్యుని క్షమ కఠినాతికఠినాఘాతమని మహా నిష్ఠుర ప్రతిఘటన యనియు జూచాయగా నతనికిఁ దోఁచినది. ఈ దయకు లొంగకున్న తన హృదయ కాఠిన్య మినుమడించును. పరిపూర్ణత్వము గాంచును. లొంగెనా, యిన్నేండ్లుగాఁ దమ క్రూరకార్యములచే లోకులతనిలో దృఢపఱచిన

ద్వేషమును విసర్జింపవలెను. ఈసారి తాను జయింపవలెను. లేదా జయింపఁబడవలెను. తన క్రౌర్యమునకును, ఆచార్యుని కరుణకును మధ్య ప్రారంభమైన యీ యుద్ధము మహత్తరము, పరిష్కారకమును.

ఇట్టిస్థితియందఁతఁడు తప్పఁద్రాగినవానివలెఁ బ్రవర్తించుచుండెను. ఇట్లు గుంటకన్నులువడి నడచునపుడు, డి-లో జరిగిన సంఘటన ఫలమేమో అతనికి స్పష్టముగాఁ దెలియునా? కొన్ని వేళల అవేద్య మంద మృదు స్వనములు జీవునిఁ బ్రబోధించునందురు. అతఁడు వినెనా? నీ విధి విధానమునఁ బరిష్కారక ఘటికను ఇప్పుడే 'కడచితివని, అటుపై ఉత్తమ మానవుఁడు కాకున్న నికృష్టుఁడు కావలెనని, బిషప్ కంటె ఉన్నతుఁడగుటో గాలె బానిసకంటే నీచుఁడగుటో సంభవింపవలెనని, దివ్యత్వమునో పిశాచత్వమునో పొందవలెనని, ఏదేని ధ్వని చెవినూఁదెనా?

ఇంతకుముందింకొకచో నడిగిన ప్రశ్నలనే మనమిక్కడ పురశ్చరణ చేయవలెను. ఈ యన్నింటి నీడ తబ్బిబ్బులుగనైన అతని మనస్సును సోకినదా? దురదృష్టము బుద్ధినైశిత్యమునకు పదును బెట్టుట నిక్కమే. కాని, మనమిక్కడ వివరించుచున్నదంతయు జాన్‌వాల్జా బుద్ధి గ్రహించుస్థితిలో నుండెనా యనుట సందేహాస్పదమే. ఈ యోజన లతనికిఁ దోఁచినను, అది క్షణికము. తత్ఫలము చెప్పరాని, విషాదకరమగు కళవళము. దుష్కృతము, దుఃఖదమునైన గాలీనుండి వెలువడిన వెంటనే, బిషప్ అతని జీవుని గాయపఱచెను. చీఁకటినుండి వెలువడినవానికి పెద్ద వెలుఁగు కనులు గ్రుచ్చును. అతనికి

జూపఁబడిన పరిశుద్ధము, ప్రకాశమానమునగు భవిష్యజ్జీవితము కంపమెత్తించి వ్యాకులము కల్గించెను. తానెక్కడనుండెనో యెఱుఁగడు. హఠాత్సూర్యోదయముఁగన్న గూబవలె, ధర్మనిష్ఠాదర్శనమునుచే యీ ఖైదీ కనులు మిఱుమిట్లుగన్నవి.

అతఁడు మున్నటివాఁడుకాఁడు. అతనిలోనిదంతయు మాఱిపోయినది. అతనితో బిషప్ పలికినదానిని, ఆతనిని బిషప్ స్పృశించుటను అడ్డగించుటతనికిఁ జేతకానివి. ఇది సునిశ్చయము. దీనినతఁడును సందేహింపలేదు.

ఇట్టిమనోధర్మమున్నపు డతఁడు పెటీగెర్వాను జూచుట తటస్థించెను. త్రాంకు దొంగిలించెను. ఏల? తానే వివరింపఁజాలడు, తథ్యము. అది, గాలీనుండి యతఁడు తెచ్చిన చిత్తవృత్తియొక్క యంత్యఫలమా? ప్రేరణశేషమా? అదియే. అంతకంటెఁ దక్కువయుఁ గావచ్చు. దొంగిలించినదతఁడు కాదు. మనుష్యుఁడు దొంగిలింపలేదు. పశువు దొంగిలించినది. అలవాటుచేత, సహజ ప్రేరణచేత ఎన్నో నూతనములు అవేద్యములునైన శక్తులతో బుద్ధి పోఱుచున్నపుడు, పశువు తెలివిమాలి కాలు నాణెముపై నుంచినది. బుద్ధి తెలిసి యీ పశుకృత్యమును జూడగనే జాన్‌వాల్జా వేదనా సంకుచితుఁడై సహింపలేక అఱచెను.

అదియొక విపరీత దృశ్యము. అతఁడప్పుడుండిన స్థితిలోనే సాధ్యమగునది. కాని వాస్తవమేమన, ఆ బాలుని నాణెము దొంగిలించుటలో, అతఁడిఁకమీఁదఁ దాను చేయఁజాలని పని చేసెను.

ఏది యెట్లైనను ఈ తుది యపరాధ ఫలము పరిష్కారక

మైనట్టిది. అతని సంకుచబుద్ధిని బ్రవేశించి దానిని డీల్పఁజేచి, వెలుఁగు నొకప్రక్క చీఁకటినింకొక ప్రక్క విడఁదీసినది.

తొట్ట తొలుత ఆత్మపరీక్ష చేసికొనుటకు ముందు, ఆలోచించుటకు ముందు మతి చెడి తప్పించుకొనఁజూచు వాని వలె, బాలుని కన్గొని నాణెము నిచ్చివేయఁ జూచినాడు. అదియసాధ్యమని తెలియగనే నిరాశుఁడయ్యెను. "నేనెంత నికృష్టుఁడను!" అని యాక్రోశించిన క్షణమునఁ, దన గతరూపమును జూచి దానినుండి వేఱై, తానొక దేహ విముక్త ప్రాణమువలె నయ్యెను. తన యెదుట శల్యమాంసములతోఁ, జేతకఱ్ఱ, వీపున మూట, దాని నిండుగ దొంగిలింపఁబడిన వస్తువులు, విషాదకఠిన వదనము, ఏహ్యము పుట్టించు ఉద్దేశ్యములతో నిండిన తలగల వికృతరూపుఁడు,గాలీ బానిస, జాన్ వాల్జా పొడకట్టెను.

మితిమించిన కష్టము లతనిని భ్రామికునిగాఁ జేసినవి. ఇదియు నొక భ్రమ కల్పిత దృశ్యమువలెనుండినది. ఈ జాన్ వాల్జా, అతని యమంగళ వదనమును నెట్టయెదుటఁ జూచి, ఎవఁడితఁడని ప్రశ్నించుకొనఁబోయి, ఆ దృశ్యముచే భయతాడితుఁడయ్యెను.

మహా సంక్షుభితమైన అతని మేధలో అతి ప్రశాంతియు కూడి, వాస్తవమును మ్రింగివేయు గాఢ మనఃకల్పనలకుఁ జోటిచ్చినది. ఆ స్థితిలోనున్న వారికిఁ బరిసర వస్తువులు కనఁబడవు. మానసిక రూపములు, బాహిరవస్తువుల వలెనే కన్పట్టును.

అతఁడు, తన్ను తానే ముఖాముఖి చూచెను. ఆ భ్రమ

లోనే, అగణిత దూరమున, ఒక విధమైన వెలుతురు కాన వచ్చినది. మొదట దాని నతడు దివిటీ యనుకొనెను. అంత రాత్మపై నుదయించిన యీ వెలుఁగును బరిశీలింపఁగా అది మానవాకారమైనట్లును, ఆ యాకారము బిషప్పుదైనట్లును గ్రహించెను.

ఎదుర నెదుర నిల్చుకొనియున్న ఈ మనుష్యుల నిద్దరను—బిషప్ జాన్‌వాల్జాలను అతని యంతరాత్మ తూకము వేయ సాగెను. మొదటిదానికంటెఁ బరమాణువంత తక్కువైన దైనను, రెండవదానిని మెత్తపఱచి యుండఁజాలదు. ఈ ధ్యాన మధికమగుచుఁ బోఁగా బిషప్ అధికాధిక ప్రకాశమానుఁ డయ్యెను. జాన్‌వాల్జా తగ్గుచుఁ గ్రమముగా నదృశ్యుఁడయ్యెను. ఆచార్యుఁడే నిల్చెను. ఇట్టి పారవశ్య ఫలమిట్టి యలౌకికమే.

బిషప్ ఆ నిర్భాగ్యుని యాత్మనంతటిని దేదీప్యమాన ప్రకాశములో ముంచి నింపివేసెను.

జాన్‌వాల్జా చాల సేపేడ్చెను. నిప్పుకణములవంటి కన్నీళ్ళు కార్చెను. అబలకంటె నెక్కుడు దౌర్బల్యముతో, శిశువుకంటె నెక్కుడు భయముతో నేడ్చెను.

అట్లేడ్చుచుండగా, వెలుఁగు మఱిమఱి ప్రకాశవంత మైనది. అసాధారణ ప్రకాశము! ఆనంద పారవశ్యము కల్గించు నది—భయంకరమైనదియు! అతని గత జీవితము, ప్రథమాప రాధము, దీర్ఘపరిహారము, తన పాశవబహిరాకారము, కఠినత వహించిన ఆంతర్యము, ప్రతీకార వ్యూహములతో సంతసము నించిన విడుదల, బిషప్ ఇంటజరిగినది, ఆచార్యుని క్షమానంతర మగుటచే మహా నీచము పైశాచికమునునగు బాలుని ప్రాంతు

హారణము—అన్నియు మఱలివచ్చి యెదుట నిలచినవి. స్పష్టముగ నున్నవి. కాని, అనిదంపూర్వమగు నొక ప్రకాశము అన్నింటికి నలమియుండినది. తన జీవితమును సింహావలోకనము చేసెను. అసహ్యకరముగఁ గన్పట్టినది. ఆత్మపరిశీలన చేసికొనెను. భయావహమని తోఁచినది. ఏమైనగానీ, ఆ జీవితాత్మలపైన ప్రశమనకాంతి యొకటి ప్రసరించుచున్నది. సైతానును స్వర్గకాంతిలోఁ జూచినట్లయ్యెను.

ఇక్లెంత సేపేడ్చెను? ఏడ్చి యేమి చేసెను? ఎక్కడికేగెను? ఎవ్వరు నెఱుఁగరు. ఆ రాత్రియే, గ్రెనోబుల్ మార్గమునఁ దపాలుబండిని దోలువాఁడు ఉదయము మూఁడు గంటలప్పుడు, డి–పుర బిషప్ వాకిటిముంగల మోకరిలియుండిన వ్యక్తినొకని చూచెనఁట. ఇంతకంటె ఇతరము నెఱిఁగినవారు లేరు.

———

# నిర్భాగ్యజీవులు

## ప్రథమఖండము – ఫాంటైన్

### తృతీయాధ్యాయము

### (1817 వ సంవత్సరమున)

---

ఫాంటైన్‌వంటి వ్యక్తులు ప్రజాహృదయమునుండి యుద్భవించినవారు. సంఘము కల్పించిన అగాధాంధకారము నందామె జననము. అజ్ఞాతత్వము, అనామధేయత్వమును ఆమె ఫాలమున అచ్చువేయబడినవి. ఎవరామె పితరులు? ఎవరికి తెలియును? తల్లిదండ్రులనామె యెఱుగనే యెఱుగదు. పేరు ఫాంటైన్. ఏల? ఇంకొక పేర నెప్పుడును పిలువబడకుండుటే కారణము. ఆమె జనన కాలమున, డైరెక్టరీ ప్రభుత్వమే యుండినది. ఇల్లే లేదు కాబట్టి, యింటిపేరును లేదు. రస్తా ప్రక్కన, వట్టికాళ్ళు జాడించుచు పడియున్న సద్యోజనిత శిశువును ప్రథమమున చూచినవాడెవడో 'ఫాంటైన్' అని పిలువ అదియే స్థిరపడినది. గురుప్రోక్తనామము లేదు–చర్చి యుండిన గదా? మేఘములు వర్షించినపుడు నీళ్ళువచ్చినట్లామె పేరు వచ్చినది. చిన్ని ఫాంటైన్! ఇంతకంటె ఏమియు తెలియదు. ఈ మానవతి ప్రపంచము ప్రవేశించిన విధాన

మది. పదేండ్ల ప్రాయమున పారిస్ నగరము విడిచి పరిసర కర్షకులకు కూలిచేయబోయినది. పదునైదేండ్ల ప్రాయమున "అదృష్టమును వెదకికొని" మఱల పారిస్‌కు వచ్చెను. ఫాంటైన్ రూపసి. సాధ్యమైనంతకాలము, కన్యాత్వము నిలిపికొన్నది. ముత్యములకు దీటైన పలువరుస, బంగారు వెంట్రుకలు-ఇవి యామె యర్పించిన కట్నము.

ప్రాణము నిల్పుకొనుటకు కూలిచేసెడిది. ప్రాణము నిల్పుకొనుటకే ప్రేమించినది. హృదయమునకును ఆకలి కలదు కదా?

ఆమె తోలోమేను ప్రేమించెను.

తోలోమే ముప్పదేండ్లు కడచిన విద్యార్థి. భోగము దప్ప, దేనినికాని అతడు గౌరవించినవాడుకాడు. ధనవంతుడు-సాలుకు నాల్గువేల ఫ్రాంకు లాదాయము. వృకోదరుడు. కాని, ముప్పదేండ్ల వయస్సుకే ముడుతలు, బట్టతల, ఊగు దంతములు తెచ్చుకున్నాడు. ఏ విధముచేనైన అనుభవించిన యతి భోగముల ఫలము! కన్నుల కాంతి తరుగుచున్నది. శక్తి యుడుగు కొలదిని, లాలసత్వము పెరుగ సాగినది. అమాయిక హృదయములను లోగొనుటలో నక్క. ఇట్టివాని వంచనకు లోగి, ఫాంటైన్ గాఢముగ ప్రేమించినది.

అతనికది వేయిన్నొకటవ కాముక క్రీడ - ఆమెకది ప్రథమ ప్రణయము. త్రికరణ శుద్ధము. ఎన్నో నాళ్ళయురి కానినుండి తప్పించుకొని తిరిగినది. కాని, ఆ తప్పించుకొను విధానములోనే మఱల కలసికొను మార్గమున్నది. తొలగి

పోవుట వెదకుటగా మారుట కలదు. వేయేల? అనూయిక హరిణము వేటకాని యురిలో తగుల్కొన్నది.

ఇప్పటికి తోలామే చదువు ముగిసి సెలవులు వచ్చెను. కడపటి కొన్నిదినములును, వీనికైనంత మాధుర్యము గ్రోలి పోవుదమని, సందేహించు స్వభావమే లేని ఫాంటైన్‌ను తోడు కొని సెంట్‌క్లాడ్ అను సముద్రతీర ప్రదేశమునకు వెళ్ళి, ఒక వారము రోజులు నౌకావిహారము, ఉద్యాన విహారము, జల క్రీడలు-కాముకోహాలు ప్రేరేపించిన సకల సుఖములనుభ వించి, ఉన్నట్టుండి యదృశ్యుడయ్యెను. పోయినవాడూరక పోక, ఈ క్రింది శ్రీముఖమంపిపోయెను.

"ప్రియురాలా!

"నీకు తెలియదుకాని, నాకు తలిదండ్రులున్నారు. తల్లి దండ్రులనగా నీకెట్లర్థమగును? ఆ పితరులు నా కొఱకేడ్చు చుందురు. దుర్వ్యయము చేయువాడని చింతింతురు. నా కొఱకై కోళ్ళను బలుపెక్కించి చూపెట్టుకొని యుందురు. నీవీ యుత్తరము చదువునప్పటికి, వాయువేగమున ఉత్తమాశ్వము నన్ను నిమిష నిమిషమునకును నా తలిదండ్రుల సమీపము నకు గొనిపోవుచుండును. సుడిగుండమునుండి, యుత్తమాశ్వము నన్ను తప్పించును. ఆ సుడిగుండము నా ప్రియురాలగు నీవే! ఇంక సంఘము, కర్తవ్యము, నియమము - వీనిని మన్నింప వలెను. నేను నగరాధికారిగ, కుటుంబికుడుగ, కౌన్సిలరుగ కావలసిన యవసరము దేశమునకెంతేని గలదు. నన్ను గౌర వింపుము. నేను త్యాగధనుడను. నిన్నే త్యజించుచున్నాను. నీకేమి? యింకొకని చేపట్టుదువు. ఈ యుత్తరము బాధ

కలిగించినచో, చింపివేయుము. రెండేండ్లు మనము సుఖముగా నుంటిమి. సుఖీభవ!

తొలొమే."

ఈ జాబు చదివి, ఫాంటైన్ వెక్కి-వెక్కి యేడ్చినది. ఇది యామె ప్రథమ ప్రణయమంటిమికదా! స్వల్పాలోచనలు లేక, అతనిని భర్తగా గణించినది. అతని హృదయమును, సాహచర్యము తప్ప ఇతరమేమియు కాంక్షించినదికాదు. ఈ పరాయిచోట, చేత పైసా లేక, ఒడిలో చిన్ని యాడు నిసుగుతో చిక్కినది.

---

# నిర్భాగ్య జీవులు

## ప్రథమఖండము-ఫాంటైన్

### చతుర్థాధ్యాయము

### (ఒప్పగింత కొన్ని వేళల విసర్జనము)

# 1

పందొమ్మిదవ శతాబ్ద ప్రథమ పాదమున, మాంట్ఫర్మిల్‌లో నొక చిన్న హోటలుండెను. దాని యజమానులు తేనార్డియర్ దంపతులు. బౌలాంగర్ వీధిలో హోటలుండెడిది. ఇప్పుడు లేదు. తలుపుమీఁదుగా గోడకొక బోర్డు వ్రేలగట్టఁబడియుండెను. అదియొక చిత్రము. ఒక మనుష్యుఁడింకొకని మోయుచుండెను. ఆ భుజముపైనివాని దుస్తులకు సేనానాయక చిహ్నములుండెను. రక్తము సూచించు మచ్చలును చిత్రింపఁబడియుండెను. తక్కిన భాగమంతయుఁ బొగనలెనుండి యుద్ధరంగమును సూచించునదిగా ఉండెను. దానిక్రింద "వాటర్లూ సార్జెంటుకు" అని వ్రాయఁబడియున్నది.

హోటలు ముందట బండి-చిన్నదో, పెద్దదో - అతి సాధారణ దృశ్యము. అయినను శకటమో శకటశకలమో వాటర్లూ సార్జెంటు గృహము ముందు 1815 వ సంవత్సర

మున, దాని ప్రమాణమునుబట్టి యేచిత్రకారుని లక్ష్యము నైన నాకర్షించియుండును.

అటవీ సమీపప్రాంతములందు వాసములు, పెద్ద వృక్షస్కంధములు తీసికొనిపోవు గొప్ప శకటపూర్వభాగమది. అతిభారమైన యిరుసు, తదనుగుణమైన నొగ, పెద్దచక్రములును ఉండినవి. మొత్తమునకది నేలకంటుకొనిపోయినది. రూపు చెడినది. గొప్ప ఫిరంగిని మోసిన శకటమని దానినూహింపవచ్చును. దాని దారుభాగమును మట్టి తినివేసినది. ఇనుపభాగమును త్రుప్పు ముగించినది. ఇరుసునుండి, మోట గొలుసు దండవలె వ్రేలుచుండెను.

ఈ గొలుసు దూలములను జ్ఞప్తికి తెచ్చుటలేదు. ఏనుఁగులకంటెఁ బెద్దజంతువులను బండికి పూన్చునది యని పించును. దీనిని జూచిన గాలీలు స్మృతి తగులును. కాని, అవి జయావహమగు గాలీలై యుండవలెను. హోమర్ పాలిఫీమస్‌ను, షేక్స్పియర్ కాలిబన్‌ను దీనితో బంధించియుండ వచ్చును.

రస్తాలో, నీచోట నీశకటమెందుకున్నదని యెవరైనఁ బ్రశ్నింపవచ్చును. మొదట, వీధిని ఇఱుకుసేయుటకు, రెండు-త్రుప్పుపట్టుటకు. పురాతన సాంఘికాచారములలోఁ బ్రగతి కడ్డుతగులునవి యిట్టివెన్నియో కలవు. అవి నిలచియుండుటకు వేఱుకారణములే లేవు.

గొలుసు నడిమిభాగము, భూమికి చాల దగ్గఱగా వ్రేలాడుచుండెను. ఆ గొలుసు వంపుమీఁద ఇద్దరు బాలికలు కూర్చుండి యుండిరి. పెద్దదాని వయస్సు రెండున్నరయేండ్లు.

చిన్నది పదునెన్మిదిమాసములది. పెద్దదాని యొడిలో చిన్నది కూర్చున్నది.

వారు క్రిందఁబడకుండుటకై యొక చేతిగుడ్డ చుట్టును కట్టఁబడినది. ఈ భయంకర శృంఖలమును గాంచి "ఆఁ! యిదుగో నా బిడ్డల కాటనస్తువు" అనుకొనిన తల్లియు నున్నది.

ఆ ముద్దుబిడ్డలకుఁ దొడిగిన బట్టలు అందమైనవి. అభిరుచి స్ఫోరకమైనవి. విజయీభావముతో, కనీనికలీను చిఱుగన్ను లిటునటు త్రిప్పుచు, నవ్వుచుఁగూర్చున్న యా పిల్లలు గొలుసు పెనవేసిన గులాబిపూలవలె నుండిరి. ఆ యమాయిక ముఖములు అత్యాశ్చర్యకరాకర్షణ గొల్పుచున్నవి. దగ్గఱి పూలపొదనుండి వచ్చు సువాసన వారి యూపిరినుండి వెలువడు చున్నదా యన్నట్లుండెను. చిన్నపిల్ల దేహము నగ్నమై శైశవ పావిత్ర్యము చాటుచుండెను. ఈ పిల్లలను చుట్టియున్న ఆ శకటమొక గుహాముఖమువలె నుండినది.

తల్లి, హోటలు కిటికీలోఁ గూర్చుండి, త్రాటిచే గొలుసును లాగుచుండినది. ఆమె యాకార మసహ్యమైన దయ్యు, ఈ సన్నివేశమున హృదయంగమముగనేయున్నది. మాతృస్వభావమునుబట్టి బాలికల కపాయము వాటిల్లునేమో యని కనులు కాచియున్నది. ఆ చూపులు ఆంతరిక పాశవము ప్రదర్శించుచున్నను దివ్యములు. ఒక్కొక్క యూపునకును, ఆ త్రుప్పుపట్టిన గొలుసు కిఱ్ఱు కిఱుమని కుపిత రోదనముఁ దలఁపించుచుండెను. శిశువులు బ్రహ్మానంద మనుభవించుచుండిరి. అస్తమింపనున్న సూర్యుఁడును ఆ యానందమునఁ

బాల్గొనెను. రాక్షసశృంఖలమును బసికందుల కాటవస్తువుగఁ జేసిన విధి చేష్టిత మతి మనోహరము.

పిల్లల నూఁచుచు తల్లి యపశ్రుతితో నాఁడు జనాదరణ బొందిన పాట పాడుచుండెను. ఆ రెండు పనులలో నిమగ్న మైన ఆమెకు వీధిలో జరుగుచున్న దేమియు తెలియుటే లేదు.

ఎవరో ఆమెకతి సమీపముగ వచ్చి "మీ కిద్దరు ముద్దు బిడ్డలున్నారమ్మా!" అనిరి. అప్పుడామె తల త్రిప్పెను. ఆ పలికిన దొక స్త్రీ. ఆమె చేతులలోను నొక శిశువుండెను. బరువైన కార్పెట్ సంచియొకటి భుజమున వ్రేలుచుండెను.

ఆ శిశువునం దలౌకికమగు నందమున్నది. రెండు మూఁడేండ్లుండును. ఈ బిడ్డ దుస్తుల సొగసు, ఆ యిద్దరి దుస్తులతోఁ బందెము చఱచునవిగా నున్నవి. గౌను మడతలు కొంచెము పైకిఁబోయి, మంచి పుష్టిచెంది తెల్లఁగానున్న కాళ్ళను కన్పఱచుచుండినది. గులాబివలె మనోహరమై యారోగ్యపూర్ణమైన శిశువు. విశాల నేత్రములు. అద్భుత మైన కనుఱెప్పలు. ఆ పసికూన నిద్రించుచుండినది. తద్వయో విశిష్టమై విశ్వాసపూర్ణమైన గాఢ నిద్ర. మార్దవ నిర్మితము లైన మాతృహస్తములు, తమపై నొరిగి నిద్రించు శిశువులను దీవించుచుండును.

తల్లియన్ననో పేదవలె, దుఃఖజీవివలెఁ గన్పట్టు చుండెను. ఆమె యాకారము గాంచినఁ గూలిపనిచేయు దాని వలె నుండినది. వయోవతి. రూపమో? ఆ దుస్తులలో నెట్టి రూపము కన్పట్టదు, రాణింపదు. క్రైస్తవ సన్యాసివలె, వికారముగ నొక బట్టను దలపైనుండి తీసి గడ్డము క్రింద ముడి

వేసికొన్నది. ఆ బట్టక్రింద బిరుసెక్కిన వెంట్రుక లొకట్టగంటుగా మెడపై వదలఁబడినవి. చక్కని పల్వరుసయున్న వారు నవ్విన బాగుండును. కాని, ఆమె నవ్వదు. కన్నులశ్రు రహితములుగఁ జాలకాలమున్నట్లు పొడకట్టదు. పాలి, అలసి, రుజాపీడితమైనట్లున్నది. శిశువును ఱెప్ప వాల్పక చూచెను. బిడ్డలను దాదులకర్పింపక-తానే చన్గుడుపు తల్లి చూపులలోని ప్రత్యేకత్వ మొక్కటి ఆ చూపులలోఁ గలదు. పెద్దదైన నీలపుఁ జేతిగుడ్డ కప్పుకొని వక్షోభాగము నాచ్ఛాదనము చేసికొన్నది. అదియు వికారముగనే యున్నది. చేతులెండకు వాడి మచ్చలు పడియున్నవి. ఎల్లపుడును సూది గ్రుచ్చుకొనుటచే చూపుడు వ్రేలు మొద్దువాఱినది. ఆమె ఫాంటైన్.

అవును, ఫాంటైన్. గుర్తు పట్టుటే కష్టము. కాని, జాగ్రత్తగా చూచితిమేని, ఆమెలో నింకను సౌందర్యమున్నదని తెలియును. పరిహాసము చేయుచున్నపుడువలెఁ జెంపపైన ఒక గీత యేర్పడి విషాదమును సూచించుచున్నది. అలంకారమూ, ఆ మస్లినులు, సిల్కులు, సుగంధములు, పౌడర్లు-అన్నియు శిశిరర్తు పత్ర పుష్పములవలె దాలి, మ్రోడు నిల్చినది.

పది నెలలైనదా విద్యాసంపన్నుఁడు వదలిపెట్టి.

ఈ పది నెలలలో నేమి జరిగినది? ఊహించుట కష్టము కాదు.

పరిత్యక్త ఫాంటైన్ స్థితి దుర్భర దారిద్ర్యమును గురియైనది. తన బిడ్డ తండ్రి, మఱి తిరిగిరాక వెళ్ళిపోయెను. 'నా' యనువారు లేక, కేవల మొంటరియైపోయినది. కూలి సేయు నలవాటు పోయినది-భోగాభిరుచి కల్గినది. తొలొమే

సంపర్కము తానంతకుముందుఁ జేయుచుండిన పనిపైన అవజ్ఞభావము రేకెత్తించెను. కావున, అతఁడు త్యజించిన తర్వాతఁ జిక్కిన అవకాశములను జాఱవిడిచినది. వేఱు మార్గములు లేవు. చదువను వ్రాయను రాదు. చిన్న తనమునఁ జేవ్రాలు చేయుట మాత్రము నేర్చుకొన్నది. ఎవరిచేతనో 'తోలొమే'కు మూఁడు జాబులు వ్రాయించెను. బదులే లేదు. ఒకనాఁడు కొందఱు వృద్ధ స్త్రీలు ఆమె బిడ్డను జూచి యామె వినునట్లు "ఇట్టి శిశువులను మనుష్యులు హృదయమున కెక్కించుకొందురా? బుజము లెగురవేసి పోవుదురు కాని!" అనిరి. అప్పుడు తోలొమే జ్ఞప్తికి వచ్చెను. అతఁడు బుజము లెగురవేసి పోయెనే కాని, యీ ముగ్ధబిడ్డకు హృదయమునఁ జోటివ్వలేదు. అతఁడాక్రమించుకొని యుండిన ఆమె హృదయ భాగము చీఁకటిపడెను. ఇంకేమి చేయవలెను? సలహా చెప్పు వారెవ్వరును లేరు. తాను దప్పొనర్చెను. కాని, ఆమె స్వభావాంతరమున లజ్జా శీలములున్నవని మనకెఱుకయే. తాను మహా వ్యసనమునకుఁ జిక్కి, వీధులఁబడిపోవు కాలమాసన్నమగుచున్నదని తోఁచుచుండెను. ధైర్యము వహింపవలెను. వహించినది. స్వగ్రామమగు మఱు పోయిన, తెలిసిన వారెవరైన, ఏదైన పని కల్పింతురని యభిప్రాయము కల్గెను. కాని, తన తప్పు దాచుకొనవలెను. మొదటి యెడబాటుకంటె మహా బాధాకరమైన యింకొక యెడఁబాటు అవసరమగునేమోయని హృదయము తత్తఱ పడసాగెను. కాని, తీర్మానించుకొన్నది. జీవితావసరమైన కఠిన ధైర్యము ఫాంటైన్‌కుఁ గలదని మున్ముందు మనము కన్గొందుము. దృఢచిత్తముతో, నిప్పటికే సున్నితము

సొంపునైన దుస్తులనన్నింటిని బిడ్డకొఱకై త్యజించినది. అహం కారమంతయు శిశువులో నిల్పుకొన్నది. ఆ యహంకారము పవిత్రము. ఉన్నవన్నియు విక్రయింపఁగా ఇన్నూఱు ఫ్రాంకు లబ్బినవి. అప్పులుపోఁగా నెనుబది మిగిలినవి. ఇరువది రెండేండ్ల ప్రాయమున మనోహర వసంతపుఁ బ్రాతర్వేళ, బిడ్డను బుజముపై నిడుకొని, పారిస్ విడిచి వెళ్ళినది. ఈమెను చూచిన వాఁడెవ్వఁడైన 'అయ్యో' యని యుండును. ఆమెకు శిశువు తప్ప ప్రపంచమున నింకేమియు లేదు. శిశువునకామె తప్ప వేఱేమియు లేదు. ఫాంటైన్ శిశువునకు స్తన్యమిచ్చినది. అందుచే వక్షోజములు సడలెను. అప్పుడప్పుడు సన్న దగ్గు ప్రారంభమయ్యెను.

ఇకమీఁద నెన్నఁడును తొలొమేను గుఱించి ప్రస్తావింప వలసిన యవసరముండదు. ఇంతమాత్రము చాలును:—ఇరువ దేండ్ల యనంతరము, లూయీ ఫిలిప్ పరిపాలనమున, ఒక రాష్ట్రప్రభుత్వ న్యాయవాది. పెద్ద జీతగాఁడు. ధనవంతుఁడు. మంచి పలుకుబడి కలవాఁడు. ఇంగితజ్ఞుఁడైన నియామకుఁడు. న్యాయము తప్పని పంచాయతీదారుఁడు. అప్పుడును, ఎప్పుడును భోగలాలసుఁడే.

ఆమడకు మూఁడు నాల్గుసెంట్లు బాడుగిచ్చి, చిన్న బండ్లలో పయనించి, మధ్యాహ్నమగుసరికి మాంట్ఫర్మీల్‌లో చేరి బొలాంగర్ వీధిలో దిగెను. పోవుచుండఁగా, తేనార్డి యర్ యింటిముంగల గొలుసుల యుయ్యాలలో గూర్చుండి

యానందముతో నూగుచున్న బిడ్డలిద్దఱంగాంచి యాకర్షితయై చూచుచు నిల్చుండెను.

ఆమె హృదయము పొంగెను. దేవతల యునికి స్వర్గమును జాటును. ఈ హోటలుమీఁద వ్రేలుంచి, సర్వేశ్వరుఁడు "ఇదిగో" యనుచున్నాఁడని యామె భావించెను. ఈ కూనలు సుఖులనుట స్పష్టముగాఁ దెలియుచున్నది. తెప్ప వాల్పక వారిని జూచి మెచ్చుకొని, హృదయోద్వేగము నాపుకొనలేక "మీ బిడ్డలు ముద్దుల మూటలమ్మా!" యనెను.

అతి క్రూర జంతువులుకూడ, తమ నిసుఁగులను ముద్దాడువారియెడ మెత్తఁబడును. తల్లి తలయెత్తి క్రొత్తయామెను తాపపైఁ గూర్చుండ నాహ్వానించెను. ఇరువురును సంభాషింప మొదలిడిరి.

"నేను తేనార్డియర్ సతిని. ఈ హోటలు యజమానులము మేమే" అని మఱలఁ బాడనారంభించెను.

తేనార్డియర్ సతి రక్తకేశి. గోధుమవర్ణ. ఎముకల గూడు. సైనిక భార్యను పోలినది. ఈ మాటయందలి యసహ్యత్వ మంతయు ఆమెలోఁ గలదు. నవలా పఠనమున కలవాటు పడినవారు కూర్చుండు ఫక్కీలో సోమరితనమును సూచించు వైఖరియుండును. ఈమెలో ఆ వైఖరి యున్నది. ఆమె యభినయించు అలసత్వమునఁ బురుష చిహ్నము కలదు. పురాతన ప్రణయ కథలు పూటకూటి యజమానురాండ్రలో నట్టిపరిణామము కల్గించును. ఆమెలో యావనమింకను నున్నది. వయస్సు ముప్పదేండ్లకుఁ దక్కువే. ఈ యమ్మ వంగి కూర్చుండక, నిల్చుండియుండెనేని, లంకిణి ప్రమాణముకల యా

యత్యున్నతి, విశాల భుజములు, ఫాంటైన్‌కు భయమొత్తించి, విశ్వాసము నుత్తరించి, మనము చెప్పఁబోవు కథను జరగనీకుండఁ జేసెడిది. ఒకవ్యక్తి నిలుచుండక, కూర్చుండియుండుటచే దైవమన్యథా జరుగుట! ఎంత సూక్ష్మాంశ మెంత విస్తార విపర్యాసమునకు దారితీసినది!

ఫాంటైన్ కొన్నిమార్పులుచేసి తన కథ చెప్పెను.

తానొక కూలిమనిషి. భర్త మరణించెను. పారిస్‌లోఁ బనిదొరకమి స్వకీయరాష్ట్రమున పనివెదకఁ బోవుచున్నది. నాఁటి యుదయమే పారిస్ విడచినది. బిడ్డనెత్తుకొని నడిచి యలసి, తటస్థపడిన బండినెక్కెను. ఆ బండి నిలిచినచోటు నుండి మాంట్ఫర్మిల్‌కు మజిల నడిచియే వచ్చినది. బిడ్డ కొంతదూరము నడిచినదికాని, చాలచిన్నవయస్సు నడవనిచ్చినది కాదు. కావునఁ దానెత్తుకొనవలసి వచ్చెను. ఆ బంగారుకొండ నిదురించెను.

ఈ కథ చెప్పి, శిశువు చెక్కులను ముద్దిడుకొనెను. అందుచే బిడ్డ మేల్కొని తల్లివంటివేయగు తన విశాల నయనములు విప్పి చూచెను. దేనిని? దేనినికాదు-అంతటిని. తీవ్ర గంభీరములగు పసిబిడ్డల చూపులు, పెద్దలమగు మన సందేహాస్పద శీలములకు విరుద్ధమగు వారి పవిత్రామాయికత్వమునందలి నిగూఢ మర్మములు. ఆ చూపులు తాము దేవతలని మనము మనుష్యులమని గ్రహించుచున్నవా యనిపించును. పిదప బిడ్డ నవ్వ మొదలుపెట్టి, తల్లి వారించినను నిలువక క్రిందికి దుమికెను. దుమికినదే తడవుగ, ఆ యిరువు

రూగుచుండఁగాఁ జూచి, మెచ్చుకొనుచున్నట్లు నాలుక కన్పఱచెను.

తేనార్డియర్ సతి త్రాడు విప్పి, "ముగ్గురును గలిసి యాడుకొనుఁడు" అని ప్రోత్సహించెను. ఆ వయస్సున మైత్రి క్షణములోఁ గుదురును. తేనార్డియర్ పిల్లలు, క్రొత్తబిడ్డతో వెంటనే ఆటలాడసాగిరి. ముగ్గురును కలసి, నేలలో బొరియలు త్రవ్వుచుండిరి.

ఈ క్రొత్తబిడ్డ ఉల్లాసవతి. తల్లి మంచితనము, బిడ్డ యుల్లాసమునందు ముద్రితమైయున్నది. చిన్న చెక్కపేడు తీసికొని, బలముగా పురుగునకొక బొరియ త్రవ్వ నారంభించినది. నిసుఁగు గోరీ త్రవ్వుట మనోహరకర్మ.

తల్లులు మాటలాడుచునే యుండిరి.

"నీ బిడ్డ పేరేమి?"

"కోజెత్తు."

"కోజెత్తు"కు బదులు "యూఫ్రెస్" అని చదువవలెను. ఆ బిడ్డ పేరదియే. తల్లి దానిని కోజెత్తుగా మార్చినది. ఇట్టి మార్పులు భాషా శాస్త్రవేత్తల కర్థము కాదు కాని, తల్లులకేదో వింత యానందమిచ్చును. "తియడోర్"ను, "గ్నాన్"గా త్రిప్పిన ఒక యవ్వను మే మెఱుఁగుదుము.

"వయస్సెంత?"

"మూఁడవయేఁడు."

"నా పెద్ద బిడ్డ వయస్సంతే."

ముగ్గురు శిశువులును చాల వ్యగ్రులై యానందలై యుండిరి. ఒక గొప్ప సంఘటనము జరిగినది. నేలనుండి పెద్ద

పురుగొకటి వచ్చినది. దానింగాంచి భయపడియు, సంతో షముఁ జెందుచుండిరి. వారి స్నిగ్ధ ఫాలభాగము లొండొంటి నొరసికొనుచుండినవి. మూఁడు తలలకొక్క పరివేషము!

"పసిపిల్లలెంత త్వరగా నొకరి నొకరు తెలిసికొందురు! చూడు. ఎవరైన ఈ ముగ్గురొక తల్లి పిల్లలనుకొందురు" అని తేనార్డియర్ సతి పలికెను.

ఈ మాటలకై ఫాంటైన్ కాచియుండెను గాఁబోలు. తేనార్డియర్ సతి చేయిపట్టుకొని "నా బిడ్డను మీరు పెంచెదరా?" అని యడిగెను.

తేనార్డియర్ సతి ఆశ్చర్య చలితయయ్యెను. దానిలో నంగీకారము లేదు, నిరసనము లేదు.

కోజెత్తు తల్లి మఱియు నిట్లనెను. "చూడుఁడు, ఈ బిడ్డను నాతోఁ బల్లెలకుఁ దీసికొనిపోలేను. పనికడ్డు. బిడ్డ యుండఁగా నక్కడఁ బని యియ్యరెరి. ఎంత యన్యాయము? దేవుఁడు నన్నిక్కడికి దెచ్చినాఁడు. ఇంత అందము, శుచిత్వము, సౌఖ్యము కల మీ పిల్లలు నన్నానందమున ముంచివేయుచున్నారు. ఇదిగో ఉత్తమ మాత యనుకొంటిని. ముగ్గురును ఏకోదరులవలె నుందురు. నేను వచ్చుటకుఁ జాల కాలము పట్టదు. నా బిడ్డను మీ దగ్గఱ ఉంచుకొనరా?"

"ఆలోచింపవలెను."

"నెల కాఱు ఫ్రాంకులిత్తును."

అప్పుడొక పురుష కంఠము లోపలినుండి వినవచ్చెను.

"ఏడు ఫ్రాంకులకు తక్కువలేదు. ఆర్నెలల కడ్వాన్సీవలెను."

"ఏడాఁడ్లు నలుబదిరెండు" అని తేనార్డియర్ సతి గుణించెను.

"ఇచ్చెదను."

"ప్రారంభపుఁ గర్చులకు పదునైదు ప్రత్యేకము" అని పురుషుఁడు.

"దానితో ఏఁబదియేడగును" అని సతి.

"అట్లే యిచ్చెదను. నాయొద్ద నెనుబది ఫ్రాంకు లున్నవి. నడిచి వెళ్ళితినేని, మీకియ్యఁగా మిగిలిన దానితో పల్లెసీమ చేరుకొందును. అక్కడ పని దొరకును. చాలినంత సంపాదించిన వెంటనే వచ్చి నా బిడ్డను దీసికొనిపోదును" అని ఫాంటైన్ వచించెను.

"పిల్లకు వలసిన బట్టలున్నవా?" అని పురుషుఁడడిగెను.

"ఆయన నా భర్త" అని తేనార్డియర్ సతి పలికెను.

"ఆహా, నా ముద్దులమూట కన్నియునున్నవి. ఎంతో వెలపెట్టి కుట్టించితిని. నా సంచిలో నున్నవి."

"దాని సిక్కడనే పెట్టిపోవలెను" అని పురుషుఁడాదేశించెను.

"నిస్సందేహముగ. నా బిడ్డను వట్టి యొడలితో వదలిపోవుదునా?"

పురుషుఁడు ముఖము వెలువఱించి "అట్లయిన, నీబిడ్డ నిక్కడ వదలవచ్చును" అని యంగీకరించెను.

వ్యాపారము ముగిసెను. ఫాంటైన్ ఆ రాత్రి యక్కడఁ గడపి, వారడిగిన ధనమిచ్చి, బిడ్డను వదలి, బిడ్డ వస్త్రములు లేమి బరువు తగ్గిన సంచినెత్తికొని త్వరగా మఱల నాసతో

మఱునాఁడుదయమున వెళ్ళిపోయెను. ఇట్టి యెడఁబాటులు నిశ్శబ్దముగ జరుగును. కాని, నిరాశాపూర్ణములై యుండును.

తేనార్డియర్ల పొరుగొకర్త, ఈ నిర్భాగ్యమాతను ద్రోవలోఁజూచివచ్చి "నేనిప్పుడొక స్త్రీని వీధిలోఁ జూచితిని. గుండె పగులునట్లేడ్చుచుండెను" అని నివేదించెను.

కోజెత్తు తల్లి వెళ్ళిన వెంటనే, పురుషుఁడు తన భార్యతో "దీనితో, రేపు తీర్చవలసిన నూటపది ఫ్రాంకుల బాకీ బాధ తీఱినది. ఏఁబది కొదువ యుండెను. నీ బిడ్డలు నీవును మంచిబోనువలె పనిచేసితిరి" అని యభినందించెను.

"తెలిసి చేసినదికాదు" అని యాఁడుది పల్కెను.

# 2

బందీయైన యెలుక మిక్కిలి చిన్నది. కాని, కృశించిన యెలుకయైనను, పిల్లికి సంతోషదాయకమే.

ఈ తేనార్డియర్లెట్టివారు?

ప్రస్తుతమొక ముక్క చెప్పెదము. క్రమక్రమముగా చిత్రము పూర్తియగును.

వారొక సంకరమైన స్వల్పతరగతికిఁ జేరినవారు. పైకి వచ్చిన యల్పులు, పతనముచెందిన ధీమంతులు, మధ్యతర గతికి నధమతరగతి నడుమనుండి యధముల యల్పగుణము లను మాధ్యమికల దుర్గుణములను గలిగినవారు. కార్మికౌదార్యములు బూర్జువా మర్యాద వారిలో లేవు.

సంకుచిత స్వభావులు. ఆఁడుది పశుహృదయ. మగ వాఁడు నీచుఁడు. ఇరువురును దుర్మార్గమునఁ బరుల గుండె

లవియఁజేయుచు చెట్టపట్టాలు వైచుకొని గమనింపఁగలరు. ఎండ్రివలె ఎడతెగక చీఁకటి వంకకే ప్రాఁకుచు, జీవితమున ముందుకుఁబోవుటకు బదులు వెనుకకే పోవుచు, కలిగిన యను భవమును తమ వికృతము నధికము చేసికొనుటకే యుపయో గించుచు, నిలువక నీచతఁబెంచుకొనుచు, నధికాధికముగ ఘనీ భవించు క్రౌర్యమున మునుఁగుచుండు జీవులుందురు. తేనార్డి యర్లట్టివారు.

ముఖ్యముగాఁ బురుషుఁడు మానవ శరీరశాస్త్రజ్ఞులకు కొఱకరాని కొయ్య. కొందఱను చూచినఁ జాలును. రెండు విధములుగా వారి జీవకళంకము మనకుఁ దెలిసిపోవును. వారు వెనుక-ఐదిన అలజడి, పురోగమించినఁ దెగువయు గల్గి యుందురు. నిగూఢత్వమేవారు. వారు చేసినదానికిఁ గారణ మూహింపజాలము. ఇఁకఁ జేయుదానికిని ఊహింపలేము. వారి చూపులలోని నీడ వారి యపరాధ నిరూపణము ఒకమాట. ఒక యంగవిన్యాసము వారి గత జీవితమునందలి పాప రహస్యము లను, భవిష్యదంధకారమున దాగియున్న ఘోరాపరాధము లను దళుక్కున మెఱపించును.

తేనార్డియర్ మాటలు నమ్మితిమేని, అతఁడు సార్జెం టుగా నుండియుండెను. బహుశా 1815 నాఁటి సమరమునఁ బాల్గొని, ధీరత్వము ప్రదర్శించియుండెను కాఁబోలు. అతఁ డెట్లు ధీరత్వము ప్రదర్శించియుండెనో యిఁకమీఁద మనకుఁ దెలియును. హోటలు ద్వారమునందలి బోర్డు అతని సైనిక ప్రతాపమునకు గుర్తు. దానిని జిత్రించిన దతడే. అతనికన్ని పనులును గొంతకొంత వచ్చును.

వారి పెద్దబిడ్డపేరు ఎపొనిన్. రెండవది అజెల్మా.

# 3

సంపద వచ్చుటకు క్రౌర్యము చాలదు. ఆ హోటలు మంచి స్థితి చెందనేలేదు.

ఫాంటైన్ ధర్మమాయని తేనార్డియర్‌కు ఋణబాధ తొలఁగెను. తరువాతి నెలలోను వారికి ధనాభావమే. సతి, కోజెత్తు బట్టలను పారిస్‌కుఁ దీసికొనిపోయి, కుదువఁబెట్టి అఱువది ఫ్రాంకులు తెచ్చెను. అది కర్చైపోగానే, ఆ బిడ్డను దయాధర్మమునకుఁ దాము పెంచుచున్నట్లు వారు భావించిరి. దుస్తులు పోయెనుగానఁ దమపిల్లల ప్రాఁతబట్టలను కోజెత్తుకుఁ గట్టఁబెట్టిరి. అవి చింపిరి పేలికలు. భుక్తశేషపు ముక్కలను ఆ బిడ్డకు కుడువఁబెట్టుచుండిరి. కుక్కలు పిల్లులు ఆ శిశువు పంక్తిలోఁ దినువారు. బల్లక్రింద నా జంతువులవలెనే కొయ్య పళ్లెములోఁ దినెడిది.

ఫాంటైన్‌కు మ-లో పని దొరికినదని యిఁకమీఁద మనము కన్గొందుము. అక్కడినుండి ప్రతి మాసము ఎవ్వరిచేతనో కోజెత్తు క్షేమములు తెలుపుఁడని వ్రాయించెడిది. తేనార్డియర్లు తప్పనిసరిగా "అద్భుతముగా ఉన్నది" అని బదులు వ్రాసెడివారు.

మొదటి యాఱు నెలలై పోయెను. తల్లి, యేడవనెలకేడు ఫ్రాంకులు పంపి ప్రతినెల తప్పకక్లే పంపుచుండెను. సంవత్సరము ముగియకముందే తేనార్డియర్ "మహా యేడు ఫ్రాంకులు! ఆ భిక్షముతో ఏమి చేయుదుమనుకున్నదో!" అని, పన్నెండు

పంపవలెనని వ్రాసెను. బిడ్డ బాగున్నదన్న మాటకుబ్బి, ఫాంటైన్ పదిరెండు ఫ్రాంకులే పంపసాగెను.

కొన్ని ప్రకృతులలో, ఒకవంక ద్వేషింపక మఱొక వంకఁ బ్రేమించుట అసాధ్యము. ఈ తేనార్డియర్ తల్లి తన పిల్లలను వెఱ్ఱిగాఁ బ్రేమించుచుండెను. దాని పర్యవసానము, నూతన శిశువుపై ద్వేషము. మాతృప్రేమ కిట్టి క్రూర ముఖ మొక్కటి యుండుట విషాదకరము. కోజెత్తాక్రమించిన స్థలము చాలకొద్ది. అయినను నంత మాత్రపుఁ జోటైనఁ దన బిడ్డలకుఁ దక్కనైనదని, తన పిల్లలు పీల్చవలసిన గాలి కొంత తగ్గినదని యీ సతికిఁ దోఁచెను. ఈ యమ నిత్యకృత్యములుగా కొన్ని యాక్షేపములు, కొన్ని గ్రుద్దులు ఇచ్చుచుండవలెను. కోజెత్తు లేకుండెనేని, ఎంత గోము చేసినను తన పిల్లలకే అవియన్నియుఁ జెందెడివి. ఇప్పుడు నూతన శిశువు గ్రుద్దుల నాకర్షించుటచే ముద్దులు మాత్రమే తేనార్డియర్ పిల్లలకు దక్కుచుండెను. కోజెత్తు కదలిన చాలు, వడగండ్ల వానవలె కఠిన దండనలు కురిసెడివి. కనులు తెఱచియుఁ దెఱవనికూన, దుర్బల. ఐహిక జ్ఞానము లేదు, ఈశ్వరజ్ఞాన మసలే లేదు. నిరంతరమును నిరాదరణకు, దండనలకు, దెబ్బలకు గుఱియగుచు, తన ప్రక్కనే మఱి యిరువురు హాయిగానుండుట చూచుచుండినది!

ఆమానుషి కోజెత్తుపై నిర్దయ కలిగియుండెను. ఎపొనిన్ అజెల్మాలును నిర్దయ చూపుచుండిరి. పిల్లలా వయస్సులోఁ దల్లుల ననుకరింతురు. పరిమాణము తక్కువ-అంతే.

ఇట్లొక సంవత్సరము, మఱియొక్కటియుఁ గడచెను. పల్లెలోనివారు ''తేనార్డియర్లెంత మంచివారు! ధనవంతులు

కాకున్నను, ఒక బీద పిల్లను బెంచుచున్నారు.'' అని మెచ్చు కొనిరి. కోజెత్తును దల్లి మఱచినదని వారి తలంపు.

ఇట్లుండఁగా, ఈ బిడ్డ జనన మజ్ఞాతమని యెట్లో తేనార్డియర్ పసిపట్టి "బాగుగాఁ దిని పెరుగుచున్నది. నెలకు బదునైదు ఫ్రాంకులిమ్ము. లేదా మా యింటనుండ వీలులేదు' అని బెదిరించెను. "నా దగ్గఱ ఈ మోసము సాగదు. పదు నైదు ఫ్రాంకులీకున్నచో, దీని యంకుతనము బైటపెట్టి రచ్చ కీడ్చెదను'' అని పండ్లు కొఱికెను. తల్లి పదునైదు ఫ్రాంకులు పంపసాగెను.

ఏటేట శిశు వెదిగెను. దైన్యము సహిత మెదిగెను.

చిన్నదిగా నున్నంతకాలము, కోజెత్తు ఆ యిద్దరు పిల్లల బలి పశువుగా నుండెను. కొంచెమెదిగి, యైదేండ్లు వయస్సురాఁగానే, యింటి పరిచారిక యయ్యెను.

"అయిదేండ్లకే! ఇది యసంభవము!'' అందురేమో. ఈశ్వరా! ఇది సత్యము. సంఘ దౌష్ట్యము వయస్తారతమ్యము లను లెక్కింపదు. నిన్న మొన్న డొమొల్లార్ కేసు విచారణ మనము చూడలేదా. అయిదేండ్ల యీడునకే పొట్టకై కూలి చేయుచు దొంగిలుటారంభించి తుదకు దారిదోపిడిగాఁడయ్యెను!

సందేశములు మోయుటకు, ఇల్లు వాకిలి యూడ్చుటకు బోకులు తోముటకు, బరువులు మోయుటకుఁగూడ కోజెత్తును నియోగించుచుండిరి. కోజెత్తు నిట్లుపయోగించుటకుఁ దమ యధికారము, తల్లి కొన్ని నెలలు ఇటీవల బాకీ పడుటచే, ద్విగుణితమైనట్లు తేనార్డియర్లు భావించిరి.

ఈ మూఁడేండ్లు దాటిన తరువాత, ఫాంటైన్

మాంట్ఫర్మిల్ కు వచ్చియుండినఁ దన పిల్లను గుర్తు పట్టెడిది కాదు. నిగనిగలాడుచు ముద్దు లొలుకుచుండిన నాఁటి కోజెత్తు నేఁడు చిక్కి, పాలి రూపు చెడినది. ఆ వైఖరిలో ఏదో కలఁత కన్పట్టెడిది. "జిత్తులు!" అని తేనార్డియర్ల వ్యాఖ్యానము.

అన్యాయము చిఱుబుఱులాడించెను. దైన్యము వికృత రూపము నిచ్చెను. కన్నుల యందమే మిగిలినది. ఆ పెద్ద కన్ను లలో విషాదముమించి, చూచువారికి బాధ కల్గించుచుండెను.

ఆ జేంస్లు నిండని యీ నిసుఁగు శీతకాలమున, ఆ పేలికలు చుట్టుకొని, గడగడలాడుచు, చేత పెద్ద పొరక, కనుల నిండ నీళ్లు కలిగి, తెల్లవారకముండే వీధి నూడ్చుచుండుట గుండె లవియించు దృశ్యము!

అక్కడి వారామెను 'భరద్వాజము' అనుచుండిరి, జనుల కుపనామము లిష్టము. పిచ్చుకంత పిల్ల, వడఁకుచు, భయపడి యదరుచుఁ, బ్రతిదిన ముదయమున నూరిలో నందఱ కంటె ముందుగా లేచి వీధిలోనో పొలములోనో పని సేయు టను జూచి వారా పేరు పెట్టిరి.

కాని, ఈ భరద్వాజ మెప్పుడును పాడుట లేదు.

———

# నిర్భాగ్య జీవులు

## ప్రథమ ఖండము-ఫాంటైన్

### పంచమాధ్యాయము

### (ఆరోహణము)

మాంట్ఫర్మిల్ జనులు పిల్లను మఱచి పరుల పంచలఁ పాల్చేసె ననుకొనిరి కదా? ఆ తల్లి యేమయ్యెను? ఎక్కడ నుండెను? ఏమి చేయుచుండెను?

తన ముద్దుల కోజెత్తను, తేనార్డియర్లతో విడిచి, నడిచి నడిచి మ-చేరుకొనెను. ఇది 1818లో నని జ్ఞాపక ముంచుకొనవలెను.

ఫాంటైన్ ఈ చోటు వదలి పన్నెండేండ్లయ్యెను. ఈ లోఁగా ఈ యూరు చాల మార్పు చెందినది. ఫాంటైన్ దిన మున కెంతగా దైన్య గర్భమునఁ గ్రుంగిపోవుచుండఁగా, ఆమె జన్మస్థానమగు పల్లె సంపన్నమగుచుండినది.

రెండు సంవత్సరముల లోపున, ఆ పల్లె బరిశ్రమలో ఒక మార్పు కల్గెను. చిన్ని యూళ్ళలో ఇట్టివి మహా సంఘట నలు. ఈ సంఘటన మిగుల ముఖ్యమైనది. దీనిని వివరించి, జ్ఞప్తి యుంచుకొని తీరవలెనని విన్నవింతుము.

అనాదిగా మ-ప్రజలు, ఇంగ్లీషు నల్లపూసలతో,

జర్మన్ నల్లగాజులతో ఇమిటేషన్ వ్యాపారము చేయుచుండిరి. ఆ ముడి వస్తువులవెల యధికమగుటచే, వారి వ్యాపార మెప్పుడును మందముగ నేయుండెను. ఫ్రాంస్టైన్ మఱలి వచ్చు సరికి, ఈ "నల్లవస్తువు"ల యుత్పత్తిలో సంపూర్ణముగ మార్పు కల్గియుండినది. 1815 తుది భాగమున ఒక యపరిచిత వ్యక్తి ఆ యూర నివాస మేర్పఱచుకొనెను. గుగ్గిలమునకు బదులు లక్క-బంక నుపయోగించి యీ వస్తువుల నుత్పత్తి చేయు విధానమతఁడు కనిపెట్టెను. గాజులు చేయుటకు, కొనలను వంచినఁజాలు-కరఁగించి యతుక వలసిన పనిలేదు.

ఈ చిన్నమార్పు ఒక విప్లవము తెచ్చినది.

ముడివస్తువు వెల మిగులఁ దగ్గిపోయెను. అందుచేఁ గార్మికుల కూలి యెక్కువయ్యెను. ఇది పల్లెకు లాభకరము. వస్తుగుణ మధికమైనది. దీనఁ గొనువారికి లాభము. మునుపటి కంటె వెల తగ్గించినను మూఁడంతలు లాభము వచ్చును. కావున, ఉత్పత్తిదారునికి లాభము. ఈ విధముగ, ఒక్క నిశిత భావము మూఁడు ఫలముల నిచ్చినది.

మూఁడేండ్లైన ముగియక ముందే, ఈ నూతన కల్పన చేసినవాఁడు ధనవంతుఁడై, పల్లెవారిని దారిద్ర్యమునుండి తొలఁగించెను. అతఁడా వ్యాపారమునకును క్రొత్త. అతని పుట్టు పూర్వోత్తరము లేమియుఁ దెలియవు.

కొన్ని వందల ఫ్రాంకులు చేత నిడుకొని ఆ యూరికి వచ్చెనఁట. ఈ చిన్న పెట్టుబడితో, నిశిత బుద్ధి ప్రేరణచేఁ గ్రమ జాగ్రతలతో, తాను సంపన్నుఁడై యిరుగు పొరుగుల వారి నందఱను సంపన్నులుగాఁ జేసెను.

మఱు వచ్చినపుడు, అతని బట్టలు, చేష్టలు, భాష-అన్నియు కార్మికునిఁ దలఁపించుచుండెను. అతడు వచ్చిననాఁడే, సాయం సమయమున, ఆ యూరి టౌన్ హాలుకు నిప్పంటుకొనెను. ఈ మనుష్యుఁడు తన ప్రాణములను లెక్క-సేయక, అగ్నిజ్వాలలోఁ దూఱి ఇరువురు శిశువులను రక్షించెను. వారు రక్షక భటాధికారి బిడ్డలట. ఆ రభసములోఁ దొందఱలో, అందఱి హృదయములు కృతజ్ఞతా పూర్ణములై యుండఁగా, నతని రాదారి కాగితమును ఎవ్వరు నడుగరైరి. అది మొదలుకొని ఫాదర్ మాదలిన్ అను పేరతనికి వచ్చెను.

# 2

అతని కేఁబదియేండ్లు. ఎల్లప్పుడును ఆలోచించుచున్నట్లుండును. కడుమంచి స్వభావము కలవాఁడు. అతనిని గుఱించి చెప్పఁగలిగినదింతే.

నూతన కల్పనచే ఆ పరిశ్రమకతఁడిచ్చిన మహావకాశముచేత నా యూరు వ్యాపారకేంద్రమయ్యెను. స్పెయిన్ దేశమున నా వస్తువుల వాడుక యెక్కు-వ. కాఁబట్టి అక్క-డి వర్తకులు విఱివిగాఁ గొనసాగిరి. లండన్ బర్లిన్‌లతో మఱు పోటీ చేయుచుండినదనియుఁ జెప్పవచ్చును. ఫాదర్ మాదలిన్ లాభము లత్యధికమై రెండవ సంవత్సరాంతముననే, పెద్ద కర్మాగారము కట్టించి దానిని స్త్రీ పురుషులకు వేఱువేఱుగా విభజింప వీలుకల్గించెను. ఒక్కొ-క పేదవాఁడును అక్క-డికి వెళ్ళి, తప్పక పనిపొందవచ్చును. పురుషులు కష్టపడ నిష్టమున్నవారు కావలెను - స్త్రీలు నీతిపరులై యుండవలెను - అందఱును

మర్యాదస్థులై యుండవలెను-ఫాదర్ మాదలిన్ కోరుటింతే ఆడువారు నడవడి గోల్పడకుండుటకై, కర్మాగారమును స్త్రీ పురుషులకు వేర్వేఱుగా నుంచెను. ఈ విషయమున నతని పట్టు సడలనిది. ఈయొక్క విషయమునందే, అతనిలోఁగాఠిన్యము కానవయ్యెడిది. మ-రకుణ సైనికస్థానము. కాన, అక్కడ అవినీతి మిక్కిలి. అతని కాఠిన్యమునకిది ప్రబల కారణము. ఆ యూరికాయన రాక వరప్రసాదము-ఆయన యునికి శ్రీరామ రక్ష. అతఁడు వచ్చుటకు ముందు సోమరులతో నిండిన పురము, ఇపుడు శ్రమ సాధ్యమగు బలారోగ్యములతోఁ బ్రుంజీభవించి యుండెను. చుఱుకుఁదన మన్నిట వ్యాపించి, సోమరితనమును దైన్యమును నపరిచితము లౌన ర్చెను. ధనములేని జేబు, దైన్యముః విడవి యిల్లు లేనేలేవు.

ఫాదర్ మాదలిన్ ఒక్కొక్కరిని పనిలోనికిఁ దీసికొనును. ఒకటే కండిషన్-"మర్యాదస్థుడవుగా నుండవలెను"-"మర్యాదస్థురాలుగా నుండవలెను."

ఈ కర్మకౌశల మధ్యమున, ఫాదర్ మాదలిన్ గొప్ప నిధి కూర్చెను. కాని, ధన సంపాదనమతని ప్రధాన లక్ష్యముగాఁ గన్పట్టలేదు. వర్తకునిలో నిది విచిత్రగుణము. అతని యాలోచన చాలవఱకు పరులను గుఱించియేకాని, తనను గుఱించి కడుఁగొంచెమైనట్టుండినది. 1820 లో, లాఫిట్ బాంకులో అతని పేర నాఱులక్షల ముప్పదివేల ఫ్రాంకులుండినది. కాని, యీ మొత్తము బాంకులోఁ కుండుటకు ముందు, ఊరిమీఁద పదిలక్షలు గర్చుపెట్టినాఁడు.

ఆస్పత్రి మూలద్రవ్యము మిగులఁ దక్కువ. ఆయన,

మఱి పదుగురకు మంచము లేర్పాటుచేసెను. మ-మెగువ యూరని, దిగువ యూరని విభజించబడి యుండెను. ఫాదర్ మాదలిన్ నివాసము దిగువ యూరిలో. అక్కడ ఒక్కటే బడి. అదియు దరిద్రము నోలకబోయు చీఁకటి కొంప-క్రమ ముగా నెలకొరుగుచుండినది. కావున, బాలురకొకటి, బాలికల కొకటియుగా రెండు పాఠశాలలు కట్టించెను. ఉపాధ్యాయు లకు ప్రభుత్వమువారిచ్చు జీతమునకు రెండంతలీసాగెను. ఒక నాఁడు పొరుగువాఁడీ విషయమై ఆశ్చర్యము ప్రకటింపఁగా ఫాదర్ మాదలిన్ "ప్రభుత్వమునం దత్యుత్తమాధికారులు నర్సు, స్కూల్ మాస్టరు" అని వచించెను. ఒక శరణాలయ మును గట్టించి, వృద్ధులు, వ్యాధిగ్రస్తులు నగు కార్మి కుల కాధార మేర్పఱచెను. ఆనాఁడు ఫ్రాంసులో అట్టి దదే యేకైక సంస్థ. ఫ్యాక్టరీ చుట్టును కార్మికగృహము లేర్పడి యొక చిన్న నగరమయ్యెను. ఆ కుటుంబములకని యుచితౌషధాలయము నెలకొల్పెను.

ఆయన, ప్రజాదృష్టి నాకర్షించుసరికి, కొందఱుత్తములు "వీఁడు ధనాశాపరుఁ"డనిరి. తన జేబు నించుకొనుటకు ముందు, ఊరివారిని సంపన్నులుగాఁ జేయుట చూచి ఆ యుత్తములే "ఈ మనుష్యుఁడధికార దాహము కలవాఁడు" అనిరి.

ఎట్టకేలకు 1819లో, నగరాధికారి సిఫారసు ఫాదర్ మాదలిన్ ఊరికిఁ జేసిన సేవయుఁ బురికొల్పఁగా, రాజుగారతనిని మ-కు మేయరుగా నియమించిరి. "అధికారపిపాసు" వనిన

సత్పురుషులకిది మంచి యదనై "అదిగో, నేను చెప్పలేదా!" అని కేకలు పెట్టిరి.

ఈ వార్త యూరంతయుఁ బ్రాకెను. అది యాధార సహితమని నిరూపణయుఁ జెందెను–ఎట్లన, కొన్ని దినములలోఁ బత్రికలో నీ వార్త ప్రకటిత మయ్యెను. మఱునాఁడే ఫాదర్ మాదలిన్ ఆ పదవి స్వీకరింప నిరాకరించెను.

ఆ సంవత్సరముననే, పారిశ్రామిక ప్రదర్శనమున, ఫాదర్ మాదలిన్ కల్పనాఫలితము ప్రదర్శింపఁబడి, అధికారుల ప్రశంస పొందెను. వారి నివేదికను బట్టి రాజు ఆయనకు గౌరవ పదకము ప్రసాదించెను. తోలుటి సత్పురుషులు, లొట్టలు వేసి "సరిసరి! అతఁడు కోరినది పదకము!" అనిరి. ఫాదర్ మాదలిన్ ఆ పదకమును స్వీకరింపఁడయ్యెను. ఖండితముగా, ఇతఁడూహా కందనివాఁడు.వదఱుబోతులు విసిఁగి "వీఁడు జూదరి పొ"మ్మనిరి.

ఆ యూరతనికెంతో ఋణపడినది. బీదలు తమ సర్వ మున కతనికి ఋణపడియుండిరి. అతని యుపయుక్తత యింతం తనరాదు. కావున నందఱతనిని గౌరవించుచుండిరి. అతని మహా కరుణను గాంచి యందఱును ప్రేమించిరి. పనివాండ్రన్నో పూజించుచుండిరి. ఆ పూజలనతఁడు విషాదగంభీర వదనుఁడై కైకొనును. అతఁడు శ్రీమంతుఁడైన పిదప "సంఘు" మనఁ బడువారు దారిలోఁగాంచిన వంగి సలాము చేయుదురు. ఊరి వారు "మాంష్యర్ * మాదలిన్" అని పిలువసాగిరి. కాని, కార్మికులు శిశువులును ఫాదర్ మాదలిన్ అనియే పిల్చుచుండిరి.

---

* గొప్పవారి పేర్లకు ముందు తగిలించెడు గౌరవ సూచక పదము.

ఈ సంబోధన మతని ముఖమునఁ జిఱుహాసము చిందులు త్రొక్కించెడిది. అతని యైశ్వర్యమధిక మగుచుఁ బోఁగా, నాహ్వానము లతనిపై వర్షించెను. "సంఘము" ఆయనను దన వానిగా గుర్తించెను. కార్మికునకుఁ బర్వతములవలె నడ్డు నిలిచిన సంఘ కవాటములు, కోటీశ్వరుని యెదుట వెనుకకుఁ దగ్గి స్వాగత పరంపర లర్పించెను. ఆయన యొక్కదానినైన నంగీకరింపఁ డయ్యెను.

"ఛీఛీ! నట్టి యజ్ఞాని, నిరక్షరుఁడు. ఎక్కడివాఁడో యెవ్వరు నెఱుఁగరు. మంచి సంఘములో నడచుకొను విధా నమే తెలియనివాఁడు. చదువఁగలవాఁడని యైన నెట్లు చెప్ప నగును? పశువు!" అని సత్పురుషులు వ్యాఖ్యానము చేసిరి.

1820 కి, ఆయన సేవాప్రకాశ మత్యుజ్జ్వలమై, ప్రజా బాహుళ్యేచ్ఛ యప్రతిఘటనమై రాజు రెండవసారి యతనిని మేయరుగా నియమించెను. మఱల నతఁడు వలదనెను. నగరాధి కారి పట్టు, ఊరి పెద్దల బలవంతము, బీదప్రజల ప్రార్థనము మీఱరానివై యతఁడీసారి పదవీ స్వీకరణ చేయక తప్పలేదు. చాల బీదగుంపులోని యొక వృద్ధస్త్రీ కుపితురాలై "మంచి మేయరు మా మంచికి పాటుపడును. మీరు చేయఁగల మంచికి భయపడుచుంటిరా?" యని కేక పెట్టెనట. ఆ కేక యతని నంగీకరింపఁజేసిన దందురు.

అతని యారోహణమున నిది మూఁడవమెట్టు. ఫాదర్ మాదలిన్ మాంష్యర్ మాదలినై, ఇప్పుడు మాంష్యర్ మేయరయ్యెను.

# 3

ఇంతయయ్యు, తొల్లటి నిరాడంబరతకు దెబ్బ తగులలేదు.
నెఱసిన వెంట్రుకలు, గంభీర నయనములు, ఎండవేడికి కాలిన కార్మికవర్ణము, తాత్వికుని యాలోచనా వైఖరియు నతనికి విశిష్టత కల్పించునవి. విశాలమైన యంచుగల హ్యాటు, గడ్డమువరకు గుండీలు బిగించిన పొడుగాటి ముతక కోటును ధరించును. మేయరు డ్యూటీ వినా, అతని యితర కార్యము లన్నియు నేకాంతములు. కొద్దిమందితో మాటాడును. ప్రశంసలకుఁదగ్గి, తలవంచి పరుగిడును. పలుకకుండుటకై హసించి, హసింపకుండుటకై ధనమిచ్చును. ఆడువారతనిని "ఎంత మంచి మెలుఁగుబంటి!" యందురు. పొలములలో నడచుటతని కానందదాయకము.

ఎప్పుడును ఒంటరిగఁ గూర్చుండి, ఏదో పుస్తకము చదువుచు భుజించును. ఆయన గ్రంథాలయము చిన్నదే కాని, ఏఱికూర్చినది. అతఁడు పుస్తకప్రేమి. పుస్తకములు నిర్వికార విశ్వసనీయమిత్రులు. అధికాధికమగుచున్న యైశ్వర్యము, ఎక్కుడు విరామమీఁగా, దాని నతఁడు చిత్తసంస్కారమున కుపయోగించుచున్నట్లుండెను. వచ్చిన ప్రారంభ దినములలో కంటె, నిప్పుడు మాట నాజూకు, పదముల సార్థక్యము మార్దవము నధికమైనట్లుండెను.

వాహ్యాళి వెళ్ళినపుడు తుపాకి తీసికొనిపోవునుగాని దాని నుపయోగించుటే లేదు. ఉపయోగించిన, గుండు తప్పదు.

ఉద్దేశ్యము క్షుద్రముఁగ నుండదు. నిరపాయకర జీవమును దేని నెన్నఁడు చంపినవాఁడే కాఁడు.

వయసుమళ్ళినవాఁడైనను మహాబలుఁడందురు. కావలసిన వారికెవ్వరికైనఁ చేయూత నిచ్చుటకు సర్వదా సిద్ధుఁడు. కూలిన గుఱ్ఱమును లేపుటకు, దిగఁబడిన బరువు బండి చక్రమునెత్తుటకుఁ దప్పించుకొనిన యెద్దుకొమ్ములుపట్టి యాపుటకు-ఆ చేతుల కలయిక లేదు. ఇల్లు వదలి వెలికేఁగునప్పుడు జేబులు ధనముతోనిండి, మఱలివచ్చుసరికి వట్టివై యుండును. ఊరిలో నడుచునప్పుడు చింపివేలికలపిల్లలు ఈగలవలెఁ జుట్టుకొందురు.

పూర్వమతఁడు పల్లెటూరిలో నివసించియుండవలెనని యనుకొందురు. కర్షకుల కుపయోగించు రహస్య క్రియల నెన్నింటినో యతఁడుపదేశించును.

శిశువులకతఁడన్న పండుగు. గడ్డిగాదములతో వారికెన్నో మనోహర వస్తువులు చేసి యిచ్చును.

చర్చి ద్వారమునకు నల్ల తెర వేసియుండుటఁ జూచిన వెంటనే యందు ప్రవేశించును. అందఱును నామకరణోత్సవమును వెదకుకొని పోవునట్లు, అంత్య క్రియల నతఁడు వెదకికొని పోవును. ప్రియులను గోల్పడిన వారిని, దీనగతి చెందినవారిని సమీపించి సమాశ్వసించును. పరలోకదృష్టితోనిండిన అంత్య కర్మ శ్లోకములను దన యాలోచనల కాధారముగ గొనును. అగాధ మృత్యుకూపతీరమున విషాదకంఠములనుండి వెలువడు ఈ శ్లోకములను, అనంతమునందలి నిగూఢ రహస్యముల వచ్చేరువందుచున్న వానివలె వినును.

పాపి దుష్కార్యముల మరుగున జేసినట్లు, సత్కార్యముల నతఁడు రహస్యముగఁ జేయును. సాయంకాలమప్పుడు, ఇండ్లు ప్రవేశించి తిన్నఁగాఁ దాపలెక్కిపోవును. ఒక దరిద్రుఁడు చీఁకటివేళ గూడు చేరుకొని, తలుపు తెఱచియుండుటనో గొళ్లెము పగులగొట్టఁబడి యుండుటనో చూచి "ఎవఁడో దొంగ చొరఁబడి యుండును" అని మొత్తుకొని లోనికేఁగి చూచునుగదా, బల్లమీఁద బంగారు నాణెముండును. లోనికేఁగి యుండిన "దొంగ" ఫాదర్ మాదలిన్.

అతఁడు దయాశాలి. ముఖమెప్పుడును వ్యసనముద్రితమై యుండును. కావున "వీఁడుగో గర్వములేని సంపన్నుఁడు. వీడే తృప్తిలేని యదృష్టవంతుఁడు" అని చెప్పుకొందురు.

అతని గదిలో దేవదారు గృహోపకరణములు చక్కఁగా అమర్పఁబడినవి. అవి యందమైనవి కావు. గోడలకు చౌక కాగితమంటింపఁబడి యుండెను. గోడ బల్లమీఁద రెండు పురాతనమైన వెండి దీపస్తంభములుండెను. ఎవ్వరు నెన్నఁడా గది ప్రవేశింపలేదని, అదియొక ఋషిగుహ, స్వప్నస్థలము, బొరియ, గోరీ యనియుఁ బ్రజలనుకొందురు.

లఫిట్ బ్యాంకులో అపరిమిత ధనముంచుకొన్నాఁడని, యతఁడడిగిన తత్క్షణమే రసీదు పుచ్చుకొని బ్యాంకు వారంత ధనమును-ముప్పదియో, నలుబదో లక్షలు-ఇచ్చివేయునట్లు షర్తనియు గుజగుజలు వోవుచుండిరి. వాస్తవమునకీ ముప్పది నలుబది లక్షలు, ఆరువందలముప్పది లేక నలుబదివేల ఫ్రాంకులకు తగ్గింపబడగలదనుట మనకు దెలియును.

# 4

**1821** ప్రారంభమున, మిరిల్ డి-పురబిషప్ "బీన్వేను స్వామి" యని బిరుదందినవాడు, ఎనుబది రెండేండ్ల ప్రాయమున పావిత్ర్యవాసనలు వెదఁజల్లుచు నీశ్వర సన్నిధి కేగెనని పత్రికలు ప్రకటించెను.

పత్రికలొక విషయము మఱచెను. మరణించుటకు ముందు పెక్కు వత్సరము లతని కనులు గ్రుడ్డివైయెనవి. చెలియలు దగ్గఱ నుండుటచే అతఁడూరట చెందెను.

జీవితమునకు గరిష్ఠ సుఖము గూర్చునది మనము ప్రేమాస్పదులమను నమ్మకము. తత్ప్రేమ కారణము మనమే యైయుండవలెను-లేదా మనమెట్టి వారైనను, ప్రేమ పొందుచుండవలెను. గ్రుడ్డివారికిట్టి విశ్వాసముండును. వారి కష్టములలో, సేవరో లాలన. వారికేదేని కొదువ తోఁచునా? లేదు. ప్రేమ ప్రవేశించినచోట వెలుఁగు నశింపదు. ఎట్టి ప్రేమయది! కేవల శుచిత్వమునుండి యుత్పన్నమైనది. సందేహము లేనిచో అంధత్వము లేదు. ఆత్మ యింకొక యాత్మకై తాఱాడి పడయును. అట్లు పడయఁబడి, పరీక్షకు నిల్చిన దాఁడు దాని యాత్మ. అబలాకంఠమునుండి వర్ణనా సాధ్యమైన మాధుర్యము చిలుకు పలుకులు నిన్నోదార్చి, నష్ట విశ్వమును బూర్తి చేయును! ఆత్మనుండి లాలనగాంతువు. చూడవు. కాని, నీవు పూజింపఁబడుచున్నట్లు నీకే తోఁచును. అది చీకటి స్వర్గము.

ఈ స్వర్గమునుండి ఆచార్యుఁడింకొక దానిం బ్రవేశించెను.

ఈ వార్తా ప్రకటనను స్థానిక పత్రికలలో మాదలిన్ చూచి, మఱునాఁడు విషాద సూచకమగు నల్లదుస్తులను టోపీమీఁద నల్లక్రేపును ధరించెను.

ఈ విషాద చిహ్నము నందఱును గుర్తించి తర్కింప సాగిరి. అది మాంష్యర్ మాదలిన్ పుట్టుకను గొంతకుఁగొంత తెలుపునని భావించిరి. పూజ్యుఁడైన బిషప్‌కు నితఁడు బంధువై యుండవలెనని తీర్మానించిరి. దీన మాంష్యర్ మాదలిన్ గౌరవమధికమై మ-లోని మర్యాదస్థుల సంఘమున ఆయన యాదరపాత్రుఁడయ్యెను. క్రొత్తగ వృద్ధస్త్రీలు చూపసాగిన యతిగౌరవము, యువతుల చిఱునవ్వుల దొంతరులును గాంచి, మాదలిన్ తన నూతనౌన్నత్యము కనుఁగొనెను. ఒకనాఁడు చాలముదుసలియగు నొక వితంతువు, వయోనుగుణమగు చనవు పురస్కరించుకొని "మేయరు కీర్తిశేషుఁడైన బిషప్‌కు బంధువనుట నిస్సందేహముకదా?" అని ప్రశ్నించెను.

మా: కాదమ్మా.

ఆమె: మఱి, ఆయనకై విషాదవస్త్రములు ధరించి నారే?

మా: చిన్నతనమున ఆయన యింట పరిచారకుఁడనుగా నుంటిని.

ఆ యూరిలో, ఆటవికుఁడగు దేశద్రిమ్మరి బాలుఁడెవఁడైన అడుగుపెట్టుట వినెనేని ఫాదర్ మాదలిన్ వానిని బిలిపించి, పేరడిగి డబ్బిచ్చెడివాడు. ఇది తెలిసి పెక్కురట్టి బాలురతని యింటి యెదుట నడువసాగిరి. ఈ విషయమును గుఱించియు ఊరివారు చెప్పికొనుచుండిరి.

# 5

క్రాలము గడచి, క్రమక్రమముగాఁ బ్రతికూలమంతయు నంత రించెను. స్వశక్తిచేఁ బైకివచ్చునందఱపై నపనిందలు ప్రబలి, యవి యపహాస్యములుగా, ఛలోక్తులుగా మాఱి తుద కదృశ్యమగును. ఇప్పుడు మాదలిన్‌మీఁది గౌరవము, పరిపూర్ణము, సార్వజనికము, హార్దమునై 1821 నాటికి, 1815 న డి–పురమున బీన్‌వెనుస్వామి పొందిన గౌరవమున కించుమించు సమానమయ్యెను. ముప్పదిమైళ్ళలోపుగానున్న జనులందఱును మాంష్యర్ మాదలిన్ సలహాలకై వచ్చెడివారు. ఆయన విభేదములు తీర్చి, కోర్టుకెక్కనీక నిలిపి వైరము లుడిగించును. ఒకొక్కఁడును దానై ఆయననే తీర్పరిగా ఎన్నుకొనును. ఈ గౌరవ విశ్వాసములా చుట్టుప్రక్కల నందఱలో కుదురుకొనెను.

ఒక్క మనుష్యుఁడీ భావములకు తొలఁగి నిలచి యుండెను. ఫాదర్ మాదలిన్ చేసిన సర్వమును నుపేక్షించుచు, నేదో నిర్వికారము నచంచలమునైన ప్రేరణచే సద్బోధితుఁడైనవానివలె జాగరూకుఁడై పరిశీలించుచుండెను. కొందఱలో, పూర్ణమై శుద్ధ జంతుప్రేరణ ప్రబలియున్నట్లు కన్పట్టును. అది వైరమును సానుభూతిని గల్పించును. ఒకని నింకొకనినుండి యావజ్జీవము విడఁదీయును. సందేహింపదు. చలింపదు. ఊరకుండదు. తప్పుచేసినట్లెన్నఁడును ఒప్పుకొనదు. దానికిఁ దెలియనివన్నియు స్పష్టమైనట్లనుకొనును. తనలోఁ బొరపాటే లేదనుకొనును. అహంకారపూర్ణమై యుండును. బుద్ధి

ప్రబోధమును లెక్క సేయదు. హేతువునకుఁ జెవి యొగ్గదు-శునకమనుష్యుని మార్జాల మనుష్యుని యునికి, గోమాయు మానవునికి, సింహమానవుని యునికిని డెలిపి హెచ్చరిక చెప్పెను.

శాంతమతియై ప్రేమపూర్ణ దృష్టులను నలుగడలఁ బఱపుచు ఎల్లర సద్భావము చూఱగొనుచు మాంష్యర్ మాదలిన్ వీధి నడచునపుడు, సమున్నత పురుషుఁడొకడు చదునుహ్యాటు, బూడిదరంగు కోటు ధరించినవాఁడు బలిష్ఠమైన చేతికఱ్ఱ బూని మాదలిన్ వెనుక తటుకునఁ దిరిగి అతఁడదృశ్యుఁ డగునంత వఱకును గనులతో వెంబడించి, నిదానముగ తల నూచుచు పై పెదవి ముక్కు తాకు వఱకును క్రింది పెదవితో పైకి నెట్టును. ఆ ముఖవికృతి భావగర్భితము. దాని యర్థ మిట్లనవచ్చును. "ఎట్టివాఁడీ మానవుఁడు? సందేహము లేదు-ఎక్కడనో చూచినాను. ఎన్ని జరిగినను, నేను మాత్రమితనిచే మోసగింపఁబడను."

ఈ వ్యక్తి గాంభీర్యమునఁ దర్శనమున్నది. ఎంత తొందఱలోఁ దనను చూచినవారి లక్ష్యమునైన నరికట్టఁగల ప్రకృతి యీ మూర్తి యందున్నది.

అతనిపేరు జేవర్. పోలీసుద్యోగి.

మ-లో, కర్కశమయ్యు నుపయుక్తమైన యిన్స్పెక్టరు పనిని జేయుచుండెను. మాదలిన్ అక్కడికి వచ్చినపుడు లేఁడు. జేవర్, పారిస్ పోలీసు శాఖాధికారియైన మాంష్యర్ చాబిలే అభిమానముచే నుద్యోగము గాంచెను. జేవర్ మ-కు వచ్చు, సరికే మాదలిన్ భాగ్యవంతుఁడై మాంష్యరై యుండెను.

కొందఱు పోలీసాఫీసరుల ముఖము తీరునందే నైచ్య ముతోఁ గూడిన యధికారము పొడకట్టును. జేవర్ ముఖ వైఖరి యట్టిదే కాని, దానను నైచ్యము లేదు.

ఆత్మలు భౌతిక నేత్రముల కగపడు నేని, ప్రతి మానవుని యాత్మయందును, నొక జంతు స్వభావము స్పష్టముగాఁ గనఁబడునని మా నమ్మకము. గుల్ల చేప మొదలు రాబందు నఱకు, పందినుండి వ్యాఘ్రమువఱకు సకల జంతువులలో నేదే నొకటి యుండునను సత్యము గ్రహించి తీఱవలెను. కొందఱిలో పెక్కు జంతువులు గుమిగూడియుండును. తాత్వికులీయంశము గమనించినట్టు లేదు.

మన మంచి చెడ్డలే జంతువులు. కండ్లయెదుటఁ బాఱాడుచున్న మన యాత్మచ్ఛాయలు. మనలో పర్యాలోచన పురి వెట్టుటకై యీశ్వరుఁడు వానిని జూపుచున్నాఁడు. అవి ఛాయలు మాత్రమే కాన, విద్యాగ్రహణ సామర్థ్యము నీశ్వరుఁడు వానికిఁ బ్రసాదింపలేదు. మన యాత్మలు వాస్తవ ములు. విశిష్ట గమ్యము కలవి. కావున వానికీశ్వరుఁడు తెలివి నిచ్చెను-అనఁగా వేతృత్వమున కవకాశము. సాంఘిక విద్య సక్రమదత్తమయ్యె నేని, ఒక్కొక్క యాత్మనుండి దానియందు నిగూఢమైయున్న యుపయుక్తతా గుణమును వెలిఁగింపఁ గలదు.

పైకిఁ గన్పట్టు ప్రాపంచిక జీవిత సంకుచిత దృష్టితో, మానవేతరములైన ప్రాణుల పూర్వభవవ్యక్తిత్వమును గుఱించిన గంభీరప్రశ్నను ద్రోసిపుచ్చక, చూచితిమేని దృష్టా

హము. ఆంతరికాహముును నాస్తి యనిపింపఁజాలదు. ఈ సంగ్రహముతో, ముందునకుఁబోదము.

ప్రతి మనుష్యునిలో నొక జంతుస్వభావ ముండునని యొప్పుకొంటిమేని, శాంతి రక్షకుఁడైన జేవర్‌ను వర్ణించుట సులభమగును.

అస్టూరియన్‌లోని కర్షకులు, ఒకతడవ పుట్టిన తోడేటి పిల్లలలో నొక కుక్క యుండునని, అది పెరిఁగి తక్కిన పిల్లలను తినివేయకుండుటకై తల్లి దానిని జంపునని విశ్వసింతురు. ఈ తోడేటి కుక్కపిల్లకు మనుష్యముఖ మిచ్చిన జేవరగును.

జేవర్ పుట్టుక జెయిలులో. అతని తల్లి దైవజ్ఞ-అందఱ యదృష్టములను వివరించునది. ఆమె భర్తకు గాలిలో పని. సంఘబహిఃప్రదేశమున పెరిఁగిన జేవర్ అందు బ్రవేశించుటకు జంకెడివాఁడు. సంఘము, తనను తన్నువారిని రక్షించు వారిని ద్వేషించునని యతఁడు కన్గొనెను. ఈ రెంట నొక పని నాతఁడెన్నుకోఁగలఁడు. తనలోని సరియైన నడవడికి వర్ణింపరాని మూలాధారమున్నదని, క్రమము, నీతియుఁ దనవేయగు జిప్సీజాతిమీఁద నణఁపరానంత ద్వేషముతోఁ గూడియున్నవనియు నతఁడెఱుఁగును. కావున పోలీసుశాఖలోఁ జేరి వృద్ధిగాంచెను. నలువదవయేట ఇన్స్పెక్టరయ్యెను.

యౌవనదశలో నున్నపుడు, దక్షిణ ప్రాంతమున గాలీలలో నియోజితుఁడై యుండెను.

జేవర్‌ను గుఱించి వాడిన మనుష్య ముఖమననేమో యిక్కడఁ గొంత వివరింతము.

జేవర్ యొక్క మనుష్య ముఖమున తబిక ముక్కు కలదు. దానికి లోతైన రెండు సందులు. వాని సరిహద్దుల వఱకును జెంపలపై పొదలవలెఁ బెరిఁగిన బుగ్గమీసము లున్నవి. ఆ యరణ్యములను గుహలను జూచినవాఁడు తత్తఱ మందును. జేవర్ నవ్వుట అరుదు. నవ్వినా అది భయంకరము. అప్పుడతని సన్నని పెదవులు విడి, అతని పండ్లనేకాక చిగురులను గూడఁ బ్రదర్శించును. ముక్కు చుట్టును, పచ్చిక నేలలోని జింక మాతి కట్టు ప్రమాణముకల యసహ్యాపు ముడుత యేర్పడును. గంభీరముగ నున్నపుడతఁడు బుల్ డాగ్. నవ్వినపుడు పులి. తక్కిన సమయములలోఁ జిన్నతల, పెద్ద దవడలు, ఫాలమునుగప్పి కనుబొమలపైఁబడుచున్న వెంట్రుకలు, కనుల మధ్య చిరభ్రుకుటి, చింతాదంతురిత నేత్రములు, ముడివడి నెఱగుఁగొల్పు నోరు, భీకరాధికార వైఖరి—ఈ యన్నింటి కలయిక జేవర్.

అతఁడు రెండు భావముల కూడిక. అవి తమంత నతి సరళములు, మంచివియు. కాని, యతిశయీకరణముచే వానిని జేవర్ దుష్టములుగా నొనర్చెను. అధికారమునెడ గౌరవము, విప్లవమునెడ ద్వేషమును ఆ రెండు భావనులు. నతని దృష్టిలో, దొంగతనము, హత్య, సకల నేరములును విప్లవ రూపములు. తన ప్రబల విశ్వాసమున ప్రధానమంత్రి మొదలు భటునివఱకే ప్రభుత్వోద్యోగినైన మన్నింపఁడు. ఒకసారి శాసన ధిక్కారముచేసినవారియెడ, తూష్ణీంభావము, అసహ్యము, జుగుప్స తప్ప నితర భావము లతనిలోఁ గలుగవు. అతనిలో మిశ్రమము లేదు. అపవాదము

లంగీకరింపఁడు. "ప్రభుత్వోద్యోగి వంచింపఁబడ లేఁడు. న్యాయాధిపతి తప్పు చేయఁడు" అనుచు వెంటనే "వారి పతనమనివార్యము. వారినుండి మంచి పుట్టదు" అనును. మానవ శాసనమునకుఁ బిశాచములను సృష్టించు నధికార మున్నదని చెప్పి వారిని పైకెక్కనీక కాలభైరవములను గాపుంచు నతివాదుల యభిప్రాయముతో సంపూర్ణముగ నేకీభవించును. నిర్వికారుఁడు. గంభీరుఁడు, నిష్ఠురుఁడు. కఠిన స్వప్నములు గాంచువాఁడు. అంధవిశ్వాసులందఱవలె వినయుడు-గర్వి. ఉదాసీనమగు నతని చూపు పిడిసానవలె తొలుచుకొనిపోవును. అతని జీవితమంతటిని ఈ రెండు పదము లలో సంగ్రహింపవచ్చును-మెలఁకువ, పొంచుట. ఎన్నివంకఱల నుండియైన నేఱు త్రోవను తీఁగలఁడు. అంతరాత్మను ఉప యుక్తతతో, మతమును బాధ్యతతో బంధించి, గూఢచారి యయ్యెను. అతని చేతులఁబడినవాఁడు ముగిసినట్లే! తన తండ్రి గాలేనుండి తప్పించుకొన్న అరెస్టుచేయును. సెలవుదాఁటి నిలచిన తల్లినైన నిరసించును. ఆ జీవితము కష్టపూర్ణము, ఐకాంతికము, రాగరహితము, నిష్కళంకము. ఆ బ్రతుకునకు వినోదమే లేదు. ఉడుము పట్టు డ్యూటీ. పోలీసుపనియే ఆ డ్యూటీ. అనుకంపాస్పర్శయు లేని అపరాధశోధకుఁడు. అతి భయంకర నీతిపరుఁడు. నేరములను వెల్లడి చేయుటలో ముందు వెనుకలు చూడని పాషాణ హృదయుఁడు.

జేవర్ మూర్తి యంతయు గూఢచారి-నేర ప్రకాశ కుఁడు. అతని నారెండింటి చిహ్న మనవచ్చు. హ్యాటులో అదృశ్యమై ఫాలముండును. కనుబొమలచే కప్పఁబడి కన్నులు

మనకుఁ గనఁబడవు. మెడపట్టీ క్రింద అణఁగి గడ్డము కాన రాదు. చొక్కా చేతియంచులలో మునిగి హస్తములు దృష్టి కందవు. కోటులో దాచుకొన్న కఱ్ఱ చూపునఁబడదు. కాని, సమయము వచ్చెనా, ఉన్నట్టుండి యొక్కసారిగ, ఈ ఛాయ నుండి పొంచి పైఁబడువానివలె (నవివోలె) సంకుచితోన్నత ఫాలము, అమంగళదృష్టి, బెదరుగొల్పు గడ్డము, విశాల హస్తములు, రాకుస గదయు దుముకును.

తీఱికవేళ నరుదుగ సరిపడకున్నను బుస్తకములు చదువును. కావున, నిరక్షరుఁడు కాఁడు. అతఁడు మాటలను ఒక విధముగ నూదిపలుకుటే యంశమును వెల్లడించును.

చెడ్డ యలవాట్లతనిలో లేవు. ఆత్మతృప్తి కలిగినపుడు ఒక చిటుక నస్యమును పీల్చును. అందుచే నతని మానవత్వము నిరూపితమగును.

న్యాయశాఖా మంత్రిచే "ఇండ్లు లేనివారు" అని వర్ణింపఁబడిన వారికి జేవర్ రాక అశనిపాతము. దృష్టి ప్రాణ హానికరము.

అట్టి యుగ్రుఁడీ శాంతి రక్షకుఁడు.

మాంష్యర్ మాదలిన్‌మీఁద నిరంతరము పొదిపిన కన్నువలె జేవరుండెను. ఆ కంట ననుమానపు టూహాలు నిండుకొన్నవి. మాంష్యర్ మాదలిన్ ఎట్టకేలకిది కనిపెట్టెను గాని, లెక్కసేయఁడయ్యెను. జేవర్‌ను బ్రశ్నింపలేదు. అతనిని డగ్గఱలేదు, వైదొలఁగలేదు. అసహ్యము, అలజడి కరమునగు నాతదేక దృష్టిని లక్ష్యము సేయనట్లు కనుపించెను.

అందఱియెడవలె జేవరునెడలను దయఁజూపి సరళముగనే ప్రవర్తించుచుండెను.

జేవర్‌లోని యుత్సుకత యిచ్ఛానముద్భవముకాదు-ప్రేరణాజనితము. దాని ప్రోద్బలమున మాంష్యూర్ మాదలిన్ గతజీవిత చిహ్నములకై రహస్య శోధనచేయుచు వచ్చినాఁడు. ఒకసారి తనలోనే "ఆఁ, చిక్కినాఁడు" అనుకొనెను. అటుపై మూఁడుదినములు ఆలోచనాధీనుఁడై యొక్కమాఱైన నాడ కుండెను. చిక్కిన కిటుకు పెటిలిపోయెను గాఁబోలు.

మానవునిలో పొఱపడనిదేదియు లేదు. ప్రేరణను జెదరఁగొట్టి, వెన్నాడి యోడింపవచ్చును. దానిలోని వైచిత్ర్యమే యది. అట్లేకానిచో నది తెలివి కతీతమగును. పశువు, మానవునికంటె శుద్ధవికాసము కలదగును.

మాంష్యూర్ మాదలిన్‌లోఁ గన్పట్టిన సహజవైఖరి, స్థిమితత్వము, జేవర్‌ను తబ్బిబ్బులు గొల్పియుండును.

ఒకనాఁడతని విచిత్ర వర్తనము మాంష్యూర్ మాదలిన్ మనస్సున కెక్కెను. సందర్భ మిది:

# 6

ఒకనాఁడు జాళ్ళుపఱువని సందులో మాంష్యూర్ మాదలిన్ పోవుచుండెను. అఱపులు విని ఒక గుంపు కూడియుండుట చూచి యక్కడికేఁగెను. ఫాదర్ ఫకల్వెంట్ అను ముదుసలి, గుఱ్ఱము పడిపోవుటచే బండిక్రిందఁ బడియుండెను.

అప్పటికింకను మాంష్యూర్ మాదలిన్‌పైన వైరభావ మున్న కొద్దిమందిలో ఫకల్వెంటొకఁడు. అతఁడు కోర్టులో

దస్తావేజులకు ముద్రవేయువాఁడు. పల్లెటూరివారిలోఁ బండి తుఁడు. చాలకాలముగ ఆ ముద్రాధికారము వహించి యుండెను. మాదలిన్ పచ్చుసరికతని ప్రతిష్ఠ తగ్గుచుండినది. వృత్తివిద్యావంతుఁడైన తాను క్షీణించుచుండ, నీ కేవల కార్మికుఁడు తన కండ్ల యెదుట ధనవంతుఁడగుచుండెను. ఇది యతని నీర్ష్యాపూర్ణు నొనర్చెను. మాదలిన్‌కు హానిచేయుటకు నవకాశము చిక్కినపుడంతయుఁ బ్రయత్నించినాఁడు. పిదప, దరిద్రదేవత నెత్తికెక్కినది. ఒక గుఱ్ఱము బండి మాత్రము మిగిలెను. ఆలుబిడ్డలు లేరు కావున బండి తోలి పొట్టపోసి కొనసాగినాడు.

గుఱ్ఱము తొడలు విఱిఁగినవి. అది కదలఁజాలకుండెను. ముసలివాఁడు చక్రములమధ్య ఇఱుకుకున్నాఁడు. దురదృష్ట వశమున బండి భారమంతయు నతని ఱొమ్ముమీఁదనే పడినది. ఫాదర్ ఫకల్వెంట్ గుండెలవియ మూల్గుచుండెను బయటి కీడ్వఁజూచిరికాని, సాధ్యము కాలేదు. ఏమి పొఱ పాటు జరిగినను నతఁడు నలిగిపోవును. క్రిందినుండి బండిని పైకి లేపినఁగాని, అతనిని దప్పింప వీలులేదు. సమయమున నక్కడికి వచ్చిన జేవర్, జాక్‌ను తేఁబంపెను.

మాంష్యర్ మాదలిన్ రాక చూచి, గౌరవముతో జనులు వెనుక కొత్తిగిలిరి.

"సహాయము! ముదుసలి ప్రాణము గాచు సత్పురుషుఁ డెవ్వఁడును లేఁడా?" యని ఫకల్వెంటఱచెను.

మాంష్యర్ మాదలిన్ నిలుచున్నవారివంక తిరిగి "ఎవరిదగ్గఱనైన గునపమున్నదా?" అని ప్రశ్నించెను.

ఒక కర్షకుఁడు—తేఁబోయినారు.

మా—తెచ్చుటకెంత ప్రొద్దగును?

క—ఇక్కడికిఁ జాల సమీపమున నొక కొలిమియున్నది. అయినను బదునైదు నిముసములు పట్టును.

మా—కాల్గంట!

ముందు రాత్రియే వర్షము పడినది. నేల మెత్తఁబడి యుండెను. నిమిష నిమిషమునకును బండి దిగఁబడుచుండెను. దానితో వృద్ధుని ఱొమ్ముమీఁద బరువెక్కువగుచుండెను. ఇంక నైదు నిముసములకు ఱొమ్ముముకలు విఱిగిపోవును.

మా—కాల్గంట ప్రొద్దు కాచుకొని యుండఁజాలము.

క—తప్పదు. కాచి తీరవలెను.

మా—కాని, అది నిరుపయోగమగును. బండి త్వర త్వరగా భూమిలోనికి దిగుచుండలేదా?

క—ఏమి చేయగలము?

మా—ఒక మనుష్యుఁడు బండి క్రిందికిఁ బోయి, వీపుపై నెత్తుట కింకను నెడమున్నది. అర్ధ నిమిషములో పాపమా వృద్ధుఁడు వెలువడును. ఇక్కడ నెవ్వరికిని బలసాహసములు లేవా? అయిదు లూయీలిత్తును.

గుంపులోని వారెవ్వరును గదలలేదు.

మా—పది లూయీలు!

నిల్చుండినవారు క్రిందఁ జూపులు బఱపిరి. వారిలో

నొకరిట్లనిరి. "అతఁడతిస్థూలకాయుఁడై యుండవలెను. చిదుగై పోవ సిద్ధపడవలెను."

మా-రండు, ఇరువది లూయిూలు.

నిశ్శబ్దము.

"ఇచ్ఛాలోపమెవ్వరిలోను లేదు" అని యొక కంఠము వినవచ్చెను. మాదలిన్ ఆవైపు తిరిగి చూచునుగదా-జేవర్. తాను వచ్చినపుడతనిని చూడనేలేదు.

జే-బలలోపము. వీపుమీఁద ఈ బండిని లేపఁగలవాఁడద్భుత పురుషుఁడై యుండవలెను.

పిదప స్థిర నిశ్చల దృష్టితో మాదలిన్‌ను జూచుచుఁ బ్రతిపదము నూది యిట్లనెను. "మాంష్యర్ మాదలిన్! మీరు చెప్పుచున్న పని చేయఁగలవాని నొకఁడినే యెఱుఁగుదును."

మాదలిన్ కంపించెను.

ఉదాసీనుని విధముగఁ గన్పట్టుచు మాదలిన్‌నుండి దృష్టి మఱల్పక జేవర్ మఱల నిట్లనెను "అతఁడొక ఖైదీ."

మా-ఆఁ!

జే-టూలన్ గాలీలలో.

మాదలిన్ తెల్లఁబోయెను.

బండి తిన్నఁగా నిష్ఠురముగా దిగఁబడుచునేయున్నది. ఫాదర్ ఫకల్వెంట్ మొఱపెట్టుచుండెను. "చచ్చిపోవుచున్నాను! ఎముకలు పగులుచున్నవి! జాక్! ఏమైనా-! అయ్యో!"

మాదలిన్ చుట్టును బరికించెను.

మా—ఇరువది లూయిూలు సంపాదించి యీ దీనుఁడగు ముదుసలి ప్రాణము రక్షింపఁదలఁచువాఁడు లేఁడా మఱి.

మూగినవాఁడొక్కఁడును జలింపలేదు.

జే—ఈ పనిచేయఁ గలవాని నొక్కనినే నేనెఱుఁగు దును-ఆ ఖైదీ.

"ఆఁ! నలిగిపోయితిని!" అని వృద్ధుఁడు ఘోషపెట్టెను.

మాదలిన్ తల పైకెత్తి, తనయందే లగ్నమైన జేవర్ గృధ్రదృష్టి నెదుర్కొని, కదలని కర్షకులను జూచి, విషాద హాసము చేసెను. ఒక్కమాటయు నాడక, మోకాళ్ళపై బడి, గుమిగూడినవారు పెదవినైనఁ గదల్పఁగలుగుటకు ముందే, బండిక్రిందఁ బ్రాకెను.

అనిశ్చయతా నిశ్శబ్దములతోఁ గూడి ఆ నిముసము భయంకరమయ్యెను.

ఆ ఘోర భారము క్రింద సాపుగా పండుకొని, మోచేయి మోకాళ్ళను దగ్గఱకుఁ దెచ్చుటకు మాదలిన్ రెండుమారులు నిష్ఫల ప్రయత్నమొనర్చెను. "ఫాదర్ మాదలిన్! అక్కడినుండి వచ్చివేయుడు!" అని చూపరు లాక్రందనము చేసిరి. వృద్ధఫకల్వెంటుకూడ "మాంప్యెర్ మాద లిన్! పొండు! నేను జావవలసినదే. మీకుఁ గన్పడుటలేదా? నన్ను వదలివేయుఁడు! మీరును నలిగిపోదురు" అని మంద లించెను. మాదలిన్ బదులు పల్కఁడయ్యెను.

నిలుచుండినవారి యూపిరి యాగినట్లయ్యెను. చక్రము లింకను దిగుచున్నవి. ఇప్పటికిఁ దాను తప్పించుకొనుటయు మాదలిన్ కసాధ్యమయ్యెను.

ఉన్నట్టుండి యా మహాభారము కదలి బండి తిన్నగాఁ బైకిలేచెను. చక్రములు సగము గుంతనుండి వెలువడెను.

లు_త్తకంఠ మొకటి "త్వరగా! పట్టండి!" అని విలపించినట్లనెను. అది మాదలిన్ దే. అతఁడు తుది యత్నము చేసినాఁడు.

అందఱును ముందుకుఱికిరి. ఒక మనుష్యుని పట్టుదల యందఱకును ధైర్యమిచ్చెను. ఇరువది చేతులు బండిని లేపెను. వృద్ధ ఫకల్వోంట్ రక్షింపఁబడెను.

మాదలిన్ లేచెను. చెమ్మటలోడుచున్నను, ముఖము పాలిపోయినది. బట్టలు చినిఁగి బుఱదమయమైనవి. అందఱును వెడ్చిరి. వృద్ధుఁడాతని పదములంటి "నా పాలిటి దేవుఁడ" వనెను. మాదలిన్ ముఖమున వర్ణనాతీతమైన యానంద ముతోఁ గూడిన దివ్యబాధ ముద్రితమయ్యెను. ప్రశాంత నయనమును జేవర్ వంకఁద్రిప్పి యతఁడింకను నిశ్చలదృష్టిని దన్నే చూచుచుండుట పొడఁగనెను.

# 7

ఆ పాటులో ఫాదర్ ఫకల్వోంటు మోకాలు విఱిగినది.

ఫాదర్ మాదలిన్ కార్మికులకని యేర్పాటు చేసియుండిన ఆస్పత్రి కతనిని దీసికొని వెళ్ళి మాదలిన్ చికిత్స చేయించెను. ఇరువురు సన్యాసినులక్కడ నర్సులుగాఁ బనిచేయుచుండిరి. మఱునాఁడుదయమునఁ దన ప్రక్కనున్న బల్లపైన ఒక వేయి ఫ్రాంకుల బిల్లును మాదలిన్ స్వహస్తాక్షరములతో "నీ గుఱ్ఱమును బండిని నేను విక్రయమునకుఁ దీసికున్నాను." అను చీటియు ఉండెను. గుఱ్ఱము చచ్చినది-బండి విఱిగినది. ఫకల్వోంటు కుదురుకొనెను. కాని, మోకాలు వంగకుండెను. ఆ సన్యాసినులు వ్యక్తేలిచ్చిన సిఫారసు మూలమున ఫాదర్

మాదలిన్ అతనిని పారిస్‌లో ఒక కాన్వెంటున దోటమాలిగా చేర్పించెను.

తరువాతఁ గొద్దికాలముననే మాంష్యర్ మాదలిన్‌ను మేయరుగా నియమించిరి. నగరముమీఁద సంపూర్ణాధికారము నిచ్చు మేయర్ దుస్తులను ధరించిన మాదలిన్‌ను ప్రథమమునఁ జూచినపుడు తన యజమాని యుడుపులలో తోడేలును బసి పట్టిన బుల్‌డాగ్‌వలె జేవర్ కటకటపడెను. అది మొదలు వీలైనంతవఱకతనికిఁ దొలఁగి చనుచుండెను. సేవాధర్మము నియమించినపుడు, తొలఁగి పోవ వీలులేనపుడు, అతి గౌరవముతో మాటాడును.

ఫాదర్ మాదలిన్ కల్పించిన సార్వజనిక సంపత్పరిణామము, ఇదివఱకు మనము వివరించిన దృశ్యమాన చిహ్నములందు మాత్రమే కాక, కనుపించని యొండొక చిహ్నముననువెల్లడి యయ్యెను. ప్రజలు దారిద్ర్యపీడితులై, పనిపాటలులేక, వ్యాపారము పడిపోయినపుడు పన్నులకెదురు తిరుగుదురు. చట్టమిచ్చిన కాలము దాటిపోయినను గట్టరు. వసూలు చేయుటకై ప్రభుత్వమున కెంతో వ్యయమగును. చేతినిండుగఁ బనియుండి, దేశము సంపన్నమై సుఖముగ నున్నపుడు పన్ను తనంత వసూలగును. దానికై ప్రభుత్వము వెచ్చింపఁ బని లేదు. పన్ను వసూలు వ్యయము దారిద్ర్యైశ్వర్యములు కొలుచు ధర్మామీటర్. ఏడేండ్ల లోపల, మ-పన్ను వసూలు వ్యయములు మూఁడునంతులు తగ్గెను. కావున ఆర్థిక మంత్రి పలుమాఱులీ జిల్లాను ప్రశంసించెను.

ఫాంటైన్ మఱలి వచ్చినప్పటి స్థితియది. ఆమె యెవ్వరి

కిని జ్ఞప్తిలేదు. అదృష్టమాయని మాదలిన్ ఫ్యాక్టరీ యాహ్వానింప సిద్ధముగానుండెను. అక్కడికి వెళ్లెనో లేదో, పనిలోఁ జేర్చుకొనిరి. ఆమెకా పని క్రొత్త. చాకచక్యము లేదు. పెద్ద కూలి లేదు. కాని, వచ్చినదే చాలు. సమస్య తీఱినది. బ్రతుకునకు లోటులేదు.

# 8

త్రానెట్లు జీవించుచున్నదియు గ్రహించినపుడు ఫాంటైన్కు క్షణికానందము కలిగెడిది. మర్యాదతోఁ గాయకష్టముచేసి జీవించుట దివ్యప్రసాదము! కృషిపైయభిరుచి యామెలో మఱలివచ్చెను. ఒక యద్దమును గొని, తన యౌవనము, అందము చిందు శిరోజములు దంతములు చూచి మురిసి,ఎన్నిం టినో మఱచి, కోజెత్తును భవిష్యదవకాశములను దప్ప నితరము లను గుఱించి యాలోచింపక చాలమట్టుకు సుఖముగనుండెను. చిన్న గదిని బాడుగకుఁ దీసికొని, రాఁబోవు బత్తెముపై నప్పు జేసి గృహోపకరణములను దెచ్చెను. అపక్రమమైన యలవాటు ముక్క!

పెండ్లియైనట్లు చెప్పికొన వీలులేక, తన చిన్ని కూఁతును గుఱించి చెప్పకుండుటకై యతి జాగ్రత వహించుచుండెను.

మొదట మొదట తేనార్డియర్లకు నెల నెలకు డబ్బు పంపెడిదని చెప్పితిమి. చేవ్రాలు చేయుటే నేర్చినదికాన, వ్రాయసకానితో జాబులు వ్రాయించెడిది.

జాబులు పలుమాఱు వ్రాయించెడిది. ఇది కనిపెట్టిరి. ఆడువారి ఫ్యాక్టరీలో"ఫాంటైన్ జాబులు వ్రాయుచున్న"దని,

"ఒయ్యారి" యని గుసగుసలు బయలుదేరెను. తమకు సంబంధించని విషయములలో జోక్యము కలిగించుకొనుటందఱకును బరమానందకరము. "అతఁడెందుకుఁ జీఁకటిపడునంతవఱకు ఇల్లు చేరఁడు?" "వాఁడెందుకు సందుగొందులఁ బడిపోవును?" ఈ యసంబంధ సమస్యా వివరణమునకై పదిమంచిపనులకు వలయునంత ధనము, కాలము, కష్టము వెచ్చించువారు కలరు. ఉత్సుకత్వముతప్ప దానికి వేఱు ప్రతిఫలము లేదు. ఇట్లు వెల్లడియైన రహస్యములు, సమస్యలును మహాపదలకు దగవులకుఁ, గుటుంబనాశములకును దారితీసి జీవితములను దుర్భరమొనర్చి, యే సంబంధమును లేనిదే వానిని గనిపెట్టిన వారి కత్యానందము గూర్చును. ఎంత విషాదకరము!

నాలుక తీటయే కొందఱను అపకారబుద్ధులుగాఁ జేయును. వారి సంభాషణలు,చావిడి వదఱులు, నంటింటి గుసగుసలును గట్టెలను క్షణములో కాల్చివేయు గాడిప్రొయ్యి వంటివి. ఇరుగు పొరుగులే వారిపాలిటి కట్టెలు.

కావున, ఫాంటైన్‌ను గమనించుచుండిరి.

ఇదిగాక, ఎందఱో ఆమె కేశసౌభాగ్యమునకు ధవళ దంత సౌందర్యమునకు ఈర్ష్యాళువులై యుండిరి.

అందఱి యెదుటనే ఫాక్టరీలోఁ దలప్రక్కకుఁద్రిప్పి కనులు నిండిన నీరు తుడుచుకొనెడిదందురు. అప్పుడు తన శిశువు జ్ఞప్తికి వచ్చియుండును. మఱి, తాను ప్రేమించియుండిన వాఁడును స్మృతి దగిలియుండును కాఁబోలు.

గత ప్రేమానుబంధములు ద్రెంచుకొనుట దుఃఖ నిబిడకార్యము.

నెలకు రెండుసారులైన వ్రాయుననని, ఎల్లపుడొక్కడే పైవిలాసమున కని, బదులు జాబులకు స్టాంపులు పంపుననియుఁ దెలిసికొనిరి. అడ్రసునుగూడ సంపాదించిరి-మూంప్యర్ తేనార్డియర్, హోటల్ యజమాని, మాంట్ఫర్మిల్. త్రాగుబోతైన ఆ వ్రాయసకాఁడు తప్పఁద్రాగినపుడీ వృత్తాంతము చెప్పివేసెను. ఫాంటైన్కొక బిడ్డయున్నదని స్పష్టమైపోయెను. "ఆఁ! అది యట్టిదే యైయుండవలెను!" ప్రాఁతవడిన వడలుబోతొక్కతె మాంట్ఫర్మిల్కు పయనించి తేనార్డియర్లతో మాటాడివచ్చి "ముప్పదైదు ఫ్రాంకులు వ్యయమైనను, అన్నియుఁ దెలిసికొంటిని. ఆ బిడ్డనే చూచితిని!" అని తృప్తి ప్రకటించెను.

ఈ ఘనకార్య మొనర్చిన యధిక ప్రసంగి యొక ముసలిముండ. దానిపేరు మాడం విక్టర్నిన్. అందఱి శీలమును గాపాడి గాచునది. ఏఁబదాఱేండ్ల వృద్ధ. వికారరూప. అదఱు కంఠము కల చపల. ఈ యాఁడు దొకప్పుడు యువతి యనుటే చిత్రముగ నుండును. యౌవనదశలో 1793 న ఒక వాన ప్రస్థునిఁ బెండ్లాడెను. కోపి, మొఱకు, విరసురాలు, దుర్జిహ్వ, విషహృదయ. తన్ను బ్రతికినన్నాళ్ళు శాసించి కఠినముగా నణఁచిన ఆ భర్తను మఱచినదికాదు. గానుచే గాయముగన్న ముండ్లకంపయది. తన స్వల్పాస్తిని ఒక మఠమున కత్యాడంబరముతో నిచ్చెను. ఈ పూజ్యురాలు మాంట్ఫర్మిల్ యాత్ర చేసి వచ్చినది.

ఈ కలాపమునకంతయుఁ గొంతకాలము పట్టెను. ఫాక్టరీలో ఫాంటైన్ సంవత్సరమునకుఁ బైఁబడియుండెను. ఒక

ప్రాతఃకాలమున ఫాక్టరీ ఓవర్సీయర్, మేయరు తరపున ఆమెకేఁబది ఫ్రాంకులిచ్చి, ఇంకనామె యవసరములేదని, ఆ యూరు విడువవలసినట్లు మేయరుత్తరువని తెలిపెను.

ఈ నెలలోనే తేనార్డియర్లు పదునైదు ఫ్రాంకుల ప్రకార మీవలెనన్నది.

ఫాంటైన్‌కు పిడుగు పడినట్లయ్యెను. ఊరెట్లు విడిచి పోఁగలదు? ఇంటికి ఫర్నిచర్‌కు బాడుగ బాకీ. ఏఁబది ఫ్రాంకులా యప్పు తీర్చుటకే చాలదు. ఏవో ప్రార్థేయ వాక్యములాడెను. వెంటనే ఫాక్టరీ విడిచిపోవలెనని ఓవర్సీయర్ బదులు చెప్పెను. నిరాశకంటె అవమానము తన్ను ముంప, గది చేరుకొనెను. తన తప్పిప్పుడందరకును దెలిసిపోయినది!

ఒక్క మాటాడుటకైన శక్తి లేదు. మేయర్‌ను జూడుమని సలహా చెప్పిరి. కాని ధైర్యము చాలలేదు. న్యాయపరుఁడు గాన, బంపివేసెను. దయాళువగుటచే ఏఁబది ఫ్రాంకులిచ్చెను. ఈ నిర్ణయమున కామె తల వంచెను.

# 9

ఇట్లా వానప్రస్థ వితంతువొక సత్కార్యము చేసెను.

మాంష్యర్ మాదలిన్‌కిది యేమియుఁ దెలియదు. జీవితమిట్టి సంకీర్ణ సంఘటనలతో నిండియుండును. ఆఁడువారుండు ఫ్యాక్టరీ భాగము ప్రవేశించు అలవాటే మాదలిన్‌కు లేదు.

ఆయన యొక వృద్ధ బ్రహ్మచారిణిని స్త్రీ కార్మికులపై పర్యవేక్షణకై నియమించియుండెను. ఆమె క్యూరె సిఫారసు

మీఁద వచ్చినట్టిది. మాదలిన్ కామెమీఁదఁ బరిపూర్ణ విశ్వాసము. ఆమెయు గౌరవనీయ,దృఢచిత్త, న్యాయశీల, సత్యవతి. ఇచ్చుటలోఁ బూర్ణ దానబుద్ధి కలది. కాని, పరుల పరిస్థితులక్ష్యము చేసికొని క్షమించుటకా దానగుణము చాలలేదు. మాంప్యర్ మాదలిన్ అన్ని విషయములామెకే యొప్పగించెను. అత్యుత్తములైనను అప్పుడప్పుడు తమ యధికారమును ఇంకొకరి పరము చేయవలసి వచ్చును. ఈ సంపూర్ణాధికార నిర్వహణమునఁ, దాను న్యాయమునే చేయుచుంటినను విశ్వాసముతో, ఓవర్సియర్ అపరాధ నిర్వచనముచేసి, విచారించి, శిక్షచెప్పి ఫాంటైనను నా శిక్షకు గురిచేసెను.

భిక్షుకుల కిచ్చుటకని, స్త్రీ కార్మిక సహాయార్థమని మాంప్యర్ మాదలిన్ ఒక నిధి నేర్పఱచియుండెను. దీనికి ఓవర్సియర్ లెక్క చెప్పవలసిన పనిలేదు. ఏఁబది ఫ్రాంకు లందలివి.

ఇరుగు పొరుగుల యిండ్లలో సేవకా వృత్తికై ఫాంటైన్ ప్రయత్నించెను. ఎవరికిని గాఁబట్టలేదు. ఊరు విడిచి పోవీలులేదు. ఫర్నిచరు (గృహోపకరణములు-కుర్చీలు, బల్లలు మున్నగునవి) బాడుగకిచ్చినవాఁడు "వెళ్ళిపోతివా, దొంగవని యరెస్టు చేయింతును" అని బెదరించెను. ఇంటి యజమాని "వయోరూపము లున్నవికదా! బాకీ తీర్చుట కష్టమా?" యనెను. ఏఁబది ఫ్రాంకులను వారికిఁ జెరిసగమిచ్చి, మూఁడు వంతులు ఫర్నిచరును వెనుకకిచ్చివేసి, కేవల మవసరమైన దాని నుంచుకొనెను. పనిలేదు. పరువులేదు. తుదకు మిగిలినది తన పరువు, ఏబది ఫ్రాంకుల ఋణము.

సోల్జర్లకు ముతక యంగీలు కుట్టి దినమున కాఱు పెన్నీలు సంపాదింప మొదలిడెను. కూతురి కర్చు ఐదు పెన్నీలు. ఈ సమయముననే తేనార్డియర్లకు బాకీ పడుచుండినది.

కాని, తానింటికి వచ్చుసరికి దీపము పెట్టుచుండిన ముసలి యొకర్తె కటిక పేదజీవితము కడపు విధానము నేర్పెను. అత్యల్పాదాయముతో జీవించుట కొక్కయడుగు వెనుక శూన్యముతో జీవించు చమత్కృతి కలదు. అవి రెండు గదులు-మొదటిది మసక, రెండవది చీఁకటి.

శీతకాలమున నిప్పులేక బ్రతుక నేర్చెను. రవికెను కిటికీ ముసుగుగ, కిటికీ ముసుగును రవికెగా మార్చ నేర్చెను. ఎదురింటి కిటికీ వెలుతురులో భుజించి మైనపువత్తి కర్చు పొదుపుసేయ నేర్చెను. దారిద్ర్యముతోఁగూడిన మర్యాదతోఁ దలపండినవారు, ఒక్క కాసునుండి యెంత పిండఁగలరో కొద్దిమందికే తెలియును. కడపటికిది ప్రతిభగాఁ బరిణమించును. ఫాంటైన్ ఈ యద్భుత ప్రతిభ సంపాదించి కొంత ధైర్యము వహించెను.

ఆ పరిస్థితులలో, ఒక పొరుగావెతో ఇట్లు చెప్పెను. "ప్చ! నన్నిట్లూ అడించుకొందును: ఐదుగంటలు మాత్రము నిదురించి, మిగిలిన కాలమునంతయుఁ గుట్టుపనిచేసినఁ దిండి కెప్పుడును గొదువయుండదు. అదిగాక, దుఃఖము తిండి తగ్గించును. కష్టములు, వేదనలు, ఒకచేత రొట్టెముక్క, ఇంకొక చేత విచారము-ఇవియన్నియు ప్రాణము నిలుపును."

ఈ దుస్థితిలోఁ గూతురు చెంతనుండెనేని ఎంత సుఖముండెడిది? తెచ్చుకొందమనుకొనెను. కాని, ఆ బిడ్డయుఁ దన

దారిద్ర్యము పంచుకొననలెనుగదా? థేనార్డియర్ల బాకీయో? ఎట్లు తీర్చవలెను? రాను పోను దారి వెచ్చములకెట్లు?

ఇక్కడ నూజట గొల్పునది దారిద్ర్యజీవిత పాఠము నేర్పిన ముదుసలియే. ఆమె దైవపరాయణ. అతి దరిద్రురాలు. అట్లయ్యుఁ బేదలను ధనికులనుగూడ కనికరించునది. చేవ్రాలు చేయుటే వచ్చిన చదువంతయు. ఈశ్వర విశ్వాసమే ఆమె శాస్త్రజ్ఞానము. తగ్గుదశలలో నిట్టి యుత్తములెందఱోకలరు. ఒకనాఁడత్యున్నత స్థానమునందుందురు. ఈ జీవితమునకు రేపున్నది.

మొదటలో, సిగ్గుపడి ఫాంటైన్ ఇంటికంటిపెట్టుకొని యుండెను. వీధిలో నున్నపుడు, అందరును తనవంకఁ దిరిగి వ్రేలు చూపుచున్నట్లూహించును. అండఱును జూతురుగాని పలుకరింపరు. నిశితము విరసమునైన వారి యుదాసీనత ఫాంటైన్ దేహాత్మలను జీల్చివైచెడిది.

చిన్నయూళ్ళలో అభాగ్యలందఱు యౌత్సుక్యమునకుఁ బరిహాసమునకు గుఱియగుదురు. పారిస్‌లోనైన నిన్నెవ్వరు నెఱుఁగరు. ఆ యప్రాధాన్యమే యంగరక్ష. పారిస్‌కుఁ బోవలె నని యెంత యువ్విళ్ళూరినది! అసాధ్యము!

దారిద్ర్యమునకు వలెనే పరుల యౌదాసీన్యమునకు నగౌరవమునకును నలవాటు పడక తప్పదు. ఇంతింతగా నేర్చుకొనెను. రెండు మూఁడు నెలలు జరుగఁ జీఁకటికొట్టు విడిచి వెలుపలికి వచ్చెను. "అన్నియు నొకటే" యనుకొనెను. తల నిక్కఁ బొడుచుకొని, కఠిన హాసముతో, వచ్చుచుఁ బోవుచు లజ్జాహీననైతినని భావించెను.

తన కిటికీ ప్రక్క నడచి పోవుచున్న ఫాంటైను నప్పుడప్పుడు మాడం విక్టర్నిన్ చూచి, ఆ "పాపి" దుస్థితిని గమనించి "యథా స్థానమునకు" దానిని బంపినం దనను తానే యభినందించుకొనును. ఖలులకు దుష్టానందము కలదు.

విరామములేని పని ఫాంటైను నలయించెడిది. తొలుత నే యుండిన పొడి దగ్గధికమయ్యెను. అప్పుడప్పుడా ముదుసలి మిత్రురాలితో "నా చేతులెట్లు కాలిపోవుచున్నవో చూడుము" అనును.

ఏది ఎట్లున్నను ఉదయము పగిలిన చెక్క దువ్వెనతో అలలవలె నేలకు దిగు తన పట్టు నెంట్రుకలను దువ్వుకొనునపుడు క్షణిక సంతోష మనుభవించును.

# 10

చలికాలము కడపటి దినములలో నామె యుద్యోగ మూడినది. వేసవి కడచిపోయెను. మఱలం జలికాలము వచ్చెను. కుఱుచ దినములు—తక్కువ పని. చలికాలములో వెలుంగు లేదు, వేఁడిలేదు, మధ్యాహ్నము లేదు. సాయంత్ర ముదయమును స్పృశించుచుండును. పొగమంచు, కిటికీ యావిరిచేఁ గప్పఁబడి యుండును. స్పష్టముగా నేదియుఁ జూడఁ జాలవు. ఆకస మొక బ్రహ్మాండమైన గుహాముఖము. అహస్సమయమే గుహావలె నుండును. సూర్యుఁడు (పాపరు) నిర్ధనివలెఁ గనుపట్టును. భయంకర ఋతువు! స్వర్గజలమును, మానవ హృదయమును పాషాణముగా మార్చివేయును! అప్పుల వారామెను బాధింపసాగిరి.

ఫాంటైన్ సంపాద్యము చాల తక్కువ. అప్పులధిక మైనవి. తేనార్డియర్లకు తక్కువ డబ్బు పంపుచుండుటచే వారు పలుమాఱు వ్రాయుచుండిరి. ఆ యుత్తరములలోని విషయము లామె గుండెల నదుముచుండెను. పోస్టు కర్చులు పీల్చి పిప్పి చేయుచుండెను. ఒకనాఁడు, చలికాలమున ధరించుటకు కోజెత్తుకు ఉన్ని గౌను కావలెనని అన్ని బట్టలు చినిఁగిపోయిన వని పది ఫ్రాంకులైనఁ దక్షణమే పంపి తీఱవలెనని జాబు వచ్చెను. దినమంతయు జాబును చేత నలుపుచుఁ గూర్చున్నది. సాయంత్రము పడఁగనే మంగలి యంగడికి వెళ్ళి ధమ్మిల్ల బంధము విప్పినది. నితంబములు కప్పి, వాటి నిగనిగలాడుచు సువర్ణకేశరాశి యంగడి వాని కనులకు మిఱుమిట్లు గొల్పెను.

అం—"ఎంత సుందరమైనవి!"

ఫాం—ఆ వెంట్రుకలిచ్చిన ఏమిత్తువు?

అం—పది ఫ్రాంకులు.

ఫాం—కత్తిరించి వేయుము.

కుట్టిన గౌనుకొని తేనార్డియర్లకు పంపించెను.

ధనమునకు 'బదులు వచ్చిన వస్తువు తేనార్డియర్లకు వెఱ్ఱి కోపమెత్తించెను. గౌనును ఎపొనిన్ కిచ్చివేసిరి. భర ద్వాజ మింకను జలికి గడగడలాడుచుండెను.

"నా ప్రాణమునకింకఁ జలియుండదు. నా కేశములతో కప్పితిని" అని తృప్తిపడెను. గుండ్రని టోపీతో ఖండిత శిరస్సునుగప్పి యింకను అందగత్తెగనే యుండెను.

ఆమె హృదయమున నొక ఘోరపరిణామము జరుగ సాగెను.

కేశసంస్కారము, అలంకరణము చేసికొను అవసర మంతరింపఁగనే, చుట్టునున్న యన్నింటిపై ద్వేషము జనించెను. ఇంతకాలముగా, నందఱవలెనే ఫాదర్ మాదలిన్‌ను గౌరవించుచుండినది. అట్లయ్యు, తనను దఱిమివేసినవాఁడతఁడే యని, తన దౌర్భాగ్యమున కతఁడే కారణమని, పలుమాఱు తలపోసి ద్వేషమునకుఁ జోటిచ్చెను. కార్మికులు, ఫ్యాక్టరీ ద్వారముకడ నున్నపుడావైపునఁ బోవుచో, లేనినవ్వు తెచ్చుకొని కూనరాగములు తీయును. ఒకసారి యిట్లుసేయునపుడొక ముదుసలి కార్మికురాలు గమనించి "ఆ పిల్ల కష్టము తెచ్చుకొనును" అనెను.

క్రోధము సాహసమును బ్రేరేప ఒక సరసునిఁ దెచ్చుకొనెను. వాఁడొక నిర్భాగ్యుఁడు. వీధుల సంగీతము పాడి బ్రతుకువాఁడు. సోమరి. నీచుఁడు. అనుభవించి కొట్టి వీధులఁబడిపోయెను.

ఇంతయ్యు ఆమె బిడ్డను బూజించుకొనుచుండెను.

అధోగమన మధికమగుచున్నకొలది,నిరాశ యధికమై, హృదయ మధ్యస్థితియైన శిశువు దివ్యప్రభావతియయ్యెను. "నేను ధనికురాలనైనపుడు నా కోజెత్తు నా దగ్గఱనే యుంచుకొందును" అని తల్లి యువ్విళ్లూఱును. ఒకక్షణము ముఖము వికాసవంతమగును. దగ్గు నదలలేదు. రాత్రులు చెమటపోయుచుండెను.

ఒకదినము తేనార్డియర్లనుండి ఇట్లుత్తరము వచ్చెను. "కోజెత్తును అంటువ్యాధి సోఁకినది. మందులవసరము. మేము నాశనమైపోవుచున్నాము. ఇంక మందులు కొనలేము.

వారము లోపల నలుబది ఫ్రాంకులు పంపవేని పిల్ల చచ్చి పోవును.''

ఫాంటైన్ గట్టిగా నవ్వుచు, వృద్ధస్నేహితురాలితో ''ఓహో! ఎంత సుకరము! నలుబది ఫ్రాంకులు! చూడు! అనగా రెండు నెపోలియనులు! ఎక్కడినుండి తెత్తుననుకొనిరో? బుద్ధిలేదా-గొర్రెలు!'' అనెను.

తాపలకడనున్న పడకగది కిటికీ దగ్గఱకువెళ్ళి ఉత్తరమును మఱలఁ జదివెను. పిదపఁ గ్రిందికి వెళ్ళి, గంతులు వేయుచు వెలుపలికిఁ బర్విడెను.

ఎదురుపడినవారెవరో ''ఏమింతానందమునకుఁ గారణము?'' అని ప్రశ్నించిరి.

''ఆ పల్లెగొర్రెలు తెలివిమాలిన పరిహాసమునకు దిగినారు. నలుబది ఫ్రాంకులు కావలెనఁట! గొర్రెలు!'' అని ఫాంటైన్ బదులు పల్కెను.

చవుకుఁ గడచిపోవునపుడు, జనులు గుమిగూడియుండుటను జూచెను. ఒక విచిత్రమైన బండిమీఁద ఎఱ్ఱబట్టలు కట్టుకొని యొకఁ డుపన్యసించుచుండెను. అతఁడైంద్రజాలికుఁడు: ఊరూరు తిరిగి దంత చికిత్స చేయువాఁడును. పూర్తి పండ్ల సెట్లను, నొప్పితగ్గించు మందులు పౌడర్లు అమ్మకమునకుఁ జూపుచుండెను.

ఫాంటైన్ ఆ గుంపులో కలసి యందఱతో పాటతని పదఱులకు నవ్వుచుండెను. ఆ పదఱులలో బూతు అపభ్రంశము మిశ్రమమై యుండెను. ఈ సుందరి నవ్వుచుండుటను జూచి

యతఁడు "నీ పండ్లు అందమైనవి–నీవే–నవ్వుచున్నదానా. ఎదుటి పండ్లు రెంటినిమ్ము. ఒక్కొక్క దాని కొక్కొక బంగారు నెపోలియ నిత్తును."

ఫాం–ఏ పండ్లు?

దం–పై వరుసలోని ముందరి రెండు.

ఫాం–అబ్బా! ఘోరము!

"రెండు నెపోలియనులు! ఎంత యదృష్టము!" అని బోసి నోటి ముదుసలి యొక్క ర్తు గొణిగొణిలాడెను.

ఫాంటైన్ అక్కడినుండి పరుగిడి కంచువలె మ్రోగు చున్న యతని కంఠము వినఁబడకుండుటకై చెవులు మూసి కొనెను. "ఆలోచింపుము ముద్దుగుమ్మా! రెండు నెపోలి యనులు! అవి నీకెంత యక్కఱకు వచ్చును! ధైర్యమున్న సాయంకాలము ఆర్గెంట్ హోటలుకు రమ్ము. అక్కడ నుందును."

పరుగు పరుగున ఫాంటైన్ ఇల్లు చేరుకొనెను. ముదు సలి స్నేహితురాలికీ కథ వివరించెను. "అర్థమగుచున్నదా? అసహ్యమైనవాఁడు కాఁడా? ఇట్టివారిని దేశమున నేల తిరుగ నిత్తురు? ముందటిపండ్లు రెంటిని బెఱికివేయవలెనట! అయ్యో, ఘోరరూపిణి నైపోదును! తల వికారమే చాలు. ఇంకను పండ్లు! ఆహా! ఎట్టి మానవ పిశాచము! అయిదవ యంతస్థు నుండి తల క్రిందులుగాఁ బడఁగలను కాని! ఆర్గెంట్‌లో ఉందు నన్నాఁడు."

ము–ఏమిచ్చెదనన్నాఁడు?

ఫాం–రెండు నెపోలియనులు.

ము-అనఁగా నలుబది ఫ్రాంకులు.

ఫాం-అవును. నలుబది ఫ్రాంకులగును.

ఆలోచన ముంచుకొనిరాగాఁ బని చేసికొనఁబోయెను. ఒక కాలుగంటలో కుట్టుటమాని మేడమీఁదికి వెళ్ళి మఱల నుత్తరము చదివెను.

దిగి వచ్చి స్నేహితురాలినిట్లు ప్రశ్నించెను. "మిలియరీ జ్వర మెట్టిది? నీకు తెలియునా?"

స్నే-ఆఁ. అదియొక వ్యాధి.

ఫాం-దానికిఁ జాల మందులు కావలెనా?

స్నే-అవును. కొంప కూల్చు మందులు.

ఫాం-ఆ వ్యాధి యెట్లు వచ్చును?

స్నే-ఉన్నట్టుండి, ఒక నిముసములో.

ఫాం-పిల్లలకు వచ్చునా?

స్నే-ముఖ్యముగాఁ బిల్లలకే.

ఫాం-ప్రాణాపాయకరమా?

స్నే-మూడు పాళ్ళపాయకరమే.

ఫాంటైన్ వెనుదిరిగి, తాపలపై నిల్చుండి మఱల జాబు చదివెను. సాయంకాలమునందు హోటలువైపు వెళ్ళెను.

మఱునాఁడుదయమున మార్గరిట్-ముదుసలి స్నేహితురాలు-ఫాంటైన్ గదిలో ప్రవేశించెను. ఇరువురును నొక గదిలోనే పనిచేసి యొక దీపపు వత్తితో సరిచేసికొనుచుండిరి. ఫాంటైన్ పడకమీఁద గూర్చుండియుండెను. ముఖము తెల్లబోయి ఉత్సాహము చచ్చినది. పండుకొనిన దేకాదు. టోపీ

మోకాలిపై నున్నది. రాత్రియంతయు వెలిఁగి క్రొవ్వువత్తి యొక్క పిసరు మిగిలియున్నది.

ఆ యసహ్యపు టపక్రమముగాంచి స్తంభించి మార్గరిట్ కడపకడనే నిలువఁబడిపోయెను. "ఓయి దేవుఁడా! వత్తి యంతయు కాలిపోయినది. ఏమో జరిగియుండవలెను" అని సుంత చలించిన ఫాంటైన్ ముండిత శిరస్సును ముఖమును జూచెను. ఈపది గంటలకు ఫాంటైన్ పదేండ్లు దాఁటినట్లుండినది.

మా—ఏమైనది?

ఫాం—ఏమియు లేదు. నా బిడ్డ మందులు లేక, ఆ పాపిష్ఠ వ్యాధికి బలికాదు. నాకుఁ దృప్తికల్గినది.

మిలమిలమనుచున్న రెండు నెపోలియనులను ముదుసలికిఁ జూపెను.

మా—ఓఓ! ఒక నిధి! ఎట్లు సంపాదించితివి?

"సంపాదించితిని" అని ఫాంటైన్ హాసము చేసెను. దీపకాంతి యామె ముఖముపై బడెను. ఆ చిర్నగవు అత్యసహ్యకరము. నోటికొనల రక్తము మరకలు కట్టినది. పైపండ్లు రెండదృశ్యమై నల్లని గుంతలు వానిస్థానమున నున్నవి.

నలువది ఫ్రాంకులు మాంట్ఫర్మిల్ కు రవాణా యయ్యెను.

కోజెత్తు కేవ్యాధియు లేదు. తేనార్డియర్ల డబ్బులాగు పన్నాగమిది.

ఫాంటైన్ అద్దమును గిటికీనుండి పాఱవైచెను. రెండవ యంతస్థునందలి చిన్నగది వదలి, అటకవంటి గూడు ప్రవేశించి పెట్టనాళ్ళైనది. ఆ గూటిలోఁ దలకుఁ గప్పు ప్రతినిముసమును

దాఁకుచుండును. బీదలు తమ గదికొనకో, బ్రతుకుకొనకో నిరంతరమును వంగకపోఁజాలరు. ఇప్పుడామెకు పఱుపులేదు. పూర్వము పఱుపు తిత్తిగా నుండిన వేలికయే తల్పము. ఒక చాప. అవసానదశలోనున్న గడ్డికుర్చీ. గులాబీతొట్టి, ఎండిన మొక్కను ఎదపై వేసికొని మూలఁబడియున్నది. ఫాంటైన్ దానిని మఱచిపోయెను. ఇంకొక మూలలో నీళ్ళతొట్టి యుండినది. ఏయే యంతున నీళ్లు గడ్డకట్టెనో అచ్చటచ్చట హైమవర్తుల చిహ్నము లేర్పడెను. ఫాంటైన్ మానమెప్పుడో పోయినది. ఒయ్యారితనమిప్పుడు పోవుచున్నది. ఇది యంత్యచిహ్నము. గలేజుటోపీ వేసికొని వెలికేగును. విరామము లేకయో ఉదాసీనతచేతనో బట్టలుతుకుకొనదు. మేజోళ్ళ మడమలరిగిపోఁగా వానిని జోళ్ళలోనికి దోఁపును. ప్రాఁత చినిఁగిన కార్సెట్లీను కాలికో ముక్కలతో అతుకులు వేయును. కదలినచో నా యతుకులు పిగిలిపోవును. అప్పులవాండ్రు తగవులాడి వేధింతురు. తాపలమీఁద వారు ప్రత్యక్షమగుదురు. వీథుల ప్రత్యక్షమగుదురు. రాత్రులంతయు నేడ్చుచు నాలోచించుచు ఫాంటైన్ కాలము కడపును. కన్నులలో విచిత్ర కాంతి, ఎడమబుజము క్రింది యెముకలో నెల్లప్పుడు నొప్పియు నుండినవి. దగ్గు చాల అధికమయ్యెను. ఫాదర్ మాదలిన్‌పైన ద్వేషము పూర్తి యయ్యెను. కాని, యెవరితోను ఫిర్యాదు చేసినది కాదు. దినమునకు పదునేడుగంటలు కుట్టుపని చేయును. కాని, జెయిలు కంట్రాక్టరు, ఉన్నట్టుండి వెల తగ్గించివేసెను. అందుచే, స్వతంత్ర కార్మికుల కూలి నాలుగున్నఱ పెన్నీలకు దిగెను. పదునేడు గంటల పని, నాల్గున్నఱ పెన్నీలు దినమునకు!

అప్పులవారి క్రౌర్య మెప్పటికంటె ఎక్కువయ్యెను. ఫర్ని చరిచ్చిన వాడు తన వస్తువులన్నియుఁ దీసికొని, నిముస ముడుగక "బాకీ ఎప్పుడు తీర్తువే లంజా" యని పీడింపసాగెను.

కరుణామూర్తీ! దేవుఁడా! ఆమె యేమి చేయవలెనని వారి కోరిక? వేటాడఁబడిన దానివలె నామె భావించెను. ఒక భయంకర జంతువామెలో వృద్ధిగాంచ మొదలిడెను. సరిగా ఇట్టి సమయమున తేనార్డియర్, తన యౌదార్యము మేఱ మీఱిపోయినదని, ఆ నిముసముననే నూఱుఫ్రాంకులు పంప కున్నచో వ్యాధి గడచి కోల్కొనుచున్న కోజెత్తు వీధిలోని కీడ్వఁబడునని, పిదప దానిగతి దానిదే యనియు వ్రాసెను. "నూఱు ఫ్రాంకులు! దినమునకు నూరరపెన్నీలు సంపాదించు టకువీలున్న చోటేది?" అని ఫాంటైన్ గుండెలు బాదుకొనెను.

"సరి! మిగిలిన దానిని అమ్మివేసెదను!"

ఆ నిర్భాగ్యురాలు దేహ విక్రయమునకుఁ బూను కొనెను.

# 11

ఏమీ ఫాంటైన్ చరిత్ర? సంఘము బానిసను గొనుట.

ఎందుచేత? దీనత్వము కారణముగ.

ఆకలి, శీతబాధ, ఏకాకిత్వము, బహిష్కరణము, కటిక పేదఱికమును కారణములు. ఎంత విషాదకర వ్యాపారము! ఒక ఱొట్టెముక్కకొక యాత్మ! దైన్యమీ సమర్పణ సేయును. సంఘ మంగీకరించును.

ఏసుప్రభుని పవిత్ర శాసనము మన నాగరకతను నడపించును. కాని, అది మన నాగరకతలోపల వ్యాప్తము కాలేదు. బానిసత్వము యూరపియన్ నాగరకతనుండి యంత రించినదందురు. పొఱపాటు. ఇంకను నున్నది. అది యాడు దాసిని మాత్రమే యణంచుచుండుటలేదు. దానినే వేశ్యావృత్తి యందురు.

అది యాడుదాని నణంచివేయుచున్నది. అనఁగా, నాణ్యమును, అబలాత్వము, అందమును, మాతృత్వమును అణంచివేయుచున్నదని యర్థము. మానవుని సిగ్గుమాలిన పనులలో నిది చిన్నది కాదు.

ఈ దురంత నాటకమున మనమిప్పుడు ప్రాపించియున్న వేళలోఁ బూర్వముండిన దేదియు ఫాంటైన్‌లో ఇప్పుడు లేదు. అవినీతికి లోఁబడి పాషాణమైపోయినది. ఆమె స్పర్శ శవమును దలపించును. నిన్ను సహించి, నిన్ను తెలిసికొనక, తన దారిని పోవును. అగౌరవింపఁబడిన భావమూయుగ్ర ముఖమునఁ గను పట్టును. జీవిత సాంఘికాచారము లామెతో, సెలవు గైకొన్నవి. ఆమెకు జరుగఁ గలిగినదంతయు జరిగినది. అంతయు సహించి నది, భరించినది, అనుభవించినది, ఓర్చినది, ఏడ్చినది. అన్నింటి కేడ్చినది. తల వంచినది. మృత్యువు నిద్రను బోలునట్లు ఆ తలవంపౌదాసీన్యమును బోలినది. ఇప్పుడు దేనినుండియుఁ దొలఁగదు. దేనికిని వెఱవదు. ప్రతి మేఘ మామెపైఁబడును. సముద్ర మంతయు నామె తలపై సంక్షోభించును! అయిన నేమి! పాచి యిదివఱకే తడిసినది.

ఏమైనఁగానిండు, ఆమె యట్లు విశ్వసించినది. కాని,

తనకు నిర్ణీతమైన భవిష్యత్తును మనుష్యుఁడు ఖాళీచేయఁగల ననుకొనుట, దేని తుదియడుగునైనఁ జేరఁగలననుకొనుటయుఁ బొరపాటు.

"ఔరా! ఇట్లు వెఱ్ఱిమొఱ్ఱిగాఁ దరుమబడిన యీ విధి నిర్ణయములేమి? ఎక్కడికిఁబోవును? ఎందుకుఁబోవును?

దాని నెఱిఁగినవాఁడు, ఈ ఛాయనంతయుఁ గాంచును. అతఁడద్వితీయుఁడు. ఆయననే యీశ్వరుఁడందురు.

# 12

చిన్నగరములన్నింటిలో, నొక తరగతి యువకులుందురు. ప్యారిస్‌లో తమ కక్ష్యకుఁజెందినవారు సంవత్సరమునకు రెండులక్షల ఫ్రాంకులు భ్రమింగుచుండ, వారి ధోరణితోనే వీరు సంవత్సరమునకుఁ బదునైదువందల లివర్లు కొఱుకు చుందురు. వారి దొక మధ్యస్థ జాతి. చేవ చెడిన పరాన్న భుక్కులు. అనామధేయులు. కొంత భూస్థితి యుండును. తెలివి మాలినతన ముండును. సారా కొట్టులో మేమును బెద్దమను ష్యుల మనుకొందురు. "మా భూములు, మా యడవులు, మా కర్షకులు" అని బడాయి పలుకుచుందురు. అభిరుచికలవారని పించుకొనుటకు, నాటకశాలలో నటురాండ్రను హసిష్మందురు. సైనికస్థానమునందలి యుద్యోగులతో తగవులు పెట్టుకొని ధైర్యము వెల్లడింపఁజూతురు. వేఁటాడుట, పొగ పీల్చుట, ఆవులించుట, త్రాగుట, నస్యము పీల్చుట, బిల్లియర్డ్సాడుట, బండ్లనుండి దిగు ప్రయాణికులను గ్రుడ్లుబుకఁ జూచుట, హోటళ్ళలోఁ దిని టేబుల్ క్రింది పెంపుడు కుక్కకు వడ్డించు

పిల్లకు ఎముకముక్కలు విసరుట, దమ్మిడీకడ కక్కుర్తి చూపుట, అతిఫ్యాషన్లు పోషించుట, విషాదాంత నాటకములను మెచ్చి స్త్రీలను గర్హించుట, బూడుసులఱుగఁ దిరిగి, వయస్సు మీరుకొలఁదిని బుద్ధిమాంద్యము పెంచుకొని, పని చేయక, మంచిచేయక, చెడ్డచేయక జీవితమును వ్యర్థము చేయుదురు.

మాంప్యర్ తోలోమే, ప్యారిస్కు వెళ్ళక, తన రాష్ట్రమునందే యుండిన నిట్టివాఁడగుచుండెను.

అట్టివారు ఎక్కువ ధనవంతులైనచో నీటుకాండ్రందురు. తక్కువ ధనవంతులైన తిరుగుబోతులందురు. కాని, వట్టి సోమరులు.

నాటి నీటుకాని వేషమిట్లుండును: పెద్దకాలర్, పెద్ద మెడగుడ్డ. గొలుసు గడియారము, ఒకటిపైనొకటిగా మూఁడు వెయ్స్టుకోట్లు వేర్వేఱు రంగులవి. లోపలివి రెండును ఎఱుపు నీలపు రంగులవిగా నుండవలెను. ఆ మూఁడు కోట్లమీఁద మఱొక పొట్టికోటు. దానికొక నడుముపట్టి. రెండుప్రక్కల బుజములవఱకు వెండిగుండీలు. దానిరంగు ఆలివ్. షరాయి రంగుకూడ అదే. కాని కొంచెము పలుచన. షరాయి పొడుగు షట్లకు ఱొమ్ముకలవలె నొకటి మొదలు పదునొకండు వఱకుఁ జారలుండవలెను. అంతకు మించరాదు. వీనికి సాయముగ, నినుపచీలల మడమలకోడి బూడుసులు, చిన్నయంచుగల హ్యాటు. హ్యాటు పట్టుతప్పించుకొని వెలికుఱుకునట్లున్న వెంట్రుకల జొంపము. చిల్లర చమత్కారములతోఁ దొణికిసలాడు సంభాషణలు. చీలమడమలు మీసములు చాల

ముఖ్యము-మొదటిది పాదచారుల చిహ్నము, రెండవది నాగర కుల చిహ్నము.

ఇంతకుముందు వివరించిన సంఘటనలు కడచిన తర్వాత, ఎనిమిది నెలలు చన్నపిదప, 1823 జనవరి మాసారంభమున ఒక సాయంకాలమున మంచు పడుచున్నపుడు, ఈ నీటు కాండ్లలో సోమరి పోతులలో నొకఁడు, శీతకాలపు ఫ్యాషన్ పరిపాకమగు ఉన్ని నిలువుటంగీతో దేహమంతయు వెచ్చగాఁ గప్పుకొని, ఆఫీసర్ల హోటలుముందు డాన్సు దుస్తులు వేసికొని నగ్న బాహు కంఠములతోఁ దలలో పూలు చెరివి ఇటునటు పచారు చేయుచునుండిన యొక ప్రాణిని సూది పోడుపు మాటలతో వేధించుచుండెను. నీటుకాఁడు పొగ పీల్చుచుండెను. కానిచోఁ, దక్షిణ ఫ్యాషనంతయుఁ గాల్పనా?

తన సమీపమునందామె పోవునప్పుడంతయు సిగరెట్టు పొగ వదలుచు "కోఁతివలె ఉన్నావు" "అది దాగునా?" "నీ పండ్లూడినవి" అని, తన చమత్కారములకు మహానందము చెందుచుండెను. ఈ ఘనునిపేరు మాంష్యుర్ బమాటబా. ఆ యోఁదుది మితిమించిన శృంగారము చేసికొనియు వికారముగ నుండెను. శోకముద్రితమైన ముఖము. మంచులో నిటునటు నడచుచుండెను. బదులు పలుకలేదు. అతనివంకఁ జూడనైన లేదు. నోరు మూసికొని, విషాద క్రమమునఁ బచారు సేయుచు నయిదు నిముసముల కొకసారి అతని పోడుపు మాటలు వినుచునేయుండినది. ఆ నిర్లక్ష్యమా ధూర్తునకుఁ గోపము తెచ్చెను. ఆమె వెనుదిరిగిన సమయమున, పిల్లివలె వెంటనడిచి, నవ్వాపుకొని, చేతినిండుగ మంచుఁ దీసికొని వీపు,

మీఁద నగ్నభాగమున వైచెను. ఆ యువతి కోపముతో గర్జించి వెనుదిరిగి చిఱుతవలె లంఘించి, వానిపైఁబడి గోళ్ళు ముఖమున గ్రుచ్చి నోట ననరాని తిట్లు తిట్టుచు బీభత్స చేసెను. ఆమె కంఠము బ్రాందీచేఁ గఱుకెక్కియుండెను. ముందఱి రెండు పండ్లు లేక ఆ నోరు చూడ నసహ్యము గొల్పుచుండెను. ఫాంటైన్!!!

ఈ గలాటా హోటలులోని యాఫీసర్లను, యాతాయాత జనులను ప్రోగుచేసెను. పెద్ద గుంపయ్యెను-నవ్వువారు, వెక్కిఱించువారు, చప్పట్లు చఱచువారు. ఈ యాకర్షణకు మూలమైన వారిని స్త్రీ పురుషులని గుఱుతించుటకే వీలగుట లేదు. పురుషుఁడాత్మ సంరక్షణ చేసికొనుచున్నాఁడు. టోపీ యెగిరిపోయినది. ఆడుది తన్నుచున్నది, కొట్టుచున్నది. పండ్లు లేవు. వెండ్రుకలు లేవు. క్రోధకాళిమముతో భయంకరమైనది.

తటాలునఁ బొడుగాటి పురుషుఁడొకఁడా గుంపునుండి వెలువడి, ఆఁడుదాని నడుము పట్టుకొని "నడుము నా వెంట" ననెను.

ఆడుది తల పైకెత్తెను. క్రోధ కంఠ ముడిగిపోయెను. రక్త నయనములు తెల్లవడెను. భీతిచేఁ గంపించిపోయెను. జేవర్టును గుర్తించినది.

ఈ సమయము చూచి సీటుకాఁడు జారుకొనెను.

# 13

నిలుచున్నవారిని పొమ్మని ఆ గుంపును విదలించి జేవర్ ఆ ప్రాణి నీడ్చుకొని పోలీస్ స్టేషన్‌కుఁ బోయెను. స్టేషన్ అక్కడికి సమీపమే. ఆమె ప్రతిరోధము చూపక యంత్రపు బొమ్మవలె వెంట నడిచెను. ఎవరును నొకమాటైన ఆడలేదు. చూపరులు, అత్యానందముతోఁ బరిహాస వాక్యములు గురియుచు వెన్నాడిరి. మితిమించిన దైన్యము పోకిరితనమున కవకాశము.

స్టేషన్ చేరఁగనే జేవర్ తలుపుతీసి ఫాంటైను నీడ్చుకొని లోనికేగి తలుపు మఱల మూసెను. వెంబడించిన గుంపాశాభంగము పొంది, మునిగాళ్ళపై నిల్చి కిటికీ నుండి యేమి జరుగునో చూడఁ బ్రయత్నించుచుండెను. ఔత్సుక్యము తిండిపోతు. చూచుటనఁగా మ్రింగుట.

లోనికేగఁగా ఫాంటైన్ భయపడిన కుక్కవలె ఒక మూలలోఁ గదలి మెదలక నక్కెను.

కాపుండిన సార్జెంటు క్రొవ్వువత్తి వెలిఁగించి బల్లపై నిడెను. జేవర్ కూర్చుండి, జేబునుండి స్టాంపు పేపరొకటి తీసి వ్రాయ నారంభించెను.

మన చట్టములిట్టి యాఁడువాండ్రను సంపూర్ణముగా పోలీసులకప్పగించినవి. వారిని పోలీసు లిష్టమువచ్చినట్లు పీడింతురు. శిక్షింతురు. కాయకష్టము, స్వేచ్ఛ-యివి రెండే వారి సంపద. దానినిఁగూడ పోలీసులు దక్కనీయరు. దుర్భేద్యుఁడు జేవర్. అతని ముఖము నిర్వికారముగ నుండెను. తదేక

ధ్యానముతో గంభీరముగ నేదో యోజన చేయుచున్నాఁడు. ఏ యడ్డు తగులనీయక, నిశ్చలాంతఃకరణ చోదితుఁడై తన విచక్షణను తఱచుచుండెను. తాను కూర్చున్న పీఠము న్యాయ పీఠమని భావించెను. తాను సలుపుచున్నది విచారణ. విచారించి శిక్ష విధింపఁబోవుచున్నాఁడు. తానొనర్చుచున్న గొప్ప పనిలోఁ దోడ్పడుటకై తన జ్ఞానమునంతయుఁ బురస్కరించు చుండెను. ఈ యువతి ప్రవర్తనను పరిశీలించిన కొలదిని, దాని పైన నసహ్యమెక్కువ కాఁజొచ్చెను. ఒక మహాపరాధ కరణము తాను జూచియుండుట స్పష్టము. ఆ స్త్రీపరుఁడు—వోటరు—రూపముగన్న సంఘమును నడువీధిలో శాసన బహిష్కృత, సంఘబహిష్కృతయునైన యీ యాడుది అవమానించినది. పైఁబడి కొట్టినది. తొత్తు నాగరకుని దన్నినది. తాను, జేవర్. ఇందుకు సాక్షి. నిశ్శబ్దముగ వ్రాయుచుండెను.

వ్రాఁత ముగించి, చేవ్రాలుచేసి, కాగితము మడిచి, సార్జెంటు చేతికిచ్చుచు "ముగ్గురు భటులను బిల్చుకొని, ఈమెను జెయిలుకుఁ దీసికొని పో" అని, ఫాంటైన్‌వంక తిరిగి "నీకార్నెల్లు శిక్ష" అనెను.

ఆ దుఃఖజీవి కంపించిపోయెను.

"ఆర్నెలలు! ఆఱునెలలు జెయిలులో! ఆఱునెలలు, దినమునకు మూఁడున్నర పెన్నీలు గడించుట! నా కోజెత్తే మగును! నా బిడ్డ! నా సర్వస్వము! నేనింకను తేనార్డియర్లకు నూఱుఫ్రాంకులప్పుపడి యున్నానే! మీకుఁ దెలియదా మాంప్యర్ ఇన్స్పెక్టర్?"

బుఱద బూడుసుల క్రొక్కిళ్ళతో మలీమసమైన

యా నేలమీఁద, లేవక మోకాలిమీఁదుగనే ప్రాఁకుచు, చేతులు జోడించి శీఘ్రముగ జేవర్‌ను సమీపించెను.

"మాంష్యూర్ జేవర్! కరుణాభిక్ష పెట్టుఁడు. నాదికాదు తప్పు. నమ్ముఁడు. ప్రారంభమును జూచియుండిన మీకుఁ దెలిసి పోయెడిది. ఈశ్వర సాక్షిగా నా తప్పులేదు. ఆ పెద్దమనుష్యుని నే నెఱుఁగను. నా వీపున మంచు విసరివైనాఁడు. ఎవ్వరికే యపకారము సేయక, సాధురీతి వీధులఁబోవు మా బోటి వారినిట్లు పీడించుటకు వారికి హక్కున్నదా? అందుచే నాకుఁ గోపము వచ్చినది. నే నారోగ్యముగ లేను, చూఁడుడు! అదీ కాక అదివఱకే 'నీవు ముద్దుగా నున్నావు' 'నీకుఁ బండ్లు లేవు' అని యేమేమో యనుచుండినాఁడు. నేనతని యెదుట సిగ్గు మాలి ప్రవర్తింపలేదు. ఒక్క మాటైన ఆడలేదు. 'ఇదేదో తృప్తి అతనికి' అనుకొంటిని. అప్పుడు మంచుతోఁ గొట్టినాఁడు. ఇందలి సత్యమును మీకుఁ దెల్పఁగల వారక్కడ నొక్కరైన లేరా? కోపగించుకొనుట నా తప్పేమో. మీకుఁ దెలియును. దెబ్బ తగలఁగనే మేము తట్టుకొనలేము. ఉద్రేకులము. తలవని తలంపుగా, వీపుమీఁద అంత చల్లని వస్తువు పడిన ఎట్లు? ఆయన టోపీ పాడుచేయుట నా తప్పు. అతఁడేల పోయినాఁడు? క్షమింప వేఁడుకొందునే! ఈ యొక్కసారి కరుణింపుఁడు మాంష్యూర్ జేవర్! మీకుఁ దెలియదు కాని, జెయిలులో మూఁడున్నఱ పెన్నీలే సంపాదింప వీలగును. అది గవర్న మెంటు వారి తప్పుకాదు. నాకు నూఱు ఫ్రాంకుల బాకీ యున్నది. దీనిని తీర్పనిచో నా పసికందును వీధిలోకి నెట్టుదురు. అయ్యో దేవుఁడా!...దానిని నా యొద్దనే నిలుపుకొన వీలు

లేదు. నా చేతలంత నికృష్టములు! నా కన్నతల్లి, నా కోజెత్తు, నా దేవీమూర్తి, కడుపు కాలి యేమైపోవునో! తేనార్డియర్లు హోటలు వాండ్రు. గొఱ్ఱెలు. దయాశూన్యులు. వారికిఁ గావలసినది వారి ధనమే. నన్ను జెయిలుకుఁ బంపవలదు! నా బిడ్డ పసికూన. ఈ చలిలో దానిని నడివీధిలోనికీడ్తురు. అట్టి దానిని కనికరింపరా మాంష్యర్ జేవర్! కొంచెము పెద్దబిడ్డ యైనచోఁ దన యన్నము సంపాదించుకొనును. ఇప్పుడింకను కాళ్ళురాని పసికందు. నా హృదయము చెడ్డది కాదు. సోమరి తనము. ఆకలిబాధ నన్నిస్థితికిఁ దేలేదు. మనోవేదన భరించ లేక కొంచెము బ్రాందీ ద్రాగితిని. నాకది యిష్టము కాదు. కాని యది మఱపు తెచ్చును. మంచి దినములలో 'నా యుడుపుల గది చూచిన వారికిఁ దెలియును నేను గ్రామ విహీన కానని. నాకెన్నో ఎన్నో బట్టలుండెను. నామీద దయ యుంపుఁడు మాంష్యర్ జేవర్!"

ఈ విధమున, రెండు వంపులుతో, వెక్కి వెక్కి యేడ్చుచుఁ, గన్నీటి ధారలు చీఁకటికప్ప, నగ్నకంఠయై, చేతులు జోడించి, పొడిదగ్గు నిమిష నిమిష మడ్డుతగుల వేదనా విదళిత స్వరమునఁ బ్రాధేయపడెను. అతిదుఃఖమొక దివ్య భయంకర ప్రకాశమై నిర్భాగ్యులరూపమే మార్చివేయును. ఆ నిముస మున ఫాంటైన్ మఱల రూపసియైనది. కొన్ని సమయములలో ఆగి సార్జంటుకోటును ముద్దిడుకొన్నది. ఆమె యార్తి నల్ల ఱాయినైనఁ గరగించియుండును. కొయ్య గుండెను గరగింప జాలినదేదియు లేదు,

"సరిసరి. లే. అంతయు విన్నాను. ఇంకను ముగియ

లేదా? కదలు కదలు. ఆఱునెలలు తప్పవు. విశ్వపిత వచ్చి నను నిన్ను విడిపింపలేడు" అని జేవర్ నిస్సందేహముగఁ జెప్పెను.

శిక్ష తప్పదని యామె కర్థమయ్యెను. "క్షమ! క్షమ!" అని గొణుఁగుచు నేల కొరిగెను.

జేవర్ వెను దిరిగెను. సోల్జర్లామెను బట్టుకొనిరి.

కొన్ని నిముసములకుముందు, ఎవరికిని దెలియక, ఒక మనుష్యుఁడచ్చటఁ బ్రవేశించి, తలుపు మూసి వీపు దాని కానించి నిల్చుకొనియుండెను. ఫాంటైన్ ప్రార్థన విన్నాఁడు. లేవకున్న ఆ నిర్భాగ్యురాలిమీఁద సోల్జర్లు చేతులు వేసిన క్షణమున, నీడ విడిచివచ్చి యతఁడు "ఒక్క నిముస మాగండి, దయచేసి" అనెను.

జేవర్ కనులెత్తి మాంష్యూర్ మాదలిన్‌ను చూచెను. హ్యాటుతీసి వందన మాచరించి, కోపవికారస్వరమున "క్షమిం పుఁడు, మాంష్యూర్ మేయర్."

ఈ పదము–మాంష్యూర్ మేయర్–ఫాంటైన్‌లో ఒక విచిత్రమైన మార్పు కలిగించెను. భూమినుండి లేచిన నీడవలె క్షణములో నిల్చుండి, సోల్జర్లను బ్రక్కకునెట్టి, వారడ్డగింప గల్గుటకుముందే, మాంష్యూర్ మాదలిన్‌ను సమీపించి, నిశ్చల ఘాతుక దృష్టితో చూచుచు "ఆఁ! మీరేనా మాంష్యూర్ మేయర్!" అనెను.

పిదప విఱుగఁబడి నవ్వి యతని ముఖమున నుమ్మి వేసెను.

మాంష్యర్ మాదలిన్ ముఖము తుడుచుకొని "ఇన్స్పెక్టర్ జేవర్, ఈమెను విడిచిపెట్టుడు" అనెను.

జేవర్‌కు స్మృతి తప్పుచున్నట్లనిపించెను. ఆ నిముసమున దెబ్బపై దెబ్బపడినట్లై, అదే సమయమున, జీవితమున నింతవఱ కెఱుగని మహాప్రబలోద్రేకములు పట్టియూపివైచినట్లయ్యెను. బజారు పడుచొక్కతె మేయర్ ముఖమున నుమ్మివేయుట పైశాచికము. తన యూహనెంత విచ్చలవిడిగా పోనిచ్చినను, నిట్టిది సాధ్యమని భావించుటే యపచారమని యతడనుకొనెను. ఇది యిట్లుండ నెక్కడనో మనో గర్భమున నీ యాడుదేమైయుండెనో, యీ మేయ రేమిగానుండునో యను తలంపుల నొకచోటికిదెచ్చి, యీ మహాపరాధ మతిలఘువైనట్లూహించి జుగుప్సా కంపితుడయ్యెను. కాని, యీ మేయరు, తీర్పరి, మెదలక ముఖము తుడుచుకొని "ఈమెను విడిచిపెట్టు" డనుట యత్యాశ్చర్యకరమై స్తంభింపజేసెను. మనోజిహ్వాలు పట్టుతప్పెను. సాధ్యమగు నాశ్చర్యము మితిదాటిపోయెను. జేవర్ మూగవై నిలువబడెను.

మేయర్ మాటలు, ఫాంటైన్‌కు గల్గించిన యాశ్చర్యము తక్కువకాదు. తలతిరిగి, పడకుండుటకై బేబులు పట్టుకొనెను. చుట్టుప్రక్కల గలయజూచి, తనలోతాను పలుకుకొన్నట్లు లిట్లనెను.

"విడుచుట! నన్ను విడిచిపుత్తురా! ఆర్నెల్లు జెయిలు శిక్ష లేదా! ఎవరామాట చెప్పినది? అట్లనుట సాధ్యముకాదు.

నేను పొరబడితిని. ఈ పిశాచి మేయరట్లు చెప్పియుండలేదు! మీరేనా, మాంష్యూర్ జేవర్, నన్ను విడిచిపుచ్చుమనుట? ఇదిగో, యిప్పుడు వినుడు. అంతయు జెప్పెదను. మీరే నన్ను పోనిత్తురు. ఈ రాక్షసుడు, ఈ ముదుసలి క్రూరమృగ మగు మేయరే దీనికంతటికిని గారణము. మాంష్యూర్ జేవర్, వీడు నన్ను తఱుమగొట్టెను! ఫ్యాక్టరీలోని క్షుద్రులు చెప్పిన చాడీలందుకు గారణము. తనపని కచ్చితముగా జేసికొని పోవుదానినిట్లు సేయుట ఘోరముకాదా! అదిమొదలు కడుపు నిండునట్లు సంపాదన లేనేలేదు. ఈ నిర్భాగ్యము దాపురించినది. పోలీసులైన మీరు చేయవలసిన తొట్టతొలి మార్పిది-జెయిలు కంట్రాక్టర్లు బీదలనోరు కొట్టకుండునట్లు చేయుట. ఎందుకందురా, వినుడు. షర్టుకుట్టుట కాఱుపెన్నీలు కూలి. కాని వారు నాలుగున్నరపెన్నీలకు దింతురు. అది ప్రాణమునిల్పుకొనుటకే చాలదు. కావున, ఇంకేమైన జేయ వలెను. నాకన్ననో, కుమార్తె కోజెత్తున్నది. కావున, నేను చెడుపనికి దిగవలసివచ్చెను. ఈ నీచుడు మేయరింతటికిని గారణమని యిప్పుడు తెలియుటలేదా? హోటలుముందఱ ఆ నాగరకుని హ్యాటును తొక్కి-వేసితిని. కాని, అతడు మంచుతో నా బట్టలన్నిటిని పాడుచేసినందుకు. మాకు, సాయంకాలమున ధరించుట కొక్క-టే సిల్కు-ండును. నే నెప్పుడే నేరము చేయదలపలేదు. నిజము. నాకంటె అధ్వా న్నపు వాండ్రెందరో యదృష్టవంతులుగ నున్నారు. మాంష్యూర్ జేవర్, మీరేకదా నన్నువదలమన్నది? పోయి విచారింపుడు. నా యింటి యజమానితో మాటలాడుడు.

బాడుగు సరిగా ఇచ్చివేయుదును. ఆయన నేను మర్యాద గలదాననని చెప్పను."

మాంష్యర్ మాదలిన్ ఏకాగ్రచిత్తముతో వినెను. ఆమె మాటాడునప్పు వేస్టుకోటుజేబు తడవి, పర్సు తీసెను. అది వట్టిదై యుండుటచే మఱల జేబులోనే పెట్టుకొని ఫాంటైన్‌తో "నీ బాకీ యెంతంటివి?" అని యడిగెను.

జేవర్‌నే చూచుచుండిన ఫాంటైన్ తిరిగి "నీతో నెవరు చెప్పిరి?" అనెను.

పిదప సోల్జర్లను చూచి "వాని మొగమున నెట్లుమ్మి వేసితినో చూచితిరికదా! దొంగముండకొడుకు మేయరు! నన్ను భయపెట్టుట కిక్కడికి వచ్చితివా? నిన్నుజూచిన నాకు భయములేదు. మాంష్యర్ జేవర్ మంచివాడు. ఆయనను జూచిన నాకు భయము." అని, మఱల జేవర్‌తో నిట్లు వచించెను. "మాంష్యర్ ఇన్స్పెక్టర్, మీరు న్యాయము నెఱుపవలెను. న్యాయపరులని నాకు తెలియును. దీనిలో నేమున్నది? ఒక మనుష్యుడు ఆడుదాని వీపుమీద తమాషాకై మంచు విసరెను. అది యాఫీసర్లకు సంతసము గల్గించును. వారి వినోదమునకేకదా మేము. అప్పుడు మీరు వత్తురు. శాంతి రక్షణమే మీ పని. తప్పుచేసిన ఆడుదానిని బంధింతురు. కాని మీరు మంచివారు. యోజింతురు. నా బిడ్డను గుఱించి చింతింతురు. ఆఱు నెలలు జెయిలులోనే నుండిన బిడ్డ దిక్కుచెడునని గ్రహించి నన్ను విడిపింతురు. ఇకపై నేను మఱల ఇట్టిపని జేయకూడదు. అంతే. వారేమి చేసినను నేను జలింపను. ఈ దినమున మాత్ర మేడ్చితిని—

మంచు నన్ను జాల బాధించుటచే. అతడు మంచుతో కొట్టు
నను నేననుకొని యుండలేదు. నా దేహస్థితియు సరిగా లేదు.
దగ్గు బాధించుచున్నది. ఊపిరితిత్తులలో గాలిన గుండువంటి
దేదో పీడించుచున్నది. డాక్టరు జాగ్రతగా ఉండుమన్నాడు.
చూడుడు. నా చేయితాకి చూడండి. భయమక్కఱలేదు.''

ఏడ్పు చాలించినది. కంఠమనునయమైనది. జేవర్
కఱకు జేయిపట్టుకొని తన ధవళకోమల వక్షముపై నిడికొని
చిఱునవ్వుతో నతనిని జూచుచుండెను.

తటాలున: ద్వరత్వరగా బట్టలను సర్దుకొని,
మోకాళ్ళపై బ్రాకుటచే అంతవఱకును ముడుచుకొనిపోయిన
గౌను సరిచేసికొని, తలుపు దగ్గఱకు వెళ్ళి, మైత్రిభావముతో
దల పంకించుచు నణచిన స్వరమున సోల్జర్లతో ''మాంష్యూర్
ఇన్స్పెక్టరు నన్ను విడుదల చేయవలెనన్నారు. పోవుచు
న్నాను.'' అనెను.

గడియపై చేయివేసెను. ఒక్క యడుగులో వీధిని
బడును.

అంతవఱకును జేవర్ చలనము దక్కి నిల్చుండి
యుండెను. కనులు నేలపై నిలచినవి. ఒక రంగమున దన
స్థానమునం దుంపబడుటకై ప్రతీక్షించు ప్రతిమవలె నుండి
నాడు.

గడియశబ్ద మతనిని మేల్కొలిపెను. సంపూర్ణాధి
కారి భావప్రదర్శకముగ దల పైకెత్తెను. ఆ భావము,
వ్యక్తి చిన్నవాడగుకొలదిని, అధికాధిక భయంకరమగును.

అరణ్యమృగమునందా యధికారము క్రూరము. అపరిణిత మానవునియందు పాపిష్ఠము.

జేవర్: సార్జెంట్ ! — ఆ త్రిమ్మరి పోవుచుండుట చూడవా? దానిని పోనిమ్మని నీ కెవరు చెప్పిరి ?

మాదలిన్: నేను.

పట్టువడిన దొంగ, చేతనున్న వస్తువును జారవిడుచు లాగు, జేవర్ పలుకులు వినగానే ఫాంటైన్ అదటి గడియ వదలిపెట్టెను. మాదలిన్ మాటాడగా, నతనివంక దిరిగి, యదిమొదలు నొక్క మాటాడక ధైర్యముతో నూపిరినైన బీల్చక, మాదలిన్ జేవరు మాటాడునపుడు, ఒకరినుండి యొకరికి చూపులు పఱుపసాగెను.

జేవర్ చిత్తస్వాస్థ్యమును గోల్పోయి యుండును. కానిచో, మాదలిక్ ఫాంటైన్‌ను వదలిపెట్ట నుత్తరు విచ్చిన తరువాత నట్లు సార్జంటుతో మాటాడెడివాడు కాడు. మేయర్ అక్కడ నుండుటనే మఱచెనా? అధికారమట్టి యుత్తరు విచ్చుటే యసంభవమని, యొకటి చెప్పబోయి మేయ రింకొకటి చెప్పియుండుననని భావించెనా? కాక, ఈ రెండు గంటలనుండి తాను జూచిన యత్యాచారములను బట్టి, తాను దీవ్రచర్య తీసికొనక తప్పదని, యల్ప మధికముగ, పోలీసు మాజిస్ట్రేటుగ పరివర్తనముకాక తప్పదని, హేయమైన యీ యసాధారణ సన్నివేశమున, క్రమము, చట్టము, నీతి, ప్రభుత్వము, మొత్తము సంఘము, అన్నియు జేవర్ మూర్తి కావలెనని భావించెనా?

ఏమో! నేనని మాంష్యర్ మాదలిన్ పలుకగనే,

పాలి, విరసుడై తెగువచూపుతో, సదృశ్యకంపముచే దేహము కల్లోలితము కాగా, భూలగ్నమైన దృష్టితోనే, నిశ్చయకంఠమున "మాంష్యర్ మేయర్! వీలులేదు." అనెను.

మా: ఏల?

జే: ఈ నిర్భాగ్యురాలొక నాగరకు నవమానించెను.

మాంష్యర్ మాదలిన్ అనునయప్రశాంత స్వరమున నిట్లనెను. "ఇన్స్పెక్టర్ జేవర్, విను. నీవు యోగ్యుడవు. నీకు వివరించి చెప్ప నాకభ్యంతరము లేదు. సత్యమిది: నీ వీమె నరెస్టు చేసినపుడు నేనావైపు పోవుచుంటిని. ఇంకను ఒక గుంపక్కడ ఉండెను. విచారించితిని. నాకంతయు తెలియును. నాగరకు డపరాధి. న్యాయశీలివైన పోలీసతనిని బంధింపవలెను."

జే: ఈ పాపి యిప్పుడే మేయర్ నవమానించినది.

మా: అది నా సంగతి. నా యవమానము నాపై నుండును. దానిని నా యిష్టము వచ్చినట్లు చేసికోవచ్చును.

జే: మన్నింపుడు మాంష్యర్ మేయర్! అవమానము మీ మీద లేదు. ధర్మముపైన బడినది.

మా: ఇన్స్పెక్టర్ జేవర్! అంతరాత్మయే యున్నతోన్నత ధర్మము. ఈ యబల వృత్తాంతము విన్నాను. నే నేమి చేయుచున్నానో యెఱుగుదును.

జే: నా మట్టునకు మాంష్యర్ మేయర్, నే నేమి చూచుచుంటినో తెలియుటలేదు.

మా: అయినచో లొంగి తృప్తిపడుము.

జే: నా కర్తవ్యమునకు లొంగుదును. ఈ యాడు దానిని ఆఱునెలలు జెయిలులో నుంచుమని నా కర్తవ్యము చెప్పుచున్నది.

మా: విను. ఒక్క దినమును నుండదు.

మృదువయ్యు, నిర్ణయము తెలుపు ఈ మాటలు తలనెత్తు ధైర్యము జేవర్ కిచ్చెను. అతిగౌరవ సూచక స్వరముతోనే జేవర్, "మాంష్యూర్ మేయర్ కెదురాడుటకై చింతించుచున్నాను. నా జీవితమునం దిట్లు సేయుటకిదే తొలిసారి. కాని, నా యధికారముమీఱి ప్రవర్తించుట లేదని మనవి చేయుచున్నాను. నాగరకుని గుఱించి మేయర్ కోరుటచే జెప్పుదును. నే నక్కడనే యుంటిని. ఈ పిల్ల మాంష్యూర్ బమటాబా మీదికి లంఘించినది. అతడు వోటరు. ఆ మూడంతస్థుల పెద్దమేడ యతనిదే. ఈ లోకమున కొన్నిటిని మనము గమనించి తీఱవలెను. ఏదియెట్లైన గానిండు. ఈ వ్యవహారము వీధి పోలీసులకు సంబంధించినది. అది నా కోస్తా. నేనీ ఫాంటైన్‌ను బంధింతును." అనెను.

ఇది విని మాంష్యూర్ మాదలిన్ చేతులు కట్టుకొని, అంతవఱకా యూర నెవ్వరును విని యెఱుగని కఠిన కంఠమున "నీవు చెప్పునది మునిసిపల్ పోలీసులకు సంబంధించినది. క్రిమినల్ చట్టమునందలి తొమ్మిది, పదికొండు, పదునైదు, అఱువదియాఱు సెక్షన్ల ప్రకారము, దీనిని విచారింపవలసినవాడను నేను. ఈమెను విడువవలసినదని యాజ్ఞాపించుచున్నాను." అనెను.

జేవరాఖరు ప్రయత్నము చేసెను. "కాని మాంష్యర్ మేయర్——"

మా: 1799 డిసెంబరు 13 నాటి చట్టము ఎనుబది యొకటవ సెక్షను చట్టవిరుద్ధమైన నిర్బంధమును గుఱించి చెప్పును. దానిని చదువుము.

జే: మాంష్యర్ మేయర్, దయచేసి——

మా: ఇంకొక్కమాటయు వలదు.

జే: ఎట్లైనను——

మా: వెళ్ళిపో.

జేవర్ దెబ్బను స్వీకరించెను——ఎదురుగ నిల్చుండి, రష్యన్ సోల్జరువలె ననాచ్ఛాదిత వక్షముపై, మేయ రెదుట నేలవఱకును వంగి వెళ్ళిపోయెను.

ఫాంటైన్ తలుపు దగ్గఱనే యుండి, అతడు పోవు నపుడు జడమతియై చూచెను.

జేవర్ పోగానే మాంష్యర్ మాదలిన్ ఫాంటైన్ వంకకు తిరిగి, తిన్నగ కష్టముతో ఏడుపు మ్రింగుచున్న వానివలె బలికెను. "నీ కథ, నీవు చెప్పినది వింటిని. నాకదేమియు దెలియదు. నీవు ఫ్యాక్టరీ వదలినట్లును దెలియదు. నీవు నాతో నెందుకు ఫిర్యాదు చేయలేదు? సరి. అది పోనీ. నీ అప్పులు నేను దీర్చివేసెదను. నీ బిడ్డను బిలిపించెదను. లేదా నిన్నే అక్కడికి బంపెదను. నీ విక్కడనో, పారిస్‌లోనో, నీ కిష్టము వచ్చిన మరెక్కడనో నివసింప వచ్చును. నిన్ను, నీ బిడ్డను బోషించెదను. నీ కిష్టము లేనిచో, ఇంకే పనియు జేయనక్కఱలేదు. నీకు గావలసినంత

ధనమిచ్చెదను. మరల సుఖపడుదువు. మర్యాదగలదాన వగుదువు. అంతేనా, విను. నీవు చెప్పినదంతయు నిజమేని - నిజమనుటకు నాకు సందేహము లేదు—ఈశ్వర దృష్టిలో నీ వెన్నడును పతితవు కావు. పవిత్రవు. ఎంత కష్టజీవివి!''

ఇది ఫాంటైన్ భరింపలేని యానందము. కోజెత్తు సాన్నిధ్యము! ఈ నీచ జీవితాంత్యము! స్వేచ్ఛ, ధనము, సుఖము, మర్యాద, కోజెత్తు! అత్యంత దైన్యమధ్యమునుండి హఠాత్తుగ ఈ వాస్తవ స్వర్గము లేచినది! తనతో మాటాడు చుండిన మానవుని భ్రమాన్వడిన దానివలె జూచినది. నోట మాట రాలేదు కాని, ఏడ్పువెక్కు లొక్కటి రెండు విన వచ్చినవి. మాంస్యర్ మాదలిన్ అడ్డుపెట్టుటకు ముందే మోకాళ్ళపై వ్రాలినది.

ఫాంటైన్ మూర్ఛిల్లెను.

—

# నిర్భాగ్యజీవులు

## ప్రథమ ఖండము - ఫాంటైన్

### షష్ఠాధ్యాయము

### (జేవర్)

## 1

మాంష్యార్ మాదలీన్ ఫాంటైనును దన యింట నెలకొల్పిన చికిత్సాలయమునకు గొనిపోయి సిస్టర్లకు అప్పగించెను. రాత్రి చాల వఱకు నతితీవ్ర జ్వరముతో నొడలు తెలియక వదఱుచుండి, ఫాంటైన్ తుదకు నిదురించెను.

మఱునాడు మధ్యాహ్నము వేళ ఫాంటైన్ మేల్కాంచెను. తన పఱుపు సమీపమున నూపిరి శబ్దము విని, దోమ తెఱ తొలగించి, మాంష్యార్ మాదలీన్ తల పైకెత్తి యేమో చూచుచుండుటను గమనించెను. ఆ చూపులలో గరుణా ప్రార్థనలతో గూడిన వేదన నిండియున్నది. అతని చూపుల దెస బరికించి, యవి గోడమీది సిలువపై లగ్నమై యుండుట కన్గొనెను.

ఆ క్షణము మొదలు, ఆమె కనులకు మాదలీన్ ఆకారము సంపూర్ణముగ మాఱినట్లు తోచెను. ఆయన

నేదో వెలుగు కప్పియున్నట్లుండెను. ప్రార్థనా నిమగ్నుడై యుండినాడు. చెప్పవాల్చక, ధ్యానభంగము సేయవెఱచి చాల సేపూరక ఫాంటైన్ చూచి పిదప నిట్లు ప్రశ్నించెను: "ఏమి చేయుచున్నారు?"

ఒక్క గంటనుండి ఆమె మేల్కనుటకై మాదలిన్ అక్కడనే వేచియుండినాడు. ఆమె చేయిపట్టి నాడి పరీక్షించి "నీ కెట్లున్నది?" అని యడిగెను.

ఫాం: చాల బాగుగనున్నది. నిద్ర పట్టినది. ఇప్పుడు చాల మేలు. ఇది యేమియు జేయదు.

మొదలామె యడిగిన ప్రశ్న కిపుడు మాదలిన్ జవాబు చెప్పెను: "మానవజాతికై ప్రాణమర్పించిన మహాత్ముని ప్రార్థించుచున్నాను." అని మనస్సులో "ఆత్మార్పణ చేసి నేలకొరిగిన యీ పూజ్యురాలి కొఱకు." అని తలంచెను.

కడచిన రాత్రియంతయు, నుదయమునను మాంష్యర్ మాదలిన్ ఫాంటైన్ వృత్తాంతమంతయు విచారించి, బాధాకరమైన ఆమె చరిత్ర యందలి సకలాంశములను దెలిసికొనెను. "చాల కష్టపడినావు తల్లీ! గతమునకు విచారింపకు. నీవు కోరిన దిప్పుడు లభించును. ఈ విధముననే మర్త్యులు దేవత లగుదురు. అది వారి తప్పు కాదు. వేఱు విధమున దానిని సాధించుట వారికి తెలియదు. నీవు తరించిన నరకము స్వర్గమునకు మొదటి మెట్టు. అక్కడి నుండియే మనము ప్రారంభింపవలెను."

ఆయన దీర్ఘనిశ్వాసము విడిచెను. ఆమె యుజ్జ్వల హాసము చేసి రెండు పండ్లూడియుండుట వెల్లడించెను.

ఆ రాత్రియే జేవరొక యుత్తరము వ్రాసి తానే తపాలాఫీసునకు దీసికొనిపోయెను. అది పారిస్‌కు. విలాసము "మాంష్యర్ చాబిలే. పోలీస్ సర్వాధికారికి గార్యదర్శి."

పోలీస్ స్టేషనులో జరిగినదంతయు నందఱకును దెలిసినది కావున, జేవర్ దస్తూరి గుర్తించిన పోస్ట్ మిస్ట్రెస్ అది రాజీనామా యనుకొనెను.

మాంష్యర్ మాదలిన్ వెంటనే తేనార్డియర్లకు వ్రాసెను. వారు తమ బాకీ నూటయిరువది ఫ్రాంకులని తెలిపిరి. ఆయన మూడువందలు పంపి, అన్ని యప్పులను జమకట్టుకొని బిడ్డను వెంటనే తీసికొని రావలెనని, తల్లి మిగుల ననారోగ్యముగ నున్నదని, బిడ్డను జూడ నేకరుచున్నదని వ్రాసెను.

తేనార్డియర్నిది యాశ్చర్యమున ముంచెను. భార్యతో "ఇది దయ్యము! బిడ్డను వదలకూడదు. ఈ భరద్వాజము కానుధేనువవలె నున్నది. ఎవడో వెఱ్ఱికుంక తల్లిమీద మోజుపడి నట్లున్నది." అని చంకలు గ్రుద్దుకొనెను.

ఐదువందలకొక బాకీపట్టీ జాగ్రతగా సిద్ధము చేసెను. ఎపానిన్ అజెల్మాలు దీర్ఘవ్యాధికి జిక్కినపుడు డాక్టరిచ్చిన మూడువందల బిల్లులో పేరుమార్చి యీ పట్టీ కెక్కించెను. కోజెత్తుకు జబ్బు చేయనేలేదని చెప్పితిమికదా? ఈ పట్టీక్రింద "మూడువందలు ఫ్రాంకులు ముట్టినవి." అని తేనార్డియరు వ్రాసి పంపెను.

మాంష్యర్ మాదలిన్ వెంటనే మఱి మూడువందలు పంపుచు "కోజెత్తును త్వరగా పంపవలెను." అని వ్రాసెను.

తేనార్డియర్ "దేవుడా! దీనిని పంపనే కూడదు." అని ముష్టి బిగించెను.

ఇట్లు జరుగుచుండ, ఫాంటైన్ కోల్కొనలేదు. ఇంకను జికిత్సాలయమునందే యుండెను.

"ఈ పిల్ల"కు బరిచర్య చేయుటకు, ఆదిలో సిస్టర్లకు వెగటుగనే యుండెను. పరిశుద్ధ స్త్రీలకు అభాగ్యుల పైగల యీ వెగటు, స్త్రీ గౌరవమున నతిగాఢముగ నాటియున్న ప్రేరణ. ఇది యనాది సిద్ధము. సిస్టర్లలో మతము దీనిని ఘనీభవింప జేసినది. కాని, కొన్ని దినములలోనే ఫాంటైన్ వారిని కరిగించి వేసెను. ఆమె మాతృమార్దవము, మెత్తని హృదయద్రావక వచనములును వారిని గదలించెను. ఒకనాడు చిత్తవిభ్రాంతిలో ఫాంటైన్ "నేను బాపిని. కాని, నా బిడ్డ నా దగ్గఱకు జేరెనా దేవుడు మన్నించినట్లే. చెడునడతలో నున్నపుడు, కోజెత్తు నాయొద్ద నుండరాదు. దాని దుఃఖాశ్చర్య దృష్టి దుర్భరమయ్యేడిది. దానికొఱకే పాపములు చేసితిని. అందుకే దేవుడు క్షమించుచున్నాడు. తెప్పవాల్జీక దానిని చూచెదను. దాని అమాయకత్వమును చూచిన నాకు మేలుకల్గును. దానికది యేమియు దెలియదు. అది దేవత. దాని వయస్సున ఱెక్కలూడి యుండవు." అని వదరుటను సిస్టర్లు వినిరి.

మాంష్యర్ మాదలిన్ దినమునకు రెండుసార్లామెను జూడవచ్చును. ప్రతి పర్యాయము "నా కోజెత్తును త్వరలో జూడగలనా?" అని యామె ప్రశ్నించును. "మూడువంతులు రేపు వచ్చును.నిమిష నిమిషమామె కెదురుచూచుచున్నా"

నని ఆయన పలుకును. ముఖము వికసింప "ఆహా! అప్పు డెంత సుఖముగ నుండును!" అని తల్లి యువ్విళ్ళూరును.

ఆమె కోలుకొనలేదని యింతకుముందే చెప్పితిమి. సరికదా, వారవారము క్షీణింపసాగెను. ఆ గుప్పెడుమంచు, వట్టివీపును దాకి, చెమ్మటను తటాలున నాపి, కొన్ని యేండ్లుగ గూడుచుండిన వ్యాధిని ప్రబల మొనర్చినట్లున్నది. డాక్ట రామె యూపిరితిత్తులను వ్రేలితో కొట్టి తలనూచెను.

మా: ఏమి?

డా: ఆమె బిడ్డను జూడ ఆత్రపడుచున్నది కదా?

మా: అవును.

డా: మఱి, ఆ బిడ్డను త్వరగా బిల్చుకొనిరండు.

మాంష్యర్ మాదలిన్ అదిరిపడెను.

ఫాం: డాక్ట రేమని చెప్పెను?

మాదలిన్ చిఱునవ్వు నవ్వ యత్నించుచు "నీ బిడ్డను వెంటనే తెమ్మన్నాడు. అది నిన్ను బాగుచేయునట." అనెను.

ఫాం: అవును! అత డన్నది సరియే! కాని, యీ తేనార్డియర్లు కేమైనది - నా కోజెత్తును పంపకున్నారు? ఆహా! అది వచ్చును! ఇప్పటికి సుఖపడు దినములు!

ఏమైనను తేనార్డియర్లు శిశువును బంపలేదు. ఒక్క శతమానము కారణములు చెప్పిరి. చలికాలమున బయ లింపలేని సుకుమారి కోజెత్తని, చిల్లర బాకీ లెన్నో యున్న వని, వానిని జమచేయుచున్నామని—ఇట్లే.

"ఎవరినైన బంపించెదను. అవసరమైన నేనే పోయి

కోజెత్తును బిలుచుకొనివచ్చెదను.'' అని మాదలిన్ ఊహిం
డించెను.

ఫాంటైన్ చెప్పగా ఈ క్రింది లేఖ వ్రాసి, ఆమె
చేవ్రాలు తీసికొనెను.

''మాంష్యర్ తేనార్డియర్‌కు,
ఈ జాబు తెచ్చినవారికి కోజెత్తు నప్పగింపుడు.
చిల్లర బాకీలన్నిటిని ఆయన తీర్చును.
మీ మేలుకు గృతజ్ఞనై నమస్కరింతును.
ఫాంటైన్.''

ఇంతలో ఒక ప్రమాద సందర్భ మడ్డు తగిలెను.
అతి నిగూఢమైన జీవితదారువు నెంతయో చెక్కి మెఱుగు
పెట్టుదుము. విధి నిర్మితమగు నల్లనాడి యెడతెగక కన్పడు
చునే వచ్చును.

## 2

త్రాను మాంట్ఫర్మిల్‌కు బోవలసివచ్చు నేమోయని,
తానూర లేనప్పుడు జరుగవలసిన విధానమును మేయ
రాఫీసున మాదలిన్ ఏర్పాటు చేయుచుండెను. అప్పుడు
ఇన్స్పెక్టర్ జేవర్ తనతో మాటాడ వచ్చినాడని తెలిపిరి.
ఆ పేరు వినగనే, అణచినను ఆగక ఏదో యనిష్టభావము
రేకెత్తెను. ఆనాడు పోలీసు స్టేషన్‌లో సంఘర్షణ జరిగిన
తరువాత మునుపటికంటె నెక్కువగా జేవర్ మాదలిన్‌కు
దొలగిపో సాగెను. కావున మాదలిన్ అతనిని జూడనే
లేదు. ''రానిమ్ము'' అనెను.

జేవర్ ప్రవేశించెను.

మాంష్యుర్ మాదలిన్ నిప్పుసెగను కూర్చుండి, ఏదో కాగితముల కట్టలమీద వివరణములు వ్రాసికొనుచుండెను. జేవర్‌కై యతడు స్థలము మార్చలేదు. ఫాంటైన్ చింత అనివార్యమై జేవర్‌పై ఔదాసీన్యము కలిగించినది.

జేవర్ సగౌరవముగ నమస్కరించెను. ముఖము త్రిప్పని మేయరిది చూడక, తలవంచుకొని వ్రాసికొనుచునే యుండెను.

జేవర్ కొన్ని యడుగులు ముందుకుసాగి నిశ్శబ్దత భేదింపకయే యాగెను.

నాగరకతను సేవించుటలో మృగప్రాయుడైనవాడు జేవర్. భౌతికము పట్టు విడువని సన్యాసి. అసత్యమాడజేతగాని గూఢచారి. ఏ యాశలకును లొంగని యపరాధ పరిశోధకుడు. అతని హృదయమున గుప్తమై మాదలిన్ మీద ద్వేషము దృఢమై యుండినది. అట్టివాని ముఖమిప్పుడు చూచిన 'ఇతని కేమైన'దని యాశ్చర్యము గొలుపునట్లు మారిపోయినది.

అతనిలో బెద్దకల్లోలము జరుగుచుండెనని ఆ కఠిన సత్యశాసననిష్ఠుని అంతరాత్మ బానిసను నెఱిగినవారికి స్పష్టముగ దెలిసెడిది. ముఖమున బ్రతిబింబింపని దతని మనస్సుననుండదు. ఉగ్రులైన వారందఱిలోవలె నతనిలోను హఠాత్తుగ మార్పులు కలుగుచుండును. ఇంత వింతగ, ఆశ్చర్యకరముగ అతని ముఖ మెప్పుడును ఉండినదికాదు. గది ప్రవేశించిన వెంటనే మాదలిన్‌కు నమస్కరించెను. అతని

చూపులో వైరములేదు. కోపములేదు. ప్రతిఘటనలేదు. మేయర్ కుర్చీ వెనుక కొన్ని యడుగులు కడచి సోల్జరువలె నిల్చుండెను. ఆ వైఖరిలో దయయే యెఱుగని నిరంతర సహనశీలికి సహజమగు ఉదాసీనతయు అమర్యాదయు ద్యోతకమగుచుండెను. ఒక్కమాటాడక, కదలక, నిక్కపు వినయముతో క్షోభారహిత సహనముతో శాంతముగ, గంభీరముగ గ్రిందచూపులు నిగుడ్చి సోల్జరు తన యాఫీసరు నెదుట, ఖైదీ జడ్జి యెదుట నిలుచుండునట్లు, హాటు చేత బట్టుకొని నిల్చుండి యుండెను. ఆ ముఖమున నాలోచనయు విషాదమును ముద్రితములై యున్నవి. అవమానము, స్థైర్యము, వర్ణన కందని తెగువతో గూడిన ఖిన్నతయు ఆ మూర్తి సకలము వెల్లడి చేయుచుండెను.

ఎట్టకేలకు మేయర్ పేనా క్రిందబెట్టి కొంచెము వెనుకకు జరిగెను. ''ఏమి? ఏమి సమాచారము జేవర్?''

చెదఱిన మతిని జేర్చుకొనుచున్న వానివలె జేవర్ ఒక్క నిముసము నిశ్శబ్దత వహించెను. పిదప నోర్విప్పి విషాద గంభీరమయ్యు సారళ్య సహిత స్వరమున ''ఒక నేరము జరిగినది మాంష్యర్ మేయర్!'' అనెను.

మా: ఏమది?

జే: ప్రభుత్వమునందలి యల్పసేవకు డొకడు మాజి స్ట్రేటు పైన నతిఘోరముగ నగౌరవము ప్రదర్శించినాడు. దానిని మీకు దెలియజేయుట నా ధర్మము.

మా: ఎవడా యల్ప సేవకుడు?

జే: నేను.

మా: నీవు?

జే: నేను.

మా: ఈ సేవకునిపై పిర్యాదు చేయవలసిన మాజిస్ట్రేటెవరు?

జే: మీరు, మాంష్యర్ మేయర్!

మాంష్యర్ మాదలిన్ కుర్చీలో చక్కనై కూర్చుండెను. జేవర్ గంభీరముగనే నేల చూచుచు మఱల పలికెను. "మాంష్యర్ మేయర్! దయయుంచి నా మీద నేరము మోపి తొలగింపజేయుడని మిమ్ము ప్రార్థింప వచ్చితిని."

మాంష్యర్ మాదలిన్ ఆశ్చర్యచకితుడై పలుకనుంకించెను. జేవర్ ముందుగనే-"రాజీనామా పెట్టుమందురేమో. అది చాలదు. రాజీనామా యిచ్చుట గౌరవకరము. నే నపరాధిని. శిక్షార్హుడను. నన్ను తొలగించియే తీఱవలెను." అనెను.

కొంచెమాగి మఱియు నిట్లనెను. "మాంష్యర్ మేయర్. ఆనా డన్యాయముగ నాయెడ గాఠిన్యము వహించితిరి. నేడు న్యాయముగ వహింపుడు."

మా: నిజమే? ఏమీ తెలివి తక్కువ? దీని యర్థమేమి? నీవు నాయెడ నొనర్చిన నేరమేది? అది యెట్లు? ఊరక నిందించుకొనుచున్నావు. ఉద్యోగ మక్కఱలేదా?

జే: నన్ను డిస్మిస్ చేయవలెను.

మా: డిస్నిస్! ఇది వింతగా నున్నది. నా కర్థమగుట లేదు.

దీర్ఘనిశ్వాసముచేసి, విషాదముతో నుదాసీనతతో జేవర్—"మీ కర్థమగును మాంష్యర్ మేయర్! ఆఱు వారములకు ముందు, ఆ యువతి విషయము జరిగిన తరువాత, క్రోధపూరితుడనై మిమ్ము నిందించితిని." అనెను.

మా: నిందించితివా?

జే: అవును. పోలీస్ సర్వాధికారి యొద్ద.

జేవర్ కంటె దక్కువ నవ్వునట్టి మాంష్యర్ మాదలిన్ నవ్వసాగెను—"పోలీసువారి డ్యూటీ నాక్రమించితి ననియా?"

జే: ప్రాత ఖైదీయని.

మేయర్ వెలవెల పోయెను.

కనులెత్తక జేవర్ — "నేను దానిని విశ్వసించి యుంటిని. చాల కాలముగా నాకు సందేహముండినది. పోలిక, మీ యపారబలము, వృద్ధఫకల్వోంట్ సన్నివేశము, మీ లక్ష్యకౌశలము, కొంచెము లాగు మీగాలు—ఇంకెన్నియో తెలివిమాలిన యాలోచనలు. కడపటికి జాన్ వాల్జా యనువాడొకడు మీరని భావించితిని." అనెను.

మా: ఏమి పేరు? ఏమంటివి?

జే: జాన్ వాల్జా. వాడొక ఖైదీ. ఇరువదేండ్లకు పూర్వము, టూలన్‌లో నున్నపుడు చూచి యుంటిని. అప్పుడు నేను గాలీ రక్షకుడను. ఈ వాల్జా గాలీ నుండి విడుదలయైన పిదప, ఒక బిషప్ భవమును దోచెను. తరు

వాత, రస్తాలో ఆయుధధారియై ఆటవిక బాలు నొక్కని దోచెను. ఎనిమిదేండ్లుగా వాని పోకడ తెలియలేదు. నేను భ్రమ పడితిని. కోపము ప్రేరేప మీరే వాడని పోలీసు సర్వాధికారికి దెలిపితిని.

మఱల గాగితముల కట్టనెత్తికొని, నిశ్చలోదాసీనతతో మాంస్యర్ మాదలిన్-"నీకేమి జవాబు వచ్చినది?" అనెను.

జే: నాకు బిచ్చి పట్టినదని.

మా: ఆఁ!

జే: వారు సరియే.

మా: నీ వట్లనుకొనుట అదృష్టమే.

జే: అవును. నిజమైన జాన్ వాల్జా పట్టు వడినాడు.

మాదలిన్ చేతికాగితము క్రింద పడెను. తలనెత్తి, నిశ్చలముగ జేవర్‌ను చూచుచు, వర్ణనకందని కంఠముతో "ఆఁ" యనెను.

జే: అది యెట్లో వివరించెదను. జానపద ప్రాంతమున ఎ-లో ఫాదర్ చాంప్మతు యనువాడుండెనట. అతడతి సాధారణుడు. నిఱుపేద. ఎవ్వరును, అతనిని లెక్క సేసినవారే లేరు. అట్టివారు జీవింతురు___ఎట్లో యెవరికిని దెలియదు. కడపటికి, ఆపుల్ పండ్లు దొంగిలించెనని ఈ చాంప్మతును అరెస్టు చేసిరి. అది ముఖ్యము కాదు. దొంగతనము - గోడనెగ బ్రాకి. చెట్టుకొమ్మలు విఱిగినవి. చాంప్మతును బంధించిరి. అతనిచేత ఆ చెట్టుకొమ్మయు నుండినది. దొంగను బోనులో పెట్టిరి. ఇంతవఱకిది సాధారణమైన

చెఱసాల కేసు. ఇక్కడ ఈశ్వరహస్తము కలుగజేసి కొన్నది. అక్కడ జెయిలు సురక్షితముగా లేకుండుటచే, అతనిని అర్రాస్‌కు మార్చిరి. అక్కడి జెయిలులో ప్రాత ఖైదీ బ్రెవీ యనువాడున్నాడు. ఏదో చిన్న నేరమునకు బంధింపబడి, సత్ప్రవర్తన ఋజువుపఱచి, తాళములను భద్రపఱుప నియమింపబడియున్నాడు. చాంప్మతు అక్కడ అడుగు పెట్టగనే వాడు కేకవేసి 'ఆహా! ఆ మనుష్యుడు నాకు దెలియును. పూర్వము ఖైదీ' యనెను.

" 'ఇటు చూడవయ్యా పెద్దమనుష్యుడా, నీవు జాన్‌వాల్జా.' 'జాన్‌వాల్జా! ఎవరు జాన్‌వాల్జా?' అని చాంప్మతు ఆశ్చర్యము నభినయించెను. 'తెలియనట్లు నటింపకు. నీవు జాన్‌వాల్జా. టూలన్‌లో గాలీలలో నుంటివి. ఇరువదేండ్లకు ముందు మనమిద్దఱమక్కడ నుంటిమి.' చాంప్మతు సర్వము నిరాకరించెను. నిజముగ! తెలిసినదా? వారు లోతులు కని పెట్టిరి. ఈ చాంప్మతు, ముప్పదేండ్లకు ముందు నానా స్థలములలో మొక్కలు కత్తిరించెడువాడుగ నుండెను—ముఖ్యముగ ఫేవరొల్‌లో. అక్కడనుండి మనకంటికగపడడు. చాల కాలమైన తరువాత ఆవర్‌న్‌లో కన్పించును. పిదప పారిస్‌లో పొడగట్టును. అక్కడ బండ్లు చేయువాడుగ నుండెను. అతనికొక్క కూతురుండెను. బట్టలుతికెడిది. కాని, ఆ యంశము ఋజువు కాలేదు. కడపట నీ ప్రాంతములలో కనుపడినాడు. సరి. ఇంటిదోపిడికి శిక్షింపబడుటకు ముందు జాన్‌వాల్జా యేమి చేయుచుండెను? మొక్కలు, పొదలు కత్తిరించుట. ఎక్కడ? ఫేవరొల్‌లో.

ఇంకొక విషయము. ఈ జాన్‌వాల్జా యొక్క గురుప్రోక్త నామము జాన్. అతని తల్లి యింటిపేరు 'మాతు'. గాలీ వదలిన తరువాత, దాపటికమునకై తల్లి యింటిపేరు తెచ్చి పెట్టుకొనుట కంటె సహజమైన దేమున్నది? జాన్ మాతు అని పిలువబడుచుండెను. ఆవర్న్‌కు పోయిన పిదప, అక్కడ 'జాన్'ను 'చాన్' అని యుచ్చరింతురు గాన చాన్‌మతు అని పిలుచుచుందురు. మనవాడు దానినే గ్రహించి చాంప్మతుగా మాఱెను. చూచితిరా! ఫేవరోల్‌లో విచారించిరి. జాన్‌వాల్జా కుటుంబీకు లిప్పుడక్కడ లేరు. ఎక్కడున్నారో యెవ్వరు నెఱుగరు. ఆ యంతస్థునందలి కుటుంబములు పలుమా అదృశ్యములగును. ఎంత వెదకినను లాభముండదు. అట్టివారు, మట్టి కానపుడు ధూళియగుదురు. ఈ కథారంభము ముప్పదేండ్లనాడు కావున, జాన్‌వాల్జా నెఱిగినవాడు ఫేవరోల్‌లో ఒక్కడైన లేడు. కాని, టూలన్‌లో విచారించిరి. బ్రెవీ కాక, జాన్‌వాల్జాను చూచినవారిద్దరే ఖైదీలు కలరు. వారు యావజ్జీవ ఖైదీలు. ఒక్కడు 'కొచెపెల్'. మఱొకడు 'చెనిల్‌దో'. గాలీల నుండి వారిని దెచ్చి చాంప్మతు నెదుట నిలిపిరి. వారికి సందేహమే కలుగలేదు. వారికిని, బ్రెవీకిని అతడు జాన్‌వాల్జాయే. అదే వయస్సు - ఏబది నాల్గు. అదే యెత్తు, ఆకారము. వాస్తవమున కతడే. జాన్‌వాల్జాయే. అ సమయమునకు సరిగా నే నొర్చిన నింద పారిస్ చేరినది. 'నీ మతి చెడినది. జాన్‌వాల్జా అర్రాస్‌లో కోర్టు చేతులలో నున్నా'డని బదులు వ్రాసిరి. ఇది నాకెంత యద్భుతము గొలిపెనో యూహింపుడు. ఆ జాన్‌వాల్జా

యిక్కడనే యున్నాడని నేను విశ్వసించి యుంటిని. నేను న్యాయాధిపతికి వ్రాసితిని. ఆయన నన్ను బిలిపించి చాంప్మ తును నా యెదుటికి బిలిపించెను.''

మా: ఆఁ!

జే: మాంష్యర్ మేయర్, సత్యము సత్యమే. నాకు విచారముకల్గినను సరే, అతడే జాన్‌వాల్జా. నేనును గుర్తించితిని.

తగ్గు గొంతుతో మాదలిన్–''సందేహమే లేదా ?'' అనెను.

దృఢ విశ్వాసమును సూచించు నవ్వుతో జేవర్– ''హుఁ, నిస్సందేహము. అసలైన జాన్‌వాల్జాను జూచితిని గాన, పరునట్లు భావించుట నాకర్థమగుట లేదు. మాంష్యర్ మేయర్, క్షమింపుడు.'' అనెను.

భటులందఱి యెదుట, ఆఱువారములకు ముందు ''వెళ్ళిపో'' అని తన్నవమానించిన యతని నిట్లు హృదయ పూర్వకముగ క్షమింప ప్రార్థించునపుడు, అహంకారియగు జేవర్ మొగమున నతనికి తెలియకయే సారళ్యము, ఘనతయు నిండియుండినవి. ఆ ప్రార్థనకు బదులుగా మాంష్యర్ మాదలిన్ ''ఆ మనుష్యుడేమి చెప్పెను?'' అని ప్రశ్నించెను.

జేవర్: ఓ, యేమిచెప్పుదును మాంష్యర్ మేయర్! చాల జెడ్డ వ్యవహారము. జాన్‌వాల్జాకైనచో ఇది రెండవ యపరాధము. గోడప్రాకి, కొమ్మవిఱచి, ఆపుల్ పండ్లు తీసికొనుట. పసిబిడ్డయైనచో నిది మేలమీఱుట. సాధారణ మనుష్యుడైనచో చెడునడత. ఖైదీకిది ఘోరనేరము. గోడ

ప్రాకి దొంగిలించుటలో అన్నియు నిముడును. పోలీసు కోర్టు విచారించ వీలులేదు. ఇది న్యాయసభకు వెళ్ళవలసి నదే. కొన్ని దినముల శిక్షతో నిలువదు. యావజ్జీవము గాలీ నిర్బంధము. ఇదిగాక, ఆ యాటవిక బాలుని కేసు న్నది. వాడు దొరకవచ్చును. పిశాచమునకైన నొకింత పోరాడ వీలుండవచ్చును. ఎవరికైనను గొంత యవకాశ ముండునేమో. జాన్ వాల్జాకు సున్న. కాని, వాడు జిత్తుల మాఱి. నాకు వానిని బట్టిచ్చినదదే. ఇంకొకడైనచో, తన దుస్థితి గ్రహించి, యేడ్చి మొత్తుకొనుచుండును. నేను జాన్ వాల్జాకానని యేమేమో చెప్పుచుండును. కాని, వీడేమియు నర్థముకాని వానివలె నభినయించుచున్నాడు.. 'నేను చాంప్మతు. నేను చెప్పుకోవలసిన దింకేమియులేదు.' అని, ఆశ్చర్యపడినవాలె నటించుచున్నాడు. బుద్ధిలేనివాని వేషము వేసినాడు. నక్క! అయిననేమి, సాక్ష్యమున్నది. నలుగురు వానిని గుర్తుపట్టినారు. ఆ పాపి గతియైనది. కేసు అర్రాస్‌లో న్యాయసభకు పంపబడినది. నేనును సాక్ష్యము జెప్పుదును. సమన్లు వచ్చినవి.

మాంష్యర్ మాదలిన్ మఱల బల్లకడచేరి, నెమ్మదిగా కాగితము తిరుగవేయుచు, గార్యభారము మోయుచున్నవానివలె జదువుచు వ్రాసికొనుచుండెను. మఱల జేవర్ వంక తిరిగి, "చాలు జేవర్. ఈ సూక్ష్మాంశములన్నియు నాకు గాబట్టవు. మనకెన్నో అవసర కార్యములుండగా, గాలమును వ్యర్థము చేయుచున్నాము. ఎనిమిది పది నాళ్ళలో

ఈ పనిమీదుగా అర్రాస్‌కు బోవుదునని నీవు చెప్పలేదా?'' అనెను.

జే: అంతకంటె ముందే పోవుదును, మాంష్యర్ మేయర్.

మా: ఎప్పుడు మఱి?

జే: కేసువిచారణ రేపేయని తమతో జెప్పితిని. శ్రద్ధ కలిగిన నేడే నేను బయలుదేఱవలెను.

మాంష్యర్ మాదలిన్‌లో అగోచర సంచలనము కలిగెను: ''ఎన్ని దినములు విచారణ పట్టును?''

జే: ఎంత పొడిగించినను, ఒక దినమే. తుదకు రేపు సాయంత్రమునకైనఁ దీర్పు చెప్పుదురు. కాని, అంతవఱకక్కడ నిలువను. నా వాఙ్మూలము ముగియగనే మఱలి వత్తును.

''మంచి''దని మాదలిన్ ''పో''మ్మన్నట్లు చేయి విసరెను.

జేవర్ పోలేదు: ''ఏమంటిరి?''

మా: ఇంకేమున్నది?

జే: ఇంకొక విషయము మీ జ్ఞప్తికి దెచ్చుచున్నాను.

మా: ఏమది?

జే: నన్ను డిస్మిస్ చేయవలెననుట.

మాదలిన్ లేచెను: ''జేవర్, నీవు మర్యాదగలవాడవు. నీ మీద నాకు గౌరవము కలదు. నీ తప్పును నతిశయింపజేయుచున్నావు. అదియు గాక, ఈ నేరము నాకు సంబంధించినది. నీ వవమానపాత్రుడవు కావు. అధికారౌన్నత్య

మున కర్హుడవు. నీవీస్థానమునందుండ వలెనని నా కోరిక.''

ప్రశాంత నయనములతో జేవర్ మాదలిన్‌ను జూచెను. ఆ చూపులలో అతని యంతరాత్మ, వికాస హీన మయ్యు నిశ్చలము పరిశుద్ధమునై కన్పట్టునట్లుండెను. నిఃక్షోభకంఠముతో ''మాంష్యర్ మేయర్, అంగీకరింప జాలను.'' అని చెప్పెను.

మా: ఇది నాకు సంబంధించినదని మఱల జెప్పుచున్నాను.

జేవర్ తన ధోరణిలోనే ''అతిశయోక్తియూ, లేదు. నా హేతు విధానమిది; అన్యాయముగ మిమ్మనుమానించితిని. అందేమియు తప్పులేదు. పై యధికారుల ననుమానించుట హక్కును దుర్వినియోగము చేయుటైనను, ననుమానించుట మా పని. కాని, యాధారము లేక, కోపఘూర్ణితుడనై యుండినపుడు, ప్రతీకారచింతతో, గౌరవనీయులు, మేయర్, మాజిస్ట్రేటు నైన మిమ్ము ననుమానించితిని. దీనినుపేక్షింపరాదు. మీ రూపమునందున్న యధికారము నెడ నపరాధ మొనర్చితిని. నేనా యధికారోపకరణము. నా క్రింది సేవకుడిట్టి పనిచేసి యుండెనా, తగని వాడవు పొమ్మని పంపివేసి యుందును. సరి. ఒక నిముస మాలకింపుడు మాంష్యర్ మేయర్! పలుమాఱు నా జీవితమున బరుల యెడ గాఠిన్యము చూపితిని. అది న్యాయము. నేను రైటే చేసితిని. ఇప్పుడు నా యెడ కఠినుడను గాకున్నచో, నేను న్యాయముగ జేసినదంతయు అన్యాయమగును. పరులకంటె నెక్కువగ నన్ను మన్నించుకొనవచ్చునా? తప్పు. ఏమీ!

పరులను శిక్షింప పరుగుపెట్టి, నా విషయమున వెనుకాడిన, పాపినగుదును! 'నీచుడు జేవర్' అనువారి పలుకులు సత్యములగును. మాంష్యర్ మేయర్! నన్ను దయచూడ గోరను. ఇతరులను మీరు దయజూచినపుడు, నన్ను గోపమూ చెడిది. నాకది యక్కఱలేదు. నాగరకునికి విరుద్ధముగ బజారు పడుచుకై ప్రతివాదము సేయుట, మేయర్నవమానించిన పోలీసేజంటును మన్నించుట నీచోచ్చతలను మంటగలుపుటగును. ఒక్కటి సేయుటగును. దాని నధర్మ కరుణయందును. అకరుణ సంఘమును దున్కలు సేయును. ఈశ్వరా! కరుణించుట సుకరము. న్యాయము నెఱపుట కష్టము. నేననుకొన్నవాడే మీరై యుండిన, దయచూపెడివాడనుకాను. ఉహుం. ఒకరియెడ నెట్లో, నా యెడను నట్లే ప్రవర్తించుకొనవలెనని మీరు గ్రహించి యుండవలసినది. దుష్టుల నణచివేయునపుడు, నపరాధులను బంధించునపుడు 'నీవు జారితివా? తప్పొనర్చితివా? జాగ్రత!' అని నాకే చెప్పుకొనెడివాడను. జారితిని. తప్పుచేయుచున్నపుడే నన్ను బట్టుకొంటిని. అది మఱియు బ్రమాదకరము! నన్ను డిస్మిస్ చేసి పంపుట న్యాయము. నాకు జేతులున్నవి. నేల దున్నగలను. కాకున్నను లోపములేదు. మాంష్యర్ మేయర్, ఇది సేవాధర్మమునకు మేల్బంతి యగును. ఇన్స్పెక్టర్ జేవర్‌ను డిస్మిస్ చేయవలెనని కోరుచున్నాను'' అనెను.

ఇట్లు చెప్పునపుడతని స్వరమున వినయాహంకారములు, తెగువ నిశ్చయములును గూడి, ఈ విచిత్ర గౌరవో

పేతునికి, వర్ణింపరాని యౌన్నత్యము నిచ్చియు చాద స్తుడని పించుచుండెను.

మాదలిన్ చేయిచాచి "చూతములే." అనెను.

జేవర్ వెనుక కెగిరిపడి తీవ్రతతో "క్షమింపుడు, మాంష్యర్ మేయర్! అట్లు చేయగూడదు. మేయర్ గూఢ చారి హస్తస్పర్శ చేయరాదు. ఆవును. ఏ నిముసమున నా స్థానమును దుర్వినియోగము చేసితినో, అది మొదలు పచ్చి గూఢచారి నైతిని!" అనెను.

పిదప. గంభీరముగ వందన మాచరించి, ద్వారము చేరెను.

అక్కడ వెనుదిరిగి, క్రిందిచూపుతో "మాంష్యర్ మేయర్, ఇంకొకరు నా స్థానమున కేర్పాటగు వఱకును, ఉందును." అనెను.

అతడు వెళ్ళిపోయెను. అతని స్థిరదృఢపద శబ్దము వినుచు ఆలోచనా ధీనుడై మాంష్యర్ మాదలిన్ కూర్చుండియే యుండెను.

---

# నిర్భాగ్య జీవులు

## ప్రథమ ఖండము - ఫాంటైన్

### సప్తమాధ్యాయము

### (చాంప్మతు వృత్తాంతము)

## 1

ఇప్పుడు వివరింపబోవు సంఘటనలన్నియు మ-లో తెలియవు. వెలికివచ్చిన కొన్నియు ఊరిలో జిరస్మరణీయములై పోయినవి. కావున, వానిని సూక్ష్మముగ వివరింపకుండుట తీవ్ర లోపమగును.

వానిలో రెండు మూడు పరిస్థితుల సంభవము లట్లు పొడకట్టును. అయినను సత్యము మీాది గౌరవముచే వానిని దెలిపెదము.

జేవర్ వచ్చిపోయిన నాటి మధ్యాహ్నమే, మాడలిన్ యథావిధిని ఫాంటైన్ జూడబోయెను. అట్లు పోవుటకు ముందు సిస్టర్ సింప్లిస్‌ను బిలిపించెను.

చికిత్సాలయము నందలి సన్యాసిను లిద్దరును లాజరిస్టులు. ఒకామె పేరు సిస్టర్ పర్పెచు. ఇంకొకామె సిస్టర్ సింప్లిస్.

సిస్టర్ పర్పెచు సామాన్యమగు పల్లెపడుచు. ఆమె

తటాలున నీశ్వరసేవ గైకొనెను—ఇతరమగు ఏ సేవా వృత్తికిని, దీనికిని భేదము గ్రహించినది కాదు. పరులు వంటకత్తెలెట్లో ఆమె సన్న్యాసిని యట్లు. ఇట్టి వారరుదు. మఠాధిపతులీ కర్షక జాతిని సులభముగ దీసికొందురు. ఈ యసంస్కృతులు మొఱటు పనుల కక్కఱపడుదురు. ఆల కాపరి సన్న్యాసియగుటకు నాంతరిక సంఘర్షణ మవసరము లేదు. ఎక్కువ శ్రమలేక, యొకరింకొరగుదురు. పల్లెకు, మఠమునకును సామాన్యమగు నజ్ఞానము చాలిన సన్నా హము. దాని ధర్మముచే, గ్రామీణుడొక్క క్షణములో గర్మ సన్న్యాసియగును.

పక్పెచు స్థూల సన్న్యాసిని. మోట మాటరి. బైబుల్ గీతములు పాడుకొనుచు గొణుగుచుండును. వ్యాధిగ్రస్తుల మూఢ విశ్వాసమునో, మోసబుద్ధినో పట్టి. గుప్తౌషధములలో జక్కెర కలుపును. కోలుకొనుచున్న వారిని గటువుగ జూచును. చచ్చుచున్న వారియెడ గఠినత కన్పఱచుచు, వారిని దేవుని ముఖమున గొట్టుచున్నట్లు, మరణబాధను గుపిత ప్రార్థనలతో బురిపెట్టునట్లును ప్రవర్తించును. ధీర. నిష్కపటి. ఎఱ్ఱనిది.

సిస్టర్ సింప్లిస్ అతి ధవళవర్ణ. ఆ ధావళ్యమున మైనము నందలి స్పష్టత కలదు. "ఆమె మఠము వ్యాధి నిలయమే. శాడుగ గూడే భవనము. ఊరి వీధులు, హాస్పి టల్ వార్డు ఆమె జపము చేసికొను చోటులు. విధేయతయే ప్రహరి. దైవభీతియే రక్ష. లజ్జయే యాచ్ఛాదనము." ఇది సెయింట్ విన్సెంట్ డిపాల్ చిత్రించిన సన్న్యాసినీమూర్తి.

ఈ యాదర్శము సిస్టర్ సింప్లిస్‌లో జీవము గొన్నది. ఆమె వయస్సెవరును జెప్పలేరు. ఆమె యువతిగా నుండలేదు. ముదుసలి యెన్నటికిని గాదనిపించును. ఆమె యొక వ్యక్తి-స్త్రీ యని చెప్ప ధైర్యము మాకు లేదు. మార్దవ తపో సాహచర్యా నిర్లిప్తతల నెలవు. అసత్యమెన్నడును ఆడినది కాదు. కడు పల్చని యొడలయ్యు గష్టములోర్చుకొనుటలో బాషాణము. అభాగ్యులకామె హస్తస్పర్శ యాహ్లాదకరమై సుకుమారమై శుచిత్వమిచ్చునది యగును. పలుకులలో మౌన గుణమున్నది. ఎంత యవసరమో అంతే చెప్పును. సత్యము కానిమాట నెన్నడును జెప్పకుండుట ఆమె విశిష్ట గుణము. ఈ యచంచల సత్య దీక్షకామె ప్రసిద్ధ. ఆమె హాసము, చూపులును ధావళ్య ప్రభాసములు. ఆ శుద్ధ స్నిగ్ధాంతరాత్మ మీద బారిధ్వాణువైన లేదు. సింప్లిస్ అభిధానమామె విచక్షణతో గైకొన్నది. సిసిలీ సింప్లిస్ తపసి సైరాక్యూస్‌లో జనించినది. సెగెస్టాలో పుట్టినట్లు చెప్పెనా ఆమె ప్రాణములు కాపాడుకొనెడిది. కాని, సత్యమునే చెప్పి, స్తనద్వయమును గోయించుకొని చచ్చినది.

ఈశ్వరసేవాపరాయణ యగు ఈ సిస్టర్ సింప్లిస్, ఫాంటైన్‌లో ఏదో ఆంతరిక సౌజన్యములు గుఱుతించి, కేవలమామె కుపచరించుటకే కాలమంతయు గడపుచుండెను.

మాంస్యూర్ మాదలిన్ సిస్టర్ సింప్లిస్‌ను ప్రక్కకు బిలిచి, ఫాంటైన్‌ను ఆమె కప్పగించెను. దీనినామె భవిష్యత్తునం దొకనాడు స్మరించెను.

అట్లప్పగించిన పిదప, నతడు ఫాంటైన్‌ను సమీపించెను.

శుభముహూర్తమున కెదురుచూచునట్లు, ఫాంటైన్ మాదలిన్ రాక కెదురుచూచు చుండెడిది. సిస్టర్లతో "మేయరిక్కడ ఉన్నప్పుడే నేను బ్రతికియుందును" అనును.

ఆనాడు జ్వరమెక్కువైనది. మాంష్యూర్‌ను చూడగనే "కోజెత్తు?" అని ప్రశ్నించెను.

చిఱునవ్వుతో మాదలిన్—"త్వరలో వచ్చును." అనెను.

ఫాంటైన్ కడ నున్నప్పుడు మాంష్యూర్ మాదలిన్ ఎప్పటియట్లు కనుపట్టును. ఆమె తృప్తికొఱకై గంట సేపక్కడ నుండును. ఆమెకే లోపము రాగూడదని, వేయి కనుల జూచును. డాక్టరాయన చెవిలో "శీఘ్రముగా క్షీణించుచున్నది" అన్నపుడతని ముఖము విచారగ్రస్తమయ్యెను.

అక్కడినుండి మాదలిన్ మేయరాఫీసుకు పోయెను. గది గోడమీది రోడ్డుమాపును చూచి, పెన్సిలుతో కాగితముపై నేమో గుర్తు వేసికొనుచుండుటను, ఒక భటుడు గమనించెను.

## 2

మేయర్ కచ్చేరినుండి మాదలిన్ నగర బహిఃప్రదేశమునకేగెను. అక్కడ మాస్టర్ స్కాఫ్లేర్ అనువాడు కలడు. అతడు గుఱ్ఱములను, బండ్లను బాడుగున కిచ్చును.

స్కాప్లే రిల్లు చేరుటకుబోవు దగ్గఱ త్రోవలో నా యూరి గురువున్నాడు. ఆయన గొప్ప యర్హత గలవాడని, మర్యాద గలవాడని, మంచి సలహాలిచ్చువాడని ప్రసిద్ధి. మాంష్యూర్ మాదలిన్ గురువింటి సమీపమున బోవునపు డక్కడ నొక మనుష్యుడుండెను. అత డిట్లు చెప్పెను: మేయర్ గురువిల్లు కడచి కొన్ని యడుగులు చన్నపిదప ఆగి, వెనుదిరిగి గురువింటి కడకు మఱల వచ్చి తలుపుదగ్గఱ నాగెను. తలుపు పెద్దది. దానిపై గొట్టి, యాగంతుకులు తమ రాక తెలుపుటకై యొక యినుపకడ్డీ వ్రేల గట్టబడి నది. మేయరా కడ్డీని తీసికొని త్వరలో బైకెత్తెను. మఱల దించి, మెల్లగా వదలి వైచెను. పిదప, మును పెన్నడును లేని తొందఱతో వెళ్ళిపోయెను.

మాస్టర్ స్కాప్లేర్ యింటనే యుండి, ఒక జీను రిపేరి చేయుచుండెను.

మా: మాస్టర్ స్కాప్లేర్, నీదగ్గఱ మంచి గుఱ్ఱ మున్నదా?

స్కా: మాంష్యూర్ మేయర్, నా గుఱ్ఱములన్నియు మంచివే. మంచి గుఱ్ఱమనుటలో మీ యభిప్రాయ మేమి?

మా: దినమున కిరువది లీగులు* పోగలిగినది.

స్కా: ఇరవై లీగులు?

మా: అవును.

స్కా: బండికా?

* 'లీగ' నగా మూడు మైళ్ళు.

మా: ఔను.

స్కా: ఆ ప్రయాణమయిన పిదప ఎంత ప్రొద్దు విశ్రాంతి?

మా: అవసరమగుచో, మఱునాడే ప్రయాణమునకు సిద్ధముగా నుండవలెను.

స్కా: మఱల ఇరువది లీగుల పరుగునకే!

మా: ఔను.

స్కా: అబ్బా! ఇరువది లీగులే?

మాంష్యర్ మాదలిన్ తన జేబునుండి కాగితము తీసి యిచ్చెను. దాని మీఁద పెన్సిలుతో 5, 6, 8½ అని గుర్తు వేయబడియున్నది.

మా: చూచితివా, మొత్తము 19½. అనగా ఇరువది లీగులు.

స్కా: మాంష్యర్ మేయర్, మీకు గావలసినట్టిది నా దగ్గఱ నున్నది. నా చిన్న తెల్లగుఱ్ఱమును నప్పుడపుడు మీరు చూచియుందురు. అది వాయువేగము కలది. సవారి కుపయోగించుటకు వారు ప్రయత్నించిరి. అహ్హాహ్హా! కాళ్ళు జాడించి యందఱను బడద్రోసినది. దుష్ట జంతువనుకొని యేమియు బాల్పోక విచారించుచుండిరి. నేను కొని బండికి కట్టితిని. మాంష్యర్, అది కోరినది బండి. పసిబిడ్డయంత సాధువు. కంటి కగుపడక పరుగెత్తును. సవారికి మాత్రము లొంగదు. ప్రతొక్కరికిని గోరిక లుండును. ఈడ్చుట దాని కోరిక—మోయుట కాదు. అది యట్లు నిశ్చయించుకొన్న దని మనము నమ్మవలసినదే.

మా: ఈ రాక పోకలది చేయునా?

స్కా: ఇరువది లీగులను, ఆద్యంతము పూర్తి కదముతో, నెనిమిది గంటలలో ముగించును. కాని, కొన్ని షరతు లున్నవి.

మా: ఏవో చెప్పు.

స్కా: సగము దూరమైన పిదప, దాని కొకగంట విశ్రాంతి నీవలెను. అది యక్కడ మేయును. అది మేయునప్పుడెవ్వరైన బ్రక్కనే యుండవలెను. లేకున్న, సత్రము సేవకులు ఉలవలు త్రాగివేయుదురు. గుఱ్ఱము పస్తుండును.

మా: సరే. ఎవ్వరైన నుందురు.

స్కా: రెండవది, బండి మాంష్యర్ మేయర్ కేనా?

మా: అవును.

స్కా: మాంష్యర్ మేయర్‌కు బండి తోలుట వచ్చునా?

మా: ఆహా.

స్కా: సరి. మాంష్యర్ మేయర్ ఒంటరిగ, సామగ్రులు లేక పయనించవలెను. లేనిచో బరువెక్కువగును.

మా: అంగీకరించితిని.

స్కా: కాని, వేఱెవ్వరును లేనందున, మాంష్యర్ మేయర్ తామే ఉలవలు తినిపించవలసి యుందురు.

మా: ఊఁ.

స్కా: నాకు దినమునకు ముప్పది ఫ్రాంకు లీవలెను. విశ్రామ దినమునకుగూడ. ఒక పెన్నీ తగ్గను. గుఱ్ఱమున కాహారము మాంష్యర్ మేయర్ వ్యయమే.

మాంష్యర్ మేయర్ మూడు నెపోలియన్లను తీసి టేబుల్ మీదనుంచి: "ఇదిగో, రెండు దినముల కడ్వాన్సు కూడ." అనెను.

స్కా: ఇట్టి ప్రయాణమునకు సాధారణమగు బండి బరువు. నా దగ్గఱ కప్పులేని దొక్కటున్నది. దానిని మాంష్యర్ మేయరంగీకరింపవలెను.

మా: ఒప్పుకొంటిని.

స్కా: ఆలోచింపుడు. ఇది చలికాలము.

మాంష్యర్ మాదలిన్ పలుకలేదు.

స్కా: చాల జలిగా నుండును.

మాంష్యర్ మాదలిన్ నిశ్శబ్దము.

స్కా: వర్షము రావచ్చు.

మాంష్యర్ మాదలిన్ తలపైకెత్తి: "గుఱ్ఱము, బోడి బండియు రేపుదయము నాల్గున్నఱ గంటలకు నా యింటి యొద్దకు బంపించు." అనెను.

సా: సరే. అర్థమైనది.

పిదప, టేబుల్ మీది మచ్చను బొటన వ్రేలిగోటితో గోకుచు, తన చాతుర్యమును మరుగుపఱచు నిర్విచార వైఖరి వహించి "సరే, నేనింతవఱకీ సంగతి యేమనుకో లేదు! మాంష్యర్ మేయర్ ఎక్కడికి పోవుదురో చెప్ప లేదే!" అనెను.

మొదటినుండి, యింకొక విషయమై యతడు యోజించుచుండలేదు. ఎందులకోకాని, ఆ ప్రశ్న వేయు ధైర్యము చాలినదికాదు.

మా: నీ గుఱ్ఱమునకు ముందుఱి కాళ్ళు దృఢమైన వేనా?

స్కా: ఆహా! కాని, మాంష్యర్ మేయర్, పల్లములో బోవునపుడు కొంచెము బిగబట్టవలెను. మీా మార్గము పల్లమా?

మా: రేపుదయము నాల్గున్నఱ గంటలకు, బండిలో నా యింటికిరా. మఱవకు.

ఆయన వెళ్ళిపోయెను. స్కాఫ్లేర్ 'మూగ' యయ్యెను. అటులని యతడు కొంతకాలమైన తరువాత జెప్పెను.

రెండుమూడు నిముసముల తరువాత మేయర్ మఱలి వచ్చెను. ముఖమున నెప్పటి నిర్వికారము, అన్యాలోచనయు కూడియున్నవి.

మా: మాస్టర్ స్కాఫ్లేర్, నీవు పంపు గుఱ్ఱము, బండియు గలిపి యేమి వెల కట్టుదువు?

స్కా: కొందురా?

మా: లేదు. ఏమైనను జరిగిన, వానిని నీకు గారంటీ చెప్పవలెనని నా యిష్టము. మఱలి వచ్చినపుడు, నా దుడ్డు వెనుకకిచ్చి వేయవచ్చును. వాని వెల యేమగును?

స్కా: ఐదువందల ఫ్రాంకులు, మాంష్యర్ మేయర్!

మా: ఇవిగో.

మాంష్యర్ మాదలిన్ ఒక బాంక్ నోటును టేబుల్ మీాద బెట్టి వెళ్ళిపోయెను. మఱె మఱలి రాలేదు.

వేయిఫ్రాంకు లనకపోతినే యని స్కాఫ్లేర్ నాలుక

కఱచెను. వాస్తవమునకా గుఱ్ఱము బండియు గలిసి నూఱు క్రౌను లగును.

స్కాఫ్లేర్ తన భార్యను పిలచి జరిగినదంతయు వివరించెను. ఈయన యెక్కడికి పోవునాయని వారు తర్కించుకొనిరి. "పారిస్"కు అని భార్య. "నేనది నమ్మను" అని భర్త. మాంష్యర్ మాదలిన్ ఆ పెన్సిల్ గుర్తు వేసిన కాగితము నక్కడనే మఱచిపోయినాడు. స్కాఫ్లేర్ దాని నందుకొని పరిశీలించెను. ఐదు, ఆరు, ఎనిమిదిన్నర? ఇవి టపాలంచెలుగా ఉండవలెను. భార్య వంక తిరిగి "కనిపెట్టితిని. ఇక్కడినుండి హెస్డిన్‌కు అయిదు లీగులు. అక్కడినుండి సెయింట్‌పోల్‌కు ఆరు. ఎనిమిదిన్నర సెయింట్‌పోల్ నుండి అర్రాస్‌కు. మేయర్ అర్రాస్ బోవుచున్నాడు." అనెను.

ఇంతలో మాంష్యర్ మాదలిన్ ఇల్లు చేరెను. ఈసారి దూరపు రస్తా వెంట వచ్చెను. గురువు గృహము మనోవికార హేతువేమో. దానికి దొలగ యత్నించెను. తన గది చేరి తలుపు వేసికొనెను. దీన విచిత్రము లేదు. ఆయన త్వరగానే పండుకొను టలవాటు. కాని, ఫాక్టరీ కావలి కత్తె—ఆమె యొక్కతే మాంష్యర్ మాదలిన్ పరిచారికయు — ఎనిమిదిన్నఱకే దీపమాఱిపోవుట గమనించి, షరాబుతో "మాంష్యర్ మేయరుకారోగ్యము సరిగా లేదా? ఏదో మాదిరిగ ఉన్నట్టుండెనే?" అనెను.

మాంష్యర్ మాదలిన్ గదిలో ఏమి జరుగుచుండెనో చూతము.

# 3

మహాంష్యర్ మాదలిన్, జాన్ వాల్జా యని పేరొక్కడు గ్రహించియుండు ననుట నిస్సందేహము.

ఆ యంతఃకరణమునందలి లోతుల నిదివఱకే చూచి యున్నాము. మఱల జూడవలసిన సమయము వచ్చినది. చూడదలప, చిత్తక్షోభము కలిగి శరీరము కంపించు చున్నది. ఇట్టి విచారముకంటె భయంకరమైన దన్యము లేదు. మనోనేత్రమునకు మిఱుమిట్లు గొల్పునది, కానరాని చీకటి కలదియు, మానవాంతర్యమును మించినది లేదు. మానవాంతర్యముకంటె భయానకము, సంక్లిష్టము, నిగూఢము, ననంతమునైనది లేదు. సముద్రముకంటె మహత్తైన దృశ్యమాకాశము. ఆకాశముకంటె మహత్తైన దృశ్యమంత రాత్మ.

ఒక్క మానవుని యంతఃకరణ చరిత్రను గానము చేసిన చాలు—వాడు మహా దుశ్చరిత్రుడైనను సరే, ఆ గీతము మహాకావ్యము లన్నింటిని మించి యద్వితీయ మగును. భ్రమలతో కామమోహములతో గల్లోలితము అంతఃకరణము. స్వప్నముల కొలిమి. మన యవమాన మూలములగు నభిప్రాయముల గుహ. కుతర్కములను బిశాచ సభ. ఉద్రేకముల యుద్ధరంగము. బహిశ్శాంత మఱుగున గొండ చిలువల పోరాటములు, రాక్షస ద్వంద్వ యుద్ధములు, చిత్తవికార కాలమేఘములు, వెలికిరానియ్యని షడ్మవ్యూహములును మెండుకొనియుండును. ప్రతి మానవుని

యందలి యీ యనంతమున కెట్టి యాచ్ఛాదనమున్నది! దానిచే మానవుడు తన కోరికలను, హతాశుడై కొలుచును. తన జీవితకార్యములను అంచనా వేయును!

ఈ యంతరంగ ప్రవేశము చేయబోవ జంకు పొడము చున్నది. అయినను ప్రవేశింతము.

పాఠకున కిదివఱకే తెలిసిన దానికింక జేర్చవలసిన దేమియు లేదు. పెటీగెర్వా సంఘటన తరువాత, ఆ నిము సమునుండి జాన్ వాల్జా క్రొత్తవాడయ్యెను. బిషప్పతనినేమి కావలెననుకొనెనో, దానిని వాల్జా సాధించెను. అది మార్పన్న జాలదు. పరకాయ ప్రవేశమనవచ్చును.

పరులకంట బడక తప్పించుకొని, దీపస్తంభములు తప్ప మిగిలిన వెండి నమ్మివేసి, తిన్నగా నూరూరు కడచి, మ-చేరుకొని, ఆ నూతన కల్పనచేసి, మనమింతకు బూర్వము వివరించిన కార్యములన్నియుజేసి, తన్నెవరును దేఱి చూడ రాని స్థానము సంపాదించి, గతముచే విషాదము గాంచు నంతరంగము హాయి గొలుప, జీవితమునందలి యుత్త రార్థము పూర్వార్థము నసత్యమనిపింప, శాంతముగ, నభ యుడై, యాశాపూరితుడై జీవితము గడపుచుండెను. ఆయ నకు రెండే చింతలు—పేరు దాచుకొని, జీవితమును బవిత్ర మొనర్చుకొనుట—మనుష్యులనుండి తప్పించుకొని దేవుని జేరుకొనుట.

ఈ రెండు చింతలతని మనస్సున పెనవేసికొని యొక్క టయ్యెను. ఒక్కటింకొకదానియంత కడవరానిది, ఆక్ర మణ శాలియు. సాధారణముగ, నతని జీవితచర్యాక్రమ

మున నవి పీడరానివై, వానిపై పెత్తనము జూపును. కష్ట ప్రపంచము దెసకాతని దృష్టిని ద్రిప్పును. దానపరునిగ, సరళహృదయునిగ జేయును. ఒకటే సలహా నిచ్చును. అప్పు డప్పుడా రెండింటి మధ్య భేదము కల్గును. అట్టి సమయ ములలో మనుష్యుడగు షాంప్మ్యర్ మాదలిన్ మొదటి దానిని రెండవదానికి, అనగా ఆత్మరక్షణను ధర్మమునకై బలి యిచ్చును. కావుననే, ఎంత జాగ్రత పడుచున్నను నాచార్యుని దీపస్తంభముల నట్లే యుంచుకొనెను. ఆయన మరణించినపుడు నల్లదుస్తులు ధరించెను. దారిని బోవు ఆటవిక బాలురనందఱను బిలచి ప్రశ్నించును. ఫేవరోల్ లోని కుటుంబముల వృత్తాంతమరయును. చిత్తము గలచు పొడపుమాటలతో జేవర్ పీడించుచున్నను, ఫకల్వెంట్ ప్రాణమును గాపాడెను. బుద్ధిమంతులు, పవిత్రులు, న్యాయ శీలురునైన వారందఱవలె, అత్యుత్తమమగు డ్యూటీ తన మెడలేదని యతడు భావించినట్లు తోచును.

కాని, కడచిన సందర్భములలో నేదియు బ్రస్తుత మును బోలినది లేదు.

ఈ యభాగ్యుని మనస్సు నావరించిన చింతాద్వయ మింత తీవ్ర సంఘర్షణకు జొచ్చిన సమయమింతకు ముందె న్నడును లేదు. జేవరాఫీసు జొచ్చి యాడిన తొలిపలుకులే, అస్పష్టముగనైనను పూర్తిగా నీ సంఘర్షణ నతనికర్థ మగు నట్లు చేసినవి. ఎక్కడనో లోతున దాను పాతిపెట్టిన పే రుచ్చరించిన క్షణమున, మూర్ఛ గ్రమ్మినట్లయ్యెను. ఈ విధి వైపరీత్యమునందలి యమంగళమేదో మత్తు గొలిపినట్లని

పించెను. ఈ మూర్ఛ, ఈ మత్తులోగూడ నతి తీవ్రాఘాత ములకు బూర్వగామియగు కంపన మతనిని గలంచెను. తుపాను సామీప్యమునకు వంగిన వ్రాకువలె, పడనున్న దెబ్బ నెదుర్కొనబోవు సైనికునివలె నతడొక్కింత వెను తగ్గెను. తలమీద, ఉఱుములు మెఱుపులు పిడుగులను జేర్చు కొని కాళమేఘములు క్రమ్ముచున్నట్లయ్యెను. జేవర్ పలు కులు వినుచున్నపుడుకూడ, తొలుత పరుగిడి, తనను వివ రించుకొని, చాంప్మతును జెయిలునుండి లాగి, తానతని స్థానమున నిలువ దలంపయ్యెను. ప్రాణి కండలలోని బాకు పోటువలె, అది నిశితమై బాధాకరమయ్యెను. కాని, క్షణ ములో నది కడచిపోయెను. ''చూతము! చూతము!'' అని తనలో ననుకొనెను. ఈ ప్రథమ ధర్మోద్వేగమునణచికొని, ఆ త్యాగవీరత్వము నెదుట ముడుచుకొని పోయెను.

ఆచార్యుని పవిత్రోపదేశానంతరము ఇన్నేండ్ల పశ్చాత్తాపాత్మత్యాగ దీక్షల తరువాత, నింత భయంకరాతి భయంకరమైన సందిగ్ధ స్థితియందైనను జలించక సమ గతితో, తనగర్భమున స్వర్ణమును దాచియుంచుకొని యావు లించుచున్న యాయగాధకూపమువంక కతడునడచిన రమ్య ముగ నుండెడిది. కాని, అట్లు జరుగలేదు. ఆ యాత్మయందు జరిగిన దానినే మేము తెలుపవలెను. అక్కడ నేముండెనో దానినే చెప్పవలెను. మొట్టమొదట, ఆత్మరక్షణా ప్రేరణ పట్టు సాధించినది. ఆత్రముతో తన యభిప్రాయములను దఱచి, ఉద్రేకముల నణచి, మహాపాయకరమైన జేవర్ సాన్నిధ్యమును గణించి, భయముగట్టిపడగా దీర్ఘానమునను

వాయిదావేసి, తనయాచరణ విధాన విచారణను మనస్సు నుండి తఱిమి, క్షత్రియుద్ధము సేయువాడు డాలుగీలించినట్లు శాంతి వహించెను.

మిగిలిన దినమంతయు అతడీ స్థితిలోనే యుండెను. లోపల బెద్ద తుపాను, వెలుపల బరిపూర్ణ శాంతి. ముందు జాగ్రతపడుట మేలని యేవో కొన్నియుపాయములు పన్నెను. ఇంకను మనస్సు నందంతయు కళవళమై, యొండొంటి నొఱసి కొనుచుండెను. ఆ కల్లోలమునందతనికి స్పష్టమగు నభిప్రాయము గోచరము కాలేదు. అప్పటికప్పుడే పెద్ద దెబ్బతగిలి నదని తప్ప, వేఱేమియు జెప్పగలిగి యుండడు. అలవాటు ప్రకారము ఫాంటైన్‌ను చూచి, యెక్కువ ప్రొద్దక్కడ నుండెను. అట్లు చేయవలెనని, ఒకవేళ తాను అక్కడినుండి తొలగవలసివచ్చిన సిస్టర్లకామె నప్పగింప వలెననియు నతని కరుణాస్వభావము ప్రేరేపించెను. అర్రాస్‌కు పోవల సిన యవసర మేర్పడునేమోయని యతని యస్పష్ట భావన. తన ప్రయాణమును రవ్వంతయైన నిశ్చయించుకొనకయే, యనుమానమునకు పూర్తిగా నతీతుడైన తాను నక్కడ జరుగుదానికి సాక్షియై యుండుటలో బాధ లేదని, యవసర మైనచో నక్కడికేగుటకని స్కాఫ్లేర్ గుఱ్ఱపు బండిని మాటాడి యుంచెను.

మంచి యాకలితోనే భుజించెను.

గదికి మఱలి, ఆలోచనల నన్నిటిని జేరదీసెను.

సన్నివేశమును బరిశీలించి యిట్టిదింతకు ముందు కని వినినది కాదని గ్రహించెను. దాని యభూతత్వ మతనిలో

విచిత్ర చలనము కలిగింప, నా యాలోచనాధీనతయందును ఇట్టిదని వివరింప వీలుకాని తొందఱతో గుర్చీనుండి లేచి, గొళ్ళెము బిగించెను. లేనిచో, లోనికేమేని ప్రవేశించునని భీతిల్లెను.

ఒక్కనిముసమున కావల దీపమార్పివేసెను. అది హింసాకరముగ నుండినది.

ఎవరో తన్ను చూడగలరని తోచుచుండెను.

ఎవరు? ఎవరో యొకరు!

ఆహా! దేని నాతడు తలుపున కావల నెట్టివైవదలచెనో, దేనిని గ్రుడ్డిపఱప జూచెనో, అది ప్రవేశించినది. అదియే యంతరంగము.

అతని యంతరంగము. అనగా ఈశ్వరుడు!

తొట్రుతోలుత భ్రమకు వశుడయ్యెను. సురక్షితుడైనట్లు,ఏకాంతము నందున్నట్లు తోచినది. గొళ్ళెము బిగింపగా దానదృశ్యుడైనట్లు విశ్వసించెను. పిదప స్వస్థుడై, మోచేతులు బల్లపైమోపి, తల చేతులపైన నానించి, చీకటిలో నాలోచింపసాగెను.

"నేనెందున్నాను? స్వప్నములోగాదా? ఏమి వింటిని? నేను జేవర్ను జూచినది, అతడట్లు చెప్పినది వాస్తవమా? ఈ చాంప్మతు ఎవడై యుండును? నన్నతడు పోలియుండునా? అట్టిది సాధ్యమా? నిన్ననెంత శాంతుడనై యుంటిని! అనుమానమునకెంత దూరమునందుంటిని! నిన్న ఈ వేళకేమి చేయుచుంటిని? ఈ విషయమునందేమున్నది? ఇది యెట్లు పరిణమించును? ఏమి చేయవలెను?"

అట్టి వేదనామధ్యమం దతడుండెను. అభిప్రాయము లను నిలిపియుంచుకొనగల శక్తిని మతి కోల్పోయినది. అలలవలె అవి దాటిపోవుచున్నవి. వాని నాపుటకై రెండు చేతులతో నతడు తలపట్టుకొనెను.

ఇచ్ఛాహేతువులను ద్రొక్కిపట్టిన యీ సంకులము నుండి యొక నిశ్చయమునకు, దీర్మానమునకు వచ్చుటకతడు విశ్వప్రయత్నము సేయుచుండెను. వేదనతప్ప వేఱేదియు స్పష్టమగుటలేదు.

తల మండిపోవుచుండినది. కిటికీ పాఱ దెఱచెను. ఆకసమునం దొక్క నక్షత్రమును లేదు. మఱలివచ్చి బల్ల దగ్గఱ గూర్చుండెను.

మొదటిగంట యిట్లు దొరలిపోయినది.

కొంచెము కొంచెముగ, నాధ్యానమునం దస్పష్టమగు హద్దు గీతలు (ఆకారములు) కన్పడసాగినవి. వాస్తవమై, సన్నివేశమంతయు గాకున్నను, కొన్ని వివరణములైనను నతడు చూడగలిగెను.

ఎంత యసాధారణము, సందిగ్ధమునైన సన్నివేశమిది యైనను, దనవశమందే పూర్తిగా నున్నదని గుఱుతించెను.

బుద్ధిజాడ్యము ఘనీభవించెను.

అతడిన్నేండ్లుగ జేసిన సకల కార్యములకును దీవ్రమగు నాధ్యాత్మికోద్దేశ్యమేకాక, తన పేరును గప్పివేయు నుద్దేశ్యమును గలదు. ఆత్మధ్యాన సమయములలో, నిద్రా విహీన నిశలందును, ఆ పేరెన్నడైన నుచ్చరింప బడునేమో యని కంపించిపోవుచుండెను. తదుచ్చారణమంతటిని ముగించి

వేయునని యతనికి దోచెను. తన నూత్న జీవితము, బహుశః నూతనాత్మ కూడ, ఆ పేరు మఱల కనుపట్టిన నాడంతరించు నేమోయనియు భావించెను. అట్టి సమయములలో ఒకప్పు డాపేరు తన చెవులలో ప్రతిధ్వనించునని, ఆ భయంకర నామమంధకారమునుండి వెలువడి తన యెదుట నిలుచునని, యా ఘోర ప్రకాశము తన్నలమిన చీకటిని జీల్చక ఘనీభ వింపజేయునని, యీ తెఱ తీయుటచే మఱింగధికమగునని, యీ భూకంపము తన భవనమును సుస్థిర మొనర్చునని, యీ పరమ సంఘటనము తనజీవితమును మఱియునుజ్జ్వలము గాజేసి దుర్భేద్యముగ నొనర్చునని, ఈ జాన్ వాల్జా పిశా చము తోడి సంఘర్షణ సత్పురుషుడు అర్హుడునైన మాంష్యర్ మాదలిన్‌ను తొల్లటికంటె గౌరవనీయు నొనర్చి యతనికి శాంతి సౌఖ్యములు ప్రసాదించుననియు, (అట్టిసమ యములలో) నెవరైన జెప్పియుండిన నతడు తలనూచి "తెలివిమాలిన మాటలు పొ"మ్మని యుండును. సరి! అచ్చ ముగా నట్లే జరిగినది. ఈ యసాధ్యముల కూడిక వాస్తవ మయ్యెను. ఈ యసంగతములను జరుగునట్లు ఈశ్వరు డను మతించినాడు!

అతని యాలోచనలు స్పష్టతరమగుచు వచ్చినవి. తన స్థాన దృక్పథము విశాలము కాజొచ్చినది.

తానొక యద్భుత నిద్రనుండి మేల్కానినట్లు, అర్ధ రాత్రమున కడునిట్రువైన కొండనుండి జాఱి యగాధ తట మునబడి అయంచున గడగడలాడుచు లోనబడిపోకుండు టకై వ్యర్థ ప్రయత్నము చేయుచున్నట్లును అనిపించెను. ఆ

చీకటి యందును స్పష్టముగ, ఇంకొకని దన్నుగా భావించి విధి యాకూపమున బడద్రోయు చున్నట్లు కన్పించెను. ఆ కూపము మూతవడుటకు దానో ఆ పరాయివాడో దానిలో బడుట యవసరము.

దానినట్లే జరుగనిచ్చిన జాలును,

ఇపుడు వెలుతురు పూర్తియైనది. అతడిట్లు గ్రహించెను: గాలీలో తన స్థానము ఖాలీపడి యున్నది. ఏమిచేసినను నదియెల్లపుడు తనకై వేచియేయున్నది. పెటీగెర్వాను దోచుట, తన్నక్కడ పునఃప్రతిష్ఠించినది. అక్కడికి పోక తప్పదు. అంతతో సర్వనాశనమగును. ఆ నిముసమునందే తన స్థానమునందింకొకడున్నాడు. ఆ దుస్థితికి వచ్చిన వాని పేరు చాంప్మతు. తన స్థానమున, భవిష్యత్తులో గాలీయందు చాంప్మతు నిలిచి, తాను మాంష్యర్ మాదలిన్ గా సంఘమున నెలకొనియుండ, భయమునకు దావేలేదు. తాను మాత్రము, చాంప్మతు శిరముపై దుర్యశ పాషాణముద్రోసి మఱిలేవరాక గోరీలో పాతినట్లు, నిశ్చింతుడు కావలెను.

ఇందలి ప్రాబల్యము, వింతయు నత్యధికమై, హఠాత్తుగ నతనిలో వర్ణనాతీత సంచలనము కలిగించెను. ఇట్టి యనుభవ మేమానవుని జీవితమునందును రెండు మూడు పర్యాయములకంటె నెక్కువ కలుగదు. అది యొక విధమగు అంతరంగ ప్రకంపనము. హృదయమున సందేహాస్పదమైన యన్నింటిని గలియబెట్టును. ఇది నిరాశానంద పరిహాసముల సమ్మేళనము. లోలోననే పెకలిన నవ్వని దాని నన వచ్చును.

సంభ్రమముతో అతడు మఱల దీపము వెలిగించెను.

"సరి, ఏమి! నేను దేనికి భయపడుచున్నాను? ఎందుకీ విషయములను యోజించుచున్నాను? నేనిప్పుడు సంరక్షితుడను. అంతయు ముగిసినది. సగము తెఱచిన రొక్క తలుపు మాత్రము, నా గత జీవితమునకు దారి నిచ్చుచుండినది. ఇది యిప్పుడు మూసుకొన్నది! ఇంత కాలము నన్ను వేధించిన జేవర్, సత్యమును గనుగొనగల్గి కనుగొని యెల్లెడల నన్ను వెన్నాడిన యతని భయంకర జ్ఞానము, ఆ వేటకుక్క దారితప్పెను. ఇంకొక్కచో మగ్న మయ్యెను. పూర్తిగా నోడిపోయెను. ఇకమీద నతడు తృప్తి పడును. నన్ను శాంతముగ నుండనిచ్చును. తన జాన్ వాల్జాను గట్టిగ జేజిక్కించుకొన్నాడు! ఏమో, అతడీ యూరు కూడ విడిచి పోవచ్చును! ఇదియంతయు నా ప్రయత్న మేమియు లేక జరిగినది! నా కెట్టి సంబంధమును లేదు! ఇందులో దురదృష్టమైన దేమున్నది! నన్ను జూచినవా రెవ రైన, నేదో మహావిపత్తు నా నెత్తిన బడినదనుకొందురు! నెవరికేదైన నపకారము జరిగి యుండినచో, నా తప్పు కాదు, అంతయు ఈశ్వర కృత్యము. ఆయన కోరిక యిది. ఆయన యేర్పాట్లు చెడగొట్టు హక్కు నాకున్నదా? నేని ప్పుడేమడుగుచున్నాను? నేనేల కలుగజేసికోవలె? నాకు సంబంధించినది కాదు. మఱి, నాకు దృప్తిలేదే! ఇంకేమి కావలెను? ఇన్నేండ్లుగ నే నాశించినది, నా నిశాస్వప్నము, నా యీశ్వర ప్రార్థనోద్దేశ్యము ఫలించినది. అది యీశ్వ రేచ్ఛ. ఈశ్వరేచ్ఛకు విరుద్ధముగ నేనేమియు జేయరాదు.

ఈశ్వరేచ్ఛ యని యెట్లనవచ్చును? నేను ప్రారంభించిన పనినిట్లే సాగింపవలెనని, నేను మంచి చేయవలెనని, నేనొక యుజ్జ్వల ప్రేరకోదాహరణము కావలెనని, నా పడిన యాతననుండి నేనుగన్న సద్గతినుండి యెట్టకేల కొకింత సుఖము చేకూరవలెనని, ఈశ్వరుడీట్లు నిర్ణయించి యుండును! గురువు దగ్గఱకు వెళ్ళి, జరిగినదంతయు జెప్పి సలహా నిమ్మని ప్రార్థించుటకేల జంకితినో నా కర్థమగుట లేదు. 'ఇది యీశ్వర నిర్ణయము! అట్లే జరుగనిమ్ము! మనము కలుగ జేసికోగూడదు!' అని యాయన చెప్పి యుండును.''

నరకకూపపుటంచులు పట్టుకొని ప్రేలాడుచు, దన యంతరాత్మ లోలోపల నతడట్లు చెప్పికొనెను. కుర్చీనుండి లేచి, గదిలో నిటునటు నడువ నారంభించెను. ''మఱి దీని యాలోచన వలదు. తీర్మానమైనది!'' అనుకొనెను. కాని సంతోషము కలుగలేదు.

సరిగా తద్విరుద్ధము.

గట్టుకు రాకుండ సముద్రము నెట్లాపలేమో, మనస్సునకు మఱలనీక యాలోచనల నట్లే నిలుపలేము. అపరాధి విషయమున, ఇదియే పశ్చాత్తాప మనబడును. భగవంతుడాత్మను సముద్రమును కూడ బైకెత్తును.

కొన్ని నిముసములు కడచిన తరువాత, ఈ విచారకర సంభాషణను మరల ప్రారంభించెను. దాని నాప నతని చేతగాలేదు. ఆ సంభాషణలో దానే మాటాడువాడు, వినువాడును. రహస్యముగ నుంపదలచిన దానిని జెప్పచు

వినగూడదనుకొన్నదానిని వినుచు, "ఆలోచింపు" మని పోరుచున్న ఒక యవేద్యశక్తికి లొంగిపోయెను. రెండు వేలేండ్లకు పూర్వమింకొక శిక్షితుని ఈ శక్తి "నడువుము" అని యాదేశించెను.

మనలో మనము మాటాడుకొందు మనుట సత్యమే. ఈ యనుభవము పొందని యాలోచనాపరుడు లేడు. ఆంతర్యమున, మనస్సునుండి అంతరాత్మకు బోయి యక్కడి నుండి మఱల మనస్సునకు వచ్చునప్పుడు పదము దివ్య రహస్యమగును. "చెప్పె" నని యీ ప్రకరణమున మనముపయోగించు పదమున కిదే యర్థము. లోపల చెప్పికొందుము, సంభాషింతుము, మొఱవెట్టుకొందుము. బహిర్జ్ఞానమునకు భంగము రాదు. లోన బెద్ద కలకలము జరుగుచున్నది. నాలుక తప్ప, లోనిదంతయు మాటాడుచుండును. కంటికి కానరాదని, స్పర్శ కందదని ఆత్మయందలి వాస్తవికత్వము నశింపదు.

నే నెందుంటినని, తన తీర్మానమును గుఱించియు ప్రశ్నించుకొనెను. తన మనస్సున దాను జేసికొనుచున్న యేర్పాట్లన్నియు పైశాచికములని యంగీకరించెను. "ఈ విషయము నిట్లే జరగనిచ్చుట, ఈశ్వర నిర్ణయములో గలుగజేసికొనకుండుట" పచ్చి ఘోరమనుకొనెను. విధియు మనుష్యులును గలిసి చేయుచున్న యీ తప్పు నిట్లే నాగనిచ్చి యడ్డకుండుట, మౌనముతో దానికి దోహదమిచ్చుట, ఏమియు జేయకుండుట తుదకంతయు చేసినట్లు పరిణమించును! వంచనానైచ్యమున కిది కడమెట్టు! అల్పత్వము, భీరు

త్వము, అసత్యము, గర్హనీయము—ఇవియన్నియు నీ మహా పాపమున నిమిడియున్నవి!

ఎనిమిదేండ్లకీనాడీ దుఃఖజీవి, క్రూరచింతాకర్మల కష్టరుచి జవిగొనెను. అసహ్యాముతో దాని నుమ్మివైచెను.

ప్రశ్నించుకొనుచునే యుండెను. "నా యుద్దేశ్యము ఫలించినది" అనుకొనుటలో నా యర్థమేమని యడిగికొనెను. తన బ్రతుకునకు నిక్కముగ నొక యుద్దేశ్యము కలదని వెల్లడించెను. ఏమా యుద్దేశ్యము? పేరు దాచుకొనుటా? పోలీసులను మోసము చేయుటా? ఈ స్వల్పోద్దేశ్యముతోనా యీ యెనిమిదేండ్ల జీవితము కడపినది? గొప్పది, సత్యమైనదియునగు వేఱుద్దేశ్యము లేదా? దేహాభిమానము విడిచి యాత్మరక్షణ చేసికొనుట, యోగ్యత, మంచితనము గడించుట, సత్యనిష్ఠుడగుట-ఇదికదా. తాను వాంఛించినది, బిషప్పాదేశించినది! గతముపై తలుపు వేయుటా! తలుపువేసి మూయుటకాక, దుష్కార్యాచరణముచే పూడియుండిన గతమును త్రవ్వి తీయుటగును. తాను మఱల దోపిడిగాడగును—అందును నతి నికృష్టుడగు దోపిడిగాడు! మఱొకని యునికిని, జీవితమును, శాంతిని, సాంఘిక స్థానమును దోచుటకదా యిది! ఇప్పుడు తాను హంతకుడగును! నైతిక దృష్టిలో, ఒక నిర్భాగ్యుని ఖూనీ చేయుటకదా యిది! గాలీ బంధనము జీవన్మరణము, శ్మశాన నివాసము కదా! మఱి, తన్ను బహిరంగ పఱచి, తొల్లిటి పేరు వహించి, ఈ భయంకరమగు తప్పిదమునకు గుఱియైన వానిని రక్షించి, ధర్మబద్ధుడై మఱల జాన్ వాల్జా

యగుటయే పునరుజ్జీవనమును సాధించుట! అదియే, తాను వెలువడిన నరకమును నిరంతరముగ మూసివేయుట! దానిలో పడినట్లు పైకి గనుపట్టులే, వాస్తవమునకందుండి వెలువడుట! అట్లు చేసి తీఱవలెను! ఇది చేయనిచో ఇంతకు ముందు చేసినదంతయు శూన్యము! తన జీవితము వ్యర్థము! పడిన బాధయంతయు వ్యర్థము! "ఉపయోగమే"మని యాప్రశ్న! అదుగో ఆచార్యుడు! చచ్చుటచే ఆయన యస్తిత్వము గట్టిపడినది! స్థిర దృష్టితో దన్ను చూచుచున్నాడు! ఇకమీద మేయర్ మాదలిన్ ఆచార్యునికి గర్హ్యుడగును! గాలీ బానిస జాన్ వాల్జా ప్రశంసార్హుడు, పరిశుద్ధుడునగును! మనుష్యులు తన పైకప్పు చూతురు. బిషప్ ముఖము చూచును. మనుష్యులు జీవితమునే గమనింతురు. బిషప్ అంతరాత్మను గమనించును. అర్రాస్‌కు బోయి తీఱవలెను. చాంప్మతును విడిపించి, ఆ స్థానమున దాను నిలువవలెను. ఆహా! ఇది యుత్తమోత్తమ త్యాగము, బాధాయుత విజయము కడపటి యడుగు. చేసి తీరవలసినదే. ఏమీ విషాద విధి విధానము! మానవదృష్టిలో దుర్యశమునకు జొచ్చిన గాని, యీశ్వరదృష్టిలో బావిత్ర్యమున ప్రవేశము లేదు!

"మంచిది! ఈ విధానమే అవలంబనీయము! స్వధర్మము నాచరింతము! ఆ మనుష్యుని రక్షింతము!" అని, తనకు దెలియకయే గట్టిగా బలికెను.

పుస్తకములు తీసి, పరిశీలించి, దానిని సరిగా నుంచెను. చిన్న వ్యాపారస్థులు తనకిచ్చిన ప్రోనోట్ల కట్టను

నిప్పులో ప్రేల్చెను. ఒక జాబు వ్రాసి సీలు చేసెను. దాని మీద 'లఫిట్, బాంకర్, పారిస్' అని యడ్రసున్నది.

ఆ సంవత్సరమున ఎలెక్షన్ సమయమున దానుపయోగించిన పాస్పోర్టును, కొన్ని బాంకు నోట్లను జేబు నోటు బుక్కున నుంచియుండెను. ఆ బుక్కును తీసికొనెను.

ఈ వివిధ కార్యములనింత తీవ్రధాన్యముతో జేయుచుండిన యతని నెవరేని జూచియుండిన, నతనిలోపల నేమి జరుగుచున్నదో సందేహించియు నుండరు. ఇంకను నుండి యుండి యతనిపెదవు లదరుచుండెను. అప్పుడప్పుడు, గోడ మీద నొకచో దాను ప్రశ్నించి వివరణమడుగవలసిన దున్నదన్నట్టు నిశ్చలముగ జూచును.

మాంష్యర్ లఫిట్‌కు జాబు ముగియగనే దానిని, నోటుబుక్కును జేబులో నుంచుకొని మఱల బచారు చేయ నారంభించెను.

అతని యాలోచనా ప్రవాహ దిశ మాఱలేదు. మెఱయుచున్న యక్షరములతో కనులు పడిన దిక్కులందంతయు "పో! నీపే రొప్పుకో! నీ నింద వహించు!" అని యతని బాధ్యత ప్రత్యక్షమగుచునే యున్నది.

పేరు దాచుకొనుట, ఆత్మశుద్ధి - ఈ సూత్ర ద్వంద్వమిన్నాళ్ళతని జీవితమును నడిపించుకొని వచ్చినవి. ఇప్పుడవి గోచరరూపము దాల్చి యతని యెదుట నిలిచినట్లైనవి. ఇప్పుడే యవి పరస్పర భిన్నములని తోపసాగినది. దానిని వేఱుపఱచుచున్న భేదమునుగూడ నతడు కనుగొనెను. ఒకటి చెడ్డది కావచ్చు. ఇంకొకటి తప్పక మంచిది. ఒకటి

స్వలాభ పరాయణత. ఇంకొకటి దీక్ష. ఒకటి "నేను" ఇంకొకటి "పొరుగు" అనును. ఒకటి చీకటినుండి వచ్చినది. ఇంకొకటి వెలుతురునుండి వచ్చినది.

అవి యొండొకటితో బోరాడుచుండుట తడు చూచెను. చూచుచుండగనే, కండ్లయెదుట బెరిగి పెరిగి "బ్రహ్మాండాంత సంవర్ధ"లైనవి. తనలోపలి యనంతమున, నంధకారమధ్యమున ఈ దేవదానవులు కొట్లులాడుకొను చున్నట్లతనికి దోచుచుండెను.

భయము ముంచుకొని వచ్చెను. కాని, మంచి యోజనయే విజయి యగుచున్నట్లు పొడకట్టెను.

తన యంతరంగమున, విధి తనకు నిర్ణయించిన దానిలో ద్వితీయ పరిష్కార ప్రయత్నము ప్రారంభమై నట్లతని కర్థమయ్యెను. ప్రథమప్రయత్నమునకు నాచార్యుడు గుఱుతు. రెండవ దానికి చాంప్మతు గుఱుతు. మహా సంధిగ్ధము తరువాత మహావిచారణ.

ఇట్లుండ, దగ్గిన జ్వరము క్రమక్రమముగా మఱల హెచ్చినది. వేయి యాలోచనలు మనస్సున మెఱపులు వాఱి యతని తీర్మానమును బలపఱచెను.

ఈ యంశమునకు దాను దగని ప్రాధాన్యమిచ్చెనా? ఈ చాంప్మతు అభిమానమున కనర్హుడా? వాస్తవముగ దొంగిలించియుండెనేమో యని ఒక్క నిముసము సందే హించెను.

ఈ మనుష్యుడు నిజముగనే కొన్ని పండ్లు దొంగిలించి యుండెనేని ఒక్క నెల కారాగారవాసశిక్ష యగును. దానికిని,

గాలీలకును మధ్య చాల దూరమున్నది. ఎవనికి దెలియును? అతడు దొంగిలింపలేదేమో? స్పష్టమైనదా? జాన్ వాల్జా నాము మతనిని ద్రొక్కిపట్టి, నిరూపణ యనవసరమనిపించును. ప్రాసిక్యూషన్ వారికట్టి యలవాటున్నదికదా? పూర్వపు ఖైదీ కావున, దారిదోపిడి గాడని యనుకొందురు.

తనను దెలియబఱచుకొన్నచో, నా కార్యమునందలి త్యాగాధిక్యము, కడచిన యేడేండ్లుగా దానుగడపిన యుత్తమ జీవితము, దేశమునకు దానొనర్చిన మేలు-యివి యన్నియు గణనకు వచ్చి, క్షమింతురేమోయని ఒక నిముస మాలోచన పొడమెను.

కాని, యీ యూహ వెంటనే యంతరించెను. ఆ యాలోచననే యతడుపహసించెను. పెటీగెర్వా ఫ్రాంకు హరణము రెండవ యపరాధము. అది మఱల చర్చకు వచ్చును. చట్టము, అక్షరాక్షర స్థిరమై యావజ్జీవ కఠినశిక్ష పాల్చేయును.

సకల భ్రమలనుండి మొగమావల ద్రిప్పుకొనెను. అధికాధికముగ భూమినుండి విడిపించుకొనెను. సమాశ్వాస బలములను వేఱుచోటనుండి యర్థించెను. తను డ్యూటీచేసి తీఱవలెను. ఆ డ్యూటీ చేయనప్పటికంటె, చేసినప్పుడు వ్యథ యెక్కువ కాదేమో. పరిస్థితులనిట్లే జరుగనిచ్చి తాను మ- నుండి కదలకుండిన, దన ప్రసిద్ధి, మంచి పేరు, మంచి పనులు, పొందిన గౌరవాదరణములు, దానైశ్వర్యములు, తన లోకహితము, సౌశీల్యము - అన్నియు బాపకలుషిత ములై పోవును. పవిత్రములైన యీయన్నియు ఘోర నేర

మునకు ముడివడినపుడేమి హాయి యుండును? ఇట్లుకాక, యీ త్యాగము చేసినచో, గాలీలలో సంకెల, ఇనుప కాలర్, పచ్చటోపీ, నిరంతరశ్రమ, నిష్కరుణావమానము నున్నను, వీనితోగూడి యొక దివ్యభావముండును.

కడపటి కిది మీఱరాని యనుకొనెను. తన విధి నిర్ణీతమైనది. ఈశ్వరుని యేర్పాటులను దారి తప్పించుట తన పనికాదు. బహిస్సౌశీల్యము అంతర్దౌష్ట్యమునో, అంతస్సౌశీల్యము బహిర్దౌష్ట్యమునో - రెంటనొకదానిని నెన్నుకొని తీఱవలెను.

ఇన్ని కష్టాలోచనలు చేయుటచే ధైర్యము చెడలేదు కాని, మతి యలసిపోయెను. ఏవో సంబంధములేని విషయములను గుఱించిన యాలోచనలు వలదన్నను దల ప్రవేశించెను.

రక్తము తీవ్రవేగమున కణతల కెక్కెను. వెనుక ముందులకు నతడు నిలువక నడచెను. మొదట జర్చినుండి, పిదప సిటీ హాలునుండి యర్ధరాత్రపు గంటలు గొట్టిరి. రెండు గడియారముల ద్వాదశ ప్రహారణములను విని, యతడా రెండు శబ్దములను బోల్చసాగెను. కొన్ని దినములకు ముందు దానొక ప్రాతవస్తువుల యంగడిలో జూచిన గంటసీ శబ్దములు జ్ఞప్తికి దెచ్చెను.

చలి వేసెను. నిప్పంటించెను గాని, కిటికీ మూయ దలపలేదు.

మఱల బుద్ధిని జడత్వము పట్టుకొన్నది. గంట కొట్టు

టకు ముందేమి యాలోచన చేయుచుండెనో స్మరణకు దెచ్చుకొనుట కతిప్రయత్నము చేసి, కడపటికి నెగ్గెను.

"అవును. ఆఁ. నింద మోయుటకు దీర్మానించుకొని యుంటిని."

ఉన్నట్టుండి తటాలున. ఫాంటైన్ తలపునకువచ్చెను.

"ఉండు. ఈ నిర్భాగ్యురాలో?"

ఇట్లతని ధ్యానమున · హఠాత్ప్రవేశ మొనర్చిన ఫాంటైన్ ఒక్క యాశాకిరణమువలె నుండెను. తన లోపలి దంతయు నూతన వైఖరి వహించుచున్నట్లు తోచెను.

"ఆఁ, అవును. చూచితివా? ఇంతవఱకు నా విషయమే ఆలోచించితిని! నా యానుకూల్యమునే గమనించితిని! నేను ఊరకుందునా, నా నింద గ్రహింతునా, నా దేహము దాచుకొందునా? నా యాత్మను రక్షింతునా? తుచ్ఛగౌరవముతో మాజిస్ట్రేటుగ నుందునా? — గౌరవార్హుడైన గాలీ బానిసనగుదునా? ఈ యన్నింటను నేను, ఎల్లప్పుడు నేను—నేనే—నాయది! వివిధములైన యహంకారము. ఏమైనను అహంకారమే! రవ్వంత పరులను గుఱించి చింతించినచో? ఉత్తమధర్మము పరులను గుఱించినదే. చూతము, పరిశీలింతము! నేను పోవుదును. నన్ను దీసికొని పోదురు. విస్మృతుడనై పోదును. ఏమి దాని పరిణామము? చాంప్మతును వదలివేయుదురు. నేను మఱల గాలీలో బడుదును. సరి, తరువాత ఏమగును? ఆహా! ఇక్కడ, ఈ జనపదములలో ఈ నగరము, ఫాక్టరీలు, వ్యాపారము, శ్రామికులు, పురుషులు, స్త్రీలు, ముసలి తాతలు, శిశువులు, బీదలు!

ఇది యంతయు నా సృష్టి, నేను దీనిని సజీవముగ నిలుపు కొన్నాను. ఎక్కడ బ్రొయ్యియున్నను, మంటలో కట్టెలు నేను వేసితిని, పాత్రలో గింజలు నేను వేసితిని. నెమ్మదిని ఇచ్చి పుచ్చుకొనుటలను, ఖాతాలను నేనుత్పత్తి చేసితిని. ఈ ప్రదేశమునంతయు మేల్కొల్పితిని. జీవము పోసితిని. సంచలనము కల్గించితిని. ఉత్సాహ మిచ్చితిని. సంపన్న మొనర్చితిని. నేను లేనిచో, జీవము పోయినట్లే. నేను వెళ్ళి పోగా ఇదియంతయు జచ్చును. ఇంత యనుభవించిన యా యబల, పతనమునందును సమ్మానార్హ, ఆమె కష్టము లన్నియు దెలియక నేనే తెచ్చిపెట్టితిని! ఆ శిశువును దెచ్చి యిత్తునని తల్లికి వాగ్దానము చేసితినే! నావలన గలిగిన యపకారమున కీమెకు నష్టపూర్తి చేయవలదా? నే నదృశ్యుడనైన నేమగును? తల్లి మరణించును. పిల్ల గతి పిల్లదే. నేను బయల్వడిన జరుగున దిది. లేనిచో, నన్ను బయట పెట్టుకొననున్నచో, ఏమగునో చూతము!''

ఈ ప్రశ్న వేసికొని యాగెను. ఒక్క నిముసము సంకోచించి యదటెను. అది క్షణమాత్రమే. పిదప శాంతముగ నిల్లు బదులు చెప్పెను.

''సరి, ఈ మనుష్యుడు గాలీలో బడును. నిజము. అయిన నేమి? అతడు దొంగిలించినాడు! దొంగిలింప లేదని నేననుట వ్యర్థము, దొంగిలించినాడు! నేనో, యిం దేయుందును. ఇట్లే జరిపింతును. పదేండ్లలో బది మిలియన్లు సంపాదింతును. దానిని దేశమున బంచి పెట్టుదును. నాకేమియు నుంచు కొనను. నాకెందుకు? నేను జేయుచున్నదేదియు నా కొఱకు

గాదు. అందఱి సంపద యధికమగుచు పోవును పరిశ్రమలు శీఘ్రగతి గనును. నిర్మాణ కర్మాగారములు వృద్ధినగును. కుటుంబములు—నూఱు, వేయి—సుఖపడును. జనసంఖ్య పెరుగును. పొలము లున్నచోట బల్లెలు, బీళ్ళలో సాగు నేలలు తలలెత్తును. దారిద్ర్యమంతరించును. దానితో వ్యభిచారము, వేశ్యా వృత్తి, దొంగతనము, హత్య, సకల దురాచారములు అపరాధములు అంతరించును! ఈ నిర్భాగ్య మాత తన బిడ్డను బెంచి పెద్దచేయును! ఈ ప్రదేశమంతయు మర్యాదైశ్వర్యముల గాంచును! ఔను. నేనెంత మందబుద్ధిని! నింద నొప్పుకొందునని నేనేమి చేయుచుంటిని? జాగ్రతగా బునరాలోచన చేయవలెను. తొందఱ పడకూడదు. ఏమి! ఏదో యౌదార్యము, మిఱుమిట్లు గొల్పు పని నాకు దృష్టి నిచ్చుననియా! ఇదియంతయు నాటకముగా నున్నది! నన్ను గుఱించి మాత్రమే చింతించి, బహుశః దొంగయైన వానిని గొంచెము తీవ్రమైన శిక్ష నుండి తప్పింపవలెనని. యొక ప్రదేశమునంతయు సర్వనాశము చేయుటా! ఒక దుఃఖజీవి యాస్పత్రిలో జచ్చిపోవలెనా! ఒక నిర్భాగ్య శిశువు వీథులలో మడియవలెనా! ఆహా! ఇది మహాఘోరము! తల్లి బిడ్డను మఱి చూడదు! బిడ్డను తల్లి దెలియనే తెలియదు! ఇదియంతయు బండ్ల దొంగయగు నాతోడేలుకొఱకా! ఇందుకు గాకున్న, నింక దేనికైన వాడు గాలీ నిర్బంధమునకు దగిన వాడేమో! బహుశః నేడో రేపో చచ్చు ముసలిదొంగ, దన చీకటింటి కంటె గాలీలో ఎక్కువ కష్టమనుకొనని వానిని విడిపించుటకై, యసంఖ్య జనబాహుళ్యమును, తల్లులను,

భార్యలను, పిల్లలను బలి చేయుటా! పాపమా కో జెత్తు కీ ప్రపంచమునం దెవ్వరును లేరు. ఇప్పుడు, తేనార్డియర్ల గుడిసెలో జలికి ముద్ద యాచుండును. నిస్సందేహము. వారును దరిద్రులు! ఇందరు నిరుపేదల యెడ ధర్మమునకు దప్పినవాడనగుదును! ఇది తెలివిమాలిన క్షుద్రప్రమాదము! ఎంతైనను ఏమి జరుగును. ఇది తప్పనుకొందము. ఒకనా డిది నా యంతరాత్మను బీడించుననుకొందము. ఆ పీడ నా మీదనే, నా యంతరాత్మ పైననే భారముగ నుండును. ఇందఱి క్షేమమునకై దానిని మోయుటొక్క యుపాసన, సౌజన్యము నగును.''

మఱల బచారు ప్రారంభించెను. ఈసారి తృప్తి గన్నట్లు భావించెను.

రత్నములు భూగర్భమున చీకటి కోణములందుం డును. సత్యములు చింతాగర్భమునందు గన్పట్టును. ఆ లోతులలోనికి దిగి, అచ్చటి ఘనతమ తమస్సులందు బొరాడి, యెట్టకేల కొక్క రత్నమును, నొక్క సత్యమును గన్గొనినట్లు, అది చేతనున్నట్లు, దాని ప్రకాశము తన కనులు మూయించుచున్నట్లును దోచెను.

''ఔనంతే! నేను సత్యపథము చేరితిని. ఇప్పటికి బరిష్కారమైనది. ఏదో యొక్కటి పట్టుకొని, దీనిని ముగిం పునకు దేవలెను. నా యెన్నిక యైనది. ఈ విషయమును దానంత వదలవలెను! ఇంక సంశయము లేదు. తగ్గుట లేదు. ఇది యందఱ క్షేమమునకై - నా యొక్కనికి గాదు. నేను మాదలిన్. మాదలిన్ గనే యుందును. జాన్ వాల్జా మైనవాడు

నాశమా గాక! వాడును, నేనును నిప్పుడొక్కరము కాము. నేనా మనుష్యునింక గుర్తింపను. వాడేమి గానున్నాడో నాకింక దెలియదు. ఇప్పుడెవనినో జాన్ వాల్జా యనుకొనిరేని, వానబ్బ తోడు - దానితో నాకు సంబంధములేదు. అది చీకటిలో నెగురుచున్న యమంగళ నామము. అది నిలిచి యెవనిపైనైన గూర్చుండెనేని, వాని దౌర్భాగ్యము.''

గోడ బల్లనుండి వ్రేలుచున్న యద్దమున దన ముఖము చూచుకొనెను.

''ఔను! ఒక తీర్మానమునకు వచ్చుట నన్నూఱడించినది! ఇప్పుడు వేఱు మనుష్యుడను!''

కొన్ని యడుగులు వేసి మఱల నిలచెను.

''ఊఁ! నా తీర్మాన పరిణామమెట్టిదైనను ఎదిరింప జంకగూడదు. ఈ జాన్ వాల్జాతో నన్ను గుట్టిపెట్టిన త్రాళ్లింకను కొన్నియున్నవి. అవి తెగిపోవలెను! ఈ గదియందే నా మీద నేరముమోపు మౌనసాక్షులున్నారు. వారదృశ్యులు కావలెను.''

జేబునుండి పర్సు తీసి, దానినుండి యొక చిన్న తాళము చెవి నెత్తెను.

ఒక రహస్యద్వారమును తెఱచెను. ఆ గుప్త పేటికలో గొన్ని పనికిమాలిన చిల్లర వస్తువులున్నవి - నీలపు గాగరా పరికిణి, పాత షరాయి, పాత సంచి, రెండు కొనలలో నినుప పొన్నులుగల బలమైన లావు ముండ్లకఱ్ఱయు. 1815 అక్టోబర్‌లో డి- పురమున, జాన్ వాల్జాను జూచిన వారీ క్షుద్రసాధనములు గుర్తింపగలరు.

తన గతజీవిత చిహ్నముగ దీపస్తంభములను, ఈ వస్తువుల నక్లే యుంచుకొనియుండెను. కాని, గాలీలనుండి వచ్చిన వస్తువులను దాచి, దీపస్తంభములను వెలుపలనే యుంచెను.

గడియ వేసియున్నను ఎవరైన దీయుదురని భయపడిన వానివలె తలుపు దెసకొక దొంగచూపు బఱపెను. పిదప ద్వరగా నాత్రముతో నొక్క-సారిగా నన్నింటిని జవిరి, ఇంత యపాయకరముగ నిన్నియేండ్లుగ నీశ్వర విశ్వాసముతో దాచియుండిన చినుగు బొంతలను, కట్టెను, సంచిని నిప్పుల బడవైచెను.

రహస్యద్వారము మూసివేసెను. ఇంకెట్టి జాగ్రత నవసరములేదు. అందు దాగియుండిన వస్తువులు నిప్పుల బడినవి. అయినను, ఒక బరువైన వస్తువు నా తలుపున కడ్డముంచెను.

కొన్ని క్షణములలోనే, యెఱ్ఱని జ్వాలాకాంతి గది యందన్నింటిపై బడెను. ఆ వస్తువులు కాలుచున్నవి. ముండ్ల కఱ్ఱ చిటపటలాడుచు మిణుగురులను గది మధ్యమున జల్లుచుండెను.

తన యందలి చింపి పేలికలతోసహా భస్మమై సంచి మినమినలాడు వస్తువు నొకదానిని నిలిపెను. అది వెండి నాణెము. ఆటవిక బాలునినుండి దొంగిలింపబడిన ఫ్రాంకు.

అతడా నిప్పు వంక జూడలేదు. చెదరని గతితో నిటు నటు తిరుగుచునే యున్నాడు.

ఉన్నట్టుండి యతనిచూపులు, గోడబల్లపై మెఱయు చున్న దీపస్తంభములమీాద బడెను.

"నిలు! జాన్‌వాల్జా యంతయు వానియందును న్నాడు!"

ఆ రెండు దీపస్తంభములను గ్రహించెను.

గుఱుతింపరాని ముద్దగా, ఆ రెండింటిని గరిగింప గలిగిన నిప్పుండినది,

అతడు నిప్పుమీాద వంగి, దేహము నొకింత వెచ్చ జేసికొనెను. అ వేడిమి హాయి గొల్పెను.

బూడిద కప్పిన నిప్పునొక దీపస్తంభముతో గలియ బెట్టెను.

ఒక్కక్షణము కడచిన, అవి నిప్పులలో బడెడివి.

ఆ క్షణమున, లోపలినుండి యొక ధ్వని "జాన్ వాల్జా! జాన్‌వాల్జా!" యని యాక్రందనము చేసినట్లయ్యెను.

ఒడలి వెండ్రుకలు నిక్కబొడుచుకొనెను. ఏదో భయంకర ధ్వని విన్నవానివలె కొయ్యబాఱిపోయెను.

"ఆఁ, ఔను! ముగించివేయుము! నీవు చేయుచున్నది పూర్తికానీ! ఈ దీపస్తంభములను ధ్వంసము చేయుము! ఈ స్మృతి చిహ్నమును నాశము చేయుము! ఆచార్యుని మఱచిపో! ఈ చాంప్మతును నాశము చేయుము! మంచిది. నిన్ను నీవే పొగడుకో! ఇంకేమి, యేర్పాటైనది, తీర్మానింప బడినది, అంతయునైనది! ఆ మనుష్యుని జూడు. గడ్డము నెఱసినవాడు. తన యపరాధమేదో యెఱుగడు. ఏమియు జేసినవాడు కాడు. నిరపరాధి కాబోలు. అతని దురదృష్టము

నీ పేరుతో గలిగినది. అతని తలమీఁద నీపేరపరాధశిలవలె నలిపివేయుచున్నది. నీకు బదులతనిని శిక్షింతురు! నీచ ఘోరస్థితిలో శేషజీవిత మతఁడు గడపును! సరే. నీవేమో గౌరవనీయుఁడవు కమ్ము. మాంష్యూర్ మేయరువై, నగరమును సంపన్న మొనర్చి, బీదలకన్నము పెట్టి, అనాథలను బెంచి, సుఖముగ సుశీలుఁడుగ, ప్రశంసార్హుఁడుగ బ్రతుకుము. నీవి ట్లానంద యశస్సంపన్నుఁడవై యుండ, నీ యెఱ్ఱబ్లాజు తొడిగి కొని, నీ నామ దుర్యశము వహించి, నీ సంకెళ్ళ నీడ్చుకొనుచు గాలీలలో ఒక నిరపరాధి క్షణక్షణమున కింతగా గ్రుంగుచుండును! ఆహా! మంచి యేర్పాటు! ఓ నీచుఁడా!''

ఫాలముమీఁద జెమ్మటలు క్రమ్ముకొని వచ్చెను. దీప స్తంభముల నతఁడు పీనుగు కండ్లతో జూచెను. లోని ధ్వని యాగక పలుకుచునే యుండినది.

''జాన్ వాల్జా! నిన్ను బట్టి యెన్నో ధ్వనులుండును. అవి యెంతో శబ్దము చేయును. గట్టిగా బలుకును. నిన్నా శీర్వదించును. ఒక్క-దానిని మాత్రము, నీవు తప్ప నితరులు వినరు. అది చీకటిలోనుండి నిన్ను శపించును. మంచిది, విను నీచుఁడా! ఈ యాశీర్వాదములన్నియు స్వర్గమును సమీపింపకయే రాలి పోవును. ఆ శాపము మాత్రము ఈశ్వర సాన్నిధ్యమున కెక్కును!''

ఈ ధ్వని, అతని యంతరాత్మయందలి యతి నిమ్న ప్రదేశమున మఱుఁగు చీకటిలో బుట్టి, ప్రారంభమున గడు దుర్బలముగ నుండినది. క్రమముగా బెద్దదియై, బలీయమై చెవిదగ్గఱ నుండియే వినిపింపసాగినది. అతనిలోనుండి వచ్చి

ఇప్పుడు వెలుపల నిల్చి మాటాడుచున్నట్లుండెను. కడపటి పదములు అతి స్పష్టముగ వినబడినట్లు కాగా, ఒక విధమైన భయముచే నదిరి గదియంతయు జూచెను. గట్టిగా, ఉలికి పాటు నదిఱిన కంఠమున "ఇక్కడ నెవరైనా ఉన్నారా?" అనెను. పిదప అవివేకి వెఱ్ఱివానివలె నవ్వుచు "ఎంత మంద బుద్ధిని! ఇందెవరుండుటకును వీలులేదు!" అనుకొనెను.

ఒక్కడుండెను. అతడు భౌతిక నేత్రముల కందడు.

మాదలిన్, దీపస్తంభములను గోడ బల్లపైన యథా స్థానమునందుంచెను.

మఱల నదేవిధమున, విచారముతో బచారు సేయ సాగెను. ఆ పదశబ్దము క్రింది గదిలో నిద్రించుచుండినవానిని గలల నుండి మేల్కొలిపెను.

ఈ పచారేక కాలమున నిమ్మళము కలిగించి యుద్రి క్తునిగను జేయుచుండెను. అత్యున్నత సమయములలో, స్థల భేదమున గనబడిన దానినంతయు సలహా నడుగదలచినట్లు దేహాము నొక్కచో నిలువనీయము. కొన్ని నిముసముల పిదప, దానెందుండెనో యతడెఱుగడు.

ఒకటి వెంట నొకటిగా, నింతకుముందు చేసికొన్న యొక్కొక్క తీర్మానమునుండియు, భయతాడితుడై వెనుక కొగ్గెను. తన కుపదేశమిచ్చిన రెండభిప్రాయములును సమాన వినాశకరములుగ దోచెను. ఏమి దైవ ఘటన! ఈ చాంప్మతును దానని పొరబడుటెట్టి సదవకాశము! ఏ సాధ నముచే నీశ్వరుడు తనకు బూర్ణ సంరక్షణ మిచ్చునట్లు

తొలుత గన్పట్టెనో, దాని చేతనే తలక్రిందుగా ద్రోయబడు నెట్టి వైపరీత్యము!

ఒక్క క్షణకాలము భవిష్యద్విధానము నూహించెను. నింద నెత్తిమీద వేసికొనవలెనా, పరమేశ్వరా! సంకెళ్ళకు జేతులందియ్యవలెనా! తాను వదలవలసిన దంతయు, వహింపవలవలసిన దంతయు నూహింప, అప్రమేయమగు నిరాశ పొడమెను. ఇంత మంచిది, రుచిమైనది, ఉజ్వలమైనదియు నగు జీవితము వదలుకొనవలెను! ఈ గౌరవ మర్యాదా స్వాతంత్ర్యములకు దిలోదకము లర్పింపవలెను! ఇంక బయళ్ళ వాహ్యాళి లేదు. వసంతోత్సవ విహంగమ కలకలారావ గానము లేదు. శిశువుల కింక దానధర్మములు లేవు. కృతజ్ఞతా ప్రేమ మధురిమములైన చూపులు లేవు! తాను నిర్మించిన యా భవనము, ఈ చిన్న గది పడిపోవలెను. ఇంక నీ పుస్తక పఠనము లేదు. ఈ తెల్లబల్లమీద వ్రాయుట లేదు. వృద్ధపరిచారిక, తన యేకైక సేవిక, ప్రాతర్వేళ దనకింక కాఫీ యియ్యదు. పరమేశ్వరా! ఈ యన్నింటికి బదులికమీద గాలీ గుంపు. ఇనుప కాలర్. ఎఱ్ఱగాను. కాలిసంకెల. ప్రాణముతొలచు బడలిక. చీకటి కొట్టు. కొయ్య పడక. ఇంతకుముందు బందొమ్మిదేండ్లనుభవించిన యీ యాతనాలన్నియునా! ఈ వయస్సులో, ఈ యెనిమిదేండ్ల యనుభవమునకు బిదప! ఇంకను యౌవన దశయుండినను దక్కువ లేదు! వయసు చెల్లినది. వచ్చిన యొక్కొక్క డవమానించును. జెయిలు భటు లిటునటు ద్రోయుదురు. కట్టె

లతో గొట్టుదురు! మేజోళ్ళు లేని కాళ్ళకు నినుప చెప్పులు తొడుగుదురు! ప్రతి సంధ్యాసమయమున సంకెల సరిగా నున్నదో లేదో యని సుత్తులతో జీలలను నిష్కరుణముగ గొట్టుదురు! చూడవచ్చిన వారికి "వీడే ప్రసిద్ధుడైన జాన్ వాల్జా! మేయరుగ నుండినవాడు!" అని చెప్పుదురు! రాత్రులు చెమ్మటతో దడిసి, ఆయాసముచే సొమ్మసిలి, పచ్చటోపీ కనులు గప్ప, ఇద్ద రిద్దరుగా, సార్జెంటు చబుకు దెబ్బలు తినుచు నిచ్చెననెక్కి ఆ యోడ ఖైదులో జేరవలెను. అయ్యో! ఎంత నిర్భాగ్యము! ధీమంతమైన జీవివలె ద్వేష పూరితమై, మానవ హృదయమువలె పైశాచికమై విధి యిట్లు వేపుకొని తినునా?

ఎంత ప్రయత్నించినను, మనోగర్భమునందున్న ఈ నిశిత సందిగ్ధము, వెనుకకు నెట్టివేయుచుండెను. స్వర్గము నందే నిలిచి రాక్షసుడగుట! నరకమున బునఃప్రవేశ మొనర్చి యచట దివ్యుడగుట! ఏది కర్తవ్యము పర మేశ్వరా!

ఏ యాతననుండి యింత కష్టముతో వెలికి వచ్చెనో, అది మఱల లోన విజృంభించెను. యోజనలు మఱల దబ్బిబ్బయ్యెను. అవర్ణ్య జడత్వము వహించి యవి నిర్జీవములైన ట్లుండెను. నిరాశా వైశిష్ట్యమది.

బహిరంతస్సు లూగిపోయెను. అప్పుడే యొంటరిగ నడువనీబడిన శిశువువలె, అతని పాదములు తడబడెను.

ఈ యాయాసమును విడిపించుకొన బోరుచు, నప్పు

డప్పుడు బుద్ధిని మఱల మేల్కొల్ప యత్నించెను. కడపటి సారిగా, దీర్మానముగా తన్నిట్లలయించిన సమస్యానిర్ణయ మొనర్ప బాటుపడెను. అపరాధ మంగీకరింప వలెనా? మౌనము వహింప వలెనా? ఏదియు స్పష్టముగ జూడజాల డయ్యెను. మనస్సస్పష్టముగ గుప్పిన హేతురూపములు కంపించెను. విఱిగి, చెదరి యొకటి వెంట నొకటి పొగలో గలిసిపోయెను. కాని, యింతమాత్రము తోచెను: ఏ తీర్మానమును బట్టి నడచినను, అవశ్యముగ దప్పించుకొను నవకాశమే లేక, తన యందొక్కటి చచ్చి తీఱవలెను. కుడి యెడమల రెండు దెసలను దాను గోరీలోనికే ప్రవేశించుచున్నాడు. తా ననుభవించుచున్నది మరణయాతన. అది సౌఖ్య మరణయాతనయో, సౌశీల్య మరణయాతనయో!

అయ్యో! మఱల సందిగ్ధములును ముంచుకొని వచ్చినవి! ప్రారంభించినప్పటి కంటె, నొక్కడుగు ముందు పడ లేదు.

ఈ దుఃఖజీవి పరితాపములో నిట్లు కొట్టుకొనెను. ఈ యభాగ్యునికి బదునెనిమిది వందల యేండ్లకు బూర్వము, తనలో సకల మానవజాతియొక్క పావిత్ర్య వ్యథలను గూర్చుకొనిన యవేద్యుడు, శాంతివృక్షము లనంతుని యుగ్రనిశ్వాసముల కూగి పోవుచుండ, ఛాయలు చిందుచు, చీకటిలో బరుగిడుచు, నక్షత్రపూర్ణమైన యనంతమున గన్పట్టుచుండిన భయంకర పాత్రను జేతులతో నెంతోకాలము నెట్టివేసెను.

# 4

గడియారము మూడు గంటలు కొట్టెను. ఐదుగంటల కాల మట్లే నిలువక నడచుచుండినాడు. అప్పుడు కుర్చీలో గూలబడి నిదురించెను. అతనికి గల వచ్చినది.

ఈ స్వప్నము అన్ని స్వప్నములవలెనే యతని పరిస్థితులకెట్టి సంబంధమును సూచించునది కాదు. కాని పరిస్థితుల విషాదబాధాకర స్వభావమిందును నున్నది. అతని మనస్సున నాటుకొన్నది. పిదప దానినతడు వ్రాసియుంచెను. అతని స్వహస్త లిఖితమైన మిగిలిన కాగితములలో నిది యొక్కటి. దాని నక్షరాక్షరము కాపీ చేయుట మా విధి యనుకొందుము.

ఈ స్వప్నమెట్టిదైనను, దానిని వివరింపకున్నచో ఆ రాత్రి కథ యసంపూర్ణమగును. అది, యొక వ్యాధిగ్రస్తాత్మ యొక్క విషాదకర పర్యటనము.

కవరుపైన నిట్లున్నది: "ఆ రాత్రి నేను గన్నకల".

"నేనొక మైదానము నందుంటిని. విశాలమైనది, విషాదము గొల్పునది. గడ్డియే లేదు. రాత్రిగను గనుపట్ట లేదు, పగలుగను గనుపట్టలేదు.

"నా బాల్యకాలము నాటి సోదరునితో గలిసి నడచుచుంటిని. ఆ సోదరుని గుఱించి యెన్నడును ఆలోచించినవాడగాను. స్మరించనైన లేదు.

"సంభాషించుచుంటిమి. నడచుచుండిన యితరులను జూచితిమి. మేము మాటాడుకొనుచుండినది, పూర్వపు

బొరుగా మెను గుఱించి. ఆమె నివాసము వీధిలో. కావున కిటికీ తెఱచియే పని చేసికొనుచుండెడిది. మేమట్లు మాటాడు చున్నపుడును, ఆ తెఱచిన కిటికీ మూలమున జలి ననుభవించుచున్నట్లుండెను.

"ఆ మైదానమున జెట్లు లేవు.

"మా సమీపమున నొక మనుష్యుడు పోవుచుండుట చూచితిమి. దిగంబరియై బూడిదరంగు దేహము కన్పింప, మట్టిరంగు గుఱ్ఱముమీద గూర్చుండియుండెను. అతనికి శిరోజములే లేవు. తల పుఱ్ఱెయు, నరములును జూచితిమి. అతని చేతికఱ్ఱ, ద్రాక్ష తీగవలె వంగునది, ఇనుమువలె బరువైనది. ఈ యాశ్వికుడు పలుకక దాటిపోయెను.

"నా సోదరుడు 'ఆ నిర్జన పథమున బోవుదము' అనెను.

"అక్కడ నొక నిర్మానుష్య మార్గముండినది. ఒక పొదయైన, తీగ ముక్కయైన మా కచ్చట గన్పడలేదు. అంతయు మట్టిరంగే – ఆకసము కూడ. కొన్ని యడుగులు నడచి నిలువగా, నెవ్వరును బదులు పలుకరైరి. నా సోదరు డదృశ్యుడై యుండెను.

"నేనొక పల్లె జొచ్చితిని. అది రోమన్ విల్ అను కొంటిని. (రోమన్ విల్ ఎందుకో)*

"నేను ప్రవేశించిన మొదటి వీధి నిర్జనము. ఇంకొక వీధి జొచ్చితిని. ఈ రెండు వీధుల మూలలో, గోడకానుకొని

* ఈ ఖండలీకరణమును జాన్ వాల్గా స్వహస్తాక్షరము అందలిదే.

యొక మనుష్యుడు నిలచియుండెను. 'ఇది యేయూరు? నేనెందున్నాను?' అని ప్రశ్నించితిని. అతడు పల్కలేదు. ఒక యింటి తలుపు తెఱచియుండ లోనికేగితిని.

''మొదటి గదిలో నెవ్వరును లేరు. రెండవ గది జొచ్చితిని. ఈ గది తలుపు వెనుక, ఒక మనుష్యుడు గోడ కానుకొని నిలచియుండెను. 'ఈ యిల్లెవరిది? నే నెక్కడ నున్నాను?' అని ప్రశ్నించితిని. అతడును పల్కలేదు. ఇంటికి దోట యుండినది.

''ఇల్లు వెడలి, తోట జొచ్చితిని. అదియు నిర్మానుష్యము. మొదటి చెట్టు వెనుక, ఒకడు నిల్చుకొని యుండెను. 'ఈ తోట యేమి? నేనెందున్నాను?' అని ప్రశ్నించితిని. అతడు పలుకలేదు.

''పల్లెనంతయు గలయ దిరిగితిని. అది నగరముగా దోచెను. అన్ని వీథులును వట్టివి. అన్ని తలుపులు తెఱచి యుండినవి. ఎట్టి జీవజంతువైన వీథుల నడచుచుండలేదు. నదుల కదలుచుండలేదు. తోటల విహరించుచుండలేదు. కాని, ఒక్కొక్క గోడమూల వెనుక, తలుపు వెనుక, అన్నింటి వెనుక ఒక మనుష్యుడు నిల్చుండి మౌనము దాల్చి యుండెను. ఒక్కసారి యొక్కరిని జూచుటకే వీలగును. నేను బోవుచుండగా వారు నన్ను జూచిరి.

''నగరము వెలువడి, పొలములలోనికి పోయితిని.

''కొంతసేపటికి వెనుదిరుగ, ఎందరో మనుష్యులు వచ్చుచుండిరి. నగరమున నేను జూచియుండిన వారినందఱను గుర్తు పట్టితిని. వారి తలలు విచిత్రముగ నుండినవి.

వారు త్వరపడినట్లు కన్పట్టుచున్నను, నాకంటె శీఘ్రముగ నడచుచుండిరి. వారు నడచునపుడు సవ్వడియే లేదు. క్షణములో ఈ గుంపు నన్నందుకొని చుట్టుముట్టెను. అందఱి ముఖములును మృద్వర్ణములే.

"అప్పుడు, నగరము ప్రవేశించిన వెంటనే నేను ప్రశ్నించి నాతడు 'ఎక్కడికి పోవుచున్నావు? నీవు చాల కాలమునకు ముందే చచ్చిన సంగతి నీకు తెలియదా?' అని యడిగెను.

"బదులుపలుక నోరు తెఱచి చూదునుగదా, ఒక్కరును ఎదుట లేరు."

అతడు మేల్కొనెను. చలిగా నుండినది. ప్రాతర్వాయువంత చల్లని గాలి, ఇంకను తెఱచియే యుండిన కిటికీ తలుపుల నిటు నటు లూగించుచుండెను. నిప్పు చల్లబడియుండినది. గొట్టమునందలి మైనపు వత్తి పొట్టియైనది. రాత్రి యింకను జీకటిగనే యున్నది.

లేచి కిటికీ కడ కేగెను. ఆకాశము నందింకను నక్షత్రములు లేవు.

కిటికీనుండి, యాటమైదానము వీథియు గనుపట్టును. గణగణ శబ్దము ప్రతిధ్వనించి క్రిందికతని చూపుల నాకర్షించెను.

క్రింద రెండెఱ్ఱ నక్షత్రముల నతడు చూచెను. వాని కిరణములు, నీడలో ముందు వెనుకలకు వికారముగ నృత్యము చేయుచున్నట్లుండెను.

అతని మనస్సింకను గడచిన ధ్యానమను పొగలోనే

యుండినది. "అవును. ఇప్పుడాకసమున నొక్కటియు లేదు. భూమిమీాద నున్నవి." అనుకొనెను.

ఈ కళవళము కరిగిపోయెను. రెండవసారి గణగణ శబ్దమతనిని పూర్తిగా మేల్కొలిపెను. గమనించి చూచి, ఈ రెండెఱ్ఱ నక్షత్రములును బండి దీపములని గ్రహించెను. వాని ప్రకాశమున బండి రూపమును జూచెను. తెల్లగుఱ్ఱము కట్టిన బోడి బండియది. అతడు విన్న శబ్దము రాతిబాటపైన గిట్టల తాపిడి.

"అదేమిబండి? ఎవరింత వేకువను వచ్చినవారు?" అనుకొనెను.

అప్పుడు గది తలుపుపై దిన్నగా దట్టిన సవ్వడి విననయ్యెను.

ఆపాదమస్తక మదటిపడి, ధిక్కార కంఠమున "ఎవరక్కడ?" అనెను.

"నేను, మాంష్యూర్ మేయర్!"

ముసలి సేవకురాలి గొంతది.

మా: ఏమి?

సే: ఇప్పుడే అయిదు కొట్టిరి.

మా: అయిన నేమి?

సే: బండి వచ్చినది.

మా: ఏమి బండి?

సే: బోడి బండి. మాంష్యూర్ మేయర్ ఉత్తరువీ లేదా?

మా: లేదు.

సే: మాంష్యర్ మేయర్ కొఱకు వచ్చితినని బండి తోలువాడనుచున్నాడు.

మా: ఎవడా బండివాడు?

సే: మాంష్యర్ స్కాప్లేర్ బండి తోలువాడు.

మా: స్కాప్లేర్!

ముఖము నెదుట మెఱపుఱికినట్లా పేరతని నులికి పడజేసెను.

మా: ఆ, ఔను! మాంష్యర్ స్కాప్లేర్!

ఆ నిముసమునందా ముసలి దతనిని జూచియుండిన భయముతో వడకెడిది.

చాలసేపంతయు నిశ్శబ్దము. అతడు దీపజ్వాలను మందబుద్ధివలె పరిశీలించుచు వత్తి చుట్టును కరిగిపడియున్న మైనము వ్రేళ్ళతో పురివెట్టుచుండెను. ముసలిది కాచుకొనియే యుండెను. ధైర్యము చేసి మఱల "మాంష్యర్ మేయర్, ఏమి చెప్పుమందురు?" అనెను.

మా: సరే, నేను వచ్చుచున్నానని చెప్పుము.

# 5

పారిస్ నుండి రాత్రి తొమ్మిది గంటలకు బయలుదేఱు తపాల బండి, ఉదయమైదు గంటలకు గొంతముందు మ– చేరును.

నాడుదయమున, ఆ బండి మ– ప్రవేశించునపుడు, వీధి మూల తిరుగగా, ఎదురుపడి వచ్చుచుండిన కప్పులేని తెల్లగుఱ్ఱపు బండియొకటి మహావేగమున దాని నొఱసికొని

పోయెను. ఆ తెల్లగుఱ్ఱపు బండిలో చోదకుడు తప్ప వేఱెవ్వరును లేరు. అతడు శాలువ కప్పుకొని యుండెను. బోడి బండి చక్రమునకు మంచి దెబ్బ తగిలినది. తపాలావాడు కేక వేసెను గాని, ఆ శీఘ్రగామి నిలువక బండిని బరుగెత్తించుకొని పోయెను.

"ఎవడో వెఱ్ఱితొందరలో నున్నాడు." అని తపాలావాడు గొణిగెను.

రాత్రియంతయు హృదయవికారమగు కంపనములలో దన్నుకొనుచుండిన యామనుష్యుడే యీ వెఱ్ఱి తొందరతో బరుగిడినవాడు.

ఎక్కడికేగుచుండెను? చెప్పగల్గి యుండలేదు. ఎందుకా త్వర? అత డెఱుగడు. నిర్దిష్ట గమ్యము లేక ముందుకుఱికెను. ఏ వైపు? అర్రాస్ వైపే, నిస్సందేహము. కాని, యింకెక్కడికైన బోవచ్చును. అప్పుడప్పు డట్లు భావించి యతడు వణికిపోయెను. ఆవులించుచున్న యగాధము జొచ్చినట్లతడా చీకటిలో బడెను. ఏదో త్రోసి తఱుముచుండినది. అతనిలో నేమి జరుగుచుండెనో యెవ్వరును వర్ణింపలేరు. కాని, యందఱర్థము చేసికొందురు. జీవితమునం దొక్కసారియైనను ఈ యవేద్యాంధకార గుహను బ్రవేశింపని మనుష్యు డెవడు?

కాని, అత డెట్టి తీర్మానమునకును వచ్చియుండలేదు. ఏమియు జేయలేదు. అతని యంతరంగకృతము లెవ్వియు దుది నిశ్చయములు కావు. తొలి నిముసమునందున్నట్లే యుండెను.

సాం్లేర్ బండి నేర్పాటుచేసికొన్నప్పు డనుకొన్న దానినే పునరుద్ఘాటన చేసికొనుచుండెను. పర్యవసాన మేదైనను, తన కండ్లతో జూచి పరిస్థితులను దూచుట కడ్డములేదు. ఏమి జరుగునో తెలిసికొనుట వివేక పద్ధతి. చూడక, పరిశీలింపక యెట్టి నిర్ణయమును జేయ వీలులేదు. దూరమునందలి యొక్కొక్క చిన్న వస్తువును బర్వతమను కొందుము. ఈ చాంప్మతు వట్టి నీచుడేమో. వానిని జూచి నపుడంతరంగము వానిని గాలికి పోనిచ్చుటకు నెను దీయ దేమో. అక్కడ జేవర్, ప్రాత ఖైదీలగు ౘ్రెపీ, చెనిల్డో, కోచెపెల్కూడ నుందురు. వారు తన్ను గుర్తింపలేరు - ఖండితము. ఏమి నెట్టి! దారికి నూఱుమైళ్ళ దూరమున జేవ రున్నాడు. ఊహాపోహలన్నియు చాంప్మతు పైననే నిలిచి నవి. ఊహాపోహల కంటె మొండియైనవి లేవు. కాన, అపాయమే లేదు.

ఇది సంకట సమయమే. దానిని గడచిపోవలెను. తన విధి నిర్ణయము, తన పిడికిట నున్నది - అట్లగుట దుష్టము కావచ్చుగాని, తాను దాని కధికారి. ఈ యాలో చన నూది పట్టుకొనెను.

నిజము చెప్పవచ్చినచో, అర్రాస్‌కు పోకుండుట కత డిష్టపడును.

కాని, ఆ దారి పట్టినాడు.

ఆలోచనలో మునిగియున్నను, గుఱ్ఱమును చబుకుతో గొట్టి సమవేగమున నిండు కదమెత్తించి, గంటకు రెండున్నర లీగులు చనుచుండెను.

బండి ముందుకు పోవుకొలని,లోననేమో వెనుకబడు చున్నది.

పగలు పడుసరికి, మ-కు చాలదూరమున జనపద ప్రాంతము లందుండెను. దిక్కులు ప్రకాశమానములగుటను జూచెను. అతడు చూడకున్నను, హేమంత శైత్యమునకు ముద్దగట్టిన యాకృతులతని కన్నులెదుట గడచిపోవుచున్నవి. సాయంకాలముననే కాదు, ప్రాతర్వేళను దయ్యములుండును. అతడు వానిని జూడలేదు. కాని, అతనికి దెలియకయే దైహికమనబోలిన చొరవతో వృక్షపర్వతముల హద్దు గీతలు, అతని సంక్షుభితాత్మ యందలి యవర్ణ్య విషాద భయముల నధికము గావించినవి.

దారిప్రక్కల ఏకాకి గృహములను గడచిపోవునపుడంతయు ''ఇంకను నిద్ర పోవుచున్నవారున్నారు'' అనుకొనును.

గిట్టలు, జీను, చక్రములును ఏకరీతిగా నినదించు చున్నవి. సంతోషముగ నున్నవానికి మనోహరముగను, విచారముగా నున్నవాని కేడ్చుచున్నట్లును ఈ శబ్దములుండును.

పట్టపగ లగునప్పటికి హెస్డిన్ లో నుండెను. గుఱ్ఱము కింత విశ్రాంతి నిచ్చి, ఉలవలు తినిపించుటకై ఒక హోటలు దగ్గఱ విడిసెను.

స్కాఫ్లేరన్నట్లే గుఱ్ఱము చిన్న జాతికి చేరినది. తలయు, పొట్టయు పెద్దవి. మెడ పొడుగు కాదు. కాని, విఱుచుకొన్న ఱొమ్ము. పెద్ద పిఱుదులు. అందము సున్ని

తమునైన కాళ్ళు. దృఢ పాదము. చిన్నదయ్యు బలిష్ఠము ఆరోగ్యమునైనది. రెండు గంటలలో ఐదు లీగులు కడచినను వెంట్రుక చలింపలేదు.

అతడు బండి దిగలేదు. అశ్వశాల బాలకుడు ఉలవలు తెచ్చి, తటాలున వంగి యెడమచక్రము బరీక్షించెను. "చాల దూరమిట్లే వచ్చితిరా?"

తన యాలోచనాశ్రేణిని గదలింపకయే మాదలిన్ "ఏల?" అనెను.

బా: చాల దూరమునుండి వచ్చితిరా?

మా: ఇక్కడినుండి యైదు లీగులు.

బా: ఆహా!

మా: ఎందు కట్లంటివి?

బాలుడు మఱల వంగి, మౌనముగ చక్రము నింకొక సారి పరీక్షించి నిల్చుండి – "ఈ చక్రమైదు లీగులెట్లు వచ్చెనో! ఇంక పాతిక లీగైన బోదు." అనెను.

మాదలిన్ క్రిందికి దుమికెను. "ఏమంటివయ్యా మిత్రుడా?"

బా: ఏమా! మీరు, మీ గుఱ్ఱము దారిలో నేదైన గోతిలో బడక యింతదూరము వచ్చుట అద్భుతమైన విషయము. మీరే చూడుడు.

చక్రము గట్టి దెబ్బనే తిన్నది. తపాల బండితో సంఘర్షణ దాని చక్రమున రెండాకులను విఱిచి, ఇరుసును వదలు పఱచినది.

మా: అయ్యా, ఇక్కడ బండ్లు చేయువాడున్నాడా?

బా: ఆహా!

మా: దయయుంచి యతనిని బిల్చుకురా నాయనా!

బా: అడుగో, అక్కడనే. ఓయ్ మాస్టర్ బూర్గ లార్డ్!

బండ్లు చేయువాడగు మాస్టర్ బూర్గలార్డ్ తన యింటి వాకిటనే యుండెను. వచ్చి చక్రమును బరీక్షించి, విఱిగిన కాలు చూచిన శస్త్రచికిత్సకునివలె మూతి విఱిచెను.

మా: ఆ చక్రము నిక్కడనే సరిచేయగలవా?

బూ: చేయగలను మాంష్యూర్!

మా: నేను మఱల నెప్పుడు బయలుదేఱగలను?

బూ: రేపు.

మా: రేపు?

బూ: పూర్తి దినము పనియున్నది.

మా: చాల తొందఱ పని. ఒక గంటకైన వెళ్ళి తీఱవలెను.

బూ: సాధ్యమే కాదు, మాంష్యూర్!

మా: ఏమడిగినను ఇత్తును.

బూ: అసాధ్యము.

మా: రెండు గంటలలోనో?

బూ: ఈనాడు కాదు. రెండాకులు ఒక యిరుసును బాగుచేయవలెను. రేపటి లోపల పయనింప వీలులేదు.

మా: రేపటి వఱకును నా పని యాగదు. రిపేరి చేయకున్న మానె. వేరొక చక్రము తగిలింపగూడదా?

బూ: ఎట్లగును?

మా: నీవు బండ్లు చేయుదువే?

బూ: ఔను మాంష్యర్!

మా: మఱి నీ దగ్గఱ అమ్మకమునకు చక్రము లేదా? నేనిప్పుడే బయలుదేఱవచ్చును.

బూ: దీనిని తీసికొని, యింకొక టిమ్మందురా?

మా: అవును.

బూ: మీ బండికి నా దగ్గఱ చక్రము లేదు. రెండు చక్రములొక జత. రెండు చక్రములు తోచినట్లు పోవు.

మా: అట్లయిన, జత చక్రము లమ్ముము.

బూ: మాంష్యర్, ఏ చక్రమే యిరుసుకైన సరి పోదు.

మా: ప్రయత్నించు.

బూ: ఉపయోగము లేదు మాంష్యర్! నా దగ్గఱ బండి చక్రములే అమ్మకమునకున్నవి. ఇది పల్లె కొంప.

మా: బాడుగ కిచ్చుటకు బండి యున్నదా?

మొదటి చూపులోనే యిది బాడుగు బండియని బూర్గలార్డ్ గ్రహించియుండెను. బుజము లెగురవేసి "మీరు బాడుగు బండ్లను మిగుల జాగ్రత్తగా జూతురు! కాని, యిచ్చుటకు నా దగ్గఱ బండి యుండవలెను గదా!" అనెను.

మా: సరి, అమ్మివేయుము.

బూ: బండి లేదే.

మా: ఏమి! చిన్న బండి లేదా? చూడు, నేనేమంత బరువైనవాడను గాను.

బూ: ఇది చిన్న యూరు. నిజమే, నా వ్రాతపెడ్డులో నొక బండి యున్నది. అది యింకొక నాగరకునిది. అతడు ప్రతి ఫిబ్రవరి 29వ తారీకున దాని నుపయోగించును. నా దగ్గఱ జాగ్రత పెట్టినాడు. దాని నిచ్చిన నాదేమియు బోదు. నాగరకుడు దానిని రోడ్డుమీద జూడకూడదు. మొరటు బండి. రెండు గుఱ్ఱము లుండవలెను.

మా: రెండు గుఱ్ఱములు తీసికొందును.

బూ: తామెక్కడికి బోవుచున్నారు?

మా: అర్రాస్.

బూ: నేడే అక్కడ జేరవలెనా?

మా: అవును.

బూ: అంచె గుఱ్ఱములతోనా?

మా: ఏల కాదు?

బూ: రేపుదయము నాల్గు గంటలకు జేరిన సమ్మతమేనా?

మా: కానే కాదు.

బూ: అంచె గుఱ్ఱములు తీసికొనుటలో, ఒక విషయమున్నది. మీ దగ్గఱ పాస్పోర్టున్నదా?

మా: ఆహా!

బూ: సరి, అంచె గుఱ్ఱములతోను రేపటి కంటె ముందు పోవ వీలుకాదు. నేరు దారులా, కావు. మారు గుఱ్ఱములు సిద్ధముగా నుండవు. పొలములలో నుండును. దున్ను కాలము. అన్ని గుఱ్ఱము లన్నిచోటులనుండి పొల

ములు చేరినవి. ప్రతి యంచెలో మూఁడు నాలుగు గంటలైన గాచుకోవలెను. దారిలో ఎన్నో కొండ లెక్కి దిగవలెను.

మా: మంచిది. నేను గుఱ్ఱము నెక్కి పోయెదను. బండి విడిపించు. ఎవరి యొద్దనైన అమ్మకమునకు జీను లేదా?

బూ: ఓ, ఉన్నది. కాని, యీ గుఱ్ఱము స్వారికి వచ్చునా?

మా: ఔను, మఱచితిని. రాదు.

బూ: మఱి—

మా: ఎవరైన గుఱ్ఱమును బాడుగ కియ్యరా?

బూ: ఒక్క యూపున అర్రాస్‌కు పోవుటకా?

మా: ఆ.

బూ: ఇక్కడి గుఱ్ఱముల కంటె చాల మంచిది కావలసి వచ్చును. మిమ్మెఱిగిన వారెవ్వరును లేరు కాన, కొనవలసి యుండును. కాని, అమ్ముటకో, బాడుగ నిచ్చుటకో, ఐదు నూర్లకో, వేయికో గుఱ్ఱముండిన కదా?

మా: ఏమి చేయుదును?

బూ: నేను రిపేరి చేయుదును. మీరు రేపు పోవుదురు.

మా: రేపటికి మించిపోవును.

బూ: మఱి నాకు దెలియదు.

మా: అర్రాస్‌కు పోవు తపాల బండి లేధా? అది యెప్పుడిక్కడికి వచ్చును?

బూ: రాత్రికి. ఇటునటు పోవు తపాలబండ్లు రెండును రాత్రియే వచ్చును.

మా: అయ్యో! ఈ చక్రము సరిచేయుట కొక దినమంతయు గావలెనా?

బూ: ఔను.

మా: ఇద్దరు కూలివాండ్రను బెట్టిన?

బూ: పదిమంది యైనను అంతే.

మా: ఆకులను త్రాళ్ళతో గట్టగూడదా?

బూ: ఆకులను గట్టవచ్చును. ఇరుసో? ఇదిగాక పైరుకూడ జెడిపోయినది.

మా: ఇక్కడ బాడుగ గుఱ్ఱముల సాల లేదా?

బూ: లేదు.

మా: బండ్లు చేయువాడింకొకడు లేడా?

బాలుడు, బూర్గలార్డు ఒక్కటేసారి తల నూపి - ''లేదు.'' అనినారు.

మాదలిన్ కధికానందమయ్యెను.

ఇది సర్వేశ్వరుని చైదమే. బండి చక్రము విఱిచి, మధ్యేమార్గమునందాపినవా డీశ్వరుడే. విఱిగినదని తానూరకుండ లేదు. ప్రయాణము సాగించుటకు సకలప్రయత్నము లొనర్చెను. అన్ని విధానములను మనస్ఫూర్తిగ దఱచి చూచెను. ఆయాసము, వ్యయము - దేనిని దాను పాటింప లేదు. తన తప్పేమియు లేదు. ప్రయాణమాగిపోయిన, తన బాధ్యత లేదు. ఇది తన యంతరంగ కృత్యము కాదు. భగవత్కృతము.

అతడు గాలి పీల్చెను. జేవరీ సంగతి చెప్పిన పిదప - నిదే మొదటిసారి వక్షఃపూర్ణముగ పీల్చుట. తన హృదయమును బిడికిట బట్టుకొనియుండిన యినుప చేతిపట్టు సడలి నట్లతనికి దోచెను. దేవుడు తన పరమనుటిప్పుడు స్పష్టము! చేయగల్గినదంతయు నైనది. ఇంక ప్రశాంతముగ వెనుదిరుగ వలసినదే.

అతడు బండ్లు చేయువానిని ప్రశ్నించుచుండగా, వచ్చు పోవువారు గుమిగూడిరి. కొన్ని నిముసములు విని యొక బాలుడెవరికిని దెలియక అక్కడినుండి పాఱిపోయెను. మాదలిన్ వెనుదిరిగి పోవ నిశ్చయించుకొనుసరికొక ముసలి దానిని వెంట నిడుకొని యా బాలుడు వచ్చెను.

ముసలిది: మాంష్యర్, ఒక చిన్న బండి మీకు బాడుగకు గావలెనని మా అబ్బాయి చెప్పుచున్నాడు.

ఒక బాలుడు తోడుకొని వచ్చిన ముసలిది పల్కిన యీ సామాన్య వచనము లతనికి ముచ్చెమట పట్టించెను. ఏ దృఢ ముష్టినుండి తాను విడిపించుకొన్నట్లింతవఱకు సంతసించెనో, అది మఱల జీకటినుండి వెలువడి పట్టుకొన వచ్చుచున్నదని భావించెను.

"అవునమ్మా, ఒక బాడుగ బండికై చూచుచున్నాను." అని త్వరలో మఱల "కాని, యిక్కడ ఒక్కటియు లేదు." అనెను.

ము: ఉన్నది.

మా: ఎక్కడ?

ము: నా యింటిలో.

ఆయన గడగడ వడకెను. ఆ యనివార్య హస్తము బంధింప వచ్చుచున్నది.

ముసలిదాని షెడ్డులో ఒక విధమైన చిన్న బండి యున్నది. వాస్తవమే. కాని బండ్లవాడు, అశ్వశాల బాలుడును, ఈయన తమ చేతినుండి జాఱిపోవుచున్నాడేయని కంపితులై యిట్లనిరి: "అది ఘోరమైన బండి. స్ప్రింగులు లేవు. తోలు పట్టీలతో లోపలి సీటు వ్రేలగట్టినారు కాని, వర్షమంతయు దాని మీఁదనే పడును. చక్రములు త్రుప్పు పట్టి యక్కఱ చెడినవి. మీ బండి పోవునంత దూరమైన బోవు. గంతులు వేయును. దానిని దీసికొనుట బుద్ధి తక్కువ –" ఇత్యాది.

ఇదియంతయు నిజము కావచ్చు గాని, దానికి రెండు చక్రములున్నవి. అది అర్రాస్‌కు పోగలదు.

అడిగిన దుడ్డిచ్చి యా బండిని దీసికొని, తన బండిని బూర్గలార్డ్ దగ్గఱ రిపేరికి నిలిపి, తెల్లగుఱ్ఱమును క్రొత్త బండికి బూన్చి, దారి బట్టెను.

బండి కదలగనే, ఒక క్షణమునకు ముందు, వెనుదిరుగు చింతనొడమ దాను సంతస పడినట్లతడంగీకరించెను. ఆ సంతసమును పరిశీలింప నాగ్రహమొదవి, యయుక్తమని పించెను. వెనుదిరిగి పోవుటకేల సంతోషింపవలె? తనంత తానీ ప్రయాణము పెట్టుకొన్నాడు కాని, ఒకరి బలవంతముచే గాదు.

తాను జరుగకూడదనుకొన్నది జరుగ వీలు లేదు. ఏమైనను సరే.

హెస్డిన్ పొలిమేఱ దాటుచుండ "నిలు! నిలు!" అని కేక వినపడెను. సరభసముగ అతడు బండి నాపెను. అప్పునపుడతని శరీరమునందేదో విచిత్రమగు వంకరలు తిరిగినవి. దాన ఆశ పోలికలుండెను.

పిలిచినవాడా ముసలిదాని బాలుడు.

బా: మాంష్యర్, ఈ బండిని మీకిప్పించినవాడను నేను.

మా: అయిన!

బా: మీరు నాకేమియు నీరైతిరి.

అందఱకును ఊరకే యిచ్చునతడు ఈ బాలు డిట్లడుగుట అతిక్రమమని, దుస్సహానమని భావించెను. "ఓహో, నీవా నీచుడా! నీకేమియు నియ్యను."

చబుకుతో కొట్టి గుఱ్ఱమును పరుగెత్తించెను.

హెస్డిన్‌లో చాలకాలము వ్యర్థమైనది. దానిని జమ చేసికోవలెను. ఆ చిన్న గుఱ్ఱ ముత్సాహవంతము. రెండు గుఱ్ఱముల బరువీడ్చును. కాని, అది ఫిబ్రవరి. వర్షము కురిసి మార్గము బుఱదగా నున్నది. ఈ బండియు బరువు. తిన్నగా బోవుచుండెను. ఇన్నింటికి తోడెగుబ్రోవ.

హెస్డిన్ నుండి సెయింట్‌పోల్ చేరుటకు నాలుగు గంటలయ్యెను. ఐదు లీగులకు నాల్గు గంటలు.

అక్కడ దగ్గఱి హోటలు కేగి, గుఱ్ఱమును శాల కంపి, స్కాఫ్లేర్ కిచ్చిన మాట ప్రకారము, అది మేయునపుడు ప్రక్కన నిల్చుండెను. అతని మనస్సున విషాద సంక్షోభములు కూడియుండినవి.

హోటలువాని భార్య అశ్వశాలలోనికి వచ్చి "తమకు దిండి యక్కఱలేదా?" అనెను.

మా: అవునవును. నాకు జాల ఆకలిగా నున్నది.

ఆ యాడుదాని మొగము వాడులేక హాయి నిండి యుండినది. అతడామె వెంట నడిచి, టేబుల్ దగ్గఱ గూర్చుండి "త్వరగా. మఱల బయలుదేఱవలెను. తొందఱ పనియున్నది." అనెను.

ఫ్లెమిష్ పరిచారిక యొకర్తు సాధ్యమైనంత త్వరగా వడ్డించెను. దాని వంక జూచి యతడు కొంత సేద తేఱెను. "ఇంతవఱకును పస్తు. నన్నదే బాధించినది."

ఒక బ్రెడ్డు తీసి, దానిలో నొక ముక్క గైకొని, తక్కిన దానిని పళ్ళెములోనే యుంచెను. వేఱేమియు దాక లేదు.

జోడు గుఱ్ఱములను తోలువాడొక డింకొక టేబుల్ దగ్గఱ నుండెను. వానితో ఈ మనుష్యుడు "ఎందుకో యీ బ్రెడ్డింత చేదు?" అనెను.

వాడు జర్మన్. అర్థము చేసికొలేదు.

మాదలిన్ అశ్వశాల కేగి, ఒక గంటలో టింక్స్ వైపుఱుకుచుండెను. టింక్స్, అర్రాస్ నుండి యైదు లీగులు.

ప్రయాణ సమయమునందేమి చేయుచుండెను? ఏ మాలోచించుచుండెను? ఉదయమునందు వలెనే, పరుగిడు చున్న చెట్లు, గుడిసెలు, పంట భూములు, దారి మలుపులలో కరగిపోవుచుండిన జనపదములను జూచుచు బోవుచుండెను. కొన్ని వేళల నిట్టి రంగములు ఆత్మకు జాలును.

ఆలోచనలను దఱిమివేయును. ఒక్క వేయి వస్తువులను మొదటి కడసారు లేకకాలమున చూచుటకంటె గాఢ విషాదకర విషయమేది? పయనించుటన ప్రతి నిముసమున బుట్టి చచ్చులే. మాఱుచున్న దిఙ్మండలమును మానవ జీవితముతో దన చీకటి కమ్మిన మనస్సున బోల్చుచుండె గాబోలు. జీవిత విషయములన్నియు మన కండ్లయెదుట నిరంతరమును బరుగిడుచుండును. చీకటి వెలుగు లొకటి వెంట నొకటి వచ్చును. మెఱపు వెంట గ్రహణము. చూచి, త్వరపడి, చేయి చాచి, పరుగిడుచున్నదానిని బట్టుకొన జూతుము. ప్రతి సందర్భమొక దారి మలుపు. ఉన్నట్టుండి వృద్ధుల మగుదుము. ఏదో చిన్న దెబ్బ తగిలినట్లగును. అంతయు జీకటి. ఒక నల్లని తలుపును కనుగొందుము. మనలను మోయుచుండిన యీ కాళిమ జీవితాశ్వము నిలచి పోవును. అవకుంఠితము, అవేద్యమునైన రూపమొక్కటా యశ్వమును జీకటిలోనికి దఱిమి వేయుటను మనము చూతుము.

మన పాంథుడు టింక్స్ ప్రవేశించుసరికి సంధ్యా సమయమైనది. బడినుండి పిల్లలిండ్లకు బోవుచుండిరి. దినము లింకను కుఱుచ లే. ఆయన టింక్స్‌లో నిలువలేదు. ఆ పల్లె వెడలుచుండ, రోడ్డు రిపేరి చేయుచుండిన వాడొకడు తల పైకెత్తి "మీ గుఱ్ఱమలిసి పోయినది" అనెను.

నిజమే. పాపము. దాని పరుగు నడకమైనది.

"మీరు అర్రాస్‌కు బోవుచున్నారా?"

మా: అవును.

"ఇట్లైనచో, మీరు వేగిరమక్కడ చేరరు."

మాదలిన్ గుఱ్ఱము నాపి-"ఇక్కడినుండి అర్రాస్ ఎంతదూరము?" అనెను.

"సుమారేడు లీగులు."

మా: అదెట్లు? తపాల దారి లెక్క-ప్రకార మైదుం బాతికే.

"ఆఁ. రోడ్డు రిపేరిలో నున్నదని మీ రెఱుగరు. ఇక్కడినుండి కాల్గంట పయనించిన, రోడ్డు ప్రక్కకు తిరుగును. ఎడమ వైపు."

మా: ఆహా!

"అవును. కారెన్సీకి పోవు దారి. నది దాటవలెను. కాంబ్లిన్ దగ్గఱ గుడివైపు తిరిగిన అర్రాస్‌కు పోదురు."

మా: చీకటైనది. దారి తప్పుదునే?

"మీరీ వైపువారు కారా?"

మా: కాను.

"అదియుగాక, యివియన్నియు అడ్డు దారులు. నా మాట వినుడు. మీ గుఱ్ఱముకూడ నలసినది. టింక్స్‌కు మఱలి పొండు. అక్కడ మంచి హోటలున్నది. నిద్ర పొండు. ఉదయమర్రాస్‌కు బోవచ్చు."

మా: ఈ రాత్రికి - సాయంకాలమునకక్కడ నుండి తీఱవలెను.

"అది వేఱు సంగతి. అట్లైనను, హోటలుకు వెళ్ళి యింకొక గుఱ్ఱమునుకూడ దీసికొనుడు. గుఱ్ఱము వెంట వచ్చు బాలుడు, అడ్డ త్రోవలను దప్పించును."

అతడు పల్లెవాసి సలహా నంగీకరించెను. వెనుదిరిగి, మఱల అరగంటలో పూర్ణ వేగమున, జోడు గుఱ్ఱముల బండిలో అదేవైపు పరువెత్తెను. అశ్వశాల బాలకుడు దాగ పైన గూర్చుండియుండెను.

అయినను, కాలము మీఱిపోవుచున్నట్లతడు భావించెను. ఇప్పటికి బాగుగ జీకటి పడినది.

వారొక యడ్డుదారిబడి పోవుచుండిరి. దారి ఘోరముగ నుండినది. బండి యొక గుంతనుండి యింకొక దానబడి లేచుచుండెను. బాలునితో అతడు "కదము త్రొక్కించుట నిలుపకు. రెండంతలు డబ్బిత్తును."

మైదానమంతయు జీకటిగ నుండినది. చిక్కని నల్లని పొగమంచు, కొండ శిఖరముల ప్రాకి తేలిపోవుచుండెను. మేఘములనుండి మెఱపులు తళుక్కు తళుక్కు మనుచుండెను. సముద్రమునుండి వచ్చిన ప్రబలమగు గాలి దిక్కులకు జెదిరి ఘర్నిచరు నిటు నటు లీడ్చినట్లు శబ్దము చేయుచుండెను. కంటబడిన ప్రతి వస్తువును భయకంపితమగుచున్నట్లుండెను. నిశాఘోరనిశ్వాసము క్రింద సకలమును గంపించును.

చలి యతనిని జీల్చికొని పోయెను. ముందునాటి సాయంకాలమునుండి భోజనము లేదు. డి- సమీప మైదానము నందు, ఎనిమిదేండ్లకు ముందు, నాటిరాత్రి గాంచిన యనుభవము స్మరించెను. నిన్న జరిగినట్లున్నది.

ఎక్కడనో దూరపు గంట మ్రోగెను.

"అబ్బాయీ, గంటెంత?"

"ఏడు మాంష్యర్! ఎనిమిదికి అర్రాస్ చేరుదుము. ఇంక మూడు లీగులే."

"ఈ నిముసమున గొన్ని యాలోచనలు పొడమెను. ఇంతకు ముందిట్లు తోచకపోవుట చిత్రమైన సంగతి. ఈ కష్టమంతయు వ్యర్థమేమో. విచారణ యిన్ని గంటలకని యైన దెలియదు. అదియైన దాను తెలిసికొని యుండవలసినది. ఉపయోగమగునా కాదా యని తెలిసికొనకిట్లు పోవుచునే యుండుట బుద్ధిమాలిన తనము. తరువాత నేమో లెక్కించుకొనెను. సాధారణముగ న్యాయసభలు ఉదయము తొమ్మిది ప్రారంభమగును. ఈ కేసు చాల ప్రొద్దుపట్టదు. ఈ పండ్ల దొంగతనమొక చిటుక పని. మనుష్యుని గుర్తించుట తప్ప వేఱేమియు నుండదు. నాలుగైదుగురు సాక్షులు, లాయర్లమాట లొకటి రెండు. అంతయునైపోయిన తరువాత దానక్కడ జేరును!

బాలుడు గుఱ్ఱములను దఱిమెను. వారు నది దాటి పోయిరి.

నిశి యధికాధికాంధ మగుచుండెను.

# 6

ఇదే సమయమున ఫాంటైన్ మతి భ్రమణావస్థలో నుండినది.

రాత్రియంతయు గష్టముగ గడపినది. వెఱగు గొల్పు, దగ్గు. ద్విగుణీకృత జ్వరము. చెడ్డ కలలు. ఉదయమున

డాక్టరు వచ్చుసరికి తెలివితప్పి యున్నది. అతడు భయపడి నర్లై మాంన్యుర్ మాదలిన్ రాగానే కబురంపుమనెను.

ఉదయమంతయు నుల్లాసము దక్కియుండినది. తక్కువ మాటలాడినది. బట్టలను మడుచుచూ నేవో లెక్కలు గొణిగికొనుచుండెను. ఆ గణన దూరములకు సంబంధించి నవి. కన్నులు గుంటవడి నిశ్చలములైనవి. ప్రకాశమంతయు పోయినట్లే యుండెను. కాని, అప్పుడప్పుడు కాంతిమంత ములై నక్షత్రములవలె దళుక్కనును. కడపటి గడియ సమీ పించుసరికి, భూప్రకాశమునుండి పోవువారిని స్వఃప్రకాశము నింపునట.

ఎట్లుంటివని సిస్టర్ సింప్లిస్ ప్రశ్నించినపుడెల్ల "సరి. మాంన్యుర్ మాదలిన్‌ను జూడ గోరికగుచున్నది" అనును.

కొన్ని నెలలముందు, తన కడపటి శీలముచు, గడ పటి యవమానమును, గడపటి సుఖమును బోగొట్టుకొన్నపు డామె తన నీడవలె నుండును. ఇప్పుడు దయ్యమువలె నున్నది. దేహబాధ, నైతికబాధ చేయుపనిని పరిపూర్ణ మొనర్చెను. ఈ యిరువదైదేండ్ల జీవి ఫాలము ముడుతలు పడినది. బుగ్గలు వ్రేలాడుచున్నవి. నలిపినట్లున్న నాసికా రంధ్రములు. పంటి చిగుళ్ళు ముడురుకొన్నవి. మాంద్య వర్ణము. ఎముకల కంఠము. నిక్కిన జత్రువులు. నరసిన వెంట్రుకలు. ఆహా! వ్యాధి వార్ధక్యమునెంత సద్యఃఫలిత మొనర్చును!

డాక్టరు మఱల మధ్యాహ్నమున వచ్చి, కొన్ని

మందులు వ్రాసి యిచ్చి, మేయరు వచ్చియుండెనా యని యడిగి, శిరమాడించెను.

సాధారణముగ మూడు గంటలపుడు, మాంష్యర్ మాదలిన్ రోగిని జూడవచ్చును. కచ్చితమే కరుణ కావున, ఆయన కచ్చితముగ నుండెడివాడు.

రెండున్నర యగుసరికి ఫాంటైన్ ఉద్విగ్నురాలయ్యెను. ఇరువది నిముసములలో పదిసారులు "సిస్టర్, గంటెంత?" అని యడిగెను.

గడియారము మూడు గంటలు కొట్టెను. మూడవ గంట కొట్టగనే, ప్రక్క పొరలలేని ఫాంటైన్ పరుపులో లేచి కూర్చుండి, ముడుతలు వడి పసుపువాఱిన హస్తములు వణకుచుండ జోడించి సిస్టర్ వినునట్లు నిట్టూర్చెను. ఒక పెద్ద బరువునెత్తు నటువంటి వాయూర్పులు. పిదప ఫాంటైన్ తిరిగి తలుపు వంక చూచెను.

ఎవ్వరును లోనికి రారైరి. తలుపు తెఱవబడలేదు. కాల్గంట కాలము, దృష్టి తలుపు పైననే నిలిపి, నిశ్చలయై, ఊపిరి బిగబట్టినట్లు కూర్చుండియుండెను. సిస్టర్‌కు మాటాడు ధైర్యములేదు. చర్చి గంట కాల్గంట కొట్టెను. ఫాంటైన్ వెనుకకు దిండుపై బడిపోయెను.

ఏమియు జెప్పక మఱల బట్టలు మడువసాగెను.

అఱ గంట, ఒక గంట కడచెను, ఎవరును రారైరి. గంట కొట్టినపుడెల్ల ఫాంటైన్ లేచి, తలుపు వంక జూచి మఱల వెనుకకు బడుచుండెను.

ఆమె యాలోచనలు స్పష్టముగ దెలియుచునే

యున్నవి. ఆమె మాత్ర మేపేరు నుచ్చరించ లేదు. ఎవరిని చూడ లేదు. ఏ తప్పును పట్ట లేదు. విషాదకరముగ దగ్గుచుండె నంతే. నల్లనిదేదో ఆమెను కైవస మొనరించుకొనుచున్నట్లుండెను. కేవలము పాలిపోయినది. పెదవులు నల్లబడినవి. అప్పుడప్పుడు హాస మొనర్చును.

ఐదు గంటలయ్యెను. అప్పుడు సిస్టర్‌తో మెల్లగా నిట్లనెను. "నేను రేపు పోవుచున్నాను గదా? ఆయన చూడ రాకుండుట తప్పు కదూ?"

మాంష్యర్ మాదలిన్ జాగుసేయుచుండుట సిస్టర్ సింప్లిస్ కాశ్చర్యకరమే.

ఇంతలో ఫాంటైన్ తన మంచపు మేలికట్టు చూచుచు, దేనినో జ్ఞప్తికి దెచ్చుకొన యత్నము సేయుచున్నట్లుండెను. ఉన్నట్టుండి గుసగుస యంత హీనస్వరమున బాడనారంభించెను. సన్యాసిని వినుచుండెను.

అది యనాదిమైన జోలపాట. పూర్వము కోజెత్తును నిదుర పుచ్చుటకు బాడెడిది. ఐదేండ్లైనది పాడి. మధుర రాగముతో, మహావిషాదకర కంఠముతో ఫాంటైన్ పాడుచుండెను. దానిని విని తపస్వియగు సిస్టర్ సింప్లిస్ కూడ కన్నీరాపుకొన జాలదయ్యెను.

ఆరుగంటలు టంగు టంగు మనెను. ఫాంటైన్ విన్నట్లు లేదు. ఇప్పుడామె దేనిని లక్ష్యము చేయునట్లే లేదు.

మేయర్ ఫ్యాక్టరీకి వచ్చెనా, వచ్చియుండిన వెంటనే చికిత్సాలయమునకు రాడా యని కనుగొనుటకై సిస్టర్

సింప్లిస్ ఒక పిల్లను బంపెను. అది కొన్ని నిముసములలో మఱలి వచ్చెను.

ఫాంటైన్ నింకను నిశ్చలముగ నుండినది. ఆలోచనలకు జిక్కినట్లున్నది.

నాటి యుదయమూఁడు గంటలకే మేయర్ తెల్లగుఱ్ఱపు బోడి బండిలో ఎక్కడికో వెళ్లెనని, డ్రైవరైన లేక ఒంటరిగనే పోయినాడని, అర్రాస్ మార్గమున దిరుగ జూచితిమని కొందఱు, పారిస్ దారిలో మేము చూచితిమని కొందఱును జెప్పుచున్నారని, పోవునపుడు యథాప్రకార ముండెనని, రాత్రికి రానని మాత్రము పరిచారికతో జెప్పెననియు బాలిక సిస్టర్ చెవిలో రహస్యముగ నూదెను.

వారిరువు రట్లు గుసగుసలాడుచుండ, ఫాంటైన్ పడక మీద మోకాళ్ళపై లేచినది. ఈ యంగసంబంధ వ్యాధులు కొన్నిటిలో నొకప్పుడు జ్వరతీవ్రత గల చుఱుకుదనము నుండును. ఆ చుఱుకుదనమున, ఆరోగ్యవంతుల సంచలనమును భయంకరమగు చావుటలతయు కూడియుండును. ముడుతలు వడిన చేతులతో గడ్డి పట్టుకొని, దోమ తెర సందులనుండి వారి రహస్యసంభాషణ విన్నది. తటాలున "మీరు మోంస్యూర్ మాదలిన్‌ను గుఱించి మాటాడుచున్నారు! ఎందుకా రహస్యము? ఆయన యేమి చేసినాడు? ఏల రాడు?" అని కేక లిడెను.

ఆ కంఠ మతికఠినమై యుండినది. ఆ స్త్రీలు పురుష స్వరమనుకొని భయకంపితులై వెనుదిరిగిరి.

ఫాం: "ఎందుకు బదులు చెప్పరు?"

బాలిక తడబడుచు - ఈనాడు రాలేరని పరిచారిక తెలిపినదనెను.

సిస్టర్: బిడ్డా, నెమ్మదిగ నుండుము. పండుకొమ్మా.

ఫాంటైన్ ఆ వైఖరి మార్చక, గట్టిగ సాధికారముగ-"రాలేరు! ఎందుకు? మీకు దెలియును. రహస్యముగ జెప్పుకొనుచుంటిరి. నేను దెలిసికోవలెను." అనెను.

బాలిక సిస్టర్ చెవిలో - సిటీ కౌన్సిల్ పనిలో నిమగ్నులై యున్నారని చెప్పుడనెను.

సిస్టర్ సింప్లిస్ మొగమెఱ్ఱవడెను. బాలిక సలహా అసత్యము. సత్యము రోగి కుద్రిక్తపఱచి దెబ్బ తీయుననుట నిస్సందేహము. ఈ మెఱుపు చాల కాలముండలేదు. ప్రశాంత విషాదదృష్టి ఫాంటైన్ వైపు బఱపి - మేయర్ వెళ్ళినాడనెను.

ఫాంటై నెగిరి కూర్చుండెను. కనులు మెఱసెను. అద్భుతానందమా దుఃఖవదనము నావరించెను. "వెళ్ళినారా? కోజెత్తు కొఱకే పోయినారు!"

పిదప జేతులాకసము దెస జూచినది. ముఖాకృతి యనిర్వచనీయమయ్యెను. పెదవు లదరెను. దేవుని ప్రార్థింప సాగెను. ప్రార్థన ముగించి "సిస్టర్, ఇంక పండుకొందును. నీవు కోరినట్లు చేయుదును. ఇంతకుముందు దుష్టముగ ప్రవర్తించితిని. అంత గట్టిగా నఱచినందుకు క్షమింపుము. అట్లఱచుట చెడ్డది-నాకు దెలియునమ్మా సిస్టర్! చూడు, ఇప్పుడెంత హాయిగ నున్నానో. దేవుడు దయాళువు. మాంష్యర్ మాదలిన్ మంచివారు. చూడు, ఆలోచించి

చూడు. నా ముద్దుల కోజెత్తుకొఱకు మాంట్ఫర్మిల్ కు పోయి నారు.'' అనెను.

మఱల బండుకొని, దిండు సర్దుటకు సిస్టర్ కు దోడు పడి, మెడలోని శిలువను చుంబించెను. ఆ సిలువ సిస్టర్ సింప్లిస్ ఇచ్చినది.

సిస్టర్: బిడ్డా, యింక విశ్రాంతిగ బండుకో. మాటా డకు.

ఫాంటైన్ సిస్టర్ చేతులను బట్టుకొనెను. ఫాంటైన్ చేతులు చెమ్మగిలి యుంట తెలిసికొని, సిస్టర్ విచార పడెను.

''నేడుదయమున పారిస్ కు బయలుదేఱెను. పారిస్ ద్వారా పోవలసిన పనికూడ లేదు. వచ్చునపు డొకింత యెడమవైపుగా మాంట్ఫర్మిల్ ఉండును. నిన్న కోజెత్తును గుఱించి యీాయనతో ప్రస్తావింప ఏమన్నారో జ్ఞప్తి యున్నదా? 'అతి త్వరలో, అతి త్వరలో!' అని. నన్ను సంభ్రమింపజేయుట కిట్లొనర్చినారు. తేనార్డియర్ల కొక యుత్తరము వ్రాయించుకొని పోయినారు. వారడ్డు చెప్పరు. చెప్పుదురా? తమ దుడ్డు ముట్టును గావున, కోజెత్తును వదలి వేయుదురు. డబ్బిచ్చిన తరువాత బిడ్డ నీకున్నచో చట్ట మూరుకొనదు. సిస్టర్, మాట్లాడవద్దని సైగ చేయకు. హాయిగ నున్నాను. ఆరోగ్యముగ నున్నాను. నొప్పియే లేదు. కోజెత్తును మఱల జూతును కదా. ఆకలియు నగు చున్నది. ఐదేండ్లొ బిడ్డను జూడనే లేదు. బిడ్డలెంతగా మనల

నాడింతురో ఊహాతీతము. అంతేకాక, అది కడు జక్కనిది. చూతువులెమ్ము! అందమైన, చిన్నని చిగుళ్ళవంటి చేతులు. దానికొక్క సంవత్సరమప్పుడు చాల చిన్న చేతులుండెను. ఇప్పుడు పెద్దవిగా నుండును. ఏడేండ్ల వయస్సు. ఇప్పుడొక చిన్న లేడీ. నేను కోత్తజెని పిలుతును. కాని దాని పేరు యూఫ్రెషెస్. ఈ యుదయమే గోడబల్లపైన దుమ్ము చూచు చుండగా, మఱల ద్వారలో కోజెత్తును చూడబోవుచున్నా ననిపించెను. అబ్బా! తమ పిల్లలను సంవత్సరముల పర్యం తము చూడకుండుటెంత తప్పు! బ్రదుకు శాశ్వతము కాద నుట మఱవకూడదు! మేయరెంత మంచివారు! చాల చలి కదా! శాలువైన గప్పికొనినో లేదో! రేపిక్కడ నుందురు కదా? రేపు మహోత్సవము. లేసు టోపీ పెట్టుకొమ్మని రేపుదయము జ్ఞాపకము చేయుము సిస్టర్! మాంట్ఫర్మిల్ పల్లె ప్రదేశము. నడిచి పోతిని. నాకది చాలదూరము. కాని, గుఱ్ఱపు బండి వేగముగా పోవును. కోజెత్తుని పిల్చు కొని రేపాయన యిక్కడుండును! ఇక్కడినుండి మాంట్ఫ ర్మిల్ కెంత దూరము?"

సిస్టర్‌కు తెలియదు. "రేపిక్కడ ఖండితముగ నుందు రని నాకు దోచుచున్నది."

ఫాం: రేపు! రేపు! రేపు నేను కోజెత్తును జూచెదను. ఇప్పుడు చూడు సిస్టర్, నేను బాగుగ నున్నాను. ఉత్సా హము పొంగుచున్నది. కావలెనన్న నాట్యము చేయ గలను.

కాల్గంటకు ముందామెను జూచిన వారికిది యర్థము

కాదు. ఇప్పుడు వికసించిన గులాబివలె నున్నది. సహజ జీవస్వరమున మాటాడుచున్నది. ముఖమంతయు నొక్కటే హాసము. అపుడపుడు తనలో గుసగుసలాడుకొని నవ్వును. తల్లి యానందము పిల్ల యానందము వంటిదే.

సిస్టర్: సరి. నీకు హాయి కల్గినది. ఇంక నా మాట విని, పలుక కుండుము.

ఫాంటైన్ తల దిండుమీద నిడుకొని, మంద్రముగ — "ఆఁ, పండుకొమ్మా. నీ బిడ్డ వచ్చును గాన, ఇంకనైన జాగ్రతగా నుండుము. సిస్టర్ సింప్లిస్ రైటు. ఇక్కడి యందఱు రైటే." అనెను.

పిదప గదలక, తల త్రిప్పక, ఆనందపూర్ణములైన కన్నులు తెరచుకొని నోరు మెదపక పండుకొనెను.

సిస్టర్ దోమతెర వేసి, ఆమె నిద్రించునని యాసపడెను. ఏడెనిమిది గంటల మధ్య డాక్టర్ మఱల వచ్చెను. నిశ్శబ్దతను గాంచి, ఫాంటైన్ నిద్రించుచున్నదనుకొని మునిగాళ్ళ మీద నడిచి లోనికి వెళ్ళెను. దోమతెర తొలగించి, మసక వెల్తురులో విశాల ప్రశాంత నయనములు విప్పి, తనవైపు ఫాంటైన్ చూచుచుండుట కన్గొనెను.

ఫాం: మాంష్యూర్, నా ప్రక్కనే ఒక చిన్న పడక మీద దానిని పండుకోనీరూ?

డాక్టర్ జన్ని ముంచుకున్నదనుకొనెను.

ఫాం: చూడుడు. సరిగా దానికి జాలు చోటున్నది.

డాక్టరు సిస్టర్ సింప్లిస్‌ను బ్రక్కకు పిలిచి ప్రశ్నించెను. మాంష్యూ మాదలిన్ ఒకటి రెండు దినములు

రాడని, ఎక్కడికేగెనో తెలియక రోగి భ్రమను తొలగింప లేదని, ఒకవేళ ఆయన మాంట్ఫెర్మిల్‌కే పోయెనేమో యనియు సిస్టర్ చెప్పెను. డాక్టరిది సరియే యనెను. అతడు ఫాంటైన్‌ను మఱల సమీపించెను.

ఫాం: ఉదయమది లేవగనే, ఆకూనకు గుడ్‌మార్నింగ్ చెప్పవచ్చు. రాత్రులు నేను మేల్కని యున్నపుడు, దాని శ్వాస వినవచ్చు. దాని చిఱుశ్వాస మధురమై నా కారోగ్యము నిచ్చును!

డా: చేయి చూపుడు.

ఫాంటైన్ చేయందిచ్చి నవ్వుచు "ఓ, నాకు బాగైనది, మీ రెఱుగరు! రేపే కోజెత్తు వచ్చును." అనెను.

డాక్టరున కాశ్చర్యము కల్గెను. ఇప్పుడు మేలుగా నున్నది. మాంద్యము తగ్గినది. నాడి బలపడినది. ఒక నూత్న జీవమీ కృశించిన ప్రాణిలో మఱల జైతన్యము కల్పించుచున్నది.

ఫాం: డాక్టర్! మాంష్యూర్ మాదలిన్ నా బిడ్డను తేబోయిరని సిస్టర్ మీతో చెప్పలేదా?

నిశ్శబ్దముగ నుండవలెనని, బాధ కలిగించు ఉద్రేకము పొందగూడదని డాక్టరాదేశించెను. వట్టి క్వైనా నిమ్మని, రాత్రి జ్వరము మఱల వచ్చునేని ఉపశమనమునకింకొక మందు చెప్పి, పోవుచు సిస్టర్‌తో "ఇప్పుడు మేలు. అదృష్టవశాత్తు, మేయర్ రేపా శిశువును దీసికొనివచ్చెనా; ఏమో, అద్భుతమగు నింద్రజాలము జరుగవచ్చు. అధికానందము వ్యాధులు కుదుర్చుట మేము చూచియున్నాము.

ఇది యంగ వ్యాధియని, చాల ముదిఱినదనియు నెఱుగుదు ను ఏమో, అంతయు నిగూఢము! ఈమె బ్రతుకునేమో!'' అని చెప్పెను.

# 7

వ్యానము దారిలో వదలిన బండి అర్రాస్ చేరుసరి కెనిమిది గంటలై యుండును. ఇంతదూరము మనము వెన్నాడిన పురుషుడు హోటలు దగ్గఱ దిగి, పరిచారకుల స్వాగతవాక్యములు నన్యాలోచనతో స్వీకరించి, రెండవ గుఱ్ఱమును బంపివేసి, తెల్లగుఱ్ఱము నశ్వశాలకు దానే తీసికొనిపోయెను. పిదప, మొదటి యంతస్థునందలి యొక బిల్లియర్డు గది ప్రవేశించి కూర్చుండి మోచేతులను టేబులు పైన ఆనించెను. ఆఱు గంటలనుకొన్న యీ ప్రయాణము పదునాల్గు గంటలు పట్టినది. తన తప్పనుకొనుటకు వీలుగానట్లతడు నడుచుకొనెను. హృదయాంతరమున నిది విచారము కల్గించలేదు.

హోటలు యజమానురాలు వచ్చెను. ''తమకు పఱుపు అన్నము కావలెనా?''

వలదని తల యూచెను.

య: అశ్వశాల బాలుడు, మీ గుఱ్ఱము చాల అలసినదనుచున్నాడు.

మా: గుఱ్ఱము రేపుదయము పయనింప జాలదా?

య: ఊహు! దానికి రెండు దినములైన విశ్రాంతి కావలెను.

మా: ఇక్కడ పోస్టాఫీసు లేదా?

య: ఉన్నది.

యజమానురా లక్కడి కతనిని బిల్చుకొని పోయెను. ఆయన తన పాస్‌పోర్టు చూపించి, ఆ రాత్రియే మెయిలు బండిలో మ– కు దిరిగిపోవ వీలు లేదాయని యడిగెను. ఒక సీటే యున్నది. అదియు డ్రైవర్ ప్రక్కన. ఆయన దానికే డబ్బిచ్చెను. "మాంష్యర్, సరిగా ఒంటిగంటకిక్కడ నుండి తీఁజవలెను" అని బుకింగ్ క్లార్కు చెప్పెను.

ఇది కాగానే ఆయన హోటలు వదలి నగరములోనికి నడచెను.

ఆ యూరు పరిచితమైనది కాదు. చీకటి వీధులు. తోచినట్లు పోయెను. అయినను, పట్టుదలతో, దారి నడుగ నట్టి వానివలె గనుపట్టెను. చిన్న నది క్రించాన్‌ను దాటి, ఇఱుకు త్రోవల సుడిలో జిక్కుకొనెను. అప్పుడొక నాగ రకుడు లాంతరు పట్టుకొని వచ్చెను. కొంచెము సందేహించి, యతనితో మాటాడ నిశ్చయించుకొనెను. ఎవరైన వినిపోదు రేమోనని భయపడు వానివలె ఇటు నటు చూచి ప్రశ్నిం చెను. "మాంష్యర్, తెలిసియున్నచో గోర్టు చూపెదరా?"

అతడు వృద్ధుడు. "మీరీ యూరివారు కారు కాబోలు, మంచిది, నాతో రండు. నేను కోర్టుకెదురుగా బోవలెను. కోర్టు మరమ్మత్తు చేయుచున్నారు. కాబట్టి యిప్పుడు సిటీ హాల్‌లో కోర్టు జరుగును."

మా: న్యాయసభ అక్కడనేనా?

వృ: అవును మాంష్యర్! చూచితిరా, నేటి సిటీ హాలు, విప్లవమునకు ముందాచార్య భవనము. మీరు నేడు

విచారణ చూడదలచిన లాభము లేదు. సాధారణముగ ఆఱుగంటలకే సెషన్సు ముగియును.

కాని, వారు సిటీ హాలు సమీపించుసరి కందులో దీపములున్నవి.

వృ: మాంష్యర్, మీరు సరియైన వేళకే వచ్చితిరి. అదృష్టవంతులు. ఆ నాల్గు కిటికీలు కన్పించుటలేదా? అదియే న్యాయసభా స్థానము. అక్కడ దీపము కన్పడుచున్నది. కావున ముగియలేదు. కేసు ముగియకుండుటచే, సాయంకాలపు సెషన్ పెట్టుకొనియుందురు. మీకీ కేసుతో సంబంధమున్నదా? క్రిమినల్ కేసా? మీరు సాక్షులా?

మా: నాకేమియు బని లేదు. వకీలుతో మాట్లాడవలెను. అంతే.

నాగరకుని యుపదేశము ననుసరించి, కొన్ని నిముసముల కొక హాలున ప్రవేశించెను. అక్కడ బలువురుండిరి. అక్కడక్కడ లాయర్ల గుంపులు గుసగుస లాడుచుండిరి. ఈ నల్ల పొడుగు దుస్తులవారు న్యాయసభా ద్వారమున గుమిగూడిరి. తగ్గు గొంతుతో సంభాషించుకొను దృశ్యము, ఎప్పుడును నిరుత్సాహకము. అనుకంపా కారుణ్యములు వారి పల్కులం దరుదు. చాల మట్టుకు వారి పలుకులు పూర్వ నిర్ణీత శిక్షలే.

హాలు విశాలమయ్యు, అందొక దీపమే యుండినది. ఒక మడత తలుపు దీనిని న్యాయసభ నుండి వేర్పఱచుచున్నది. ఆ మసక వెలుతురులో మొగములు స్పష్టముగా

గనబడుటలేదు. కాన తొలుత గన్పడిన లాయరుతో నతడు "మాంష్యర్, ఎట్లున్నది?" అనెను.

లా: ముగిసి పోయినది!

మా: ముగిసి పోయినది!!

పునరుచ్చారణ కంఠమునందలి యుద్విగ్నత గాంచి లాయరు – "క్షమింపుడు, మాంష్యర్! మీరు బందుగులు కాబోలు?" అనెను.

మా: లేదు. నేనింకెవ్వరి నెఱుగను. శిక్ష చెప్పిరా?

లా: ఆహా! వేఱు మార్గమే లేదు.

మా: కఠిన శిక్షయా?

లా: యావజ్జీవము.

వినబడనంత హీనస్వరముతో మాదలిన్ "గుఱుతు పట్టిరా మనిషిని?" అనెను.

లా: గుఱుతేమి? ఏమియు నక్కఱలేక పోయినది. చాల సూటి కేసు. ఈ యాడుది తన బిడ్డను జంపినది. నేరము రుజువయ్యెను. అపరాధ మాలోచించి చేసినట్లు జూరీలు నమ్మలేదు. కావున యావజ్జీవ కారాగారము.

మా: ఐన, ఆడుదా అపరాధి!

లా: అవును. లిమోసిన్ పిల్ల. మీరడిగిన దేది?

మా: ఏదియు లేదు. కాని, కోర్టు ముగిసిన, ఇంకను ఆ దీపము లెందుకు?

లా: ఇంకొక కేసు జరుగుచున్నది. అది ప్రారంభమై రెండు గంటలయ్యెను.

మా: అదేమి కేసు?

లా: అదియు స్పష్టమైనదే. దొంగతనము - రెండవ యపరాధము - దోపిడి. వాని పేరు జ్ఞప్తిలేదు. బందిపోటు దొంగవలెనే కన్పట్టును. ఆ ముఖముననే వానిని గాలీకంప వలె.

మా: మాంష్యర్! హాలులోనికి పోవుటకు వీలుం డునా?

లా: కష్టము. పెద్ద గుంపు కూడినారు. కాని, విశ్రాం తికై విచారణ కొంత పొద్దాపినారు. కొందఱు చూపరులు వెళ్ళిపోయిరి. మఱల ప్రారంభించునపుడు ప్రయత్నింపుడు.

మా: ఎట్లు పోవలె?

లా: ఆ పెద్ద తలుపుగుండా.

లాయరు వెడలిపోయెను. కొన్ని నిముసములలో, ఏక సమయమున ఏకమై, ఎన్నో యుద్రేకములు మాదలిన్‌లో చెలరేగెను. ఉదాసీనుడగు లాయరు మాటలు, మంచు కడ్డీల వలె, అగ్ని జ్వాలలవలె అతని హృదయమును జీల్చుకొని పోయెను. కేసు ముగియలేదని తెలిసి, ఊపిరి సల్పెను. అది తృప్తియో, నొప్పియో చెప్పజాలడు.

అక్కడ గూడిన పలు గుంపుల దగ్గఱజేరి వినెను. సారాంశ మిది: ఆ సంవత్సర చతుర్థమునకు చాల కేసు లుండినవి. జడ్జి, ఆనాటికి రెండు చిన్నవి సూటివియైన కేసు లనే వేసికొన్నాడు. శిశు హత్యాపరాధముతో ప్రారం భించిరి. ఇప్పుడు ద్వితీయాపరాధము చేసినవాని కేసెత్తు కొన్నారు. వాడు కొన్ని పండ్లు దొంగిలించెనట. అది ఖండి తముగా నిరూపింపబడినట్టు లేదు. వాడు టూలన్‌లో గాలీ

బంధనము నందుండినవాడని నిరూపణమైనది. వాని కేసును నాశనము చేసిన దిది. వానిని విచారించుటైనది. సాక్షుల విచారణమైనది. ఇంక డిఫెన్సు ప్రాసిక్యూషన్‌ల ఆర్గ్యుమెంటులే మిగిలినది. అర్ధరాత్రమునకు గాని యిది ముగియదు. వానికి శిక్ష తప్పనట్లున్నది. ప్రాసిక్యూటరు చాల మంచివాడు. శిక్ష వేయింప నెన్నఁడును దప్పినవాడు కాడు. మంచి ప్రతిభావంతుఁడు. కవిత్వము చెప్పును.

కోర్టు గది తలుపు దగ్గఱ ఒక ఆఫీసరు కావలి యుండెను.

మా: మాంష్యూర్, త్వరగా దలుపు తీయుమరా?

ఆ: తెఱవ బడదు.

మా: ఏమి? ఇపుడు విశ్రాంతి కదా? సెషన్ మఱల ప్రారంభించినపుడు తీయరా?

ఆ: ఇప్పుడే ప్రారంభమైనది. తలుపు మఱి తీయ బడదు.

మా: ఏల?

ఆ: హాలు నిండిపోయినది.

మా: ఏమి! ఇంక సీట్లే లేవా?

ఆ: ఒక్కటికూడ లేదు. తలుపు మూసివేసిరి. ఎవరును లోనికి పోలేరు.

కొంతసేపూరకుండి ఆఫీసరు—"మాంష్యూర్ జడ్జి వెనుక ఇంకను రెండు మూడు సీట్లున్నవి. అధికార్లను దప్ప, ఇతరులను నక్కడ గూర్చుండనీయరు." అనెను.

ఇట్లు చెప్పి, ఆఫీసరు ముఖ మటు త్రిప్పుకొనెను.

మాడలిన్ ముందున్న హాలులోనికి వెళ్ళి, తిన్నగా దాపలు దిగి, అడుగడుగున సందేహించుచున్నట్లుండెను. లోన విచారణ జరుగుచుండును. ముందునాటి సాయం కాలమునుండి, లోపల జరుగుచున్న ప్రబల సంఘర్షణ యింకను ముగియలేదు. ప్రతి క్షణమున నేదో క్రొత్తమలుపు కనబడుచున్నది. దాపలు తిరుగుచోట, ఇనుప కడ్డీల కాను కొని చేతులు కట్టుకొనెను. తటాలున, జేబు నోటుబుక్కు తీసి, ఒక కాగితము చింపి, మకమక వెలుతురులో కాగితము మీద "మ-పుర మేయర్ మాంష్యర్ మాడలిన్" అని వ్రాసి త్వరత్వరగా దాపలెక్కి, గుంపులలో దూరి, కావలి యాఫీసరును సమీపించి, కాగితము నిచ్చి సాధికారముగ "దీనిని మాంష్యర్ జడ్జి కిమ్ము" అనెను.

ఆఫీసరు తీసికొని, చదివి, లోన కేగెను.

# 8

అతనికి దెలియకయే మాంష్యర్ మాడలిన్ ప్రసిద్ధి చుట్టు ప్రక్కల ప్రాకియుండినది. ఐదేండ్లుగా నతని యశస్సు పరిసరములలో బ్రసరించెను. ఆ గాజుల యుత్పత్తి నభివృద్ధి చేసి, ఆ యూరి కార్మికులకు, బ్రజలకు ఎన్నో సేవలు చేయుటే కాక, ఆ జిల్లా యందలి నూట నలువదియొక్క యుపమండలములలో బ్రతి దానికిని నేదో యొక మేలు చేసియే యున్నాడు. ఇతర మండల పరిశ్రమలకును తన హోదా ధనముల యూతనిచ్చినాడు. ఎల్లెడల మాంష్యర్ మాడలిన్ నామము గౌరవాకరమై యుండినది. అర్రాస్,

డువాయ్ పురములు, మాదలిన్ వంటి మేయరును నోచు కొన్న మ-పురమును జూచి యసూయాన్వితములయ్యెను.

ఈ చతుర్థమున అర్రాస్ న్యాయ సభాధ్యక్షుడు, డువాయ్ రాయల్ కోర్టు జడ్జి. అందఱవలె నతడును మాంష్యర్ మాదలిన్ నామము నెఱిగి గౌరవించువాడే. "ఈపెద్దమనుష్యుడు విచారణచూడవలెననుచున్నాడు" అని కావలి యాఫీసరిచ్చిన కాగితమును పరిశీలించిన వెంటనే జడ్జి, సాదరముగ కాగితము మీద ఏమో వ్రాసి యాఫీసరు కిచ్చి "రానిమ్ము." అనెను.

ఆ దుఃఖజీవి, తలుపుకడ, ఆఫీసరు వెళ్ళినప్పుడున్న చోట, అదే వైఖరితో నిల్చుకొనియుండెను. "నా వెంట వచ్చి మాంష్యర్ మన్నించునా?" యను అతి వినయవాక్య మాతని యాలోచనలను జెదఱగొట్టెను. ఒక నిముసము నకు ముందు విముఖుడైన యాఫీసరే యిప్పుడు నేల సాగిల బడుచున్నవాడు. ఆఫీసరు కాగితము నిచ్చెను. విప్పి చదువును గదా-"మాంష్యర్ మాదలిన్‌కు న్యాయసభాధ్యక్షుని వందన పురస్సర స్వాగతము." అని యున్నది.

కాగితమును నలిపి వేసెను. ఆ పదములు వింతయగు వేదన గొలిపెనా!

ఆఫీసరు వెంట నడిచి, నిముసములో మైనపు వత్తులతో ప్రకాశితమగు చిన్న గది ప్రవేశించెను. "మాంష్యర్, ఇది యాలోచనా మందిరము. ఆ తలుపునున్న యిత్తడి పిడి త్రిప్పిన కోర్టు గదిలో, జడ్జి కుర్చీ వెనుక నుందురు." ఈ

పదములు, తానింతకు ముందు గడచిన యినుప వరాండా తాపల నస్పష్ట స్మృతిలో గలసెను.

ఆఫీసరు తన్నొంటరిగా విడిచిపోయెను. పరిష్కారక క్షణము వచ్చినది. చెదఱిపోవుచున్న యాలోచనలను కూడగట్టుకొన ప్రయత్నించి విఫలుడయ్యెను. జీవితమునందలి నిశితవాస్తవములను బట్టుకొనవలసిన తీవ్రావసరము వచ్చిన సమయములలో, ఆలోచనా తంతువు తెగిపోవును. ఎక్కడ న్యాయపతులు పర్యాలోచించి తీర్మానమునకు వత్తురో, ఆ స్థలముననే తానుండెను. ఆ నిశ్శబ్ద భయంకర ప్రదేశమున ఎన్ని జీవితములకో 'అల్బిదాయో' పాడబడినది. అక్కడ ద్వరలో తన చర్చ వచ్చును. విధి యాక్షణమున నా చర్చకు దారి తీయుచున్నది. ఈ ప్రదేశ మిట్టిదా, ఇక్కడ నేను న్నానా యని గోడలను దనను బరికించి చూచుకొనెను.

ఇరువదినాల్గు గంటలనుండి పస్తు. బండి యదురు దేహమును పగులగొట్టినది. ఇది యతనికి దోచలేదు. అప్పు డతడు ఫాంబైన్, కోజెత్తులను గుఱించి చింతించుచుండెను.

ఆలోచనాధీనుడై యుండియు, తనకే తెలియక, కన్నులి త్తడి పిడివంక తిరిగెను. తానా తలుపు సంగతియే మఱచిపోయెను. మొదట ప్రశాంతముగ నుండిన ముఖవైఖరి యిపుడు మాఱెను. పిడిమీది చూపు స్థిరమై, ఉద్విగ్నమై క్రమక్రమముగా భయభ్రాంతమయ్యెను. తలలో బుట్టి స్వేద బిందువులు కణతలపైకి జాఱెను.

ఒకసారి, తిరుగుబాటుతో గూడిన యధికారమును వెల్లడించునట్టి యవర్ణ్యవిన్యాసమాతని దేహమంతయు నావ

హించెను. దాని యర్థమిది: "సరి. నన్ను బలవంతము సేయువారెవరు?" పిదప సరభసముగ వెనుదిరిగి, వచ్చిన తలుపు తెఱచి వెలికుఱికెను. అతడు వెళ్ళిన దిది వఱకే తాను కడచి వచ్చి వరాండాలోనికి. అక్కడ ఊపిరి పుచ్చుకొని వినెను. ముందు వెనుకలనంతయు నిశ్శబ్దము. తరుమబడిన వానివలె బరుగిడి యక్కడికి వచ్చినాడు.

ఆ వరాండాలోని పలు మలుపులను రెండుసార్లు చుట్టి యతడు మఱల వినెను. అదే నిశ్శబ్దత, తన్ను వీడని నీడ. అతని కూపిరాడలేదు. దేహమూగిపోవ గోడ కానుకొని చేరబడెను. ఆ రాతిగోడ జిల్లుమని యున్నది. ఫాలముమీది స్వేదమును హిమశీతలమైయున్నది. కంపించుచు శరీరమును లేవదీసెను.

అక్కడ నప్పుడేకాకియై, చీకటిలో నిల్చుకొని, చలి చేతను మఱి దేనిచేతనో వడకుచు బునరాలోచన చేసెను.

రాత్రియంతయు, బగలంతయు నాలోచించియుండెను. ఇప్పుడొక్కటే స్వరము వినిపించుచున్నది – "అయ్యో!" యని.

కాలంట యిట్లు కడచిపోయెను. తుదకాతడు దల వంచి, యతి పరితప్త నిశ్వాసము విడిచి, చేతులు వ్రేల వెనుదిరిగెను. మెల్లగా, గొండపై బడ విడిపించుకొని బయటబడిన వానివలె నడచెను. పాఱిపోయి పట్టువడిన వానివలె నుండెను.

మఱల నాలోచనామందిరము బ్రవేశించెను. మొట్ట

మొదట చూచిన దిత్తడి పిడినే. గుండ్రనై, మెఱుగు పెట్టిన యా పిడి తళతళలాడుచు నశుభ నక్షత్రమువలె గన్పట్టినది. మేక పులికన్నును చూచినట్లతడు ఆ పిడిని జూచెను. కనులు దాని నుండి మఱలవు. ఉండి యుండి యొకొక్కడుగు వేయును.

తటాలున, ఎట్లో తానే యెఱుగక, తలుపు దగ్గర నున్నట్లు తెలిసికొని, పిడిని ప్రకంపితహస్తముతో ద్రిప్పెను. తలుపు తెఱచుకొన్నది. ఆయన కోర్టు గదిలో నుండెను.

# 9

ఒక్కడుగు ముందుకువైచి, తలుపు మూసివైచి, యంత్రము వలె నిల్చుండి, తాను జూచిచుండిన దాని నాకళించుచుండెను. అది పెద్ద హాలు. మంద ప్రకాశము. కొంత ప్రొద్దు నిశ్శబ్దము. కొంత ప్రొద్దు కలకలము. అపరాధ విచారణా పరికరములన్నియు ప్రదర్శింపబడియుండినవి. ఆ పరికరములలో అల్పత్వము, భయావహ గాంభీర్యము కూడి యున్నవి. అక్కడ జేరిన చూపరులు, లాయర్లు, న్యాయపతులు, పరికరములు-అన్నియు కాఠిన్య పావిత్ర్యములను భావన కల్గించును. చట్టమనబడు గొప్ప మానవసృష్టి సాన్నిధ్యమును, పరమదివ్యమగు న్యాయ(ధర్మ)సాన్నిధ్యమును నచ్చట బొడ కట్టును.

ఆ గుంపులో నెవ్వరును నాతనిని గమనించలేదు. జడ్జికెడమ ప్రక్కగా, నొక కొయ్య బెంచీమీద, ఇరుప్రక్కల

నిద్దరు భటులు కావలి కాయ - గూర్చున్నవానినే యన్ని కన్నులును జూచుచుండినవి.

ఇతడే యామనుష్యుడు. మాదలిన్ వెదుకకయే, యతనిని జూచెను. సహజముగనే, అతని నిదివఱకెఱిగియున్నట్లు కన్నులతని దెస వెడలెను.

తన్ను దానే చూచినట్లు తోచెను. వయస్సు కొంత యెక్కువ, ముఖలక్షణము లచ్చముగా నొకటే కావు. కాని, వైఖరీభావము లొక్కటే. ఆ చింపిఱి తల, చంచల భయానక నేత్రములు, సరిగా దాను • డి-పురము జొచ్చిననాడు వేసికొన్నట్టి దానివలెనేయున్న బ్లౌజు, అంతయు నొకటే. ఆ నాడు ద్వేషపూరితుడై, గాలీలలో పందొమ్మిదేండ్లు కూర్చిన వికృతభయంకరాలోచనతో దాను నిండియుండెను. అదిఱిపడి "పరమేశ్వరా! మఱల నీ గతికి వత్తునా?" యని క్షోభించి పోయెను.

ఈ మానవుడఱువదేండ్ల వానివలె నుండెను. ఆ యాకారమునందేదో మోటుదనము, జడత్వము, అతి భయము - ఇట్టిదన రాకుండెను.

తలుపు మూసిన సవ్వడి విని, జనులు దారి విడిచి ప్రక్కకు దొలగిరి. జడ్జి తల త్రిప్పి, వచ్చినవాడు మ-మేయరనుకొని, నమస్కరించెను. తన డ్యూటీ నిమిత్తమె యెన్నిసారులో మ-కు పోయియుండిన ప్రాసిక్యూటరు మాదలిన్‌ను గుఱుతించి నమస్కరించెను. ఆయన వారిని జూడనే లేదు. భ్రమకు జిక్కి, విచ్చుకనులతో చుట్టుప్రక్కల గలయజూచెను.

క్రూరోత్సుకులైన జడ్జీలు, గుమాస్తాలు, ప్రేక్షక తండములు - ఇరువదేడేండ్లకు ముందిది యంతయు జూచి యుండెను. మఱల నీ భయంకర వాతావరణమున బడవలసి వచ్చెనే! తన యెదుట వారు కదలుచున్నారు, సజీవులై యున్నారు. తన జ్ఞాపకశక్తివలన బుట్టినది కాదిది. భావన యందలి మృగతృష్ణ కాదు. నిక్కమైన మనుష్యులు - కండలు, ఎముకలు. గత పైశాచిక దృశ్యములన్నియు మఱలి వచ్చి, భయంకర వాస్తవికత దాల్చి, తన చుట్టును జీవించుచున్నవి. ఇదియంతయు దన యెదుట ఆవులించు చున్నది. మహా భయతాడితుడై కనులు మూసికొని ఆత్మాంతరాంతరముల నుండి 'వలదు' అని కుయ్యిడెను.

ఏమి యీ విషాదకర విధి విలాసము! తన యభిప్రాయ ముల నన్నిటిని గల్లోలపఱచి, పిచ్చి పట్టించుచున్నది. తన యెదుట తన ప్రతిని నిల్పినది. ఈ విచారణకు నిలచిన వాని నందఱును జాన్ వాల్జా యనుచున్నారు!

తన కన్నుల యెదుట నొక యశ్రుతపూర్వ స్వప్న దృశ్యము నడుచుచున్నది. తన జీవితమునందలి యత్యంత ఘోర సమయప్రదర్శనమే యది. తన ఛాయ దాని నాడు చున్నది.

అన్నియు, ప్రతి విషయమును ఇందున్నది. అదే పరిక రములు, రాత్రివేళ నదే గంట, న్యాయపతి, ఉపన్యాయ పతులు, భటులు, ప్రేక్షకులు. కాని, జడ్జి తలమీదుగా సిలువ యున్నది. తన శిక్ష నాటికి కోర్టు రూములలో సిలువ

యుండెడిది కాదు. తన విచారణ సమయమున నీశ్వరు డక్కడ లేదు.

తన వెనుక నొక కుర్చీ యుండినది. ఎవరైన జూతు రేమో యను భయమున నందు కూలబడెను. కూర్చున్న పుడు, జడ్జి బల్లపై నుండిన కాగితముల కట్ట మఱుగున ముఖము దాచుకొనెను. ఇప్పుడు చూడబడక చూడ వచ్చును. పూర్ణముగ వాస్తవికతను గ్రహించెను. క్రమ ముగా జిత్త స్వాస్థ్యము గాంచి, వినుట కవసరమైనంత శాంతి పొందెను.

మాంప్యర్ బమటాబొ జూరర్లలో నొకడు.

జేవర్ కొఱకు బరికించెను. అతడు కనుపట్టలేదు. సాక్షుల సీటు, గుమాస్తాల టేబులు వెనుకనుండి కనపడ లేదు. ఇన్నిటికి దోడు, హాలులోని దీపము లుజ్జ్వలములు కావు.

ఆయన ప్రవేశించుసరికి, నేరారోపితుని వకీలు తన వాదము ముగించుచుండెను. చూపరుల కుతూహలము మితి మీఱి యుండెను. అప్పటికి మూడు గంటలనుండి విచారణ జరుగుచుండినది. ఈ మూడు గంటలనుండి యపరిచితుడు, అభాగ్యుడు, శుద్ధ మందబుద్ధి, లేదా కడు జిత్తులమాఱియు నైన యొకడు, ఒక భయంకర సంభావ్య భారము క్రింద నడుగంటుచుండుటను చూపరు లీక్షించుచుండిరి. ఈ మనుష్యుడొక ద్రిమ్మరి. ఒక మైదానమునందు బంధింప బడెను. అప్పుడతనిచేత ఆపుల్ పండ్లతో నిండిన కొమ్మ యుండినది. ఆ కొమ్మ, అక్కడికి సమీపమునందలి యింటి

తోటలోని చెట్టునుండి వింపబడినది. ఎవడీ మనుష్యుడు? పరిశీలన జరిగెను. సాక్షులను విచారించిరి. వారందఱేక గ్రీవులు. ప్రతి విచారణ భాగమునుండియు సత్యమును కనుగొనిరి.

ప్రాసిక్యూటరన్నాడు: "మనమిప్పుడు చూచుచున్న వీడు పట్టి పండ్లదొంగ కాడు. వీడు బందిపోటు దొంగ. శాసన బహిష్కృతుడు. ఆ బహిష్కారమును ధిక్కరించిన వాడు. మహాపాయకర పాపి, జాన్ వాల్జా. వీనికొఱకై చట్టము వెదకుచుండినది. టూలన్ గాలీలనుండి యెనిమిదేండ్లనాడు విడువబడి, వెంటనే పెటీగెర్వాయను యువకుని నుండి యాయుధపాణియై, దోపిడి చేసెను. న్యాయసభా మూలమున వీడు జాన్ వాల్జాయని నిరూపణ జరుగగనే యా దోపిడి నేరము విచారణకు వచ్చును. ఇప్పుడీ క్రొత్త యపరాధమునకు శిక్షింపుడు. ఇకమీద ప్రాత నేరమును విచారణ సేయుదము." ఈ నిందను, సాక్షుల యేకాభిప్రాయమును విని నిందితు డాశ్చర్యమును ప్రకటించెను. అతని యంగవిన్యాసము లనంగీకార్యము సూచించెను. కష్టముతో మాటాడి, తబ్బిబ్బై జవాబు లిచ్చెను. కాని, దేహమాపాదమస్తకమా నింద నంగీకరించకున్నది. తన్నెదిరించుచుండిన యీ ధీమంతుల యెదుట జడబుద్ధివలె,దన్ను బంధించిన ఈ సంఘమధ్యమున నితరునివలె గన్పట్టెను. అట్లయ్యు భవిష్యత్తు బెదరించుచున్నది. నిమిష నిమిషమునకును సంభావ్యము లధికము కాజొచ్చినవి. అనుక్షణ నిశ్చితమై అతనిపై బడనున్న శిక్షకు నతనికంటె నుద్విగ్నుడై ప్రతి

ప్రేక్షకుడును నిరీక్షించుచున్నట్లుండెను. జాన్ వాల్జాయని నిరూపింపబడి, పెటీగెర్వాను దోచుట స్థిరపడెనేని, గాలీ లెందుకు? ఉరిశిక్షయే. ఈ మనుష్యుడెవడు? ఇతడు జాల దెలివి గలవాడా, కేవల మందబుద్ధియా? ఇది బుద్ధి జాడ్యమా, అభినయమా? ఇతని యుదాసీనతా స్వభావ మెట్టిది? ఈ ప్రశ్నలకు ప్రేక్షకులు భిన్నాభిప్రాయులై యుండిరి. జూరర్ల కవి కొరకరాకుండెను. ఈ విచారణయం దేదో భయంకరత్వము, నిగూఢత్వము నున్నవి. ఇది విషాద నాటకమే కాదు, దురవగాహమును.

# 10

కేసు ముగింపవలసిన వేళ వచ్చినది. జడ్జి నిందితుని లేవ నాజ్ఞాపించి సాధారణ ప్రశ్న వేసెను. "నీ పరముగ ఏమైన చెప్పుకొందువా?"

ఆ మనుష్యుడు నిల్చుండి, గలీజు టోపీని బుర్రత్రిప్పుచు విననట్లుండెను. జడ్జి మఱల అదే ప్రశ్నడిగెను.

ఈసారి విని యర్థము చేసికొన్నట్లా మనుష్యుడు కన్పట్టెను. నిదురనుండి లేచినవానివలె అదిఱిపడి, చుట్టును బరికించి, ప్రేక్షకులను, భటులను, వకీళ్ళను, జూరర్లను, కోర్టును - అందఱను చూచి, యెదుటి బోను దూలముపైన పెద్ద పిడికిలి నిడి, మఱల నన్నిదిక్కుల జూచి, ప్రాసిక్యూటరు మీద జూపు నిలిపి మాటాడసాగెను. అదియొక పొంగువలె నుండెను. పెదవులనుండి పదములు పడు విధానము చూడగా బరస్పర సంబంధములేక, వేగముతో ద్రోసికొని, ఒండొం

టిని రభసముతో నొఱసికొని, యన్నియు నొక్కసారి వెలికుఱుక వచ్చినట్లుండెను.

"ఇంతే చెప్పవలసినది: పారిస్‌లో, మాంష్యర్ బలూప్ కడ, బండ్లు చేయువాడుగ నుంటిని. బండ్లు చేయువారి పని యెప్పుడును బయళ్ళలోనే. యజమానులు మంచివా రైనచో, గుడిసెలలో బని చేయనిత్తురు. శీతకాలపు జలికి, వేడి పుట్టవలెనని చేతులు కొట్టుకొందుము. యజమాను లందుకంగీకరించరు. అది కాలహరణమట. రస్తాలో మంచు కురియునపుడు ఇనుముపట్టి పనిచేయుట కష్టము. అది మను ష్యుని ద్వరలో బీల్చివేయును. నాకేబది మూడేండ్లు. చాల జబ్బుకూడ. తోడి పనివాండ్రు చెడ్డవారు. యౌవనము కడ చిన నిర్భాగ్యుని ముసలి గూబయని, ముసలి పశువని యందురు! నా సంపాద్యము దినమునకు బదునైదు పెన్నీలే. నా వయస్సాధారము చేసికొని, సాధ్యమైనంత తక్కువ కూలినే యజమాను లిచ్చుచుండిరి. నాకు గూతురుండెను. అమె నది దగ్గఱ బట్టలుతికెడిది. ఆమెయు గొంత సంపా దించెడిది. ఏదో యిద్దరి పొట్టలెట్లో నిండెడివి. ఆమె పనియు జాల కష్టమే. పగలంతయు నడుముల లోతు నీళ్ళలో - వాన కాని, మంచు కాని, చలిగాలి కోయనీ, బట్టలేమో ఉదకవలసినదే. చాలినన్ని బట్టలు లేనివారు కాచుకొని యుందురు. ఉదుకనిచో వాడుకలు పోవును. తొట్టె సమ ముగా నుండవు. నీళ్ళంతయు బైన బడును. దానిచే నాని పోవును. ఆమె లాండ్రీలోకూడ ఉదికెడిది. అక్కడ కొళాయీ లుండును. నడుము లోతు నీళ్ళలో నిలువ బనిలేదు. పై

కప్పును నుండును. కావున నంత చలియుండదు. కాని, అక్కడ నుపయోగించు కారపునీళ్లు మిగుల జెడ్డవి. కండ్లను నాశనము చేయును. రాత్రి యేడు గంటలకు అలసి వచ్చి వెంటనే పడి నిద్రపోవును. ఆమె మగడు కొట్టెడివాడు. చనిపోయినది. మాకు సుఖమే లేదు, మంచి బిడ్డ. డాన్సుల కెప్పుడును బోదు. మేదకురాలు. ఒక పండుగునా డెనిమిది గంటల రాత్రికే నిద్రపోయెను. సత్యము!నిజమా కాదాయని యడిగి తెలిసికొనుడు. అడుగుడు! ఎంత మతిమాలినవాడను! పారిస్ సముద్రము. ఫాదర్ చాంప్మతు నెఱిగినవారెవ రున్నారు? కాని, మాంష్యూర్ బలూప్ కలడు. పోయి యత నిని చూడుడు. మీకింకేమి కావలెనో యెఱుగను.''

ఆ మనుష్యుడు మాటలు చాలించెను గాని, కూర్చుండలేదు. గట్టిగా, త్వర త్వరగా, బొంగురుతో, మోటుగా, గొంతులోనే ఒక విధమైన కోపముతో, నాట విడునివలె సూటిగ నీ వాక్యములన్నియు బలికెను. ఒకసారి యాగి, ప్రేక్షకులలో నెవరికో నమస్కరించెను. తోచి నట్లతడు విసరిన సిద్ధాంతములు, వెక్కిళ్లవలె వచ్చెను. ఒక్కొక్క దానికిని గట్టెలు కొట్టినట్టి విన్యాసమును జత పఱచెను. అతడు ముగింపగనే, ప్రేక్షకులు నవ్వసాగిరి. వారిని జూచి, నవ్వుచుండుట పొడగని, ఎందుకో తెలియక తానును నవ్వసాగెను.

అది దుశ్శకునము. నెమ్మది కలవాడు, దయాళువు నైన జడ్జి గొంతెత్తి పలికెను.

అపరాధిని బంధ్లు చేయుటకు పారిస్‌లో నియోగించి

యుండిన మాంప్యర్ బలూప్‌కు సమన్లు పంపినను అతడు రాలేదని జూరర్లకు జడ్జీ తెలిపెను. బలూప్ దివాలా తీసి యెచ్చటికో పోయెనట. అతని పోబడి తెలియలేదు. పిదప, నిందితుని దిక్కు తిరిగి, తన మాటలు జాగ్రతగా వినుమని, ఇట్లు చెప్పెను: "నీవున్న స్థితి ఆలోచింపదగినది. మహా ఘోరమైన యూహలు నీపై బడియున్నవి. దాని పర్యవసానము ప్రమాదకరము కావచ్చు. బంధితుడా! నీ తఱపున మఱల నిన్నొకసారి ప్రశ్నించుచున్నాను. ఈ రెండంశములను వివరింపుము. గోడ దాటి ఆ యింటి తోటకొచ్చి, కొమ్మకొట్టి పండ్లు దొంగిలించితివా లేదా? విడుదలైన గాలీ ఖైదీ జాన్ వాల్జా నీవగుదువా కాదా?"

చక్కగా అర్థము చేసికొన్నవానివలె బంధితుడు తల పంకించి, న్యాయసభాధ్యక్షుని వైపు తిరిగి "అసలు, మొదట—" అనెను. పిదప టోపీని పైకప్పును జూచి మౌనము వహించెను.

కఠిన స్వరమున ప్రాసిక్యూటరిట్లు నుడివెను: "బంధితుడా! సావధానుడవై వినుము. నిన్నడిగినదాని కొక్కటికైన నీవు బదులు చెప్పలేదు. నీ యదుఱుడు నిన్ను బట్టి యిచ్చుచున్నది. నీ పేరు చాంప్మతు కాదని, పూర్వపు ఖైదీ జాన్ వాల్జాయని, తల్లి పేరు వహించి జాన్ మతు అని కొన్నాళ్ళు దాగియుంటివని, ఆవర్న్‌లో నివసించుచుంటివని, నీ జన్మస్థానము ఫేవరోల్ అని, నీవు పొదలు కత్తిరించువాడవని స్పష్టమగుచున్నది. ఆ తోట గోడదాటి పండ్లు దొంగిలించితివనుట స్పష్టము. జూరర్లీ సంగతి నిర్ణయింతురు."

నిందితు డెట్టకేలకు గూర్చొని యుండెను. ప్రాసి క్యూటరు ముగింపగా, దటాలున అతడు లేచి యిట్లనెను: “నీవు మిగుల జెడ్డవాడవు. నిన్నే నేననుట. నేను చెప్పదలచు కొన్నది, మొదట జెప్పలేకపోతిని. నేనేమియు దొంగిలింప లేదు. దినమును దినుటకైన నేమియు లేనివాడను. నేను త్రోవలో పోవుచుంటిని. వర్షము పడి నేలయంతయు బుఱదయై గుంతలనుండి నీళ్ళు పొర్లి పాఱుచుండినవి. రోడ్డు ప్రక్కల గడ్డిమొక్కలు తలలెత్తుచుండినవి. ఇంకేమియు లేదు. పండ్లతోడి కొమ్మ రస్తాలో బడియుండగజూచి తీసి కొంటిని. అది యెంత బాధించునో నాకప్పుడు తెలియదు. మూడు నెలలనుండి జెయిలులో నున్నాను. ఎక్కడెక్కడనో త్రిప్పిరి. ఇంతకంటె నేమియు చెప్పలేను. నామీద నేమేమో చెప్పి జవాబిమ్మందురు. ఈ భటుడు మంచివాడు. ప్రేలితో బొడిచి జవాబు చెప్పుమనును. నేనేమీ వివరించలేను. నాకు జదువు రాదు. బీదవాడను. నేను దొంగిలించలేదని తెలిసికో లేక పోవుట మీ తప్పు. త్రోవలో బడియుండినదానిని తీసి కొంటిని. జాన్ వాల్జా యందురు. జాన్ మతు అందురు. అట్టి వాళ్ళెవరును నాకు దెలియదు. వారు పల్లెవారైయుందురు. నేను మాంప్యర్ బలూప్ దగ్గఱ బనిచేసితిని. నా పేరు చాంప్మతు. నా జన్మస్థానము తెలిసికొనిన మీరు చాల బుద్ధిమంతులై యుండవలెను. నాకే తెలియదు. అందఱకు బుట్టుట కిండ్లుండవు. ఇండ్లున్న ననుకూలమే. నా తలిదండ్రులు త్రిమ్మరులట. నాకు దెలియదు. నేను పసిబిడ్డగా నున్నపుడు కున్నివాడనుచుండిరి. ఇప్పుడు ముసలివాడందురు. అవే నామ

కరణపు జేర్లు. మీ ఇష్టము వచ్చినట్లనుకొనుడు. ఆవర్నులో ఉంటిని. ఫేవరొల్ లో ఉంటిని. గాలీలలో ఉండకయే ఆ యూర్లలో నుండుటకు వీలులేదా? ఔ తమాషా! ఇదిగో చెప్పుచున్నాను - నేను దొంగిలింపనే లేదు. నేను ఫాదర్ చాంప్మతును. నేను మాంష్యర్ బలూప్ కడబని చేసితిని. అతని యింటిలోనే యుంటిని. అంతములేని మీ తెలివిమాలిన మాటలు నన్ను విసుగెత్తించినవి. ఎందుకందఱును పిచ్చి కుక్కలవలె నా వెంట బడినారు?''

ప్రాసిక్యూటరింకను నిల్చుకొనియే యుండి, జడ్జీ కిట్లు విన్నవించెను: "నిందితుడు చమత్కారముగ కళవళముతో సత్యమును గప్పివేయుచున్నాడు. జడునివలె గన్పట్టవలెనని వాని ప్రయత్నము. నెగ్గలేదు. మేము నెగ్గనీయము. ఈ పరిస్థితులలో, ఖైదీలగు బ్రెవీ, కొచెపెల్, చెనిల్డోలను, ఇన్స్పెక్టర్ జేవర్ను మఱల బిలిపించి, ప్రశ్నించి, వీడు జాన్ వాల్జాయేనా యని పరిశీలింపవలెనని ప్రార్థించుచున్నాను."

"ఇన్స్పెక్టర్ జేవర్, తన సాక్ష్యము ముగియగనే, ఉద్యోగ ధర్మముపై వేఱొక చోటికి కోర్టువారి యనుజ్ఞ గైకొని వెళ్ళినాడు. దీనికి ప్రాసిక్యూటరు, నిందితుని వకీలును ననుమతించిరి.'' అని న్యాయసభాపతి బదులు చెప్పెను.

ప్రా: ఔను. మాంష్యర్ జేవర్ను బిలిపింప వీలు కానపుడు, అతని వాఙ్మూలమును జూరర్లకు జదివి వినిపించుట నా ధర్మము. జేవర్ మర్యాదగలవాడు, తన స్థానమునకు గౌరవమును దెచ్చినవాడు. విషయములను దీక్షముగ, సుఱుకుగ గనుగొనును. అతని వాఙ్మూలమిది: 'నిందితుని

నిరసనము ప్రతిఘటించుటకెట్టి నైతిక సూత్రములు కాని, వాస్తవిక నిరూపణలు కాని అవసరము లేదు. నిస్సందేహముగ వీనిని గుర్తించితిని. వీని పేరు చాంపత్యు కాదు. వీడు ఖైదీ జాన్ వాల్జా. గట్టి పిండము. భయంకరుడు. అధికారుల కిష్టము లేకున్నను, వాని శిక్ష ముగియగా విడుదల చేయవలసి వచ్చినది. ఇల్లు దోపిడికి, నాలుగైదుసార్లు తప్పించుకొన జూచినందులకు బందొమ్మిదేండ్లు కఠినశిక్ష అనుభవించినాడు. పెటీగెర్వాను దోచి, పండ్లు దొంగిలించుటే కాక, స్వర్గీయ డి-పురాచార్యు నింటను దోపిడి చేసినాడని తోచుచున్నది. టూలన్‌లో, గాలీల రక్షణయందున్నపుడు వీనిని పలుమారు చూచియుంటిని. నిస్సందేహముగ వీనిని గుర్తించితిని!' ''

ఇంత స్పష్టమగు వాఙ్మూలము ప్రేక్షకులలో జూరర్లలో దృఢాభిప్రాయములు కలిగించెను. జేవర్ లేడు కావున, ఆ ముగ్గురు ఖైదీలను బునఃప్రశ్న చేయవలెనని ప్రాసిక్యూటరు పట్టుపట్టెను. జడ్జి యుత్తరువు మేఱకొక నిముసములో, రక్షకభటుని వెంట బ్రెవీ కోర్టులోనికి వచ్చెను. ప్రేక్షకులూపిరి సలుపకుండిరి. అందఱి గుండెలొక్క- జీవుని పైనన్లేకగతిని స్పందించుచుండెను.

జ: బ్రెవీ, నీవు దుర్యశము తెచ్చు శిక్షననుభవించినవాడవు. ప్రమాణము చేయుట కర్హుడవు కావు.

బ్రెవీ తల వంచుకొనెను.

జ: అయినను, చట్టముచేత శిక్షింపబడినవాని యందును, దైవకృపయున్నచో, గౌరవ న్యాయభావవ

లుండవచ్చు. అవి నీలో నింకను ఉన్నచో, నొక నిముస మాలోచింపుము. ఈ మనుష్యుని జూడు. నీ మాటయొక్క టితనిని నాశము చేయవచ్చు. లేదా న్యాయమును వెల్ల డింపవచ్చు. ఇది పవిత్ర సమయము. సరియని తోచినచో, నిప్పటికైన వెనుక చెప్పిన మాటలు తప్పనవచ్చు. నింది తుడా, లెమ్ము. బ్రెవీ, అతనిని సరిగా పరిశీలింపుము. నీ స్మృతిని, ఆత్మను, అంతరంగమును పరీక్షించి చూడు. ఈ మనుష్యుడు గాలీలలో నీకు సహచరుడుగ నుండిన జాన్ వాల్జాయేనా?

బ్రెవీ బంధితుని జూచి, కోర్టువైపు తిరిగెను.

"ఔను, యువరానర్! వీనిని మొట్టమొదట నేనే గుర్తించితిని. ఇప్పుడును గుర్తించుచున్నాను. ఈ మను ష్యుడు జాన్ వాల్జా. 1796 లో టూలన్‌కు వచ్చి, 1815లో విడుదల పొందెను. తరువాత నేడాదికి నేను విడువబడితిని. ఇప్పుడు బుద్ధిలేని పశువువలె నున్నాడు. వయస్సల్లు చేసి యుండవచ్చును. గాలీలో నున్నపుడు భయంకరుడు. వీడే జాన్ వాల్జా. నిజము."

జ: కూర్చుండుము. బంధితుడా, నీవు నిలచియే యుండు.

అప్పుడు చెనిల్డో వచ్చెను. అతడు యావజ్జీవపు ఖైదీ. జడ్జి, అచ్చముగా బ్రెవీకి చెప్పిన మాటలే యితనికిని జెప్పి, నిజము పలుకుమనెను. చెనిల్డో తల పైకెత్తి ప్రేక్షకుల నందఱను జూచెను. పిదప, పకపక నవ్వి "ఓహో! గుర్తిం తునా! ఐదేండ్లొక్క గొలుసుతోనే మమ్ముల నిద్దరను గట్టి

యుండిరి. నామీద గోపమా, మిత్రుడా!'' అని పరిహాస మాడెను.

జ: కూర్చుండుము.

అప్పుడు కొచెపెల్‌ను బిల్చుకొని వచ్చిరి. నిందితుని కంటె దక్కువ వికారమైనవాడు కాడు. మఱి, యెక్కుడు మందబుద్ధివలె గన్పట్టెను. ప్రకృతిచే గ్రూరమృగములుగ జేయబడి, సంఘముచే గాలీబానిసలుగ దుదముట్టింపబడు నిర్భాగ్యులలో నితడొకడు.

ఉపేక్షకు దావీయని కరుణావచనములతో, ఇతరుల నడిగినట్లే న్యాయసభాపతి ;''నిస్సంశయముగ గష్టములేక, యీ మనుష్యుని గుర్తించితివా?'' అని యడిగెను.

''వీడు జాన్ వాల్జా. వీనినే జాన్ జాక్ అనుచుంటిమి. అంత బలశాలి'' అని కొచెపెల్ పలికెను.

వారి సంశయరహిత వాక్యములలో వంచన లేకుం డుట స్పష్టము. నమ్మకముండుట నిజము. అవి ప్రేక్షకులలో నశుభసూచకమగు గొణుగును బుట్టించెను. రుజువు బల పడు కొలదియు దాని వేగమును, నిలుకడయు నధికము కాజొచ్చెను. బంధితుడును ఆశ్చర్యముతో వినెను. అది యభినయమని, అదియే యతని రక్షణ సాధనమని వ్రాసి కొన్యాటరభిప్రాయపడెను. మొదటివాడు గుర్తింపగనే, బంధి తుడు ''ఆఁ, సరి! వారిలో నొకడు!'' అనెనని వినిన రక్షక భటులు చెప్పుదురు. రెండవవాడు గుర్తింప, యింకను గట్టి గొంతుతో, దృప్తిపడిన వానివలె ''మంచిది!'' అనెనట. మూడవసారి ''అద్భుతము!'' అని లొట్టవేసెనట.

జడ్జి: బంధితుడా, వింటివి కదా, ఏమి చెప్పెదువు?

చాం: అద్భుతమందును!

ప్రేక్షకులనుండి గగ్గోలు పుట్టి జూరర్లను జుట్టు ముట్టి నట్లయ్యెను. ఆ మనుష్యుడు ముగిసిపోయినట్లే.

జడ్జి భటులతో - ఈ సందడి నిలుపుడు. కేసు ముగించెదననెను.

ఆ నిముసమున జడ్జి సమీపమున సంచలనము పుట్టెను. "బ్రెవీ, చెనిల్డో, కొచెపెల్" అను పిలుపు వినబడెను.

ఆ స్వరమున విషాద మగాధమై భయంకరముగ నుండినది. వినిన వారి రక్తము గడ్డ కట్టెను. ఆ శబ్దము వచ్చిన దెస కందఱకనులును మళ్ళెను. గౌరవనీయ ప్రేక్షకుల మధ్య కూర్చుండియుండిన మనుష్యుడు లేచి, దిగివచ్చి, హాలు నడుమ నిల్చుండెను. జడ్జి, ప్రాసిక్యూటరు, మాంష్యూర్ బమటాబొ, మఱి ఇరువదిమంది యతనిని గుర్తుపట్టి యొక్క సారిగ "మాంష్యూర్ మాదలిన్!" అని యాశ్చర్యము వెలి బుచ్చిరి.

# 11

నిక్కముగ నతడే. దీపమతని ముఖమును ప్రకాశమొనర్చెను. అతడు చేత హాటు పట్టుకొనియుండెను. ఉడుపులలో క్రమభంగము లేదు. పై కోటు గుండీలు జాగ్రతగా బిగింపబడినవి. అతడు పాలిపోయి, యించుక కంపించుచుండెను. అర్రాస్‌కు వచ్చినపుడే నెఱసియుండిన వెంట్రుకలిపుడు పూర్తిగా దెల్లబడినవి. ఒక గంటలో జరిగిన

మార్పది. అందఱి కన్నులతనినే తెప్పవాల్చక చూచుచున్నవి.

ఆ కలిగిన సంచలనము వర్ణనాసాధ్యము. ప్రేక్షకులొక్కక్షణము సంకోచించిరి. ఆ స్వరమునందలి పులకింపజేయు గుణము, ఆ ముఖమునందలి శాంతియు వారిని తబ్బిబ్బుపడ జేసెను. ఎవరఱచినదని యడిగిరి. ఈ ప్రశాంత పురుషుడా భయంకరాక్రందనము చేసియుండునని వారు నమ్మలేదు.

ఈ యనిశ్చయత కొన్ని క్షణములే యుండినది. జడ్జి, ప్రాసిక్యూటరు లోకమాత్రైన నాడుటకు ముందు, భటులు కదలుటకు ముందు, ఇంతవఱ కందఱును మాంష్యూర్ మాదలిన్ అనుకొనుచుండి నాతడు, సాక్షులగు కొచెపెల్, ప్రెవి, చెనిల్డోలను సమీపించి, ''నన్ను గుర్తింపలేదా?'' అని యడిగెను.

ముగ్గురును స్తంభించి నిలచిరి. తలయూపున గుర్తించినట్లు తెలియజేసిరి. కొచెపెల్ భయపడి మిలిటరీ సెల్యూట్ చేసెను. మాంష్యూర్ మాదలిన్ జూరర్లను, కోర్టువారిని జూచి ''ఆ నిందితుని వదలివేయుడు. యువరానర్, నన్ను బంధింప నుత్తర్వొండు. మీరు వెదకుచున్నవాడతడు కాడు. నేను. నేను జాన్ వాల్జాను!'' యనెను.

అందఱి యూపిరి యాగిపోయినది. మొట్టమొదట గల్గిన యాశ్చర్య సంకులమును శ్మశాననీరవము వెంబడించెను. ఒక దివ్య కార్యసాధన గాంచి పులకరించి పూజ్యభావ

సమ్మోహితులైన వారివలె ప్రేక్షకులందఱును మౌనము వహించిరి.

అయినను, జడ్జి ముఖమున గరుణా విషాదములు ముద్రితమయ్యెను. ప్రాసిక్యూటరును సాభిప్రాయముగ జూచి, యుపన్యాయపతులతో గొన్ని పదములు గుసగుస లాడెను. ప్రేక్షకులవంక దిరిగి, అందరకర్థమగు స్వరముతో "ఇక్కడ ఎవరైన డాక్టర్లున్నారా?" అని ప్రశ్నించెను.

ప్రాసిక్యూట రిట్లనెను: "జూరీ మహాశయులారా! ప్రేక్షకుల నందఱను గలవరపెట్టుచున్న యీ యనూహిత విచిత్ర సంఘటన, మీలో మాలో గలిగిన భావమును వెల్లడింప నవసరము లేదు. గౌరవనీయులు, మ–పుర మేయర్ మాంష్యూర్ మాదలిన్ కీర్తిని మీరెఱుగుదురు. ఎవరైన డాక్టర్లిక్కడ నున్న, దయచేసి మాంష్యూర్ మాదలిన్ను ఇల్లు చేర్పుడని, జడ్జితో గలసి మేము ప్రార్థించుచున్నాము."

మాంష్యూర్ మాదలిన్ ప్రాసిక్యూటరును సాగనియ్యక, సాధికారమయ్యు మృదువగు స్వరమున నిరోధించెను. ప్రేక్షకులలో నొకరు, ఆ సంఘటన ముగిసి యింటికి పోయిన వెంటనే వ్రాసిపెట్టిన దానినట్లే వల్లించుచున్నాము. నలుబదియేండ్లు కడచినను, వినిన వారి చెవులలో అవి యింకను గింగురుమనుచునే యున్నవి.

"మాంష్యూర్ ప్రాసిక్యూటర్! మీ దయకు కృతజ్ఞుడను. నేను బిచ్చివాడను గాను. ఇప్పుడే మీకు దెలియగలదు. గొప్ప తప్పు చేయబోవుచుంటిరి. ఆ మనుష్యుని

విడిపింపుడు. నేను నా విధి చేయుచున్నాను. ఆ దుఃఖజీవి ఖైదీ నేను. స్వప్నమున జూచుచున్నవాడిక్కడ నేనొక్కడనే. సత్యము. నేనిప్పుడు చేయుచున్న పని, పైనుండి యీశ్వరుడు చూచును. అది చాలును. నేనిందుంటిని గనుక, పట్టుకొనుడు. నేను జేయగలిగినంత మంచి చేసితిని. మారు పేరుతో ధనవంతుడనై, మేయరైతిని. మర్యాదగలవారలలో గలియగోరితిని. విధికది యిష్టము కానట్లున్నది. నేను జెప్పజాలని విషయములెన్నో యున్నవి. నా జీవిత కథ చెప్పి మిమ్ము విసిగింపను. ఎప్పుడో మీరు తెలిసికొందురు. నే నాచార్యుని దోచినది సత్యము. పెటీగెర్వాను దోచినది సత్యము. జాన్ వాల్జా క్రూర పాపియని వారన్నది రైటే. కాని, తప్పంతయు అతనిది కాదేమో. ఈశ్వరునితో వాదించుటకు, సంఘమున కుపదేశించుటకు నావంటి పతితుడర్హుడు కాడు. కాని, యే దుర్యశమునుండి విడివడ నేను బ్రయత్నించితినో, అది మానవజాతికే హానికరమైనది. గాలీలు గాలీ బానిసలను సృష్టించును. నేనొక బీదరైతును. తెలివి లేనివాడను. ఒక విధమైన జడమతిని. గాలీ నన్ను మార్చివేసెను. మందబుద్ధిని, క్రూరుడనైతిని. దూలమువలె నుండిన వాడను అగ్నిపిండమునైతిని. ఇల్లు కాఠిన్యముచే నశించిన నేను, కరుణచే రక్షింపబడితిని. క్షమింపుడు. నేను జెప్పినది మీరు గ్రహింపజాలరు. నా యింట, చలి కుంపటియొద్ద, పెటీగెర్వానుండి దోచిన వెండి నాణెమును చూడగలరు. ఇంక నేను జెప్పవలసినదేమియు లేదు. బంధింపుడు. పరమేశ్వరా! ప్రాసిక్యూటరు తల త్రిప్పుచున్నాడు. 'మాంష్యర్

మాదలిన్ పిచ్చివాడయ్యె' నందురు. నన్ను నమ్మరు. ఇది దుర్భరము. కడకు, నా మనుష్యుని శిక్షింపకుడు. ఏమి! వీరు నన్నెఱుగరు! జేవరిక్కడ నుండిన బాగుగ నుండును. అతడైన నన్ను గుర్తు పట్టును.''

ఈ వాక్యములను వెలువఱచిన కంఠమునందలి కరుణను, వెఱగుగొల్పు విషాదమును వర్ణించుటకు వాక్కు చాలదు.

అతడు ముగ్గురు సాక్షుల దెస జూచెను. ''మంచిది! నిన్ను గుర్తుపట్టితిని బ్రెవీ. నీ షరాయి వ్రేలుటకు గట్టుకొన్న దారములు జ్ఞప్తినున్నవా?'' బ్రెవీ యదిరిపడి, బెదరి యతని నాపాదమస్తకము పరిశీలించెను. ''చెనిల్డో, జీ-నై-డ్యూ అని మాఱుపేరు పెట్టుకొంటివి కదూ. నీ యెడమ బుజము మీది టి. యఫ్. పి. అను నక్షరములు తుడిచివేయవలెనని కాల్చుకొంటివి. అక్షరములేమో మాయలేదు. నిజమేనా, చెప్పు.''

చె: అవును. నిజమే.

మా: కొచెపెల్, నీ యెడమ చేతిమీద, రక్తము నోడ్చిన చోట, చక్రవర్తి కాన్నును ప్రవేశించిన తేది 1-3-1815 కాల్చి చెక్కిరి. చొక్కా తీసి చూపు.

కొచెపెల్ చొక్కా చేయి మడిచెను. భటుడు లాంతరు పట్టగా, అందఱి కనులు కొచెపెల్ నగ్నహస్తము మీద నా తేదీని జూచెను.

ఆ దుఃఖజీవి, న్యాయసభా ప్రేక్షకుల వంక దిరిగి

హాసించెను. అది విజయహాసము-నిరాశాహాసమును. దానిని జూచినవారి కీనాటికిని దలచుకొన్న గుండెలు బ్రద్దలగునట.

"నేను జాన్‌వాల్జా యనుట స్పష్టమయ్యెను గదా!"

అప్పుడా హాలులో న్యాయపతులని, ప్రాసిక్యూటర్లని, భటులని భేదము నశించెను. నిశ్చల నేత్రములును, తీవ్రముగ సంచరించు హృదయములుమాత్రమే యుండినవి. తమతమ విధులందఱును మఱచిపోయిరి. ప్రాసిక్యూటరు నేర నిరూపణ విధిని విస్మరించెను. డిఫెన్సు వకీలు రక్షణ విధిని మఱచెను. ఏ ప్రశ్నయు లేదు. ఏ యధికారమును జేయి చేసికొనదు. మహోన్నత దృశ్యములందలి వైచిత్ర్యమే యట్టిది. అన్ని యాత్మలను లోగొనును. ఉన్నవారిని వట్టి చూపరులుగా జేయును. అప్పటి తన యనుభవమెట్టిదో తెలిసినవాడు లేడు. ఒక మహాదీపప్రకాశమును జూచిన ట్లెవ్వడును అనుకొనలేదు. కాని ఒక్కొక్కని హృదయమును మిఱుమిట్లు గన్నది.

జాన్‌వాల్జా తమ కండ్ల యెదుట నుండెననుట స్పష్టము. జాజ్వల్యమానమగు వాస్తవము. ఏ యితర వివరణము లేకయే జనసముదాయము విద్యుద్వికసితమునట్లు, క్షణములో నొక్క చూపున, దనకు బదులింకొకడు శిక్షింపబడుటకై ఆత్మార్పణమొనర్చిన నిరాడంబర దివ్యజీవి చరిత్రమును సంగ్రహించిరి. ఈ యుజ్జ్వల వాస్తవికతముం దితరములన్నియు జీకటివలె బటాపంచలయ్యెను.

"ఇంక విచారణకు భంగము కల్గింపను. అరెస్టు చేయరైతిరి కావున బోవుచున్నాను. చేయవలసినవెన్నో పను

లున్నవి. నేనెక్కడ కేగుచున్నానో ప్రాసిక్యూటరుకు దెలి యును. ఇష్టము వచ్చినపుడరెస్టు చేయించును.''

ఇట్లు చెప్పి, జాన్‌వాల్జా వెలుపలి తలుపు వంక నడ చెను. ఒక్కరైన నెదురాడలేదు. ఒక్క చేయియైన నడ్డ గింపలేదు. అందఱును బ్రక్క కొరిగిరి. అప్పుడాతనిలో వర్ణనాసాధ్యమైన దివ్యత్వము పొడసూపి, జనసముదాయము నొత్తిగిలి దారినిచ్చునట్లొనర్చినది. అతడు మెల్లగా నడచి వెళ్ళెను. తలుపెవరు తెఱచిరో తెలియదు. కాని, దానిని సమీపించుసరికది తెఱవబడియుండినది. అచ్చట జేరి, వెను దిరిగి ''మాంష్యర్ ప్రాసిక్యూటర్, నేను మీయధీనుడను'' అని చెప్పి, ప్రేక్షకులతో ''నన్ననుకంపార్హు డనుకొను చున్నారు కదా? పరమేశ్వరా! నేనేమి చేయబోవుచుంటినని తలచుకొన్న, అసూయకర్హు డననుకొందును. ఇప్పటికిని, ఇదియంతయు జరుగకుండిన బాగని కోరుచుంటిని'' అనెను.

ఆయన పోయెను. తలుపు తెఱచుకొన్నట్లే మూసి కొనెను. మహాశ్రేష్ఠ కార్యములను జేయువారికి జనసము దాయము నందలి యే యొక్కరో సేవ సలుపుట తథ్యము.

పిదప, ఒకగంట లోపుగనే, చాంప్మతుమీది యారో పణ లన్నియు ఉపసంహరించిరి. మ్రాన్పడి, మానవులందఱు వెఱ్ఱివారనుకొని, జరిగిన దొక్కముక్కయు యర్థముకాక, యతడు తన దారిని బోయెను.

---

# నిర్భాగ్యజీవులు

## ప్రథమ ఖండము - ఫాంటైన్

### అష్టమాధ్యాయము – ప్రతిఘాతము

# 1

తెల్లవార వచ్చుచుండెను. ఫాంటైన్ రాత్రియంతయు, జ్వరముచే నిద్రలేకయే కడపెను. అయినను నెన్నో యానంద దృశ్యములు గన్నది. తెల్లవాఱు సరికి బాగుగ నిద్రపట్టెను. సిస్టర్ సింప్లిస్ రాత్రియంతయు కాచుకొనియే యుండినది. ఈ సమయము చూచుకొని, క్వినా కలుపుకొని రాబోయెను. ఔషధముల గదిలో నా యస్పష్ట కాంతిలో మందులు వెదకుచుండి తటాలున వెనుదిరుగ, మాంష్యర్ మాదలిన్ నిల్చుకొని యుండినాడు. అతడప్పుడే సవ్వడిసేయక వచ్చియుండెను.

సి: మీరా, మాంష్యర్ మేయర్!

మాదలిన్ బదులుగా–పాపమామె యెట్లున్నదనెను.

సిస్టర్, జరిగినది వివరించెను. ఫాంటైన్‌కు రాత్రంతయు చాల జబ్బు. ఇప్పుడు కొంచెము మేలు - మేయరు

మాంట్ఫర్మిల్‌కు బిడ్డను తేబోయినాడని నమ్ముటచే. సిస్టర్‌కు మేయర్‌ను ప్రశ్నించు ధైర్యములేదు కాని, ఆయన వైఖరిని బట్టి అక్కడినుండి వచ్చినవాడు కాడని తెలిసికొనెను.

మా: మంచిది. ఆ భావము తొలిగింపకుండుట మంచిది.

సి: ఔను. కాని, మాంష్యూర్ మేయర్, ఇప్పుడామె మిమ్మొంటరిగ జూచునే, ఏమి చెప్పగలము?

ఒక్క నిముస మాలోచించి మాదలిన్ - దేవుడు దారి చూపును అనెను.

నొక్కిన స్వరముతో సిస్టర్-"కాని, అసత్య మాడలేము కదా" అనెను.

నిండు పగటి వెలుతురు గదిచొచ్చి, మాంష్యూర్ మాదలిన్ ముఖమున గాంతి చిమ్మెను.

సిస్టరప్పుడు కనులెత్తినది -ఓ దేవుడా! మాంష్యూర్, ఏమి జరిగినది? మీ వెంట్రుకలన్నియు సున్నము పూసినట్లైనవి.

మా: తెల్లగనా!

సిస్టర్ సింప్లిస్ కడ నద్దము లేదు. శస్త్రముల సంచి వెదుకగా, రోగులు బ్రతికియున్నారా మరణించిరా యని కనుగొనుటకు ముక్కు దగ్గఱ డాక్టరుంచు గాజుముక్క యుండినది. దానిని తీసికొని, తన ప్రతిబింబ మందులోఁ జూచుకొని మాదలిన్, ఉదాసీనముగ నేమో యోచించు వానివలె "నిజమే!" యనెను.

ఈ యన్నిటియందును, దెలియని దేదో యున్నది. సిస్టర్ క్షణకాలము దానిని జూచెను. ఆమె రక్తము గడ్డ కట్టి నట్లనిపించినది.

మా: ఆమెను జూడవచ్చునా?

ఏ ప్రశ్న వేయు ధైర్యము లేకున్నను సిస్టర్— "మాంష్యర్ మేయరామె బిడ్డను దీసికొనిరారా?" అనెను.

మా: తప్పక. కాని రెండు మూఁడు దినములు పట్టును.

సిస్టర్ జంకుచు - "మాంష్యర్ మేయరు నామె యిప్పుడు చూడకున్నచో నాయన వచ్చెననుకొనదు. ఓపికపట్టుటామెకు సులభము. బిడ్డ వచ్చినపుడు, మాంష్యర్ మేయరప్పుడే వచ్చి రనుకొనును. అప్పుడు మన మసత్య మాడు పనియుండదు." అనెను.

మాంష్యర్ మాదలిన్ కొన్ని నిమిషము లాలోచించి, శాంత గంభీరముగ "కాదు సిస్టర్, నే నామెను చూచి తీఱవలెను. నాకెంతో వ్యవధి లేదేమో" అనెను.

సి: అట్లయిన లోనికి పొండు. ఆమె నిద్రించు చున్నది.

మాదలిన్ పలుకులందలి "ఏమో" యను పదమును ఆ సన్యాసిని గమనించినట్లు లేదు. అది యేదో యస్పష్టము అసాధారణమునైన ధ్వని నిచ్చుచున్నది.

ఆయన ఫాంటైన్ గది ప్రవేశించి, మంచము దగ్గఱి, దోమతెఱ తీసెను. ఆమె నిదురించుచుండినది. ఆమె రంగు తెల్లబడి పోయినది. చెక్కులు మినమిన లాడుచుండెను.

కన్నెతనపు సౌందర్యమ్మున మిగిలినదంతయు దీర్ఘములగు ఆప్పవెంట్రుకలే. మూతపడిన కనులలో అవి చెక్కులపై వంగి కదలు చుండినవి. కానరాక, భావనకందు ఱెక్కల విసరునకు గదలుచున్నదా యన్నట్లామె దేహము కంపించు చుండెను. ఆ ఱెక్కలు విచ్చి యామె నెత్తుకొని పోవునా! ఆమె నా స్థితిలో చూచిన వారెవరును, ఆశ వదలరు. ఆమె చనిపోవునట్లు లేదు, ఎగిరిపోవు నట్లున్నది.

పుష్పమును గోయుటకు జేయి చాచినపుడు, కాడ కంపించి వెనుదగ్గును. నిగూఢమృత్యు హస్తము గ్రసింప బోవునపుడు మానవ దేహమున కిట్టి కంపము వాడమును.

మాంష్యుర్ మాదలిన్, నిశ్చలముగ గొంతప్రొద్దు పడక దగ్గఱ నిల్చుకొని, దృష్టిని రోగినుండి సిలువకు, సిలువ నుండి రోగికి ద్రిప్పుచుండెను. రెండు నెలలకు ముందామెను చికిత్సాలయమున జేర్చినపు డిట్లే చూచియుండెను. ఇప్పు డును, అప్పటివలెనే ఆమె నిద్రించుచున్నది. ఆయన నిల్చి కొని ప్రార్థించు చున్నాడు. ఈ రెండు నెలలు కడచిన పిదప, ఇప్పుడు మాత్ర మామె వెండ్రుకలు సగము నెఱసి నవి. ఆయన తల పూర్తిగా దెల్లబడి పోయినది.

సిస్టరతనితో లోనికేగ లేదు. పెదవిపై వ్రేలుంచు కొని, ఎవరినో సద్దుచేయ వద్దను చున్నట్లాయన నిలచి యున్నాడు. ఫాంటైన్ కనులు తెఱచి, ఆయనను జూచి, నెమ్మదిగా జిఱునవ్వుతో ''కోజెత్తేదీ?'' అని ప్రశ్నించెను.

# 2

ఫాంటైనానందాశ్చర్యములతో నెగిరిపడలేదు. ఆనందమే తానయ్యెను. ఆమె యడిగిన "కోజెత్తేదీ?" యన్న ప్రశ్నలో దృఢవిశ్వాసము, నిశ్చయము నిండి, కలతకాని సందేహము కాని లేనే లేకుండుటచేత, ఆయన బదులు చెప్పజాలక పోయెను.

ఫాం: మీ రక్కడికి పోయితిరని నాకు దెలియును. నిద్రపోవుచుంటిని. అయినను మిమ్ములను జూచితిని. రాత్రి యంతయు గనులతో మిమ్ము వెన్నాడితిని. మీకు దివ్య పరివేషముండెను. నానా దేవతలు మీ చుట్టును దిరుగు చుండిరి!

ఆయన, చూపులు సిలువపై నిగుడించెను.

ఫాం: కాని, నా కోజెత్తెక్కడ నున్నదో చెప్పడు. నా మంచముమీద విడిచిపెట్టి యుండినచో, నేను లేచిన వెంటనే చూచెడి దానను గదా?

ఏదో యంత్రమువలె నేమి జవాబు చెప్పెనో అతడెన్నడును జ్ఞప్తికి దెచ్చుకొన జాలడయ్యెను. అదృష్ట వశమున వైద్యుడా సమయముననే వచ్చి, మాద లిన్ కు దోడుపడెను. "బిడ్డా! నెమ్మది వహింపుము. నీ కూతురిక్కడనే యున్నది!" అనెను.

ఫాంటైన్ కన్నులానంద ప్రఫుల్లములై యామె యాకారమునంతయు వికసింప జేసెను. అతి తీవ్రముగ నతిమృదువుగ ప్రార్థించుచు, జేతులు జోడించి "నా

బిడ్డనందింపుడు.'' అనెను. హృదయ ద్రావకమగు మాతృ భ్రమ! కోజెత్తింకను జేతులలో దేవలసిన శిశువే ఆమె దృష్టిలో.

వై: ఇప్పుడే కాదు. ఈ నిముసమున గాదు. నీ కింకను గొంత జ్వరమున్నది. నీ బిడ్డను జూచితివా. ఉద్రేకము చెందుదువు. వ్యాధి యధికమగును. మేము తొలుత నిన్నారోగ్యవతిగా జేయవలెను.

ఫాంటైన్ ఔద్ధత్యముతో నతని మాటల కడ్డు వచ్చెను. ''నా కారోగ్యము కలిగినదే! నేను చెప్పుచున్నాను. ఇప్పు డారోగ్యవతిని! ఈ వైద్యునికి బుద్ధిలేదా? నా బిడ్డను జూచి తీఱుదును.''

వై: చూడు. ఎంత యుద్రేకము చెందుదువో! నీవీ స్థితిలో నున్నంతవఱకు బిడ్డను జూడనీను. చూచిన జాలదు. దానికై నీవు జీవింపవలెను. నీకు మనోనిగ్రహము కలిగి నపుడు, దగ్గఱకు దెత్తును.

ఆ యభాగ్యమాత తలవంచెను.

ఫాం: అయ్యా, క్షమింపుడు. హృదయపూర్వకముగ క్షమాభిక్ష వేడుచున్నాను. పూర్వమైనచో నింతకుముందు వలె మాట్లాడియుండను. ఎన్నో కష్టములు పడితిని. కావున ఒక్కొక్కప్పుడేమందునో నాకే తెలియదు. నాకర్థమైనది. ఉద్రిక్తురాల నగుదునని భయపడుచుంటిరి. మీరు చెప్పి నన్నాళ్ళు కాచుకొనియుందును. కాని, నా కూతురును జూచిన నపాయము కలుగదు. ఇప్పుడు చూచుచున్నాను. నిన్న రాత్రినుండి దానిని విడిచి నా చూపు ప్రక్కలకు

బోలేదు. ఇప్పుడు తీసికొని రమ్మనుడు. నెమ్మదిగా దానితో మాటాడుదును. అంతే. నాకు జూపించుటకనియే మాంట్ఫర్మిల్ కు వెళ్ళి దానిని బిలుచుకొనిరాగా, నేను జూడగోరుట సహజము కాదా? నాకేమియు గోపము లేదు. చాల సుఖపడబోవుచున్నానని తెలియును. రాత్రియంతయు, తెల్లబట్టలు ధరించిన ఆకారములు నన్ను చూచి స్మితము గావించు చుండినవి. డాక్టరిష్ట పడినప్పుడే కోజెత్తును నా దగ్గఱకు దేవచ్చు. జ్వరము పోయినది. ఆరోగ్యము వచ్చినది. నాకే జబ్బున్నట్టును తోచుటలేదు. కాని, జబ్బున్నట్లు నటించి, కదలకుందును. అప్పుడు సిస్టర్లు 'ఆమె బిడ్డను ఇచ్చివేయుడు' అని చెప్పుదురు.

మంచము ప్రక్కన నొక కుర్చీలో మాంష్యర్ మాదలిన్ కూర్చుండియుండెను. ఫాంటైనాయన వైపు తిరిగి, శాంతముగ నున్నట్లు, 'మంచి'దైనట్లును ఆయన యనుకొనవలెనని, ఎదుటివారి కర్థమగునట్లు ప్రయత్నము సలిపెను. రోగ దార్బల్యమామెను పసిబిడ్డవలె జేసివైచినది. శాంతముగ కనుపట్టిన కోజెత్తును జూచుట కడ్డుండదని యాశ. అట్లయ్యు, ఎంతో నిగ్రహించుకొనియు, మాదలిన్ కొకవేయి ప్రశ్నలను వేసినది.

"ప్రయాణము సుఖముగ నుండినదా మాంష్యర్ మేయర్? అంత దూరము పోయినారు. ఎంత మంచివారు! అది యెట్లున్నదో చెప్పుడు, చాలును. దానికి బ్రయాణము కష్టమనిపించలేదు కదా? ఇంతకాలము నన్నాకూన మఱచియుండును. శిశువులకు జ్ఞప్తి యుండదు. పక్షుల వంటివారు.

నేడొక్కటి, రేపింకొక్కటి చూతురు. ఏదియు జ్ఞప్తి యుండదు. దాని బట్టలు శుభ్రముగ ఉండినవా? తేనార్డి యర్లు దానిని శుభ్రముగ నుంచియుండిరా? ఎట్లు పెంచినారు? ఓ, నా కష్టకాలమున నీ యాలోచనలతో నేనెంత వేదన చెందితినో మీకు దెలిసెనా? ఇపు డదియంతయు నైపోయి నది. సుఖముగ నున్నాను. ఆహా! దానిని జూడనలెనని యెంత యుబలాటముగ నున్నది. మాంష్యర్ మేయర్, అది యందముగ నున్నదనుకొందురా? నా కూతురు చూపసి కాదూ? ఆ బోడి బండిలో మీకు జాల చలిగా నుండును. ఒక్క క్షణమిక్కడికి దానిని దీసికొని రాగూడదా? వెంటనే పిలుచుకొని పోవచ్చు. చెప్పండీ! ఇక్కడ మీరధికారులు. మీ కిష్టమేనా?''

ఆయన ఫాంటైన్ చేయిపట్టుకొని ''కోజెత్తు రూప రాశి. ఆరోగ్యముగ నున్నది. త్వరలో జూచెదవు కాని నెమ్మదిగ నుండుము. త్వరత్వరగా మాటాడుదువు-చేతులు పఱుపు వెలుపల విసరుదువు. అందువలన దగ్గు వచ్చును.'' అనెను. సత్యమే. ప్రతి పదమునకును దగ్గుచుండినది.

ఫాంటైన్ అతృప్తి కనబఱుపలేదు. చాల ఆతురతతో ప్రశ్నలు వేసి, ప్రార్థించుటచే దానుద్దేశించిన నమ్మకము చెడిపోవునేమోయని భయపడి, ఏవో యసందర్భపు సంగ లను గుఱించి పలుకనారంభించెను. ''మాంట్ఫర్మిల్ మంచి యూరే. కాదూ? ఎండకాలమున కక్కడికి బోవుదురు. తేనార్డియర్ల వ్యాపారము బాగున్నదా? పెద్ద పెద్ద వారా యూరి మార్గమున బయనింపరు, వారి హోటలు చిన్నది.''

మాంష్యర్ మాదలినింకను ఆమె చేయిపట్టుకొనియే యుండెను. ఉద్విగ్నుడై ఆమెను జూచుచుండెను. కొన్ని విషయము లామెకు జెప్పవచ్చినవాడిప్పుడు జంకుచుండెను. డాక్టరు వెళ్ళిపోయినాడు. సిస్టర్ సింప్లిస్ మాత్రమేయున్నది. ఆ నిశ్శబ్దమును జీల్చి ఫాంటైనిట్లు కేకపెట్టెను. "దాని గొంతు వినబడుచున్నది! నా బిడ్డే! ఆ గొంతే!"

ఆ ప్రక్క హాలులో బరిచారిక శిశువొకర్తాటలాడు చుండెను. పలుమారిట్టి సంఘటనలు జరుగును. భవిష్య ద్విషాద పరిణామమును, నిగూఢముగనైనను, కొంతకు గొంత యివి ప్రదర్శించును. అది యాడుబిడ్డ. దేహమున వేడి యెక్కట కిటునటు బరుగిడుచు, నవ్వుచు, గట్టిగా బాడుచుండినది. ఆహా! బిడ్డల యాటలలో నేది కలిసిపోదు! ఈ పసిపాప పాటలను ఫాంటైన్ విన్నది. "అవును, అది నా కోజెత్తే! దాని కంఠము నే నెఱుగుదునమ్మా!"

ఎట్లు వచ్చెనో అట్లే ఆ బిడ్డ పరుగిడిపోయెను. మాటలు పాటలు నిలచిపోయెను. ఫాంటైన్ కొంత ప్రొద్దు చెవి యొక్కించెను. ముఖము మీద నేదో ఛాయ క్రమ్మెను. మాదలిన్‌కీ మాటలు వినిపించెను. "నా బిడ్డను జూడనియ్యని డాక్టరెంత కఠినుడు! పాడుమొగము!"

అట్లయ్యు మనస్సున తీయని యూహాతరంగములు లేచినవి. తనలో మాటాడుకొనుచునే యున్నది. "ఎంత సుఖముగా నుందుము! మాకు జిన్న యుద్యానవన మొక్కటి యుండును. మాంష్యర్ మాదలిన్ మాట యిచ్చినారు. నా బిడ్డ ఆ యుద్యానములో ఆటలాడును. ఇప్పటి కక్షరము

లన్నియు వచ్చియుండును. వర్ణక్రమము నేర్పెదను. గడ్డిమీది సీతాకోక చిలుకలనది తెలుపుచుండును. నేను చూచుచుండెదను.'' అని నవ్వసాగెను.

మాదలిన్ చేయి వదలెను. నేల జూచుచు అగాధాలోచనలలో మనస్సు మునిగియుండ, వీచు గాలిని వినుచున్నవానివలె ఫాంటైన్ పలుకులను వినుచుండెను. ఉన్నట్టుండి ఫాంటైన్ మాటలు నిలిపి బొమ్మవలె దల పైకెత్తెను. ముఖము భయంకరమైపోయినది. మాట లేదు. ఊపిరి లేదు. పడకపై సగము లేచెను. ఎండిన బుజములనుండి కప్పుకొన్న బట్ట జారిపోయెను. ఇంతకుముందు వికసించిన ముఖమిప్పుడు కాటువేసిన రక్తము లేనట్టు తెల్లబడిపోయెను. అతి భయముచే నుబికి పెద్దవియైన కనులు, ఎదుట గదికా కొనలోనున్న దేనిమీదనో బంధించినట్లుండెను.

మా: అయ్యో దేవుడా! ఏమైనది, ఫాంటైన్?

ఆమె జవాబు చెప్పలేదు. తాను జూచుచుండిన స్థానమునుండి కనులు మఱల్పలేదు. ఒక చేతితో ఆయన హస్తము తట్టి, రెండవదానితో వెనుకకు జూడుమని సంజ్ఞ చేసెను.

మాదలిన్ తిరిగి, జేవర్‌ను చూచెను!

# 3

మొదట గలిగిన కలవరము చల్లబడగనే, జడ్జి యద్దు ప్రశ్న లేమియు వేయలేదు. న్యాయము దాని మార్గము ననుసరించి తీఱవలెను. జడ్జి దయాళువు, తెలివి

గలవాడే. ఐనను ఉన్నదున్నట్టు చెప్పక తప్పదు. పూర్వ ప్రభువుల పార్టీకి జేరినవాడు జడ్జి. మేయరు, తన ధోరణిలో మాటాడుచు "బోనపార్టి" యనక "చక్రవర్తి" యని నెపోలియన్‌ను గురించి చెప్పుట, జడ్జికసహ్యాము కలిగించెను. ఇదిగాక, ప్రాసిక్యూటరొక జాన్ వాల్జాను బంధించి తీరవలెను. చాంప్మతు విడుదలయ్యెను గావున, మాదలిన్ వంక కతడు చేసాచెను.

అరెస్టుకుత్తరు వీబడెను. ప్రాసిక్యూట రాయుత్తరువు నొక యాశ్వికునికిచ్చి ఊపిరి సల్పుకొనక వెళ్ళి దీనిని జేవర్ కిమ్మని పంపెను.

తన వాఙ్మూలము ముగియగనే జేవర్ మ-కు మరలి యుండెను. జేవర్ లేవబోవు సరికి సరిగా, ఆశ్వికుడు వారంటు తెచ్చెను. ఆ యాశ్వికుడు పోలీసువాడే. తెలివైన వాడును. మూడు ముక్కలలో అర్రాస్‌లో జరిగినదంతయు దెలిపెను.

ప్రాసిక్యూటరు చేవ్రాలున్న వారంటిట్లుండెను. "ఈ నాడు కోర్టులో జాన్ వాల్జా యని గుర్తింపబడిన మాదలిన్ మ-మేయరును ఇన్స్పెక్టర్ జేవర్ అరెస్టు చేయవలెను."

సద్దు చప్పుడు చేయక జేవర్ ప్రక్క స్టేషనులోని కార్పొరలొక్కని, నల్గురు సోల్జర్లను బిల్చుకొని వచ్చి, హాలులో సోల్జర్లను నిలిపి, పరిచారిక దెలుప దాను ఫాంటైన్ గది ప్రవేశించెను. సాయుధభటులు మేయరుకొరకు వచ్చుట నిత్యకృత్యముగాన, పరిచారిక సంకోచింపలేదు.

మాదలిన్ చూపులు తన చూపుల నెదుర్కొనిన

క్షణమున, కదలకయే, చలించకయే, జేవర్ భయంకరు డయ్యెను. ఆనందమంత వెలుగుగొల్పు మనుష్య భావమిం కొకటి లేదు.

బలిపశువును మఱల గనుగొన్న పిశాచముఖమది. సాధికారమగు నతని వైఖరియందు దృష్టి తొణికిసలాడు చుండినది. విజయవికృతి యతని ఫాలముపై వ్యాపించెను. తృప్తిపడిన ముఖమునందు కనుపట్టవలసిన భయానకత్వ మక్కడ పరిపూర్ణత గాంచెను.

జేవర్ వికృత భయంకరుడే కాని, యల్పుడు కాడు. ధర్మముమీాది పట్టుదల అపార్థప్రేరణచే వికృతము కావచ్చు. అట్లయ్యునది గొప్పదే. మానవాంతరాత్మకు విశిష్టమగు దాని ఘనత భయానకమే. అది పొఱపాటుతో గూడిన సౌశీల్యము. నిష్కరుణుడై, ఘోరకృత్యమును బరిపూర్ణా నందముతో జేయు నంధవిశ్వాసిలో నిగూఢ విషాదము కూడిన కాంతియుండి మనలో గౌరవము జేకెత్తించును. జేవర్ కది తెలియదు. విజయుడగు నొక్కొక్క యజ్ఞాని వలె, భయంకరానందము ననుభవించుచున్న జేవర్ అను కంప గొలుపుచుండెను. ఆ ముఖము మంచిలోని చెడ్డ చూపు చుండెను. అంత బాధ గొల్పునది, భయము కల్గించునది యింకొకటి యుండజాలదు.

# 4

జేవర్ నుండి, మాదలిన్ తప్పించిన నాడు మొదలు ఫాంటైన్ నతనిని జూడలేదు. వ్యాధిగ్రస్తమగు నామె మనస్సు,

జేవర్ తన కొఱకే వచ్చి యుండునని నిశ్చయించెను. అతని ముఖము నామె చూడజాలక, తన ముఖమును రెండు చేతులతో గప్పుకొని "మాంష్యర్ మాదలిన్, రక్షింపుడు." అని యాక్రోశించెను.

ఇకమీద జాన్ వాల్జా యనియే పిలచెదము. జాన్ వాల్జా నిలుచుండి, అతి ప్రశాంత మృదుస్వరమున "భయపడవలదు. నీ కొఱకుగా దతడు వచ్చుట." అని మఱల జేవర్ దెసతిరిగి "నీ వెందుకు వచ్చితివో ఎఱుగుదును." అని పలికెను.

జే: త్వరగా గానిమ్ము.

ఈ రెండు పదముల యుచ్చారణయందు, ఇట్టిదనరాని దేదో యుండినది. అది క్రూరమృగమును, పిచ్చివానిని తలపునకు దెచ్చును. ఆ పదముల నుచ్చరించిన కంఠమును, ఏ వర్ణ క్రమముచేతను నిర్ణయింపజాలము. అది మానవ వచనము కాదు, ఏదో ఘోరమృగముయొక్క బొబ్బరింత.

సాధారణ విధానము నత డవలంబింపడయ్యెను. ఏ మాటలు లేవు. వారంటు చూపుటైన లేదు. అతని దృష్టిలో, స్పర్శకందని నిగూఢవైరి జాన్ వాల్జా-ఎదుటబడని మాయాయుద్ధధురీణుడు. తానైదేండ్ల నుండి యతనితో బోరుచున్నను నోడింప జాలకుండెను. ఈ యరెస్టాది కాదు, అంత్యము. "త్వరగా గానీ"యని మాత్రమనెను. అట్లన్నప్పుడడుగు కదల్పడయ్యెను. నిర్భాగ్యుల నీడ్వ సమర్థములైన తన చూపుటురులను జాన్ వాల్జా పైకిని విసరెను. ఆ

జేవర్ పదఘట్టన చేసెను. "నోరుముయ్, నీచురాలా! పాడు దేశము-గాలీ బానిసలు మాజస్ట్రేట్లు, బజారుముండలు ప్రభ్వీణులు! ఊఁ! ఇదియంతయు మారిపోవును! సమయము వచ్చినది!"

ఫాంటైన్‌ను తెప్పవాల్పక చూచుచు, మఱల లంకించి జాన్ వాల్జా కాలరును బట్టుకొని జేవర్ "విను, మాంష్యర్ మాదలిన్ లేడు. మాంష్యర్ మేయర్ లేడు. దారి దోపిడి గాడు, ఖూనీకోరు, ఖైదీ—జాన్ వాల్జా యున్నాడు! నేను వానిని బట్టుకొంటిని! అంతే." అనెను.

బిగువెక్కిన చేతులనాని, ఫాంటైన్ నిటాలున లేచెను. జాన్ వాల్జాను, బిదప జేవర్‌ను చూచెను. సిస్టర్‌ను చూచెను. ఏమో మాటాడ నోరు తెఱచెను. గొంతునుండి యేదో గొరగొర పుట్టినది. పండ్లు కఱచుకొని పోయెను. మహావేదనతో జేతులను విసరెను. నీళ్ళలో మునిగిపోవుచున్న దానివలె తాతాడెను. పిదప దటాలున దిండుపై బడిపోయెను. తలగడ తాకి ఆమె తల ముందుకు ఱొమ్ముపై బడెను. నోరు తెఱచుకొనెను. కన్నులు తెఱచుకొనెను. ఫాంటైన్ కథ ముగిసినది.

జాన్ వాల్జా, జేవర్ చేయి పట్టుకొని పసిబిడ్డచేయిని విడిపించినట్లు తీసివేసెను. "నీ వీమెను చంపితివి!"

జేవరతి కుపితుడై యఱచెను. "చాలించు. ఉపదేశ

ములు వినుట కిక్కడికి రాలేదు. అవి నీకే యుండనీ. క్రింద భటులున్నారు. వచ్చితివా సరి. లేకున్న చేతి సంకెలలు!''

గదిలో నొకమూల యందు, విఱిగిన యినుప మంచ ముండినది. దాని తలవైపు కడ్డీని జాన్‌వాల్జా యూడబెఱికెను. ఆయన కండల కది చెలాటము. దానిని చేతబట్టుకొని జేవర్‌ను జూచెను. జేవర్ తలుపు దగ్గఱకు ముడుచుకొని పోయెను.

ఆ యినుప యూచ పట్టుకొని జాన్‌వాల్జా తిన్నగా ఫాంటైన్ పడక డగ్గఱిలి, వెనుదిరిగి, వినబడనంత మెల్లగా జేవర్‌తో "నన్నిపుడు చెనకవద్దు" అనెను. జేవర్ కంపించెను.

జాన్‌వాల్జా, మోచేయి పఱుపుపై మోపి, తల చేతులలో నిడికొని, చేతనారహితయై పడియున్న ఫాంటైన్‌ను తదేకదృష్టితో జూచెను. ఇట్లు మూకయై, ఆలోచనాధీనుడై, సకలమును మఱచి యుండెను. ఆ మూర్తిలో, వైఖరిలో, వర్ణనకందని జాలి వెల్లి విఱియుచుండెను.

కొన్ని నిముసము లిట్లు ధ్యానమగ్నుడైయుండి, పిదప ఫాంటైన్‌కేమో చెప్పెను.

ఏమి చెప్పెను? ఈ సంఘపరిత్యక్తుడా మృత స్త్రీకేమి చెప్పెను? ఏమి మాటలవి? భూనివాసులెవ్వరును వానిని వినలేదు. చచ్చిన యాడుది వినెనా? హృదయము కరిగించు భ్రమలు ఉదాత్త సత్యములు. ఒక్కటి మాత్రము నిస్సం

దేహము : సిస్టర్ సింప్లిస్ ఒకర్తయే దీనికి సాక్షి. ఆమె పలుమారు చెప్పుచుండును. జాన్ వాల్జా, ఫాంటైన్ చెవిలో చెప్పుచుండినపుడు, ఆ చైతన్యరహితోష్ఠము మీద దివ్య హాసము స్పష్టముగ ప్రకాశించెనట. శ్మశానవైదగ్ధ్యముతో గాంతిచెడిన కనులు ఆనందవిలసితము లయ్యెనట.

జాన్ వాల్జా, ఫాంటైన్ తల చేతులతో బట్టుకొని, తల్లివలె, దిండుమీద సరిగా బెట్టెను. గౌను దారము బిగించెను. టోపీ క్రింద వెంట్రుకలు సరిచేసెను. పిదప, కనులు మూసెను.

అప్పుడు, ఫాంటైన్ ముఖము విచిత్రముగ కాంతిమంతమైనట్లుండెను.

మృత్యువు, మహాకాంతికి ద్వారము.

ఫాంటైన్ చేయి మంచం నుండి వ్రేలుచుండినది. జాన్ వాల్జా మోకరిలి, తిన్నగా నాచేయినెత్తి, చుంబించెను.

పిదప నిలుచుండి, జేవరుతో "ఇంక ఇపుడు నీ యధీనుడను." అనెను.

# 5

జేవర్, జాన్ వాల్జాను సిటీ జెయిలులో నుంచెను.

మాంష్యూర్ మాదలిన్ అరెస్టు మహాసంచలనము కలిగించెను. "గాలీ బానిస" అను వాక్యమొక్కటి వినిన

వెంటనే, ఒక్కొక్కరును ఆయనను త్యజించిరి. రెండు గంటల లోపల, ఆయన చేసిన మంచినంతయు మఱచి గాలీ బానిసయని మాత్రమే మనస్సున నిలిపికొనిరి. అర్రాస్‌లో జరిగిన వివరణములేవియు నింకను దెలియలేదు. దినము పొడుగునను నిట్టి సంభాషణ లూరంతయు జరుగుచుండెను. "నీకు దెలియదా? అతడు విడుదలైన ఖైదీ!" "ఎవరు?" "మేయర్." "ఓహో! మాంస్యూర్ మాదలిన్!" "ఔను." "నిజమే!" "అతని పేరు మాదలిన్ కాదు. ఏదో ఘోరమైనది, బెజానో, బోజానో, బాంజానో!" "ఆహా! ఔరా!" "అరెస్టు చేసినారు." "ఆఁ!" "ఇప్పటికి సిటీజెయిలులో ఉన్నారు. ఇంకెక్కడికైన మార్తురు." "మార్తురు! ఎక్కడికి?" "న్యాయసభలో అతడొకప్పుడు చేసిన దారిదోపిడి విచారింపవలెనే!" "సరి సరి! నాకెప్పుడును నతని మీద సందేహమే. అన్నిటను అతి - మంచితనములో, స్వాదు రీతిలో. ఆస్తి మీద నభిమానము లేదు. కనబడిన కుఱ్ఱదొంగల కందఱకును విరివిగా డబ్బిచ్చును. దీనికంతటికేదో మూల మున్నదనుకొనుచునే యుంటిని." సుఖముగా గడుపుచుండిన వారందఱిట్టి మాటలనే ఆడుచుండిరి.

ఈ విధమున, మాంస్యూర్ మాదలిన్ పేరిట ఛాయను జించి చెండాడుచుండిరి. ఊరి వారందఱిలో, ముగ్గురు నలుగురే, ఆయన సచ్చరిత్రము స్మరించుచుండిరి. వృద్ధపరిచారిక వారిలో నొకతె.

నాటి సాయంకాలమున, నింకను దిగ్భ్రమ వీడక, విషాదకర చింతలు కలచుచుండ, ఆ యుత్తమురాలు తన గదిలో నుండెను. దినమంతయు ఫాక్టరీ మూసియే యున్నది. వీధి నిర్జనమైపోయినది. ఇంట సిస్టర్ పర్పెచు, సిస్టర్ సింప్లిస్ తప్ప వేఱెవ్వరును లేరు. వారు ఫాంటైన్ శవమును కాచు కొని యుండిరి.

మాంష్యర్ మాదలిన్, ప్రతి దినమును వచ్చు సమయమునకు సరిగా, ఆ స్వామిభక్తురాలు నిర్జీవముగ లేచి, డ్రాయరునుండి ఆయన గది తాళము చెవిని, ఆయన వెలిగించి తీసికొనిపోవు వత్తి దీపపుస్టాండును తీసి, ఆయనకను దినపరిచితమగు చీలకు దాళముచెవి తగిలించి, దాని సమీపముననే దీపపుస్టాండు నుంచెను. ఆలోచనలామె బహిరంత శ్చైతన్యముల నరికట్టినప్పటికిని, నలవాటు మేఱ కిట్లొనర్చినది. రెండుగంటలకు పైగా నిట్లుండి, యప్పటికి స్మృతి రాగా "అయ్యో! ఆయన తాళముచెవిని చీలకు దగిలించి నానే" అని బిగ్గరగా ఆశ్చర్యముగ బలికెను.

సరిగా అప్పుడే, ఆమె గది కిటికీ తెఱచుకొనెను. ఒక చేయి, కిటికీనుండి తాళముచెవిని, దీపపుస్టాండును దీసికొని ఆ వత్తిని వెలిగించెను. పరిచారిక కనులెత్తి ఆశ్చర్యముతో నేలకంటుకొని పోయెను. అఱపు పెదవుల వఱకును వచ్చి ఆగిపోయెను. ఆ చేయి, ఆ కోటు ఆమె యెఱిగినవే. ఆయన మాంష్యర్ మాదలిన్.

"భగవంతా! మాంష్యర్ మేయర్! మీరు—"

ఆమె మనస్సునందున్న దానినతడు పూరించెను. "జెయిలులో నుంటిని. కిటికీ కమ్మి నూడబెఱికి, ప్రక్క మేడమీద దుమికి వచ్చితిని. నా గదికి బోవుదును. సిస్టర్ సింప్లిస్‌ను బిల్చుకొనిరా. ఆ యభాగిని దగ్గఱ ఉందును."

వృద్ధపరిచారిక వెంటనే వెళ్ళెను. అతడట్టి హెచ్చరికయు బలుకలేదు, తన్నామె తనకంటె జక్కగా గాపాడును. నిస్సందేహము.

తాపలనెక్కి తన గదిలో ప్రవేశించెను. లోనికేగుటకు ముందు, దీపమును గడపటి తాపమీదనే పెట్టి, తలుపు తెఱచి, తారాడుచు బోయి కిటికీ మూసివైచెను. ఈ కిటికీ వీధిలోనికి గనబడును కాన, ఈ జాగ్రత యవసరమే. అతడు గదినంతయు బరికించెను. పరిచారిక అన్ని వస్తువులను చక్కబెట్టి యుండినది. బూడిదలోనుండి, ఆ ఫ్రాంకును, జేతికఱ్ఱకొనలందుండిన యినుమును తీసి టేబులుమీద బెట్టి యుండెను.

ఒక కాగితము తీసికొని, "ఇవి నా కఱ్ఱ కొనలును, పెటీగెర్వానుండి నేను దొంగిలించిన ఫ్రాంకును. దీనిని గుఱించియే న్యాయసభలో చెప్పితిని." అని వ్రాసి, కాగితము మీదనే ఆ వస్తువుల నుంచెను. గదిలోనికి వచ్చిన వారికవి మొట్టమొదట గంటబడును. ప్రాతచొక్కా యొక్కటి తీసికొని, చింపి, దానిలో వెండి దీపస్తంభములను చుట్టబెట్టెను.

ఇట్లు చేయుచున్నపుడతనిలో త్వర లేదు. ఉద్రేకము లేదు. దీపస్తంభములను గట్టుచున్నపుడు, జెయిలులో యిచ్చిన బ్రెడ్డు ముక్కను నమలుచుండినాడు. తరువాత గోర్టువారా యిల్లు సోదా చేసినపుడు, అక్కడ కనబడిన బ్రెడ్డుముక్కలో యంశమును రుజువు పఱచినవి.

తలుపు మీద మృదువుగా రెండుసారులు తట్టిన సవ్వడియయ్యెను. "రండు." ఆ వచ్చినది సిస్టర్ సింప్లిస్.

పాలిపోయినది. కండ్లెఱ్ఱగ నున్నవి. చేతనున్న దీపము కంపించుచున్నది. మన భావములెంత నియమితములు, నిగృహీతములు నైనను, విధి కొట్టు దెబ్బలకు, నెక్కడనో యగాధమున నాత్మలో దాగియున్న మానవ స్వభావము లేచి పరులకంట బడును. నేటి యల్లకల్లోలమున నీ సన్యాసిని మఱల నబలయైనది. విలపించినది. కంపించుచుండినది.

జాన్ వాల్జా యొక కాగితముముక్కమీద నేమో సియుండెను. దానిని సిస్టర్కిచ్చి "సిస్టర్, వీనిని క్యూరే ్." అనెను. కాగితము మడిచి యుండలేదు. ఆమె ్పులు వ్రాతపై బ్రసరించెను. "చదువ వచ్చు" నని ాల్జా చెప్పెను.

సిస్టర్ చదివెను. "నేనిక్కడ వదలినదంతయు స్వాధీ వేసికొమ్మని మాంష్యర్ క్యూరేను బ్రార్థించుచున్నాను. ారణ వ్యయములు, నేడుదయము మరణించిన స్త్రీ క్రియల వ్యయములును పోగా, మిగిలినది బీదలకని పము."

సిస్టర్ మాటాడ యత్నించెనుగాని, నాలుక తడబడి, గొంతు గద్గదమై, యతికష్టముతో "మాంష్యర్ మేయరా అభాగినిని గడపటి ఒక్క-సారి చూడరా?" అనగల్గెను.

మా: లేదు. నన్ను దఱుముకొని వచ్చుచున్నారు. నన్నామె గదిలోనే అరెస్టు చేయుదురు. ఆమె శాంతికి భంగము కల్గును.

అతడీ మాటలని యనక ముందే తాపలపైన బెద్ద సద్దయ్యెను. పైకెక్కు- పదముల శబ్దము. అఱవగలిగినంత గట్టిగా విదారిత కంఠమున వృద్ధపరిచారిక కేకలును విన వచ్చెను. "మంచివాడవే. దేవునిమీద ప్రమాణము చేసి చెప్పుచున్నాను. ఈ పగలంతయు, ఇంతవఱకును నిక్క-డి కెవ్వరును రాలేదు. గది దాటి నే నడుగావల బెట్టలేదు."

"అయినను ఈ గదిలో దీపమున్నదే" యని పురుషుడనెను. అది జేవర్ గొంతు. వారు గుర్తించిరి.

ఈ తలుపు తీసినచో, కుడిప్రక్క- మూల, ప్రవే చిన వారికి గనపడదు. జాన్ వాల్జా దీపమార్పి, ఆ మూల నక్కె-ను. సిస్టర్ సింప్లిస్ టేబులు దగ్గఱ మోకరిల్లెను. త తెఱచి జేవర్ వచ్చెను. పలువుర నిరుద్ధ స్వరములు చారిక యడ్డుమాటలును వినవచ్చుచునే యుండెను.

సన్యాసిని, వంచిన తలనెత్తక ప్రార్థించుచు జేవరామెను జూచి, లజ్జితుడై నిలచిపోయెను.

జేవర్ యొక్క- ఆధారము, స్వభావము, అ గొను వాతావరణము - అంతయు అధికారముమీద మనుట మఱువగూడదు. ఆ విషయమున నతనికి

ము లే లేవు. అడ్డు లేదు. తగ్గుదల లేదు. అతని యభిప్రాయ మున, మతాధికారము సర్వోత్కృష్టము. అన్ని విషయముల లోవలె దీనను నెక్కువ పట్టుదల. లోతులు పరికింపడు. అతి ఖండితవాది. అతని దృష్టిలో గురువు పొఱపాటెఱుగని యలౌకిక జీవి. సన్యాసిని పాపస్పర్శము లేనిది. నారీలోకము నుండి వేఱుచేయబడిన యాత్మలు. వారి ప్రపంచద్వారము తెఱచుకొనెనా, సత్యమును వెలువరించుటకే.

సిస్టర్‌ను జూచిన వెంటనే వెళ్ళిపోవలెనని ప్రథమ ప్రేరణ. కాని, విధి గట్టిగా బట్టుకొని, సాధికారముగ, ముందుకు బొమ్మనుచున్నది. కావున, నిలచి యొక ప్రశ్న వేయుమని ద్వితీయ ప్రేరణ.

"సిస్టర్, ఈ గదిలో మీరొంటరిగ నున్నారా?"

క్షణకాలము, వృద్ధపరిచారికకు సర్వాంగములు తూగి ందికి ద్రోయుచున్నట్లనిపించెను. సిస్టర్ కనులెత్తి "ఔను" నను.

జే: ఈ మొండితనమును క్షమింపుడు. అది నా విధి. మనుష్యుడు జెయిలునుండి తప్పించుకొన్నాడు. వాని జాన్ వాల్జా. వానినిక్కడ, ఈ సాయంకాలమున మీరు లేదా?

సిస్టర్: లేదు.

ఆమె యసత్యము పలికెను. రెండసత్యములు–ఒకటి నొకటి. నిస్సంకోచముగ, ఆఱితేఱిన కల్లరివలె.

"క్షమింపుడు." అని, సగౌరవముగ వ నమస జేవర్ వెళ్ళిపోయెను.

ఓ పవిత్ర కన్యకా! ఎంతో కాలము, సోదరీమణులలో
గన్యలలో, సోదరులలో, దేవతలలో నీవును నొకర్తువ
ఎక్కువ లేదు. ఈ యసత్యములు, ఈశ్వర సన్నిధానము
నీ కండయా గాక!

సిస్టర్ మాట, జేవర్‌కు వేదవాక్యము. అప్పు
యార్పుటచే పొగలిచ్చుచున్న దీపపువత్తినైన అతడు గమ
నించ లేదు.

తరువాత, ఒక గంటకు, మ- విడిచి, చెట్ల క్రిందు
జీకటిలో, పారిస్ దెస నొక మనుష్యుడు నడిచి పో
చుండెను. అతడు జాన్ వాల్జా.

ఫాంటైన్‌ను గుఱించిన తుది పలుకులు. మనకందఱ
కొక్కటే తల్లి - మట్టి. ఫాంటై నాతల్లి యొడిలో జేరెను

జాన్ వాల్జా యాస్తిలో, సాధ్యమైనంత యెక్కు
భాగము బీదలకుపయోగించుట మంచిదని క్యూరే తలంచెన
ఇంతకు అడ్డెవరు - ఒకడు ఖైదీ. ఒకటె బజారు పడు
ఇందుచేతనే గురువు అంత్యక్రియలను కేవలమవసరమైన
జరిపి, ఫాంటైన్‌ను భూనిక్షిప్తము చేసెను.

కావున, బీదలకు చోటిచ్చు సామాన్య శ్మశాన
ఫాంటైనును బాతిపెట్టిరి. అదృష్ట వశమున, ఆత్మల
ఉండునో దేవుడెఱుగును. చీకటిలో నామరహిత
అసంఖ్యాకమైన శవముల నడుమ ఫాంటైనదృశ్యమ
మృత్తికలో భేదరహిత యయ్యెను.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA112B141 |
| పుస్తకం పేరు | నిర్భాగ్యజీవులు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 387 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 6 |
| లేని పేజీలు | 1,2,1,2,369,370 |
| తయారు చేసినది | Khajin |
| పేజీలు విడదీసినది | Khajin |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |